# విజ్ఞాపన

సూత్రభాష్యము ప్రథమాధ్యాయానువాదము మొదటి రెండు సంపుటములతో పూర్తి అయినది. వానిని మీరందుకొని ఆంధ్రమున శాస్త్ర సారస్వతాభివృద్ధికి నాకు తోడ్పడుచున్నందుకు కృతజ్ఞుడను. తమ సహాయములేక నిట్టి యుద్యమము కొనసాగనేరదు. ద్వితీయాధ్యాయము 1 - 2 పాదములు తృతీయ సంపుటముగ రు 2-8-0 లకు రాబోవు జనవరి మొదటివారమున తమకు వి.పి.పి. గా పంపబడును. దయచేసి దానిని అందుకొన ప్రార్థన.

అనువాదకుడు

# సూత్రార్థ కౌముది

## శాంకరమీమాంసా సూత్రభాష్యమునకు

## ఆంధ్రానువాదము

### సభాష్యము




ద్వితీయ సంపుటము

ప్రథమాధ్యాయము

2, 3, 4 పాదములు

రచయిత :

రాయప్రోలు లింగన సోమయాజీ

బి. ఏ., బి. ఎల్.

ఉపనిషచ్చన్ద్రిక రచయిత

# విషయసూచిక

## ప్రథమాధ్యాయే - ద్వితీయః పాదః

## ప్రథమాధ్యాయే - చతుర్థః పాదః

# అకారాది సూత్రపట్టికా.

## ప్రథమాధ్యాయే ద్వితీయపాదే

## ప్రథమాధ్యాయే - తృతీయపాదే

ప్రథమాధ్యాయే - చతుర్థపాదే

# కృతజ్ఞత

నాచే రచింపబడిన బ్రహ్మసూత్ర ఆన్ధ్రానువాద ద్వితీయ సంపుటము ముద్రించుటకు వలయు ధనమును పొన్నూరు శ్రీ భావనారాయణస్వామివారికి వంశపరంపరా ధర్మకర్తలును నాకు చిరకాలమిత్రులు నగు శ్రీ రాజా వాసిరెడ్డి హరిహర ప్రసాద్ బహదూరుమన్నెసుల్తాన్‌గా రొసంగిరి. వీరి సుగుణ గణస్మరణ మొక గుణపాఠమగుచున్నది. వీరి మూలపురుషులు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు. ఈయన మన వేమారెడ్డికి వాసి సమకూర్చి రాజ్యమును నిల్పుటచే నీ వంశము 'వాసిరెడ్డి' యను అన్వర్థనామమున వాసికెక్కెను. శ్రీ వెంకటాద్రినాయుడుగారి పరిపాలనాసామర్థ్యము, హిందూ మహమ్మదీయమత సమదర్శనము, శ్రీ రామలింగేశ్వరుని యందలి భక్తిపారవశ్యత మొదలగునవి యన్నియు చరిత్రాంశములు. ఆయన రాజ్యము రామరాజ్యము. నేటికిని, అనేక కుటుంబములు దీపము పెట్టుకొని ఆయన సుగృహీత నామమును, ననుదినము స్మరించుచున్నారు. ఆయన 1815 సంవత్సరమున ఆచంద్రతారార్కమగు యశశ్శరీరమును ప్రవేశించెను. ఏబదిలక్షల విలువగల జమీను తన పాలకకుమారులగు జగన్నాథబాబు, రామనాథబాబుగార్లకిచ్చెను. వెంకటాద్రి నాయుడుగారి తరువాత నీ జమీ అంతయు న్యాయస్థానములపాలబడెను. "గహనా కర్మణో గతిః" అను ఆభాణమున కీసంస్థాన మొక తార్కాణము. దశరథుడు కైకేయీ ప్రియముగోరి తన రామభద్రుని కోల్పోయెను. శ్రీరాముడు

ప్రియురాలికి సంతసము సమకూర్పగోరి అసంభవమగు హేమ
మృగమును నాసించెను. వెంకటాద్రినాయుడు ద్వితీయభార్య
మాటను పాటించి రామనాథబాబును దత్తుమీద దత్తు చేసి
కొనెను. ఈయన వాసిరెడ్డి వంశమునకు ముసలమయ్యెను.
బంగారమువంటి కాపురమిఱుకుల జిక్కుకొనెను.

మా మిత్రులు హరిహరప్రసాదుగారు, వెంకటాద్రి
నాయుడుగారికి మునిమునిమనుమలు. ప్రప్రపితామహుని
యశోధనముమాత్ర మాయన భాగధేయమయ్యెను. వంశాను
గతమైనట్టి యశోధనమును తన సుగుణానీకముచే ననుదినము
పోషించుచున్నారు. తన యాత్మగౌరవమును రక్షించుకొనుచు
కుటుంబగౌరవమునకు మెఱుంగువెట్టెను. మితభాషిత్వము,
బంధుమిత్ర జనాదరణము, సంస్కృతాంధ్ర విద్యాపోషణము,
భూషణతిరస్కారము, బీదసాదలయెడ సానుభూతి, సదా
చారము, శ్రీ భావనారాయణస్వామి కైంకర్యమున నిరుప
మానమగు జాగరూకత — ఇట్టి సుగుణము లనేకములు గుమి
గూడి హరిహరప్రసాదురూపమును దాల్చినవి. హరిహరుల
యందలి సమదర్శిత్వమున కాయన నామమే సాక్షి. తన బుద్ధి
బలముల శ్రీ భావనారాయణ దేవాలయ పరిపాలనమందు
వినియోగించుచు, గౌరవీయులగు తలిదండ్రులు నడచిన
త్రోవన తానును నడచెను. వారారంభించిన దక్షిణగోపుర
నిర్మాణముననుసరించి ప్రాగ్ద్వారగోపురము, శిఖరముల సువర్ణ
కలశములు, ధ్వజస్తంభము, యజ్ఞశాల, సర్వజనదర్శన
యోగ్యమగు వైవాహికమంటపము, మొదలగు సేవాసౌక
ర్యము లనేకము నెలకొల్పిరి. ఈ నూతన కట్టడములయందు

కాన్పించు శిల్పసౌందర్య మాయనకు కళలయందుగల ప్రాచీ న్యాభిమానముల జెప్పక చెప్పుచున్నది. గాంధిమహాత్ముని ప్రతిమను నెలకొల్పి తన కమ్మహామహుని తత్త్వమునందుగల యాస్థను తృప్తిపఱచుకొనెను. ఆయన స్థాపించిన సంస్కృత కళాశాల తా జేసిన మహాత్కార్యము లన్నిటికిని తలమానిక మగుచున్నది. నిరుక్త పూర్వమీమాంసా సాహిత్యాది విద్యలయం దారితేఱిన పండితప్రవరులచే నీసంస్థ సమర్థింపబడు చున్నది.

వాగ్దేవికి విద్యుద్దీపాలంకృతమగు నొక ఆలయమును కట్టించుట ఎంతయు సమంజసముగ నున్నది. భావైకసమధి గమ్యుడు భావనారాయణుడు. భావైకరూపిణి వాగ్దేవి. విద్యార్థులకు భోజనవసతులు కల్పించిరి. అనాథ బాలబాలికా శరణాలయము నొకదానిని నిర్మించుచున్నారు. ఇట్టి సుగుణము లెన్నియున్నను అవి అవలేపనకారణములుకావు మా మన్నె సుల్తానుకు. వెంకటాద్రినాయుడుగారినుండియు నౌరసపుత్రులు లేని యీ వంశమున వీరికి కలిగిన చతురధిక పరిమితముగు నౌరస సుపుత్రసంతానము అనిర్వ్యాజమగు శ్రీ భావనారా యణస్వామి సేవాసంపత్ఫల మనుటకు సందియములేదు. పెద్ద కొమరుడగు చిరంజీవి శ్రీరామభానుభూపాలుగారి యాత్మజు డగు ఆయుష్మంత సుధాస్వరూపుడు మామిత్రుని తాతనుచేసి యాడించుట కనులపండుగ యగుచున్నది. వీరి వంశ మౌరస సంతాన ప్రాబల్యము నొంది ఆచంద్రతారార్కముగ విలసిల్లు నటుల శ్రీ భావనారాయణుడు తన సద్భావముల వెలువరించు

గాక అని ప్రార్థనలు. హరిహరప్రసాదుగారికి అనతికాలమున ఆరోగ్యభాగ్యము సమకూర్చుగాక!

మహోన్నతములగు నిట్టి యారంభముల శ్రీ హరిహర ప్రసాద్‌గారికి కుడిభుజముగనుండి ఆలయ పరిపాలనమునం దన్ని విధముల తోడ్పడుచున్న ఆయన తోడిఅల్లుడు శ్రీ కాట్రగడ్డ అనంతపద్మనాభచౌదరిగారి ఆస్థాధిక్యత యెంతయు ప్రశంస నీయము.

ఆలయపరిపాలనమునంతయు నూతనవిధానమున నడి పించుచు ఆ సంస్థను జనసామాన్యముయొక్క ఆధ్యాత్మిక క్షేమమునకు విద్యాప్రచారమునకు వినియోగించుటకు తగిన సలహా సహాయములు గడుశ్రద్ధతో నిచ్చుచున్న ఆంధ్ర హిందూ ధర్మాదాయ దేవాదాయ కమీషనరు గారగు శ్రీ రామిరెడ్డి వెంకటరెడ్డిగారి సహసాక్షిత్వము శ్లాఘా పాత్రము. జీవితమునందు ప్రకృతిసిద్ధమగు దేవాదాయ పునరుజ్జీవనము వీరికి ఉద్యోగప్రాప్తముగూడ నయినది. గుణ పక్షపాతము వీరి విశిష్టలక్షణము. ఆంధ్రదేశమున తిరుమల తిరుపతి సంస్థానముతరువాత శ్రీ పొన్నూరు భావనారాయణ స్వామి సంస్థ ద్వితీయస్థానము నాక్రమించుటకీ మూర్తిత్రయము కారణమగుట యథావస్థుస్థితికథనమే యగును. నా ఉద్యమము నందు తగు నుత్సాహమునిచ్చిన వీరు ముగ్గురుగూడ నాకు కృతజ్ఞతాపాత్రులు. శ్రీ భావనారాయణుని భావప్రభవమగు సర్వతోముఖ పురోభివృద్ధి వీరలకు సమకూరుగాక యని యాశించు ...

రా. లిం. సోమయాజి



శ్రీ కల్యాణకౌముదీ ద్వితీయసంపుట ముద్రాపయితలు

శ్రీ రాజా వాసిరెడ్డి హరిహరప్రసాద్ బహదూర్
మన్నె సుల్తాన్ గారు

పెన్షనర్ - శ్రీ పొన్నూరు భావనారాయణస్వామి దేవాలయ
వంశపారంపర్య ధర్మకర్తలు.

•



బ్రహ్మసూత్ర

# శాంకరమీమాంసాభాష్యమ్.

కల్యాణ కౌముదీ సమేతమ్.

ప్రథమాధ్యాయే - ద్వితీయః పాదః.

## (1) సర్వత్ర ప్రసిద్ధ్యధికరణమ్ (సూ. 1-8)

ప్రథమే పాదే 'జన్మాద్యస్య' ఇత్యాద్యాకాశాదేస్సమస్తస్య జగతో జన్మాదికారణం బ్రహ్మేత్యుక్తం. తస్య సమస్తజగత్కారణస్య బ్రహ్మణో వ్యాపిత్వం నిత్యత్వం సర్వజ్ఞత్వం సర్వాత్మకత్వమిత్యేవంజాతీయకా ధర్మా ఉక్తా ఏవ భవంతి. అర్థాంతరప్రసిద్ధానాం చ కేషాంచిచ్ఛబ్దానాం బ్రహ్మవిషయత్వ

---

సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము

---

అ॥ "జన్మాద్యస్య యతః" యను ప్రథమపాద ద్వితీయ సూత్రమునందు బ్రహ్మ మాకాశాది పూరుషాంతమగు సమస్త జగత్తున కుత్పత్తి స్థితిలయ కారణమని నిరూపింపబడినది. అందుచేత సమస్త జగత్కారణమగు బ్రహ్మముయొక్క సర్వవ్యాపిత్వము,

పూర్వోత్తర సంగతి.

హేతుప్రతిపాదనేన కానిచిద్వాక్యాని సందిహ్యమానాని బ్రహ్మ పరతయా నిర్ణీతాని. పునరప్యన్యాని వాక్యాన్యస్పష్టబ్రహ్మలింగాని సందిహ్యంతే, కిం పరం బ్రహ్మ ప్రతిపాదయంతి, ఆహోస్విదర్థాంతరం కించిదితి. తన్నిర్ణయాయ ద్వితీయతృతీయపాదావారభ్యేతే.

---

నిత్యత్వము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము, సర్వాత్మత్వము మొదలగు ధర్మములుగూడ నుక్తప్రాయములే యగుచున్నవి. [బుద్ధికందరాని విచిత్రరచనలతో నలరారుచున్న జగత్తును సృష్టించినవాడు సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడును కావలయును. జగత్కార్యమునకు బ్రహ్మ మాత్యంతికకారణమగుటచే నిత్యము సర్వవ్యాపియు, నుపాదానకారణమగుటచే సర్వాత్మము నగుచున్నది.] ఆకాశప్రాణజ్యోతి [రీక్షితృ ఆనందమయా]ది శబ్దములు బ్రహ్మేతరములయందు సుప్రసిద్ధములై ఆయా వాక్యముల యర్థము సందేహాస్పదములగుటంజేసి, స్పష్టముగ బ్రహ్మమును బోధించు సూచనల వలన సహేతుకముగ నర్థనిర్ధారణము చేసి యా పదములు బ్రహ్మపరములని నిర్ణయించితిమి. బ్రహ్మమును స్పష్టముగ సూచింపని మఱికొన్ని వాక్యములు గలవు. అవి బ్రహ్మపరములా, తదన్యపరములా, యను సందేహము కలుగుచున్నది. ఈ సందేహము తీర్చుటకు ద్వితీయతృతీయ పాదము లారబ్ధములగుచున్నవి. [ఉపాస్యబ్రహ్మవాక్యములు ద్వితీయపాదమునను, జ్ఞేయబ్రహ్మవాక్యములు తృతీయపాదమునను విచారింపబడుచున్నవి.]

## సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ (సూ. 1)

ఇదమామ్నాయతే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత. అథ ఖలు క్రతుమయః పురుషో యథా క్రతురస్మిన్లోకే పురుషో భవతి. తథేతః ప్రేత్య భవతి స క్రతుం

---

విషయము : 'మనోమయః ప్రాణశరీరో భారూపః' అను ఛాందోగ్యము నందలి శాండిల్యవిద్యయందు కాన్పించు పదములు.

విషయము : మనోమయత్వాది శబ్దములు జీవపరములా, లేక పరమాత్మ పరములా?

పూర్వపక్షము : జీవపరములు.

సిద్ధాంతము : పరమాత్మ పరములు.

గమనింపదగ్గ శ్రుతివాక్యము. ఛాందోగ్యము 3-14-1-2.

---

అ॥ మనోమయశబ్ద ముపాస్యమగు పరబ్రహ్మమును తెలియచేయుచున్నది యని రాబోవు సూత్రము చూపుచున్నది.

సర్వత్ర = అంతటను, ప్రసిద్ధ ఉపదేశాత్ = సుప్రసిద్ధమగు బ్రహ్మము నుపదేశించుటవలన నాపదము లుపాస్య బ్రహ్మలింగములగుచున్నవిగాని జీవలింగములు కావు.

"ఇది అంతయు బ్రహ్మమేగదా! బ్రహ్మమునందు బుట్టుచున్నది. లయమగుచున్నది; స్థితి గలిగియున్నది. ఇట్లు తెలిసికొని పురుషుడు శాంతచిత్తుడై యుపాసింపవలయును,

కుర్వీత మనోమయః ప్రాణశరీరో భారూపస్సత్యకామస్సత్య సంకల్ప' ఇత్యాది (ఛాం3-14-1-2). తత్ర సంశయః. కిమిహ మనోమయత్వాదిభిర్ధర్మైశ్శారీర ఆత్మోపాస్యత్వేన ఉపదిశ్యతే ఆహోస్విత్పరం బ్రహ్మేతి. ।

పూ.పక్షః: కిం తావత్ప్రాప్తం? శారీర ఇతి. కుతః? తస్య హి కార్యకరణాధిపతేః ప్రసిద్ధో మనఆదిభిస్సంబంధో న పరస్య బ్రహ్మణః 'అప్రాణో హ్యమనాశ్శుభ్ర' (ము2-1-2) ఇత్యాది శ్రుతిభ్యః. ।

---

పురుషుడు కృతనిశ్చయుడు. పురుషు డీలోకమున నేనిశ్చ యము గలవాడగునో ఆప్రకారమె యితరలోకమునకుం బోయినతరువాతగూడ నగుచున్నాడు. కనుక ఆ నిశ్చయము నిచటనే చేయఁదగును. అతఁడు మనస్సు ముఖ్యముగ గల వాఁడు; ప్రాణమే యతని శరీరము." ఇట్లు శ్రుతి (ఛాం3-141,2) పల్కుచున్నది. ఈ వాక్యమునందలి మనోమయత్వాదిధర్మ ములు జీవు డుపాస్యమని తెలుపుచున్నవా? లేక పరబ్రహ్మ ముపాస్యమని తెలుపుచున్నవా? యని సందేహము కలుగు చున్నది.

మనోమయత్వాది శబ్దములు జీవలింగములని పూర్వపక్షము.

పూ. పక్షి: (1) మనోమయత్వాదిధర్మములు జీవుని బోధించుచున్నవి. అతడు కార్యములకు తత్సాధనములకు నధిపతియై మనస్సు మొదలగు వానితో ప్రసిద్ధమగు సంబంధము గలిగియున్నాడు. బ్రహ్మమున కట్టి సంబంధము లేదని 'అతడు ప్రాణము

మాధ్యమికః : నను 'సర్వం ఖల్విదం బ్రహ్మే'తి స్వశబ్దేనైవ బ్రహ్మోపాస్త్యం కథమిహ శారీరం ఆత్మోపాస్యత్వేనాశంక్యతే? ।

పూ.పక్షీ: నైషదోషః. నేదం వాక్యం బ్రహ్మోపాసనవిధిపరం. కింతర్హి? శమవిధిపరం. యత్కారణం 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీతే'త్యాహ—ఏతదుక్తం భవతి. యస్మాత్సర్వమిదం వికారజాతం బ్రహ్మైవ, తజ్జత్వాత్తల్లత్వాత్తదనత్వాచ్చ. న చ సర్వస్యైకాత్మకత్వే రాగాదయస్సంభవంతి, తస్మాచ్ఛాంత ఉపాసీతేతి. న చ శమవిధిపరత్వే సతి అనేన వాక్యేన బ్రహ్మోపాసనం నియంతుం శక్యతే. ఉపాసనం తు 'స క్రతుం

---

లేనివాడు, మనస్సు లేనివాడు. శుద్ధుడు' అని మాండూక్యాది శ్రుతులు పల్కుచున్నవి.

మాధ్యమికుడు: 'ఇదియంతయు బ్రహ్మమేగదా!' యను వాక్యము సాక్షాత్తుగ బ్రహ్మశబ్దముచేతనే బ్రహ్మమును జెప్పుచుండగా జీవాత్మ నుపాస్యముగ చెప్పుచున్నది యని నిరూపింప నెట్లు శక్యము ?

పూ. పక్షి: ఇదియొక దోషము గాదు. ఈఛాందోగ్య వాక్యము బ్రహ్మము నుపాసింపవలయునను విధిని బోధించుట లేదు. మనశ్శాంతిమాత్రము విధించుచున్నది. దీని యంతకు బ్రహ్మము కారణముగనుక తజ్జలానితి యని శాంతుడై యుపాసింపవలయునని శ్రుతి చెప్పుచున్నది. ఇది అంతయు బ్రహ్మమునందు పుట్టుచున్నది. బ్రహ్మమునందు లయమగుచున్నది. బ్రహ్మమునందు జీవించుచున్నది. కనుక వికారజాతమగు నిదియంతయు బ్రహ్మరూపమే యగుచున్నది. ఇది

కుర్వీతే'త్యనేన విధీయతే. క్రతుస్సంకల్పో ధ్యాన మిత్యర్థః. తస్య చ విషయత్వేన శ్రూయతే 'మనోమయః ప్రాణశరీరః', ఇతి జీవలింగమ్. అతో బ్రూమః జీవవిషయమేతదుపాసనమితి. 'సర్వకర్మా సర్వకామ' ఇత్యాద్యపి శ్రూయమాణం పర్యాయేణ. జీవవిషయముపపద్యతే. 'ఏష మ ఆత్మాऽన్తర్హృదయేऽణీయా-న్వ్రీహేర్వా యవాద్వే'తి చ హృదయాయతనత్వమణీయస్త్వం చారాగ్రమాత్రస్య జీవస్యావకల్పతే, నాపరిచ్ఛిన్నస్య బ్రహ్మణః.।

యంతయు నొకబ్రహ్మరూపమయినపుడు, రాగాదులు సంభవింపనేరవు. అందువలన పురుషుడు శాంతుడై యుపాసింపవలయును. అని ఈ వాక్యము యొక్క తాత్పర్యము. ఈవాక్యము శమమును విధించుచుండగా బ్రహ్మోపాసనమును గూడ విధింపలేదు. [ఒకవాక్యము రెండువిధులను బోధింపలేదు.] 'ఆతడు ధ్యానరూపమగు ప్రయత్నమును చేయవలయును.' అను తరువాతవాక్యముపాసనమును విధించుచున్నది. క్రతుశబ్దమునకు సంకల్పము ధ్యానము అర్థము. జీవుని బోధించు "మనోమయః, ప్రాణశరీరః" అను శబ్దములచే జీవుడు ధ్యానవిషయమని శ్రుతి చెప్పుచున్నది. కనుక నిచట నుదాహరింపబడిన ఉపాసనము జీవవిషయమని చెప్పుచున్నాము. సర్వకర్మలు సర్వకామములతనివే యనుపదములు గూడ క్రమముగ జీవపరములే అగుచున్నవి. (2) 'ఈ నా ఆత్మ హృదయమునందు గలదు. అది వ్రీహికంటెను యవధాన్యముకంటెను సూక్ష్మము' అనువాక్యమునందుదాహరింపబడుచున్న హృదయాంతర్గతత్వము సూక్ష్మత్వములుగూడ ములుకర్ర

మాధ్యమికః : నను 'జ్యాయాన్ పృథివ్యా' ఇత్యాద్యపి న పరిచ్ఛిన్నే ఉపకల్పత ఇతి.।

పూ.పక్షీ: అత్ర బ్రూమః—న తావదణీయస్త్వం జ్యాయస్త్వం చోభయమేకస్మిన్నాశ్రయితుం శక్యం, విరోధాత్. అన్యతరాశ్రయణే చ ప్రథమశ్రుతత్వాదణీయస్త్వం యుక్తమాశ్రయితుం. జ్యాయస్త్వం తు బ్రహ్మభావాపేక్షయా భవిష్యతీతి. నిశ్చితే చ జీవవిషయత్వే యదంతే బ్రహ్మసంకీర్తనం 'ఏతద్బ్రహ్మ' (ఛాం.3-14-4) తి తదపి ప్రకృతపరామర్శార్థత్వాజ్జీవవిషయమేవ. తస్మాన్మనోమయత్వాదిభిర్ధర్మైర్జీవ ఉపాస్య ఇతి।

---

మాత్రము పరిమాణముగల జీవునితో నన్వయించునుగాని యపరిచ్ఛిన్నమగు బ్రహ్మముతో నన్వయింపవు.

మాధ్యమికుడు : పృథివికంటె గొప్పవాడను విశేషణము, పరిచ్ఛిన్నమగు జీవునియందు వర్తింపదుగదా!

పూర్వపక్షి : ఇందుకు సమాధానమేమన, సూక్ష్మత్వము మహత్వములు పరస్పరవిరుద్ధము లగుటచే నొక్కనియందు సంభవింపనేరవు. ప్రకృతమున సూక్ష్మత్వమహత్వములలో నేదియో యొకదానినిమాత్రము గ్రహింపఁదగును. ప్రథమమున చెప్పబడినది యగుటచే సూక్ష్మత్వమునే ప్రకృతమున గ్రహించుట యుక్తము. జీవునికి బ్రహ్మభావమాసన్నమైనపుడు మహత్వము చెప్పఁదగును. ఇట్లు ప్రకృతవాక్యము జీవపరమని నిశ్చయముకాగా 'ఏతద్బ్రహ్మ'—ఇది బ్రహ్మమని వాక్యాంతమున సంకీర్తనము చేయబడిన బ్రహ్మశబ్దముగూడ ప్రకృతవిషయమునకు సంబంధించినందువలన జీవపరమే

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః.—పరమేవ బ్రహ్మేహ మనోమయత్వాదిభిర్ధర్మైరుపాస్యం. కుతః? సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్. యత్సర్వేషు వేదాంతేషు ప్రసిద్ధం బ్రహ్మశబ్దస్యాలంబనం జగత్కారణమిహ చ 'సర్వం ఖల్విదం బ్రహ్మే'తి వాక్యోపక్రమే శ్రుతం, తదేవ మనోమయత్వాదిభిర్ధర్మైర్విశిష్టముపదిశ్యత ఇతి యుక్తం. ఏవం సతి ప్రకృతహానాప్రకృతప్రక్రియే న భవిష్యతః, ।

---

యగుచున్నది. అందువలన మనోమయత్వాదిధర్మములచే నుపాస్యుఁడగు జీవుడు తెలియఁజేయబడుచున్నాడు. ఇట్లు పూర్వపక్షము సంప్రాప్తము కాగా.

సిద్ధాంతి : మనోమయత్వాది ధర్మములచే బ్రహ్మము పాస్యముగ చెప్పబడుచున్నది యని మావాదము. ఏలనన అంతటను ప్రసిద్ధముగ నున్నదియే యిచట నుపదేశింపబడుచున్నది. వేదాంతశాస్త్రమునందు జగత్కారణత్వము బ్రహ్మశబ్దముతో సుప్రసిద్ధముగ సంబంధించియున్నది. ఆ బ్రహ్మమే "ఇది యంతయు బ్రహ్మమే గదా" యను ప్రకృత వాక్యారంభమున వినబడుచున్నది. ఆబ్రహ్మమే మనోమయత్వాది ధర్మములను కలిగియున్నట్లుగ శ్రుతి యుపదేశించుచున్నది యని గ్రహించుట యుక్తము. ఇటుల గ్రహించినచో ప్రకృతమగు బ్రహ్మమును పరిత్యజించుటగాని అప్రకృతమగు జీవుని పరిగ్రహించుటగాని సంభవము గాదు.

మనోమయాదిశబ్దములు బ్రహ్మలింగములు

మధ్యవర్తీ: నను వాక్యోపక్రమే శమవిధివివక్షయా బ్రహ్మ నిర్దిష్టం న స్వవివక్షయేత్యుక్తం.।

సిద్ధాంతీ : అత్రోచ్యతే.—యద్యపి శమవిధివివక్షయా బ్రహ్మ నిర్దిష్టం, తథాపి మనోమయత్వాదిషూపదిశ్యమానేషు బ్రహ్మ సన్నిహితం భవతి, జీవస్తు న సన్నిహితః, న చ స్వశబ్దేనోపాత్త ఇతి వైషమ్యమ్.।

---

మధ్యవర్తి : శమమును విధించుటకై వాక్యారంభమున బ్రహ్మము నిర్దేశింపబడినదిగాని బ్రహ్మమును గూర్చి చెప్పదలచికాదని పూర్వపక్షి చెప్పుచున్నాడుగదా ?

సిద్ధాంతి : (1) శమవిధిని చెప్పుటకొరకే బ్రహ్మము నిర్దేశింపబడిన ట్లనుకొందుముగాక! అప్పుడుగూడ మనోమయత్వాదిధర్మము లుపదిష్టములగుచుండగ, వాక్యారంభమున నుపక్రమింపబడిన బ్రహ్మమే సన్నిహితమగుచున్నది. [ఉపక్రమవాక్యము శమపరమని యంగీకరించినను] శ్రుతి సన్నిహితముగాగాని సాక్షాజ్జీవశబ్దముచేతగాని జీవుని యుదాహరింపలేదు.(2) [ఇచట గాన్పించు చిహ్నములు బ్రహ్మను సూచించుచున్నవి. కాని జీవుని సూచించుటలేదు.(3)దుఃఖియగు జీవుడుపాసనార్హుడుగాడు. అతని యుపాసనము నిష్ప్రయోజనము. అందఱును గోరు నానందరూపమగు బ్రహ్మ ముపాస్యముగ గ్రహించుట న్యాయము. జీవుని బోధించు సూచనలు లేక పోగా, సాక్షాత్తు బ్రహ్మను బోధించుచున్న "సర్వం ఇదం" అను బ్రహ్మలింగములకు బాధకలుగును.] కనుక జీవుని గ్రహించినచో నిట్టి వైషమ్యము సంప్రాప్తమగుచున్నది.

## వివక్షితగుణోపపత్తేశ్చ (సూ. 2)

ప్రస్తుమిషా వివక్షితాః. యద్యప్యపౌరుషేయే వేదే వక్తురభావాన్నేచ్ఛార్థస్సంభవతి, తథాప్యుపాదానేన ఫలేనోప చర్యతే. లోకే హి యచ్ఛబ్దాభిహితముపాదేయం భవతి తద్వి వక్షితమిత్యుచ్యతే, యదనుపాదేయం తదవివక్షితమితి, తద్వద్వే దేఽప్యుపాదేయత్వేనాభిహితం వివక్షితం భవతీతరదవివక్షితం. ఉపాదానానుపాదానే తు వేదవాక్యతాత్పర్యాతాత్పర్యాభ్యామవ

అ॥ మనోమయత్వాదులు బ్రహ్మలింగము లనుటకు కారణాంతర ముదాహరింపఁబడుచున్నది.

---

వివక్షిత = చెప్పఁగోరిన సత్యసంకల్పాది గుణములు, బ్రహ్మమునందు, ఉపపత్తేః = సంభవించుటవలన.

చెప్పుటకు వాంఛింపబడినవి వివక్షితములు, వేదములు పురుషవిరచితములు కావు. కనుక పురుషాత్మకమగు వక్త గాని యతని కోరికగాని యుండనేరదు. అయిన నిచ్ఛ ఫలస్వీకారమునకు బూర్వభూతమగుటచే, ఫలస్వీకారమునం దుపయోగించు చున్నది. పరిగ్రహించుట కుద్దేశింపబడి

వివక్షితశబ్దార్థము.

యే విషయము శబ్దముచేతఁ జెప్పబడు చున్నదో యది వివక్షితమనియు, తదితర మవివక్షితమనియు భాషలో వాడుక గలదు. వేదమునందు నాలాగుననే యుపాదేయముగ నుదాహరింపబడినది వివక్షితమగును. తదితర మవివక్షితమగును. [దేని నేశబ్దము బోధించునో యది యాశబ్దమున కర్థమగును] వేదవాక్యమునకుఁ

గమ్యతే. తదిహ వివక్షితా యే గుణా ఉపాసనాయాముపాదేయత్వేనోపదిష్టాస్సత్యసంకల్పప్రభృతయస్తే పరస్మిన్ బ్రహ్మణ్యుపపద్యంతే. సత్యసంకల్పత్వం హి సృష్టిస్థితిసంహృతిష్వప్రతిబద్ధశక్తిత్వాత్పరమాత్మన ఉపకల్పతే. పరమాత్మగుణత్వేన చ 'య ఆత్మాఽపహతపాప్మా' (ఛాం8-7-1) త్యత్ర 'సత్యకామస్సత్యసంకల్పః' ఇతి శ్రుతం 'ఆకాశాత్మా' ఇతి చ ఆకాశవదాత్మాఽస్యేత్యర్థః. సర్వగతత్వాదిభిర్ధర్మైస్సంభవత్యాకాశేన సామ్యం

---

దాత్పర్యమునది పరిగ్రాహ్యమనియుఁ, దాత్పర్యము కానిది యపరిగ్రాహ్యమనియుఁ దెలియుచున్నది. ఉపాసనయందు బరిగ్రాహ్యములుగ నుపదేశింపఁబడిన సత్యసంకల్పాది యే యే గుణములు గలవో యవి ప్రకృతవాక్యమున వివక్షితములగు గుణములగుచున్నవి.

మనోమయత్వాదులు బ్రహ్మపరములు.

(4) ఆగుణములు పరబ్రహ్మమునం దుపపన్నములగుచున్నవి. ఆ పరమార్థవస్తువు జగత్తుయొక్క సృష్టిస్థితిసంహారములయం దప్రతిహతమగు సామర్థ్యము గలదగుటవలన, సత్యసంకల్పత్వ మద్దానియందు గల్పింపబడుచున్నది. 'ఆత్మ అపహతమైన పాపము గలవాడ'ను శ్రుతి సత్యకామత్వ సత్యసంకల్పత్వములు పరమాత్మ గుణములని పలుకుచున్నది. మనోమయవాక్యమునందు గాన్పించుచున్న "ఆకాశ ఆత్మా" ఆకాశమట్టిది యాత్మ యను పదమునకు పరబ్రహ్మస్వరూప మాకాశమువలె సర్వవ్యాపి, సర్వసూక్ష్మమని తాత్పర్యము. ఆకాశము జడము. బ్రహ్మము జడము కాకపోయినను సర్వవ్యాపిత్వ

బ్రహ్మణః. 'జ్యాయాన్ పృథివ్యాః' ఇత్యాదినా చైతదేవ దర్శయతి. యదాప్యాకాశ ఆత్మాస్యేతి వ్యాఖ్యాయతే. తదపి సంభవతి సర్వజగత్కారణస్య సర్వాత్మనో బ్రహ్మణ ఆకాశాత్మకత్వం. అతఏవ 'సర్వకర్మే' త్యాది. ఏవమిహోపాస్యతయా వివక్షితా గుణా బ్రహ్మణ్యుపపద్యంతే. ।

యత్తూక్తం 'మనోమయః ప్రాణశరీర' ఇతి జీవలింగం న తద్బ్రహ్మణ్యుపపద్యత ఇతి, తదపి బ్రహ్మణ్యుపపద్యత

---

సూక్ష్మత్వములయందు రెండింటికిని సామ్యముగలదు. 'పృథివి కంటెఁ బెద్దది' యనువాక్యముగూడ నీయర్థము నే చూపుచున్నది. ఆకాశ ఆత్మా యనుపదమునకు 'ఆకాశమే స్వరూపముగా గలవాడు' అని కొందఱర్థకల్పనము సేయుచున్నారు. ఆ పక్షమునందుగూడ సర్వజగత్కారణమగు బ్రహ్మమాకాశస్వరూప మగుచున్నాడు. అందువలననే పరబ్రహ్మము సర్వకర్మ లతనివే యనియు ఆకాశ ఆత్మయను విశేషణము తరువాత మఱియొక విశేషణము శ్రుతియందు కాన్పించుచున్నది. ఈ తీరుగ నుపాస్యములుగ నుదాహరింపదలచిన గుణములు బ్రహ్మమునం దుపన్నములగు చున్నవి.

మనోమయః ప్రాణశరీరః అనుపదములు జీవలింగములుగాని బ్రహ్మమునం దన్వయింపవని పూర్వవాది వాదమునకిట్లుఁ బ్రతివచనము చెప్పుచున్నాము. (5) బ్రహ్మము సర్వాత్మము గనుక, అనఁగా సర్వమునకతఁడే శరీరమగుటవలన జీవసంబంధము

పూర్వపక్షవాద నిరాస

ఇతి బ్రూమః. సర్వాత్మత్వాద్ధి బ్రహ్మణో జీవసంబంధీని మనోమయత్వాదీని బ్రహ్మసంబంధీని భవంతి. తథా చ బ్రహ్మ విషయే శ్రుతిస్మృతీ భవతః — 'త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ, త్వం జీర్ణో దండేన వంచసి త్వం జాతో భవసి విశ్వతోముఖః' (శ్వే 4-3) ఇతి. " సర్వతః పాణిపాదం తత్సర్వతోऽక్షిశిరోముఖం, సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతీ " (గీత 13-13) తి చ. 'అప్రాణో హ్యమనాశ్శుభ్రః' ఇతి చ శ్రుతిః శుద్ధబ్రహ్మవిషయా, ఇయం తు 'మనోమయః ప్రాణ

---

లగు మనోమయత్వాది గుణములు బ్రహ్మసంబంధములుగూడ నగును. శ్రుతిస్మృతులు బ్రహ్మనుగూర్చి యిట్లు పలుకుచున్నవి. "నీవు స్త్రీవి; నీవు పురుషుడవు; నీవు కుమారుడవు; లేక కుమారివి; నీవు ముసలివై కఱ్ఱతో వణకుచున్నావు; నీవు జన్మించి యన్నిముఖములఁ జూచుచున్నావు". అని శ్వేతాశ్వతరశ్రుతియు, 'అతని కరచరణము లంతటను గలవు; ఆతని శిరశ్చక్షుస్సు లంతటనుగలవు. ఆతని శ్రోత్రము లంతటను గలవు; ఆతడు ప్రపంచము నంత నావరించుకొని యుండును" అని గీతయు పలుకుచున్నవి. [ జీవధర్మము లన్నియు స్వరూపములని తాత్పర్యము. ]

(6) బ్రహ్మ "ప్రాణము లేనిది, మనస్సు లేనిది, శుద్ధము" అని ప్రతివాది యుదాహరించిన శ్రుతివాక్యము శుద్ధమగు నిర్గుణ బ్రహ్మవిషయము, "మనోమయః ప్రాణమయః" యను

శరీర' ఇతి సగుణబ్రహ్మవిషయేతి విశేషః. అతో వివక్షితగుణోప పత్తేః పరమేవ బ్రహ్మోపాస్యత్వేనోపదిష్టమితి గమ్యతే.।

## అనుపపత్తేస్తు న శారీరః (సూ. 3)

పూర్వేణ సూత్రేణ బ్రహ్మణి వివక్షితానాం గుణానా ముపపత్తిరుక్తా. అనేనతు శారీరే తేషామనుపపత్తిరుచ్యతే. తు శబ్దోఽవధారణార్థః. బ్రహ్మైవోక్తేన న్యాయేన మనోమయత్వాది

---

ప్రకృతవాక్యము సగుణబ్రహ్మవిషయము. ఇదియే రెండింటి కిని గల విశేషము. కనుక వివక్షితములగు మనోమయత్వాది గుణములు బ్రహ్మమునం దుపపన్నములగుటంజేసి యుపాస్య మగు బ్రహ్మమిచట నుపదేశింపఁబడుచున్నాఁడని తెలియు చున్నది.

అ॥ వివక్షితములగు మనోమయత్వాదిగుణములు బ్రహ్మమునం దుపపన్నములగుటంజేసి యవి బ్రహ్మలింగము లని యన్వయముఖమున నిరూపించిరి. ఆగుణములు జీవునియం దుపపన్నములు కాకుండుటచే జీవలింగములు కానేరవని వ్యతిరేకముఖమున తరువాత నిరూపించుచున్నారు.

---

అనుపపత్తేః తు = వివక్షితములగు మనోమయ త్వాదిగుణములు జీవునియం దుపపన్నములు గాకుండుట నిశ్చయమగుటవలన గూడ, శారీరః న = ఆ లింగములచే జీవుఁడు సూచింపబడుటలేదు.

వివక్షితములగు మనోమయత్వాదిధర్మములు బ్రహ్మ మునం దుపపన్నములగుచున్నవి యని పూర్వసూత్రమునందు

గుణం, న తు శారీరో జీవో మనోమయత్వాదిగుణః, యత్కారణం 'సత్యసంకల్ప ఆకాశాత్మా' ఇవాక్యనాదరః జ్యాయాన్ పృథివ్యా' ఇతి చైవంజాతీయకా గుణా న శారీరే అంజస్యోపపద్యంతే. శారీర ఇతి శరీరే భవ ఇత్యర్థః. నన్వీశ్వరోఽపి శరీరే భవతి. సత్యం శరీరే భవతి నతు శరీర ఏవ భవతి. 'జ్యాయాన్ పృథివ్యా జ్యాయానంతరిక్షాదాకాశవత్సర్వగతశ్చ నిత్యః' ఇతి చ వ్యాపిత్వశ్రవణాత్. జీవస్తు శరీర ఏవ భవతి. తస్య భోగాధిష్ఠానాచ్ఛరీరాదన్యత్ర వృత్త్యభావాత్. ।

---

బ్రదర్శించిరి. జీవునియం దవి యుపపన్నములుగావని యీ సూత్రమునఁ జూపుచున్నారు. తుశబ్దమున కిచట నిశ్చయమర్థము. సర్వాత్మమగుటవలన బ్రహ్మమునకే మనోమయత్వాది గుణములు సంభవములు, శారీరునికి సంభవములు కావు. 'ఏజగత్కారణము సత్యసంకల్పము, ఆకాశాత్మకము, ఇంద్రియములు లేనిది కామము లేనిది, అనగా నిత్యతృప్తము, పృథివికంటె మహాంతము అగుచున్నదో' యని, మనోమయత్వవాక్యమునం దుదాహరింపబడిన గుణములన్నియు నకస్మాత్తుగ జీవునియం దుపపన్నములు గానేరవు. శారీరుడనగా శరీరమునం దుండువాడని యర్థము. ఈశ్వరుడు గూడ శరీరమునం దున్నాడుగదా యనిన, నిజమే! ఈశ్వరుడుగూడ శరీరమునందే యున్నాడు. అతడు శరీరమునం దున్నాడు గాని శరీరమునందు మాత్రమే లేడు. [ ఆత్మ సర్వవ్యాపి. జీవుడు శరీరమునందుమాత్రమే గలడు] "అతడు పృథివికంటెను అంతరిక్షముకంటెను గొప్పవాడు!" "ఆకా

మనోమయత్వాది గుణములు జీవునియందుపపన్నములు.

## కర్మకర్తృవ్యపదేశాచ్చ (సూ. 4)

ఇతశ్చ న శారీరో మనోమయత్వాదిగుణః, యస్మాత్కర్మకర్తృవ్యపదేశో భవతి 'ఏతమితః ప్రేత్యాభిసంభవితాస్మీ' తి. ( ఛాం. 3- 14- 4 ) ఏతమితి ప్రకృతం మనోమయత్వాదిగుణముపాస్యమాత్మానం కర్మత్వేన ప్రాప్యత్వేన వ్యపదిశతి.

---

శముపలె నతడు సర్వగతుడు నిత్యుడు" అని యతని సర్వవ్యాపిత్వమును శ్రుతి పల్కుచున్నది. జీవుడన్ననో శరీరమునందు మాత్రమేగలడు. శరీర మతనికి భోగభూమి. అతనికి మఱియొక స్థానము లేదు. 3

అ॥ అన్వయవ్యతిరేకములచే మనోమయత్వాది గుణములుపాస్యబ్రహ్మలింగములని ప్రదర్శించి, జీవుని స్వీయధర్మములవలనగూడ నాగుణములు బ్రహ్మలింగములు గానేరవని చూపుచున్నారు.

కర్మ = బ్రహ్మము పొందతగినది గాను, కర్తృ = జీవుడా బ్రహ్మమును బొందువానిగాను వ్యపదేశాత్ చ = నిరూపింప బడుటచేతనుగూడ, మనోమయత్వాది గుణకుడు జీవుడు గానేరడు.

ఈ కారణమువలనగూడ జీవుడు మనోమయత్వాది గుణములుగలవాడు కాడు. 'మరణానంతరము నే నితనిని పొందగలను' అను శ్రుతియందు బ్రహ్మము ప్రాప్యముగాను, జీవుడు ప్రాప్తగాను చెప్పబడుచున్నారు. 'ఇతనిని' యని మనోమయత్వాది గుణోపేతము ఉపాస్యమునగు ప్రకృతబ్రహ్మ

జీవుడుపాసకుడు
బ్రహ్మముపాస్యము

అభిసంభవితాస్మీతి శారీరముపాసకం కర్తృత్వేన ప్రాపకత్వేన. అభిసంభవితాస్మీతి ప్రాప్తాఽస్మీత్యర్థః. న చ సత్యాం గతావేకస్య కర్తృకర్మవ్యపదేశో యుక్తః, తథోపాస్యోపాసకభావోఽపి భేదాధిష్ఠాన ఏవ, తస్మాదపి న శారీరో మనోమయత్వాదివిశిష్టః ।

## శబ్దవిశేషాత్ (సూ. 5)

ఇతశ్చ శారీరాదన్యో మనోమయత్వాదిగుణః, యస్మాచ్ఛబ్దవిశేషో భవతి, సమానప్రకరణే శ్రుత్యంతరే— 'యథా వ్రీహిర్వా యవో వా శ్యామాకో వా శ్యామాకతండులో

---

మును పొందతగినదానిగాను, పొందుట అనుక్రియకు కర్మగాను శ్రుతిచెప్పుచున్నది. పొందుచున్నానని యుపాసకుఁడగు జీవుఁడు పొందుట యను క్రియకు కర్తగాను చెప్పుచున్నది. అభిసంభవితాస్మి అనగా నేను బొందుచున్నానని యర్థము, పొందుటయను క్రియకొకడే కర్తగాను కర్మగాగూడ నున్నాడనుట యుక్తముఁ కాదు. అదేవిధమున నుపాసించువాడు, నుపాసింపబడునది వీరిద్దఱికి నాశ్రయములు భిన్నములు కావలెను. ఇందువలనగూడ జీవుఁడు మనోమయధర్మగుణకుడు కానేరడు.4

అ॥ పూర్వసూత్రమునందలి 'చ' మఱియు అను శబ్దమున కర్థము తరువాతసూత్రమున స్పష్టముచేయుచున్నారు.

---

శబ్దవిశేషాత్ = సమానార్థకమగు నితరప్రకరణమునందు జీవబ్రహ్మములు విశేషశబ్దములచే జెప్పబడుటవలన

ఈ కారణమువలనగూడ మనోమయత్వాది గుణకుడు

వైవమయమంతరాత్మన్పురుషో హిరణ్మయ' (శత. బ్రాం 10-6-32) ఇతి. శారీరస్యాత్మనోఽన్యః శబ్దోఽభిధాయకః సప్తమ్యంతోఽంతరాత్మన్నితి. తస్మాద్విశిష్టోఽన్యః ప్రథమాంతః పురుషశబ్దో మనోమయత్వాదివిశిష్టస్యాత్మనోఽభిధాయకః, తస్మాత్తయోర్భేదోఽవగమ్యతే.

## స్మృతేశ్చ (సూ. 6)

స్మృతిశ్చ శారీరపరమాత్మనోర్భేదం దర్శయతి— "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్సర్వ

---

జీవునికంటె నన్యుడగుచున్నాడు. ఈ అర్థమును బోధించు మఱియొక శ్రుతియందు, వ్రీహిగాని యవలుగాని, శ్యామాకమను తృణధాన్యవిశేషము గాని, శ్యామాకతండులము గాని యెట్లో యట్లే ఆత్మయందు హిరణ్మయుఁడగు పురుషుఁడు గలఁడు; అని జీవబ్రహ్మములకు భేదము చెప్పబడుచున్నది. శారీరుఁడగు జీవుని బోధించు శబ్దము 'అంతరాత్మని' యని సప్తమీ విభక్తియందు గలదు. మనోమయత్వాది విశిష్టమగు నాత్మను బోధించు పురుషశబ్దము ప్రథమావిభక్తియందు గలదు. అందువలన వీరిద్దఱు భిన్నులగుచున్నారని తెలియుచున్నది. 5

జీవబ్రహ్మములు విభిన్న శబ్దములచే చెప్పబడుచున్నారు.

---

స్మృతేః చ = స్మృతిగూడ జీవబ్రహ్మలకు భేదమును గనుపఱచుచుండుటవలన.

భూతాని యంత్రారూఢాని మాయయే" (గీ 18-61) త్యాద్యా. తత్రాహ —

పూ. పక్షి : కః పునరయం శారీరో నామ పరమాత్మనోఽన్యో యః ప్రతిషిధ్యతే, 'అనుపపత్తేస్తు న శారీర' ఇత్యాదినా ? శ్రుతిస్తు 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి (బృ. సూ. 1-2-3) శ్రోతా నాన్యోఽతోఽస్తి మంతా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతే' (బృ. 3-5-23) త్యేవంజాతీయకా పరమాత్మనోఽన్యమాత్మానం వారయతి. తథా స్మృతిరపి — "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారతే" (గీ.13-2) త్యేవంజాతీయకేతి ।

సిద్ధాంతీ: అత్రోచ్యతే. సత్యమేవైతత్, పర ఏవాత్మా దేహేం

---

'ఈశ్వరుడు సర్వజీవులను యంత్రారూఢులైనవారివలె మాయచేత భ్రమింపజేయుచు వారల హృద్దేశమునందున్నాడు.' అను మొదలగు స్మృతివాక్యములు జీవపరమాత్మలకు భేదమును బ్రదర్శించుచున్నవి.

పూ. పక్షి: మనోమయత్వాది గుణము లుపపన్నములు కానందున పరమాత్మకంటె భిన్నుడని నిషేధింపబడుచున్న యీ జీవుఁడనగా నెవరు? 'ఇతనికంటె భిన్నుడగు ద్రష్టగాని శ్రోతగాని లేడను, మొదలగు శ్రుతివాక్యములు పరమాత్మకంటె భిన్నుడగు నాత్మను నివారించుచున్నవి. 'సర్వ క్షేత్రములలోనున్న క్షేత్రజ్ఞుడను నేనే యని తెలిసికొనుము' అని గీత పలుకుచున్నది.

సిద్ధాంతి : ఇందుకు సమాధానము చెప్పుదుము. మీరు చెప్పునది నిజమే! అజ్ఞులు దేహేంద్రియమనోబుద్ధు లను

ద్రియమనోబుద్ధ్యుపాధిభిః పరిచ్ఛిద్యమానో బాలైః శారీర ఇత్యుపచర్యతే. యథా ఘటకరకాద్యుపాధివశాదపరిచ్ఛిన్నమపి నభః పరిచ్ఛిన్నవదవభాసతే తద్వత్. తదపేక్షయా చ కర్మకర్తృత్వాది భేదవ్యవహారో న విరుధ్యతే. ప్రాక్ 'తత్త్వమసీ' త్యాత్మైకత్వోపదేశగ్రహణాత్. గృహీతే త్వాత్మైకత్వే బంధమోక్షాదిసర్వవ్యవహారపరిసమాప్తిరేవ స్యాత్. ।

---

జీవపరమాత్మభేద ముపాధికృతము

నుపాధులచే పరిమితుడైన పరమాత్మనే జీవుడని వ్యవహరించుచున్నారు. స్వాయముగా నాకాశ మపరిచ్ఛిన్నము. ఘటము, మంచుగడ్డ మొదలగు నుపాధులచే పరిచ్ఛిన్న మైనటుల పైకి కాన్పించుచున్నది. పరమాత్మగూడ అలాగుననే కాన్పించుచున్నాడు. "ఆ బ్రహ్మము నీవేయగుచున్నావు" అను మహావాక్యముచే బోధింపబడిన జీవబ్రహ్మల యనన్యత్వము గ్రహింపనంతవఱకు, వారలకుఁ గల కర్మకర్తృత్వ భేదవ్యవహారమునందు విరోధములేదు. వారల కైక్యమును గ్రహించినపుడు, బంధము మోక్షము మొదలగు సర్వవ్యవహారము ముగియును. 6

అ॥ బ్రహ్మము సర్వవ్యాపి. కాని యత డల్పమగు హృద్దేశమునందుండినట్లు చెప్పుచున్నారు. ఈరెండును విరుద్ధములు. కనుక హృద్దేశమునందుండువాడు బ్రహ్మము కానేరడు అను ప్రథమసూత్రమునందలి పూర్వపక్షియొక్క రెండవ యాక్షేపణ కిట్లు సమాధానము చెప్పుచున్నారు.

## అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ (సూ. 7)

పూ.పక్షీ: అర్భకమల్పమోకో నీడం 'ఏష మే ఆత్మాంతర్హృదయ" ఇతి పరిచ్ఛిన్నాయతనత్వాత్. స్వశబ్దేన చ 'అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా' ఇత్యణీయస్త్వవ్యపదేశాత్, శారీర ఏవారాగ్రమాత్రో జీవ ఇహోపదిశ్యతే న సర్వగతః పరమాత్మేతి యదుక్తం తత్పరిహర్తవ్యం. ।

---

అర్భక ఔకస్త్వాత్ = బ్రహ్మమున కల్పమగు హృత్పుండరీకము స్థానముగా చెప్పబడుటచేత, తత్ వ్యపదేశాత్ చ = బ్రహ్మమున కణుత్వము చెప్పబడుటచేతను, న = బ్రహ్మ ముపాస్యముగాదు. ఇతి చేత్ = అని యంటివేని, ఏవం = ఈ విధముగ నిచాయ్యత్వాత్ = బ్రహ్మము ధ్యానింపబడుటవలన, వ్యోమవత్ చ = వ్యాపకమైనను ఆకాశమునకు వలెనే.

పూర్వపక్షి : అర్భకం = అల్పమైన, ఓకం = నివాస స్థానము. "హృదయమునందున్న యీ నా స్వరూపము" అను వాక్యము పరిమితమగు నివాసస్థానమును చెప్పుచున్నది. వ్రీహికంటెను యవకంటెను స్వల్పమగు నల్పపరిమాణమును దెలియఁజేయుచున్న యీ శ్రుతి ములుగట్టువంటి పరిమాణముగల జీవునిమాత్రమే బోధించుచున్నది. సర్వగతుడగు పరమాత్మను బోధించుటలేదు అను పూర్వపక్షము పరిహరింపవలసియున్నది.

సిద్ధాంతీ : అతోఽభిధీయతే—నాయం దోషః న తావత్పరిచ్ఛిన్న దేశస్య సర్వగతత్వవ్యపదేశః కథమప్యుపపద్యతే. సర్వగతస్య తు సర్వదేశేషు విద్యమానత్వాత్పరిచ్ఛిన్నదేశవ్యపదేశోఽపి కయాచిదపేక్షయా సంభవతి, యథా సమస్తవసుధాధిపతిరపి సన్నయోధ్యాధిపతిరితి వ్యపదిశ్యతే. కయా పునరపేక్షయా సర్వగతస్సన్నీశ్వరోఽర్భకౌకా అణీయాంశ్చ వ్యపదిశ్యత ఇతి. నిచాయ్యత్వాదేవమితి బ్రూమః. ఏవమణీయస్త్వాదిగుణోపేత ఈశ్వరస్తత్ర హృదయపుండరీకే నిచాయ్యో ద్రష్టవ్య ఇత్యుపదిశ్యతే, యథా సాలగ్రామే హరిః, తత్రాస్య బుద్ధివిజ్ఞానం

---

సిద్ధాంతి : ఇందుకు సమాధానము చెప్పుచున్నాము. పరిమిత ప్రదేశగతుడైనవానికి సర్వగతత్వ మేవిధముగాను సంభవముకాదు. సర్వగతుడు సర్వప్రదేశముల యందుండుటచే నితరప్రదేశము నపేక్షించి పరిమితప్రదేశమున నున్నట్లు చెప్పశక్యము. ఆసేతుహిమనగపర్యంతమగు భూమికి అధిపతి యయినను, అయోధ్యాధిపతియని వ్యవహరించుచున్నాము. సర్వగతుఁడగు పరమేశ్వరుని దేని నపేక్షించి హృదయమను నల్పప్రదేశము గలవాఁడనియు నల్పపరిమాణము గలవాఁడనియు జెప్పుచున్నామన, ఉపాసనము కొఱకలాగు చెప్పుచున్నాము. సూక్ష్మత్వము మొదలగు ననేకగుణోపేతుఁడగు నీశ్వరుడు హృదయపుండరీకమునందు దర్శనయోగ్యుఁడని శ్రుతి యుపదేశించుచున్నది. శాలగ్రామమునందు విష్ణుమూర్తి నుపాసించుచున్నాము. బుద్ధివృత్తి హృదయపుండరీకమునం దీశ్వరుని గ్రహింపగలదు. ఈశ్వరుఁడు సర్వగతు

గ్రాహకం, సర్వగతోఽపీశ్వర స్తతోఽపాస్యమానః ప్రసీదతి. వ్యోమవచ్చైతద్ద్రష్టవ్యం. యథా సర్వగతమపి సద్వ్యోమ సూచీపాశాద్యపేక్షయార్భకౌకోఽణీయశ్చ వ్యపదిశ్యతే, ఏవం బ్రహ్మాపి. తదేవం నిచాయ్యత్వాపేక్షం బ్రహ్మణోఽర్భకౌకస్త్వమణీయస్త్వంచ న పారమార్థికం. తత్ర యదాశంక్యతే హృదయాయతనత్వాద్బ్రహ్మణః హృదయాయతనానాం చ ప్రతిశరీరం భిన్నత్వాత్ భిన్నాయతనానాం చ శుకాదీనామనేకత్వసావయవత్వానిత్యత్వాదిదోషదర్శనాద్బ్రహ్మణోఽపి తద్వత్ప్రసంగ ఇతి తదపి పరిహృతం భవతి. ।

---

ఉపాసనము కొఱకు హృదయము నిర్దేశింపబడినది.

డైనను పరిమితములగు నాయా స్థలములయం దుపాసింపఁబడి యనుగ్రహించును. ఆకాశముయొక్క పోలికచే నీవిషయమును గ్రహింపవలయును. ఆకాశము సర్వగతమగుచుండగ, సూదిబెజ్జము నపేక్షించి స్వల్పప్రదేశగతమనియు సూక్ష్మమనియు వాడుచున్నాము. అలాగుననే బ్రహ్మముగూడ. ఈ విధముగ నుపాసనము నపేక్షించి బ్రహ్మమున కాపాదింపఁబడుచున్న స్వల్పమగు నావాస సూక్ష్మత్వములు పారమార్థికములు గావు. ఇట్లనుటవలన, బ్రహ్మమునకు హృదయ మావాసము, శరీరము లనేకములగుటవలన చిలుకలకువలెనే బ్రహ్మముయొక్క నివాసస్థానములుగూడ ననేకములు, అవయవసహితములు, కనుక అనిత్యములు అను మొదలగు దోషములు కాన్పించుటచే నీదోషములు బ్రహ్మమునకుగూడ సంభవించుచున్నవిగదా యను నాశంకగూడ పరిహృతమగుచున్నది. 7

## సంభోగ ప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్ (సూ. 8)

పూ.పక్షీ; వ్యోమవత్సర్వగతస్య బ్రహ్మణః సర్వప్రాణిహృదయ సంబంధాచ్చిద్రూపతయా చ శారీరేణావిశిష్టత్వాత్, సుఖ దుఃఖాదిసంభోగోఽప్యవిశిష్టః ప్రసజ్యేత. ఏకత్వాచ్చ న హి పరమాత్మనోఽన్యః కశ్చిదాత్మా సంసారీ విద్యతే 'నాన్యోఽతోఽస్తి విజ్ఞాతే' (బృ 3-5-23) ఇత్యాదిశ్రుతిభ్యః. తస్మాత్పరస్యైవ బ్రహ్మణః సంభోగప్రసంగః, ఇతి చేన్న. ।

---

అ॥ జీవబ్రహ్మములకు భేదములేనిచో, హృద్గతుడగు జీవుని కనిష్టభోగ ముపపన్నమగుటంజేసి హృద్గతుడగు జీవుడే యుపాస్యమగుచున్నాడను శంకకు రాబోవు సూత్రమున సమాధానము చెప్పుచున్నారు.

---

హృదయసంబంధముచే, జీవునికివలెనే బ్రహ్మమునకుగూడ, సంభోగప్రాప్తిః ఇతి చేత్ = సుఖదుఃఖానుభవము గలుగుచున్నదనిన న = అది సరికాదు. ఏలనన! వైశేష్యాత్ = విశేష ముండుటవలన.

పూర్వపక్షి : బ్రహ్మ మాకాశమువలె సర్వగతు డగుటవలన సర్వప్రాణుల హృదయముతో నతనికి సంబంధము సంప్రాప్తమగుచున్నది; చిద్రూపము గనుక జీవుని కంటె భిన్నముకాదు. కనుక సుఖదుఃఖాది సంభోగమునం దిరువురకును భేదము లేకుండును. వారుభయు లొకరే యగుచున్నారు. పరమాత్మకంటె నన్యుడు జీవుడను వా డొకడు లేడు. "అతనికంటె భిన్నుడు విజ్ఞాత యగువాడు లేడు"

సిద్ధాంతీ: వైశేష్యాత్. స తావత్సర్వప్రాణిహృదయసంబంధాచ్చిద్రూపతయా చ శారీరవద్బ్రహ్మణస్సంభోగప్రసంగః, వైశేష్యాత్. విశేషో హి భవతి శారీరపరమేశ్వరయోః. ఏకః కర్తా భోక్తా ధర్మాధర్మాదిసాధనః సుఖదుఃఖాదిమాంశ్చ, ఏకస్తద్విపరీతోఽపహతపాప్మత్వాదిగుణః. ఏతస్మాదనయోర్విశేషాదేకస్య భోగో నేతరస్య. యది చ సన్నిధానమాత్రేణ వస్తుశక్తిమనాశ్రిత్య కార్యసంబంధోఽభ్యుపగమ్యేత ఆకాశాదీనామపి దాహాదిప్రసంగః. సర్వగతానేకాత్మవాదినామపి సమావేతౌ చోద్య

---

మొదలగు శ్రుతివాక్యములు వినవచ్చుచున్నవి. అందువలన పరమాత్మకే సంసారసంభోగ మాపన్నమగుచున్నది.

జీవుడు కర్త భోక్త బ్రహ్మము కాదు.

సిద్ధాంతి : "ఇది సరికాదు, ఇద్దరికి భేదము గలదు. అందువలన, సర్వప్రాణుల హృదయసంబంధమువలన జీవునికి గలిగినట్లు బ్రహ్మమునకు సంసార సంభోగము గలుగదు. జీవపరమేశ్వరులకు నిశ్చయముగ భేదముగలదు. జీవుడు క్రియాచరణమును జేయుచున్నాడు, వాని ఫలము ననుభవించుచున్నాడు; ధర్మాధర్మరూపములగు నుపాధిసాధనముల గలిగియున్నాడు; సుఖదుఃఖములకు లోనగుచున్నాడు. పరమేశ్వరుడు సర్వపాపనాశము మొదలగు జీవునికంటె వ్యతిరేక గుణములు గలిగియున్నాడు. ఈ కారణమువలన నొకరికి భోగము సంప్రాప్తమగుచున్నది. రెండవవాని కది సంప్రాప్తమగుటలేదు. వారివారి శక్తిని విచారింపక, కేవల హృదయసాన్నిధ్యముచేతనే సుఖదుఃఖాది కార్యములు బ్రహ్మమునకు

పరిహారౌ. యదప్యేకత్వాద్బ్రహ్మణ ఆత్మాంతరాభావాచ్ఛారీరస్య భోగేన బ్రహ్మణో భోగప్రసంగ ఇతి, అత్ర వదామః—ఇదం తావద్దేవానాంప్రియః ప్రష్టవ్యః-కథమయం త్వయాత్మాంతరాభావోఽధ్యవసిత ఇతి. 'తత్త్వమస్యహం బ్రహ్మాస్మి నాన్యోఽతోఽస్తి విజ్ఞాతే'త్యాదిశాస్త్రేభ్యః ఇతి చేత్, యథాశాస్త్రం తర్హి శాస్త్రీయోఽర్థః ప్రతిపత్తవ్యః స తత్రార్ధజరతీయం లభ్యం.

---

దటస్థించునంటి రేని, నగ్నికి సన్నిహితముగానున్న యాకాశమునకుగూడ దహనము సంప్రాప్తము కావలయును. జీవు లనేకులను వారి మతమునందుగూడ నీప్రశ్న ప్రతివచనములు సమానమే యగుచున్నవి. బ్రహ్మ మొకడు, జీవుఁడను వాఁడు మఱియొకఁడు లేఁడు. కనుక, జీవుని భోగము బ్రహ్మభోగ మగుచున్నదియని వాదించు మందబుద్ధిని నొకవిషయ మడుగవలసియున్నది. జీవుడనువాఁ డన్యుడు లేఁడని నీవెట్లు నిశ్చయింపఁ గలిగితివి? "నీవు ఆబ్రహ్మ మయితివి" "నేను బ్రహ్మము నే యగుచున్నాను." "అతని కంటె నన్యుఁడగు విజ్ఞాత మఱియొకడు లేడు"- ఈ మొదలగు శ్రుతివాక్యములచే నిశ్చయింపగలిగితి మంటి రేని యథాశాస్త్రముగ శాస్త్రసమ్మతమగు నర్థమును గ్రహింపవలయునుగాని అర్ధజరతీయన్యాయము నవలంబింపరాదు. [కోడిలో సగభాగము వండి తినుటకును సగభాగము గుడ్లుపెట్టుకొనుటకును కోరుట విరుద్ధమగును. పాకార్థమర్ధం ప్రసవార్థమర్ధని కోరుట అర్ధజరతీయన్యాయము. వృద్ధస్త్రీయొక్క ముఖము మాత్రము కోరు

శాస్త్రం చ 'తత్త్వమసీ'త్యపహతపాప్మత్వాదివిశేషణం బ్రహ్మ శారీరస్యాత్మత్వేనోపదిశచ్ఛారీరస్యైవ తావదుపభోక్తృత్వం వారయతి. కుతః? తదుపభోగేన బ్రహ్మణ ఉపభోగప్రసంగః ।

పూ.పక్షి: అథాగృహీతం శారీరస్య బ్రహ్మణైకత్వం ।

సిద్ధాంతి : తదా మిథ్యాజ్ఞాననిమిత్తః శారీరస్యోపభోగో న తేన పరమార్థరూపస్య బ్రహ్మణస్సంస్పర్శః. న హి బాలై స్తలమలినతాదిభిర్వ్యోమ్ని వికల్ప్యమానే తలమలినతాదివిశిష్టమేవ పర

---

చున్నాడుగాని యంగముల కోరుటలేదనుట గూడ అర్ధజరతీయన్యాయమున బడుచున్నది. జీవబ్రహ్మల యైక్యసమర్థనము కొఱకు శాస్త్రము, భోక్తృత్వాది వాదసమర్థనముకొఱకు శాస్త్రపరిత్యాగము తగదని తాత్పర్యము]. జీవబ్రహ్మైక్యము నుపదేశించు శాస్త్రము, సర్వపాపరహితము గు బ్రహ్మము జీవునియొక్క స్వరూపమని బోధించుచు, జీవునియొక్క భోక్తృత్వమును మాత్రము నిషేధించుచున్నది. అట్టిస్థితిలో జీవునికి భోగ మెక్కడ! తద్వారా బ్రహ్మమున కుపభోగ మెక్కడ?

పూ. పక్షి : మేము శాస్త్రమునసనుసరించి జీవబ్రహ్మల యైక్యము నంగీకరించుటలేదు. [మీ వాదము నాధారముచేసి కొని యట్టి యైక్యము నంగీకరించి మేము వాదించుచున్నాము కనుక అర్ధజరతీయ న్యాయము మాకన్వయింపదు]

సిద్ధాంతి : అట్లయినచో, జీవునికి మిథ్యాజ్ఞానముచే భోక్తృత్వము సంప్రాప్తమగుచున్నది. అట్టి మిథ్యారూపముచే పరమాత్మ సంస్పృష్టుడుగా నేరడు. అజ్ఞానుల కల్పనలచే

మార్థతో వ్యోమ భవతి. తదాహ 'న వైశేష్యా'దితి. నైకత్వేపి శారీరస్యోపభోగేన బ్రహ్మణ ఉపభోగప్రసంగో వైశేష్యాత్. విశేషో హి భవతి మిథ్యాజ్ఞానసమ్యగ్జ్ఞానయోః. మిథ్యాజ్ఞానకల్పిత ఉపభోగః, సమ్యగ్జ్ఞానదృష్టమేకత్వం, న చ మిథ్యాజ్ఞానకల్పితే నోపభోగేన సమ్యగ్జ్ఞానదృష్టమేకత్వం వస్తు సంస్పృశ్యతే. తస్మాన్నోపభోగగంధోఽపి శక్య ఈశ్వరస్య కల్పయితుమ్.

---

నాకాశమునందు యథార్థముగ నీలాదివర్ణములు గలుగ నేరవు. అందువలన న వైశేష్యాత్ = జీవబ్రహ్మలకు భేదముండుటవలన నని సూత్రకారులు పలికిరి. జీవబ్రహ్మ లొకటే యయినను, భేదముండుటచే జీవుని భోగముచేత బ్రహ్మమునకు భోగము సంభవింపదు. మిథ్యాజ్ఞానమునకు యథార్థజ్ఞానమునకు నవశ్యము భేదము గలదు. జీవునిభోక్తృత్వము మిథ్యాజ్ఞానముచే కల్పితము; యథార్థజ్ఞానముచే జీవబ్రహ్మలయైక్యము తెలియుచున్నది. మిథ్యాజ్ఞానకల్పితమగు జీవుని భోక్తృత్వము యథార్థజ్ఞానముచే దెలియుచున్న బ్రహ్మపదార్థము నంట నేరదు. కనుక పరమేశ్వరుని కుపభోగవాసనకూడ నంట శక్యము కాదు.

---

<u>అధికరణార్థసంక్షేపము</u>: స్పష్టబ్రహ్మలింగ వాక్యముల ప్రథమపాదమున విచారించిరి. అస్పష్టములగు నుపాస్యబ్రహ్మలింగములు ద్వితీయపాదమునందు, జ్ఞేయబ్రహ్మలింగములు తృతీయపాదమునందును విచారించుచున్నారు. మున్నందు ఛాందోగ్యము 3-14-1 వాక్యమునందు వినబడు "మనోమయః

ప్రాణశరీరః" యనుపదములు విచారణవిషయములుగ గ్రహింపబడినవి. ఈపదములు ఉపాస్యమగు జీవపరములు. జీవునియొక్క మనోమయ సంబంధము సుప్రసిద్ధము. హృదయంగతత్వమను పరిమాణపరిమితత్వమతనికే తగునుకాని యపరిచ్ఛిన్నమగు బ్రహ్మమునకు దగదు. బ్రహ్మము పృథివికంటెను బెద్దదియని శ్రుతి చెప్పుచున్నది. ప్రపంచమంతయు బ్రహ్మమని యారంభమున వినబడుచున్న బ్రహ్మము సృష్టిస్థితిలయహేతువగుటవలన నద్దాని శాంతముతో నుపాసింపవలయునని శాంతము ననంతరవాక్యము విధించుచున్నది. ఇట్లు పూర్వపక్షము రాగా మనోమయశబ్దము బ్రహ్మపరమని సిద్ధాంతము చేయబడుచున్నది. బ్రహ్మము సృష్టిస్థితిలయహేతువని వేదాంతములయందు సుప్రసిద్ధము. దుఃఖియగు జీవు డుపాస్యుడు గానేరడు. ఆనందరూపమగు బ్రహ్మ ముపాస్యము. తరువాతవాక్యమునందు చెప్పబడు సత్యసంకల్పాది వాక్యములు బ్రహ్మమునందన్వయించును. జీవునియందన్వయింపవు. ఆకాశ ఆత్మా యను తరువాత పదము బ్రహ్మమును సూచించుచున్నది. సృష్టిస్థితిలయములు బ్రహ్మమునకే తగును. మనోమయత్వాదులు సగుణబ్రహ్మమునందు సంభవించుచున్నవి. జీవునియందు సంభవము కావు. జీవుడు హృదయమునందు మాత్రముండును. బ్రహ్మము హృదయమునందేగాక యంతటనున్నాడు. బ్రహ్మము ప్రాప్యము, జీవుడద్దాని బొందువాడు, ఇట్లుభయులకు విరుద్ధగుణములు కాన్పించుచున్నవి. పొందువాడు పొందబడువాడును భిన్నులు కావ

లెను. ఈయర్థమును బోధించు నితరప్రకరణములయందును శ్రుతిస్మృతుల యందును జీవబ్రహ్మము విభిన్నశబ్దములచే బోధింపబడుచున్నారు. ఉపాసనము కొఱకు బ్రహ్మమల్ప పరిమాణము గలహృదయాకాశ మునందున్నట్లు నుదాహరింప బడినది. సర్వగతుడైనవానికి అల్పప్రదేశము సంభవము. జీవబ్రహ్మము లొకరను జ్ఞానము కలగ నంతవఱకు కర్తృత్వ భోక్తృత్వములు జీవుని యందుండునుగాని యవి బ్రహ్మము నంటవు. ఇద్దఱొకటియె యనుజ్ఞానము కలిగినపుడు జీవునికిగూడ నాగుణములు తొలగిపోవుచున్నవి.

---

## అత్త్రధికరణము

అ॥ ఈశ్వరునికి భోక్తృత్వము లేనిచో నతనికి నట్టి గుణమును బోధించు "యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదన" అను కఠవల్లీ వాక్యము విరుద్ధమగుచున్నది యనుశంకను తరువాత యధికరణమున నివారించుచున్నారు.

విషయము– "యస్య చ బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః॥ (కఠ 1-2-25)

సంశయము– ఇచట వినబడుచున్న అత్త యెవరు? అగ్నియా! జీవుడా! లేక పరమాత్మయా?

పూర్వపక్షము– అగ్నియో జీవుడో కావలెను. పరమాత్మ కానేరడు.

# అత్తా చరాచరగ్రహణాత్ (సూ. 9)

కఠవల్లీషు పఠ్యతే—'యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః, మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః' (1-2-24) ఇతి, అత్ర కశ్చిదోదనోపసేచనసంసూచితోఽత్తా ప్రతీయతే. తత్ర కిమగ్నిరత్తా స్యాదుత జీవోఽథ వా పరమాత్మేతి సంశయః, విశేషానవధారణాత్, త్రయాణాం చాగ్నిజీవపరమాత్మనామస్మిన్ గ్రంథే ప్రశ్నోపన్యాసోపలబ్ధేః ।

---

సిద్ధాంతము - పరమాత్మయె యగుచున్నాడు.

చూడదగిన ప్రమాణములు -

కఠ. 1- 2 -25 1-1-13-1-1-20 1-2-14.

ముండకము 3-1-1.

---

చర అచర గ్రహణాత్ = చరాచరము లుదాహరింపఁబడుటవలన విషయవాక్యమునందలి అత్తా = అత్త యను శబ్దముచే బోధితు డగువాడు బ్రహ్మము.

'ఎవనికి బ్రహ్మక్షత్రియు లాహారమో, మృత్యువుపసేచనమో యనఁగా నాహారసంస్కారమగు ఘృతాదికమో యట్టివాఁ డెచట నున్నాడో యెవరికి తెలియు'నను కఠవల్లి వాక్యమున నోదనోపసేచన శబ్దములచే భుజియించువాఁ డొకఁడు సూచింపబడుచున్నాఁడు. ఈ భుజియించువానిని నిశ్చయించు విశేషము లుదాహరింపఁబడకుండుటచే నీతఁ డగ్నియా, జీవుఁడా లేక పరమాత్మయా యను సందేహము కలుగుచున్నది. ఈ ముగ్గిరిలోను 1-1-13 మంత్రమున

పూ.పక్షి: కిం తావత్ప్రాప్తం? అగ్నిరత్తేతి. కుతః? 'అగ్నిరన్నాద' (బృ 1-4-6) ఇతి శ్రుతిప్రసిద్ధిభ్యాం, జీవో వాఽత్తా స్యాత్ 'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి' ఇతి దర్శనాత్. న చ పరమాత్మా 'అనశ్నన్నన్యో అభిచాకశీతి' (ముా 3-1-1) తి దర్శనాదితి. ।

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే బ్రూమః—అత్తాఽత్ర పరమాత్మా భవితుమర్హతి. కుతః? చరాచరగ్రహణాత్. చరాచరం హి స్థావర జంగమం మృత్యూపసేచనమిహాద్యత్వేన ప్రతీయతే. తాదృశస్య

---

నగ్నినిగూర్చియు, 1-1-20 మంత్రమున జీవునిగూర్చియు, 1-2-14 మంత్రమున బ్రహ్మమునుగూర్చియు నచికేతసుఁడు యముని ప్రశ్నించెను.

పూర్వపక్షి : ఇపుడేమి సంప్రాప్తమైనదనిన, (1)అత్తశబ్ద మగ్నినిఁ జెప్పుచున్నది, "అగ్ని యన్నము దినుచున్న వాఁడు" అని శ్రుతియందును లోకమునందును ప్రసిద్ధిగలదు. లేక (2) అత్తశబ్దము జీవునయినను బోధించును. 'సంసార వృక్షమున నున్న రెండుపక్షులలో నొకటి రుచ్యమగు సంసారముననుభవించుచున్నది'యని మాండూక్యమునందు(3-1-1) జీవుఁడు దాహరింపఁబడుచున్నాఁడు. 'రెండవపక్షి యేమియు ననుభవములేక దూరమునుండి చూచుచున్నది.' యను వాక్యము వలన నత్తశబ్ద మిచట బ్రహ్మమును బోధించుటలేదు.

సిద్ధాంతి : ఇట్టి పూర్వపక్షవాదమునకు సమాధానము చెప్పుచున్నాము. ఇచట 'అత్త'యగువాడు పర

చాద్యస్య న పరమాత్మనోఽన్యః కార్త్స్న్యేనాత్తా సంభవతి, పరమాత్మా తు వికారజాతం సంహరన్ సర్వమత్తీత్యుపపద్యతే

పూ.పక్షీ : నన్విహ చరాచరగ్రహణం నోపలభ్యతే. తత్కథం సిద్ధవచ్చరాచరగ్రహణం హేతుత్వేనోపాదీయతే? ।

సిద్ధాంతీ : నైషదోషః మృత్యూపసేచనత్వేనాద్యత్వేన సర్వస్య ప్రాణిజాతస్య ప్రతీయమానత్వాద్బ్రహ్మక్షత్రయోశ్చ

---

చరాచర శబ్దములు బ్రహ్మను సూచించుచున్నవి.

మాత్మయే కాఁదగును. (1) చరాచర శబ్దము లీవాక్యమునందు గలవు. చరాచరములనఁగ స్థావర జంగమములు. ప్రకృతమున నవి నోదనముగను మృత్యువుపసేచనముగనుఁ దెలియవచ్చుచున్నవి. ఈ విధముగ నన్నిటిని నాహారముగ గ్రహింపగలవాఁడు పరమాత్మకంటె మఱియొకఁడు సంభవింపఁడు. పరమాత్మ వికారస్వరూపమగు దానినంతయు నుపసంహరించుచున్నందున వానిని భుజించుచున్నట్లుఁ గాన్పించుచున్నాఁడు.

పూర్వపక్షి : ప్రస్తుతవాక్యమునందు చరాచరములుదాహరింపఁ బడలేదు. [ బ్రహ్మక్షత్రములు మృత్యువు మాత్రము వినబడుచున్నవి]. పలుకరింపబడనివానిని హేతువుగా గ్రహించుట కెట్లుశక్యము ?

సిద్ధాంతి : ఇదియొక దోషముకాదు. సమస్తప్రాణిజాతము మృత్యువున కుపసేచనముగఁ గాన్పించుచున్నది. ప్రధానములు గనుక బ్రహ్మక్షత్రములు ప్రదర్శింపబడినవి.

ప్రాధాన్యాత్ప్రదర్శనార్థత్వోపపత్తేః. యత్తు పరమాత్మనో ఽపి నాత్తృత్వం సంభవతి 'అనశ్నన్నన్యో అభిచాకశీతీ' తి దర్శనా దితి, అత్రోచ్యతే. కర్మఫలభోగస్య ప్రతిషేధకమేతద్దర్శనం, తస్య సన్నిహితత్వాన్న వికారసంహారస్య ప్రతిషేధకం, సర్వవేదాంతేషు సృష్టిస్థితిసంహారకారణత్వేన బ్రహ్మణః ప్రసిద్ధత్వాత్. తస్మాత్పరమాత్మైవేహాత్తా భవితుమర్హతి. ।

## ప్రకరణాచ్చ (సూ. 10)

సిద్ధాంతీ: ఇతశ్చ పరమాత్మైవేహాత్తా భవితుమర్హతి: యత్తా

---

(2) 'రెండవపక్షి యేమియు భుజియింపక దూరమున నుండి చూచుచున్నది' యనువాక్యముచేఁ బరమాత్మకుఁ గర్తృత్వము సంభవించుటలేదను వాదమునకు సమాధానమేమన, పరమాత్మ కర్మఫలభోగము ననుభవింపదని ఆ వాక్యము చూపించుచున్నది. ఆ వాక్యమునందు కర్మఫలభోగము సన్నిహితముగ నుదాహరింపబడుచున్నది. బ్రహ్మము వికారజాతము నుపసంహరింపదని యీవాక్యము నిషేధించుటలేదు. బ్రహ్మ సృష్టిస్థితిసంహారకారణమని వేదాంతములన్నిటి యందునుఁ బ్రసిద్ధిగలదు. కనుక పరమాత్మయె ప్రకృతమగు నత్త యగుచున్నాడు. (9)

---

ప్రకరణాత్ చ = ప్రకరణమునుబట్టి గూడ బ్రహ్మమే "యత్త" యగుచున్నాడు.

సిద్ధాంతి : ఈ కారణమునుబట్టి గూడ బ్రహ్మమే అత్త కాదగును. ప్రకృత వాక్యమువినవచ్చుచున్న ప్రకరణము

రణమిదం ప్రకరణం పరమాత్మనః ‘న జాయతే మ్రియతే వా విపశ్చి’ (కఠ1-2-18) దిత్యాది. ప్రకృతగ్రహణం చ న్యాయ్యం ‘క ఇత్థా వేద యత్ర స’ ఇతి చ దుర్విజ్ఞానత్వం పరమాత్మలింగమ్.

## (3) గుహాప్రవిష్టాధికరణమ్ (సూ 11-12)

బ్రహ్మప్రకరణమగుటవలనగూడ పరమాత్మయే ‘యత్త’ కాఁదగును. ‘ఆత్మ పుట్టదు, చావదు;’ అని తరువాతవాక్యము పల్కుచున్నది. ప్రకృతమగుదానిని గ్రహించుట న్యాయము. “ఆతడెక్కడ నున్నాఁడో యెవరికిఁ దెలియును” అని దుర్విజ్ఞానత్వముగూడ బ్రహ్మసూచక మగుచున్నది. 2

అధికరణ సంక్షేపము. కఠవల్లి 1- 2- 25 వాక్యమునం దుదాహరింపబడిన అత్త బ్రహ్మము, అతడు చరాచరమునకు సృష్టిస్థితి సంహారహేతు వగుచున్నాడు. ప్రకరణము బ్రహ్మప్రకరణము. ఆతనికి కర్మలోపభోగము లేదనిమాత్రము మాండూక్యము 3-1-1 వలన తెలియుచున్నది. (10)

అ॥ అత్తృశబ్దము వినబడుచున్న ప్రకరణము బ్రహ్మప్రకరణమని తరువాత వాక్యార్థనిర్ణయముచే స్థిరముచేయుటకీ యధికరణ మారంభమగుచున్నది.

## (3) గుహాప్రవిష్టాధికరణము (11-12)

విషయవాక్యము- ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం
ప్రవిష్టౌ పరమే పరార్థే ఛాయాతపౌ

## గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్ (సూ. 11)

కఠవల్లీష్వేవం పఠ్యతే—“ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యే చ త్రిణాచికేతా” (కఠ1-3-1) ఇతి. తత్ర సంశయః. కిమిహ బుద్ధిజీవౌ నిర్దిష్టౌ, ఉత జీవపరమాత్మానావితి. యదిబుద్ధి జీవౌ,తతోబుద్ధిప్రధానాత్కార్యకరణసంఘాతాద్విలక్షణో

---

బ్రహ్మవిదో వదన్తి పంచాగ్నయో యే
చ త్రిణాచికేతాః (కాఠ1-3-1)

విశయము – బుద్ధిగుహా ప్రవిష్టులుగ నుదాహరింపబడిన యిరువురు బుద్ధిజీవులా జీవపరమాత్మలా యని –

పూర్వపక్షము – బుద్ధిజీవులు.

సిద్ధాంతము – జీవాత్మ పరమాత్మలు.

అధికరణమున చూడవలసిన ఉపనిషద్వాక్యములు కాఠకము 1-3-1 ; 1-2-12 ; 1-3-3; 1-3-9 ; 1-2-12; వాక్యములు :

గుహాం = బుద్ధిగుహను ప్రవిష్టౌ = ప్రవేశించిన వారిద్దఱు ఆత్మానౌ = జీవపరమాత్మ లగుచున్నారు. తత్ దర్శనాత్ = వారుభయులు నొకస్వభావము గలవారని ద్వివచనమువలన దెలియుటచే.

‘స్వయంకృతమగు కర్మఫలమనుభవించునట్టి ఆత్మ, శర్

జీవః ప్రతిపాదితో భవతి, తదపీహ ప్రతిపాదయితవ్యం. 'యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే. ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం వరాణామేష వరస్తృతీయః' (కఠ 1-1-20) ఇతి పృష్టత్వాత్. అథ జీవపరమాత్మానౌ, తతో జీవాద్విలక్షణః పరమాత్మా ప్రతిపాదితో భవతి. తదపీహ ప్రతిపాదయితవ్యం. 'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యస్మాత్కృతా

---

రమునందలి శ్రేష్ఠమయిన బ్రహ్మస్థాన మగు బుద్ధిగుహను ప్రవేశించునట్టి ఆత్మ, వీ రిద్దఱును ఛాయాతపములవలె విలక్షణులగు చున్నారు. ఈవిధముగ బ్రహ్మవిదులగు జ్ఞానులు పంచాగ్న్యుపాసకులగు కర్మకాండపరులు గూడ పల్కుచున్నారు.' ఈ వాక్యమునందు సంశయ మేమన ఈవాక్యము

సంశయ కారణము.

బుద్ధిజీవులను తెలియఁజేయుచున్నదా? లేక జీవపరమాత్మలనుఁ దెలియఁజేయుచున్నదా? యని. బుద్ధిజీవులను తెలియఁజేసినచో, జీవుడు బుద్ధిప్రధానమగు కార్యకరణసంఘాతముకంటె విలక్షణుడుగ నుపపాదింపబడు చున్నాడు. ఈ విషయము గూడ నిచట ప్రస్తావింపదగియే యున్నది. "మనుజుడు మరణించినపు డిట్టి విచారణ కలుగుచున్నది. 'దేహేంద్రియములకు భిన్నమగు నాత్మయనునది యొకటిగలదని కొందఱు, అట్టిది లేదని మఱికొందరు చెప్పుచున్నారు. 'నీచే శాసింపబడినవాఁడనయి నే నీవిషయమును దెలిసికొనగలను. ఇదియె నేను గోరు మూడవవరము' అని జీవునిగురించి నచికేతసుడు యముని నడిగెను. [ఈ ప్రశ్న

కృతాత్, అన్యత్రాస్మాత్కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వదే'
(కఠ 1-2-14) తి పృష్టత్వాత్. ।

మాధ్యమికః: అత్రాహ—ఉభావప్యేతౌ పక్షౌ న సంభవతః. కస్మాత్? ఋతపానం హి కర్మఫలోపభోగః 'సుకృతస్య లోక' ఇతి లింగాత్. తచ్చ చేతనస్య క్షేత్రజ్ఞస్య సంభవతి నాచేతనాయా బుద్ధేః. పిబంతావితి ద్వివచనేన ద్వయోః పానం దర్శయతి శ్రుతిః. అతో బుద్ధిక్షేత్రజ్ఞపక్షస్తావన్న సంభవతి. అత ఏవ క్షేత్రజ్ఞపర

---

యందు బుద్ధ్యాదులకంటె జీవుఁడు విలక్షణుఁడని యుదాహరింపఁబడినది.] ఒకవేళ ప్రకృతవాక్యము జీవపరమాత్మల పలుకరించినచో పరమాత్మ జీవునికంటె విలక్షణుఁడని తెలియఁజేయుచున్నది. ఈ విషయముగూడ ప్రకృతమున బలుకరింపఁదగినదియే. ధర్మానుష్ఠానము దానిఫలము, 'అది దాని సాధనములకంటెను భిన్నము, ధర్మము ననుష్ఠింపకపోవుటచే కలుగు పాపముకంటె భిన్నము, కార్యకారణములకంటెను భిన్నము. కాలత్రయాబాధితము వ్యవహారగోచరము కానిది, యేది కలదో దానిని నీ వెఱుంగుదువుగాన నద్దాని నాకుం జెప్పుమని' నచికేతసుఁడు యమునిఁ బ్రార్థించెను. [ఇచట జీవబ్రహ్మములకు భేదము గోచరించుచున్నది].

మాధ్యమికుఁడు : పై నుదాహరించిన రెండుపక్షములుగూడ నిచట సంభవములు గావు. ఏలనన! ఋతపానమన కర్మఫలోపభోగము. 'సుకృతస్య లోకే' యను పదము లీయర్థమును సూచించుచున్నవి. కర్మఫలోపభోగము చేతనుఁడగు జీవునికి సంభవము గాని యచేతన

మాత్రపక్షేఽపి న సంభవతి, చేతనేఽపి పరమాత్మని ఋతపానాసంభవాత్ ‘అనశ్నన్నన్యోఽభిచాకశీతీ’తి మంత్రవర్ణాదితి. ।

సిద్ధాంతీ: అత్రోచ్యతే నైష దోషః. ఛత్రిణో గచ్ఛంతీత్యేకేనాపి ఛత్రిణా బహూనామచ్ఛత్రిణాం ఛత్రిత్వోపచారదర్శనాత్, ఏవమేకేనాపి పిబతా ద్వౌ పిబంతావుచ్యేయాతాం. యద్వా జీవస్తావత్పిబతి, ఈశ్వరస్తు పాయయతి, పాయయన్నపి పిబతీత్యుచ్యతే. పాచయితర్యపి పక్తృత్వప్రసిద్ధిదర్శనాత్. బుద్ధిక్షేత్రజ్ఞపక్షపరిగ్రహోఽపి సంభవతి, కరణే కర్తృత్వోపచారాత్, ఏధాంసి

---

మగు బుద్ధికి సంభవముగాదు. పిబంతౌ అను ద్వివచనముచే పానముచేయువారిద్దఱున్నట్లు శ్రుతి చూపుచున్నది. కనుక ప్రకృతవాక్యము బుద్ధిక్షేత్రజ్ఞపక్షము కానేరదు. ద్వివచనకారణముచేత ప్రకృతవాక్యము జీవపరమాత్మపక్షముగూడ కాఁదగదు. పరమాత్మ చేతనమైనను, ఋతపానమతనికి సంభవముగాదు. “ఏమియు ననుభవింపకయె రెండవపక్షి చూచుచు దూరముగనున్నది” యని శ్రుతి పల్కుచున్నది.

సిద్ధాంతి : దీని కిట్లు చెప్పుచున్నాము. ఇది దోషము కాదు. ఒకడు గొడుగువేసికొని పదిమందితోఁ గలిసిపోవుచుండగా గొడుగులవారు బోవుచున్నారను ప్రయోగము లోకమునఁ గాన్పించుచున్నది. ఋతపానము చేయువాఁడొక్కఁడైనను, రెండవవానితోఁ గలిపి త్రాగువారని వాడఁబడుచున్నది. లేక జీవుడు ఋతపానము చేయుచున్నాడు, ఈశ్వరుఁ డతనిని త్రాగించుచున్నాడు. పానము

పచంతీతి ప్రయోగదర్శనాత్. న చాధ్యాత్మాధికారే అన్యౌ కౌ చిదృతం పిబంతౌ సంభవతః, తస్మాద్బుద్ధిజీవౌ స్యాతాం జీవపర మాత్మానౌ వేతి సంశయః.|

పూ.పక్షము: కిం తావత్ప్రాప్తం? బుద్ధిక్షేత్రజ్ఞావితి. కుతః? గుహాంప్రవిష్టావితి విశేషణాత్. యది శరీరం గుహా యది వా హృదయముభయథాపి బుద్ధిక్షేత్రజ్ఞౌ గుహాం ప్రవిష్టావుప పద్యేతే. న చ సతి సంభవే సర్వగతస్య బ్రహ్మణః విశిష్టదేశత్వం యుక్తంకల్పయితుం.' సుకృతస్యలోకే' ఇతి చ కర్మగోచరానతి

---

చేయించువానినిగూడ పానము చేయువానిగనే చెప్పనగును. [కారకుడు కర్తయగుచున్నాడని న్యాయమునుబట్టి] వంట చేయించువాడు వండుచున్నాడని చెప్పుకొనుచున్నాము. బుద్ధి సాధనము, జీవుడు కర్త యగుచున్నారు. కరణము నందు కర్తృత్వము నాపాదించి చెప్పుకొనుట సహజము గనుక బుద్ధిజీవుల నిచటగ్రహించినను గ్రహింపవచ్చును. వంటచెరకు వండుచున్నది యని ప్రయోగము కాన్పించు చున్నది. ప్రకరణ మాధ్యాత్మిక విషయమగుటవలన ఋతపా నముచేయువారు మఱియెవరో యిద్దఱుండుట సంభవము కాదు. కనుక నీ పానము సేయువారు బుద్ధిజీవులైనను గావచ్చును. లేక జీవపరమాత్మలైనను కావచ్చునుగదా యని సంశయము.

పూర్వపక్షము: ప్రకృతమున యేమి సంభవించినదియన, బుద్ధిక్షేత్రజ్ఞులు ఋతపానము చేయువారు. ఏలనన! "గుహను బ్రవేశించినవారు" అను విశేషణమువలన! ఈగుహ శరీరమైనను

క్రిమందర్శయతి. పరమాత్మా తు న సుకృతస్య దుష్కృతస్య వా గోచరే వర్తతే. 'న కర్మణా వర్ధతే నో కనీయా' నితి శ్రుతేః. 'ఛాయాతపా' వితిచ చేతనాచేతనయోర్నిర్దేశ ఉపపద్యతే ఛాయాతపవత్పరస్పరవిలక్షణత్వాత్. తస్మాద్బుద్ధిక్షేత్రజ్ఞావిహోచ్యేయాతామితి. ।

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే బ్రూమః. విజ్ఞానాత్మపరమాత్మానావిహోచ్యేయాతాం. కస్మాత్ ? ఆత్మానౌ హి తావుభావపి చేతనౌ

---

హృదయమైనను బుద్ధిజీవులు గుహను ప్రవేశించిరనుట యుక్తిసహమగుచున్నది. ఇట్లర్థసమన్వయము కుదురుచుండ, సర్వగతుడగు బ్రహ్మమునకు ప్రత్యేక మొకస్థలమును గల్పించుట యుక్తముగాదు. 'సుకృతస్య లోకే' సుకృతియయినవాడనురూపమగు లోకమును బొందుననను వాక్యము కర్మఫలము నతిక్రమించుటకు సాధ్యము కాదని సూచించుచున్నది. పరమాత్మ యన్ననో సుకృతదుష్కృతములకు గోచరమగు ఫలమున కతీతుడు, అతడు కర్మచేత వృద్ధినిగాని హైన్యమునుగాని బొందడని శ్రుతి పల్కుచున్నది. ఛాయాతపము లనుపదములు చేతనమును అచేతనము నగువస్తువులను నిర్దేశించుచున్నవి. చేతనాచేతనములు ఛాయాతపములవలె పరస్పరవిలక్షణములు. అందువలన ఋతపానము చేయునట్లు ప్రకృతమున చెప్పబడుచున్నవారు బుద్ధిజీవులగుచున్నారు. ఇట్లు పూర్వపక్షము రాగా-

గుహాన్రప్రవేశించిన వారుబుద్ధిజీవులని పూర్వపక్షము

సిద్ధాంతి : సమాధానము చెప్పుచున్నాము. ప్రస్తుత వాక్యము జీవపరమాత్మలను దెలియచేయుచున్నది. ఆయాత్మ

సమానస్వభావౌ, సంఖ్యాశ్రవణే చ సమానస్వభావేష్వేవ లోకే ప్రతీతిర్దృశ్యతే. అస్య గోర్ద్వితీయో౽న్వేష్టవ్య ఇత్యుక్తే గౌరేవ ద్వితీయో౽న్విష్యతే నాశ్వః పురుషో వా, తదిహ ఋతపానేన లింగేన నిశ్చితే విజ్ఞానాత్మని ద్వితీయాన్వేషణాయాం సమాన స్వభావశ్చేతనః పరమాత్మైవ ప్రతీయతే.।

మధ్యవర్తి : నమూక్తం గుహాహితత్వదర్శనాన్న పరమాత్మా ప్రత్యేతవ్య ఇతి.।

సిద్ధాంతీ : గుహాహితత్వదర్శనాదేవ పరమాత్మా ప్రత్యే

---

బుద్ధిగుహను ప్రవేశించిన వారు జీవపరమాత్మలని సిద్ధాంతము.

లిద్దఱు చేతనులు. సమానస్వభావులు. సమానస్వభావులగువారల నొక సంఖ్యావాచకముచే [వారిద్దరు వారు నలుగురు అని] చెప్పుట లోకమునందు కాన్పించుచున్నది. ఈ గోవునకు రెండవదానిని వెతుకవలయుననగోవునే వెతుకుదుముగాని, అశ్వమును పురుషునిగాని వెతుకము. ప్రకృతవాక్యమున ఋతపానమను చిహ్నముచే నిద్దఱిలో నొకడు జీవాత్మ యని నిశ్చయమగుచుండ నట్టిస్వభావముగల రెండవవాడు పరమాత్మయె కాన్పించుచున్నాడు.

మధ్యవర్తి : రెండవవాడు గుహాహితుడని శ్రుతి చెప్పుటచే నతనిని రెండవవానిగ గ్రహింప వీలులేదుగదా?

సిద్ధాంతి : గుహాహితత్వ విశేషణము కాన్పించుట చేతనే పరమాత్మ నిచట గ్రహించుటకు శక్యమని చెప్పుచున్నాము. పరమాత్మను బుద్ధిగుహాయందు దున్నవానినిగ

తవ్య ఇతి వదామః. గుహాహితత్వం హి శ్రుతిస్మృతిష్వసకృత్పరమాత్మన ఏవ దృశ్యతే. 'గుహాహితం గహ్వరేష్ఠం పురాణం' (కఠ 1-2-12) 'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్' (తై 2-1) 'ఆత్మానమన్విచ్ఛ గుహాం ప్రవిష్ట' మిత్యాద్యాసు. సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపలబ్ధ్యర్థో దేశవిశేషోపదేశో న విరుధ్యత ఇత్యేతదప్యుక్తమేవ. సుకృతలోకవర్తిత్వం తు ఛత్రిత్వవదేకస్మిన్నపి వర్తమానముభయోరప్యవిరుద్ధం. ఛాయాతపావిత్యప్యవిరుద్ధం. ఛాయాతపవత్పరస్పరవిలక్షణత్వాత్సంసారిత్వాసంసారిత్వయోః అవిద్యాకృతత్వాత్సంసారిత్వస్య పారమార్థికత్వాచ్చ

---

దఱుచు శ్రుతిస్మృతులు పల్కుచున్నవి. "ఆత్మ ప్రాకృత విషయముల వికారవిజ్ఞానములచే బుద్ధిగుహాయందు గప్పబడియున్నాడు. విషమస్థానమునందున్నవాడు "పురాతనుడని" కఠశ్రుతియు, 'నుత్కృష్టమగు బుద్ధిగుహాకాశమునందున్నవాడని' తైత్తిరీయశ్రుతియుఁ బల్కుచున్నవి. "బుద్ధిగుహాను ప్రవేశించిన పరమాత్మ నన్వేషింపుము" అని మఱియొక శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మము సర్వగతమైనను ఉపలబ్ధికొఱకొక విశేషప్రదేశమునందున్నట్లుపదేశించుట విరుద్ధముగాదు. ఆలాగు చెప్పుట యుక్తమే యగుచున్నది. సుకృతముల నాచరించినవాని కనుకూలలోకము గలుగునను మాట గొడుగులు వేసికొన్నవారు వెళ్ళుచున్నారను మాట వలెనే జీవాత్మపరమాత్మలలో నొకరికి వర్తించినను ఉభయులను గలిపి చెప్పుట విరుద్ధముకాదు. వారలిద్దఱికి ఛాయాతపసామ్యముగూడ విరుద్ధముకాదు. ఛాయాతపములవలెనే

సంసారిత్వస్య, తస్మాద్విజ్ఞానాత్మపరమాత్మానౌ గుహాంప్రవిష్టౌ గృహ్యేతే. ।

కుతశ్చ విజ్ఞానాత్మపరమాత్మానౌ గృహ్యేతే. ?

## విశేషణాచ్చ (సూ. 12)

విశేషణం చ విజ్ఞానాత్మపరమాత్మనోరేవ సంభవతి 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చే' (కా 1-3-3) త్యాదినా పరేణ గ్రంథేన రథిరథాదిరూపకల్పనయా విజ్ఞానాత్మానం రథినం సంసారమోక్షయోర్గంతారం కల్పయతి. 'సోऽధ్వనః పార

---

వారిద్దఱు విలక్షణులని తాత్పర్యము. జీవుడు సంసారి. పరమాత్మ యసంసారి. సంసార మవిద్యాకృతము కనుక జీవునికి సిద్ధమగుచున్నది. అసంసారిత్వము పరమార్థము గనుక పరమాత్మ యసంసారి యగుచున్నాడు. అందువలన బుద్ధి గృహను ప్రవేశించినవారు జీవాత్మపరమాత్మలని తెలియుచున్నది.

ఇందుకు మఱియొక కారణమేమన!

---

విశేషలక్షణములు కాన్పించుటచేత :

తరువాత వాక్యమునందు వినబడుచున్న విశేషణములు జీవాత్మపరమాత్మలయందుమాత్రమే అన్వయించును. "శరీరము రథము; ఆత్మ రథము నధిష్ఠించువాడు" అను తరువాత గ్రంథమునందలి రథిరథాద్యూఢకల్పనముచే జీవాత్మ

మాప్నోతి తద్విష్ణోః పరమం పద ' (కఠ1-3-9) మితిచ పరమా త్మానం గంతవ్యం కల్పయతి. తథా 'తం దుర్దర్శం గూఢమను ప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణం, అధ్యాత్మయోగాధి గమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతీ'తి (కఠ1-2-12) పూర్వస్మిన్నపి గ్రంథే మంతృమంతవ్యత్వేనైతావేవ విశేషితౌ. ప్రకరణం చేదం పరమాత్మనః, 'బ్రహ్మవిదో వదంతీ'తి చ వక్తృవిశేషోపాదానం పరమాత్మపరిగ్రహే ఘటతే, తస్మాదిహ జీవపరమాత్మానావుచ్యేయాతాం. ఏష ఏవ న్యాయః 'ద్వా సు

---

జీవపరమాత్మలు విలక్షణ పదములచే వర్ణింపబడుచున్నారు.

రథికుడనియు, నతడు సంసారమోక్షములనుఁ బొందుచున్నాఁడనియు, "సుశిక్షితమగు బుద్ధియు నిగృహీతమగు మనస్సును గలవాడు సంసారసాగరము దటిజేరి యుత్కృష్టమగు వాసుదేవపదము నొందును", అని పరమాత్మ జీవునికి గంతవ్యస్థానమనియు దెలియుచున్నది. "ఆత్మదర్శనము కష్టసాధ్యము; ఆత్మ నిగూఢము, ప్రాకృతవిషయవికార విజ్ఞానముచే బుద్ధిగుహ యందుఁ గప్పబడియున్నది. విషమస్థానమునందున్నది. పురాణము. మనస్సును విషయములనుండి మరల్చి దానియందు సమాధానము చేయుటచే నయ్యది లభించును, ధీరుఁడగు వాఁడిట్టియాత్మను దెలిసికొని హర్షశోకముల వదలును" అని పూర్వగ్రంథమునందుగూడ పరమాత్మ మంతవ్యుడు, జీవాత్మ మననకర్త యను విశేషణములతో వీరిద్దఱినే శ్రుతి నిరూపించినది. ప్రకృత ప్రకరణము పరమాత్మవిషయము. బ్రహ్మ

పర్ణా సయుజా సఖాయా' (ముం3-1-1) విత్యేవమాదిష్వపి. తత్రాపి హ్యధ్యాత్మాధికారాన్న ప్రాకృతౌ సుపర్ణావుచ్యేతే. 'తయోరన్యః పిప్పలం స్వాద్వత్తీ'త్యదనలింగాద్విజ్ఞానాత్మా భవతి. 'అనశ్నన్నన్యో అభిచాకశీతీ' త్యనశనచేతనత్వాభ్యాం పరమాత్మా. అనంతరే చ మంత్రే తావేవ ద్రష్టృద్రష్టవ్యభావేన విశినష్టి— 'సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః, జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః' (ముం3-1-2) ఇతి. ।

---

విదు లట్టుపల్కుచున్నారని వక్తలను విశేషించి చెప్పుటచే పరమాత్మగ్రహణమే యిచట ఘటించును. అందువలన నిచట జీవపరమాత్మలనే చెప్పవలయును. "విడిపోనట్టియు సమాననామము గలిగినట్టియు రెండుపక్షులొకే వృక్షము నాశ్రయించియున్నవి" యను ముండకవాక్యమునందుగూడ నీవిధమునే యనుసరింపఁదగును. అచటి ప్రకరణ మధ్యాత్మ విషయము. పక్షిసామాన్యము నచట గ్రహింపవీలులేదు. "వానిలో నొకటి రుచికరమగు సంసారఫలము ననుభవించు చున్నది". యనెడి భోక్తృత్వము విజ్ఞానాత్మను సూచించు చున్నది. 'రెండవది యేమియు ననుభవింపకయే దూరమున నుండి చూచుచున్నది' యనుటచేఁ దెలియుచున్న చేతనత్వము, అనశనత్వము పరమాత్మను సూచించుచున్నవి. "జీవుఁ డీశ్వరునితోఁగూడ నొకే శరీరవృక్షము నాశ్రయించి యుండి దానితో నైక్యమును బొందినవాడై, యసమర్థుఁ డగుటవలన మోహమును జెంది దుఃఖించును, కాని యనే

అపర ఆహ—ద్వా సుపర్ణేతి. నేయమృగస్యాధికరణస్య సిద్ధాంతం భజతే, పైంగిరహస్యబ్రాహ్మణేనాన్యథా వ్యాఖ్యాతత్వాత్. 'తయోరన్యః పిప్పలం స్వాద్వత్తీ'తి సత్త్వం 'అనశ్నన్నన్యో అభిచాకశీతీత్యనశ్నన్నన్యోఽభిపశ్యతి జ్ఞస్తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞా'వితి, సత్త్వశబ్దో జీవః క్షేత్రజ్ఞశబ్దః పరమాత్మేతి

---

కములగు యోగకర్మమార్గములచేత ధ్యానింపఁబడుచున్న యీశ్వరుడు తానేయనియు, ప్రపంచమంతయు నతని మహిమయనియు దెలిసికొనినపు డతఁడు శోకరహితుఁడగును" అను తరువాతమంత్రమునందుగూడ జీవుడు చూచువాఁడనియు, పరమాత్మ చూడఁబడువాఁడనియు వీరిద్దఱే విశేషించి చెప్పబడుచున్నారు.

అ॥ ఇట్లీసూత్రమునకు భగవత్పాదులు స్వాభీప్సితమగు నర్థము ననుసరించి, ప్రస్తుతమగు పక్షిద్వయము జీవాత్మపరమాత్మలుగ నుదాహరించిరి. పైంగిరహస్యమను నొక పూర్వవ్యాఖ్యానము ననుసరించు మఱికొందఱి తాత్పర్యము నిచట బేర్కొని యద్దాని యసౌష్ఠవమును ప్రదర్శించుచున్నారు.

పైంగిరహస్యమతము :

మఱికొంతమంది వ్యాఖ్యాతలిట్లనుచున్నారు. "ద్వా సుపర్ణా" యను శ్రుతివాక్యము ప్రకృతాధికరణమునకు సిద్ధాంతవాక్యము కానేరదు. రుచ్యమగు సంసారఫల మనుభవించునది సత్త్వమనగా బుద్ధియనియు, దూరమునుంచి చూచునది క్షేత్రజ్ఞ

పైంగిరహస్య మతనిరాస

యదుచ్యతే, తన్న. సత్త్వక్షేత్రజ్ఞశబ్దయోరంతఃకరణశారీరపర తయా ప్రసిద్ధత్వాత్, తత్రైవ చ వ్యాఖ్యాతత్వాత్. 'తదేతత్స త్త్వం యేన స్వప్నం పశ్యత్యథ యోఽయం శారీర ఉపద్రష్టా స క్షేత్రజ్ఞస్తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ' ఇతి. నాప్యస్యాధికరణస్య పూర్వ పక్షభావం భజతే. న హ్యత్ర శారీరః క్షేత్రజ్ఞః కర్తృత్వభోక్తృ త్వాదినా సంసారధర్మేణోపేతో వివక్ష్యతే. కథం తర్హి? సర్వ సంసారధర్మాతీతో బ్రహ్మస్వభావశ్చైతన్యమాత్రస్వరూపః 'అన శ్నన్నన్యోఽభిచాకశీతి, అనశ్నన్నన్యో అభిపశ్యతి జ్ఞ' ఇతి వచ నాత్. 'తత్త్వమసి' 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (గీ. 13 - 2) త్యాదిశ్రుతిస్మృతిభ్యశ్చ. తావతా చ విద్యోపసంహారదర్శన

---

డనియు నిచట బుద్ధిజీవులిద్దఱు రెండుపక్షులుగ వర్ణింపఁ బడినారనియు పైంగిరహస్యమునం దీశ్రుతికి నర్థకల్పనము చేయబడినది. సత్త్వశబ్దము జీవునిని, క్షేత్రజ్ఞశబ్దము పర మాత్మనుఁ దెలియఁజేయుచున్నదనియు ననుట సరికాదు. సత్త్వశబ్ద మన్తఃకరణమునందును, క్షేత్రజ్ఞశబ్దము జీవుని యందును సుప్రసిద్ధములు. దేనిచే స్వప్నమును జూచు చున్నాడో అది బుద్ధి. శరీరమునందుండి చూచువాడు క్షేత్ర జ్ఞుడు. వీరిద్దఱు సత్త్వక్షేత్రజ్ఞులని పైంగిరహస్యమునందు వర్ణింపఁబడినది. అంతియకాదు. 'ద్వా సువర్ణా' యను శ్రుతి ప్రకృతాధికరణమునకుఁ బూర్వపక్షముగాఁగూడ నుండ వీలులేదు. కర్తృత్వము భోక్తృత్వము మొదలగు సంసార ధర్మములతోఁ గూడుకొనిన శారీరుఁడనగా జీవుని యీ శ్రుతి చెప్పుటలేదు. ఫలానుభవము లేక దూరమునుండి చూచు

మేవావకల్పతే 'తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ న హ వా ఏవం విది కించన రజ ఆధ్వంసత' ఇత్యాది. కథం పునరస్మిన్ పక్షే 'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తీ'తి సత్త్వమిత్యచేతనే సత్త్వే భోక్తృత్వ వచనమితి. ।

సిద్ధాంతీ : ఉచ్యతే. నేయం శ్రుతిరచేతనస్య భోక్తృత్వం వక్ష్యామీతి ప్రవృత్తా. కిం తర్హి? చేతనస్య సత్త్వస్య భోక్తృత్వం బ్రహ్మస్వభావతాం చ వక్ష్యామీతి. తదర్థం సుఖదుఃఖాదివిక్రియా వతి సత్త్వే భోక్తృత్వమధ్యారోపయతి.ఇదం హి కర్తృత్వం భోక్తృ త్వంచ సత్త్వక్షేత్రజ్ఞయోరితరేతరస్వభావావివేకకృతం కల్ప్యతే.

---

చున్నాడని రెండవవాఁడు జీవుఁడని చెప్పుటచే సర్వసంసార ధర్మముల కతీతుడై బ్రహ్మస్వభావుడు చైతన్యమాత్ర స్వరూపుడగు జ్ఞానమాత్రుడు చెప్పబడుచున్నాడు. "అది నీవేయగుచున్నావు" "నన్ను క్షేత్రజ్ఞునిగ దెలిసికొనుము" ఇత్యాది శ్రుతిస్మృతు లిచట సమన్వయము లగుచున్నవి. ఇట్టిరకల్పనచే నీ పక్షులు రెండును సత్త్వక్షేత్రజ్ఞులు, ఈ విషయమును గ్రహించినవానిని పాపమంటదు" అను తరు వాతి పైంగిరహస్యవాక్యము మంత్రార్థము యొక్క యుప సంహారవాక్యముతో పొసగగలదు.

సిద్ధాంతి సమాధానము : ఈ పక్షమునందు అచేతన మగు నన్తఃకరణము సంసారము నెట్లనుభవింపగలదు? శ్రుతియన్ననో సంసారానుభవమును చెప్పుచున్నది. అచేతన మగు బుద్ధి సంసార మనుభవించుచున్నదియని బోధించుట కీశ్రుతి ప్రవర్తించుటలేదు. చేతనుడగు జీవుడు బ్రహ్మస్వభా

పరమార్థతస్తు నాన్యతరస్యాపి సంభవతి, అచేతనత్వాత్సత్త్వస్య, అవిక్రియత్వాచ్చ క్షేత్రజ్ఞస్య. అవిద్యాపరికల్పితస్వభావత్వాచ్చ సత్త్వస్య సుతరాం న సంభవతి. తథా చ శ్రుతిః— 'యత్ర వాన్యదివస్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యే'దిత్యాదినా స్వప్నదృష్టహస్త్యాదివ్యవహారవదవిద్యావిషయ ఏవ కర్తృత్వాదివ్యవహారం దర్శయతి. 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యే' (బృ. 4-5-15) దిత్యాదినా చ వివేకినః కర్తృత్వాది వ్యవహారం నివారయతి. ।

---

వము గలవాఁడనియు సంసారఫలము ననుభవించుటలేదనియుఁ దెలియఁజేయుచున్నది. అందులోఁ బరము సుఖాదులచే వికారమును బొందిన బుద్ధికి భోక్తృత్వము నాపాదించుచున్నది. బుద్ధిక్షేత్రజ్ఞుల స్వభావమును గుర్తెఱింగి వానిని పరిత్యేకింప చేతకాకపోవుటవలన కర్తృత్వభోక్తృత్వములాపాదింపబడుచున్నవి. పరమార్థముచే నారెంటికి నా లక్షణములు లేవు. సత్త్వ మచేతనము; క్షేత్రజ్ఞుడు వికారరహితుడు; బుద్ధియొక్క స్వభావ మవిద్యాకల్పితమగుటచే బుద్ధికి కర్తృత్వభోక్తృత్వము లెంతమాత్రము సంభవముకాదు. 'మఱియొకటియున్నట్లుఁ గాన్పించునపుఁ డొకటి మఱియొకదానినిఁ జూచును." అనుశ్రుతి యీవాదమున కనుకూలమగుచున్నది. కర్తృత్వాది వ్యవహారమంతయు స్వప్నమునందు కాన్పించు గజాశ్వాదుల వంటిది యగుచున్నది. "సర్వమాత్మయె యగుచున్న స్థితియందు దేనిచే నెవనిని

జూచును” అను శ్రుతివలన నాత్మా నాత్మవివేకికిఁ గర్తృత్వాది వ్యవహారము లేదని తెలియుచున్నది.

---

అధికరణ సంక్షేపార్థము: "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే" యను కాఠక వాక్యమునం దుదాహరింపఁబడిన బుద్ధిగుహాప్రవిష్టులగు నిరువు రెవరు? బుద్ధిజీవులా? లేక జీవపరమాత్మలా?" యని విచారణావిషయము. లేక కేవలపరమాత్మయె చెప్పఁబడుచున్నాడా? తరువాత గ్రంథమున యీయిద్దరిని గూర్చియు నచికేతసుడు ప్రశ్నించియున్నాడు. కనుక సంశయము కలుగుచున్నది. బుద్ధిక్షేత్రజ్ఞు లిచటఁ జెప్పఁబడినట్లు పూర్వపక్షులు తలంచుచున్నారు. పరిచ్ఛిన్నమగు ప్రదేశప్రవేశము వారిద్దఱికే తగునుగాని సర్వవ్యాపియగు బ్రహ్మమునకుఁ దగదు. సుకృతికి లోకావాప్తి జీవవిషయ మగుచున్నది. బ్రహ్మముపచయాపచయములు లేనిది. జీవపరమాత్మ లీ వాక్యమునం దుదాహరింపబడుచున్నారని సిద్ధాంతము. వీరుభయులు చేతనులు సమానస్వభావులు ఋతపానము జీవలింగము, గుహాహితత్వము పరమాత్మలింగము వగుచున్నవి. సుకృతలోకవర్తిత్వము గొడుగులవారు బోవుచున్నారను ప్రయోగమును బోలియున్నది. శ్రుతి జీవాత్మ పరమాత్మలను గంతృగంతవ్యత్వము ద్రష్టృద్రష్టవ్యత్వము, అను భేదములచే విశేషించుచున్నది. గనుక జీవాత్మపరమాత్మలనే యీప్రకరణము బోధించుచున్నది. 12

---

# (4) అంతరాధికరణమ్ (సూ. 13-17)

## (4) అంతరాధికరణము

అ॥ పూర్వాధికరణమున "ఋతం పిబంతౌ" అను వాక్యమునందు జీవపరమాత్మ లాపాతముగ నవగతములగు చున్నారని గ్రహించి తదనుసారముగ గుహాప్రవేశాదిపదములు వ్యాఖ్యానింపఁబడినవి. అదేవిధముగ "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" అను ఛాందోగ్యవాక్యమునందు వినబడుచున్న దృశ్యతే యనుశబ్దమున కాపాతముగ దెలియుచున్న బాహ్యాదర్శనము నర్థముగ గ్రహించి యావాక్యమునందలి పురుషశబ్దమునకు ఛాయాపురుషుడు, విజ్ఞానాత్మ దేవతాత్మ మొదలగువారు చెప్పబడుచున్నారని ప్రతివాదుల వాదమునుఁ ద్రోసిపుచ్చి బ్రహ్మపరముగ సమన్వయము చేయుట కీయధికరణ మారంభమగుచున్నది.

విషయవాక్యము: య ఏషోఽక్షిణి పురుషోదృశ్యత ఏష ఆత్మేతి హోవాచైతదమృతమభయమేతద్బ్రహ్మేతి (ఛాం. 4-15-1).

సంశయము : ఇచటఁ జెప్పబడు పురుషుడు ఛాయాత్మ విజ్ఞానాత్మ దేవతాత్మలలో నొకరు కావచ్చునా లేక పరమాత్మయే యగుచున్నాడా.

పూర్వపక్షము : ఛాయాత్మాదులలో నెవరో యొకరగుచున్నారు. పరమాత్మ కాదు.

సిద్ధాంతము : పరమాత్మయె యగుచున్నాడు.

## అంతర ఉపపత్తేః (సూ. 13)

‹య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచైతదమృతమేతదభయమేతద్బ్రహ్మే'తి, 'తద్యద్యప్యస్మిన్ సర్పిర్వోదకంవా సించతి వర్త్మనీహ్యేవ గచ్ఛతీ' త్యాది శ్రూయతే. తత్ర సంశయః.కిమయం ప్రతిబింబాత్మాఽక్ష్యధికరణో నిర్దిశ్యతే, అథ విజ్ఞానాత్మా, ఉత దేవతాత్మా ఇంద్రియస్యాధిష్ఠాతా ఽథ భోక్తాఽథవేశ్వర ఇతి. ।

---

సమాలోకనీయ వాక్యములు-

ఛాందోగ్యం 4-15-1 బృహా 3-7-3 ఛాం 4-10-5 4-14-3, 4-15-1 ప్రశ్న 1-10 ఛాం 4-15-5. బృ 5-5-2.

---

అథ య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే యను శ్రుతియందు అంతరః = అక్షిమధ్యవర్తి యగు పురుషుడు పరమాత్మ యగుచున్నాడు. ఏలనన ఉపపత్తేః = అమృతత్వాదిధర్మములు బ్రహ్మమునం దుపపన్నములగుటవలన.

"నేత్రమునందుఁ గాన్పించు నీ పురుషుఁ డాత్మ, ఈతఁ డమృతుఁడు; అభయము; ఇది బ్రహ్మము. కంటిమీఁద ఘృతముగాని జలముగాని పడినపుడది యిరుప్రక్కల జారిపోవును." అని గురువగు సత్యకాముఁ డుపకోసలునికి జెప్పెను." అని "ఛాందోగ్యమునందు (4-15-1) వినవచ్చుచున్నది. ఇచట నుదాహరింపఁబడిన పురుషుఁ డెవ్వఁడు? చక్షుస్సానముగాఁగల ప్రతిబింబమా, జీవుడా, చక్షురింద్రియాధి

పూ. పక్షీ : కిం తావత్ప్రాప్తం? ఛాయాత్మా పురుషప్రతిబింబరూప ఇతి. కుతః? తస్య దృశ్యమానత్వప్రసిద్ధేః 'య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత' ఇతి చ ప్రసిద్ధవదుపదేశాత్. విజ్ఞానాత్మనో వా ఽయం నిర్దేశ ఇతి యుక్తం. స హి చక్షుషా రూపం పశ్యంశ్చక్షుషి సన్నిహితో భవతి, ఆత్మశబ్దశ్చాస్మిన్ పక్షే ఽనుకూలో భవతి. ఆదిత్యపురుషో వా చక్షుషోఽనుగ్రాహకః ప్రతీయతే 'రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠిత' (బృ. 5-5-2) ఇతి శ్రుతేః. అమృతత్వాదీనాం చ దేవతాత్మన్యపి కథంచిత్సంభవాత్, నేశ్వరః, స్థానవిశేష నిర్దేశాదితి. ।

---

దేవత యగునొక దేవతయా, లేక పరమేశ్వరుఁడాయను సందేహ మీవాక్యమునందు గలుగుచున్నది.

పూర్వపక్షి : (1) ఎదుటనున్న పురుషుని ప్రతిబింబాత్మకమగు ఛాయ యిచట పురుషశబ్దముచే నిర్దేశింపఁబడుచున్నది. ఏలనన నతఁడు సుప్రసిద్ధముగ కంటియందు కాన్పించుచున్నాఁడు. "కంటియందేపురుషుఁడు కాన్పించుచున్నాఁడో" యని యతని దృశ్యత్వమును శ్రుతి యుపదేశించుచున్నది. (2) లేక యీపురుషుఁడు జీవుఁడనుటగూడ యుక్తమేయగును. ఆతఁడు చక్షుస్సాహాయ్యముచే రూపములను జూచుచు చక్షుస్సునకు సన్నిహితముగ నున్నాఁడు. ఈపక్షమునకు [శ్రుతివాక్యమునందు వినబడుచున్న] ఆత్మశబ్దము సహాయ్యమగుచున్నది. లేక దర్శనక్రియకు సహాయుఁడగు నాదిత్యుఁడిచట పురుషశబ్దవాచ్యుఁడు కాఁదగును. "తన కిరణముల చే

పూర్వపక్షము

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే బ్రూమః. పరమేశ్వరఏవాక్షిణ్యభ్యంతరః పురుష ఇహోపదిష్ట ఇతి. కస్మాత్? ఉపపత్తేః. ఉపపద్యతే హి పరమేశ్వరే గుణజాతమిహోపదిశ్యమానం. ఆత్మత్వం తావన్ముఖ్యయా వృత్త్యా పరమేశ్వర ఉపపద్యతే 'స ఆత్మా తత్త్వమసీ' తి శ్రుతేః. అమృతత్వాభయత్వే చ తస్మిన్నసకృచ్ఛ్రూయేతే తథా పరమేశ్వరానురూపమేతదక్షిస్థానం. యథా హి పరమేశ్వరస్సర్వదోషైరలిప్తః అపహతపాప్మత్వశ్రవణాత్

---

దక్షిణాక్షమునందలి పురుషుని సూర్యుఁడధిష్ఠించి యున్నాఁడని బృహదారణ్యకశ్రుతి (5-5-2) పల్కుచున్నది. (3) విషయవాక్యమునం దుదాహరింపఁబడిన యమృతత్వాభయత్వాదిలక్షణములుగూడ నేదోవిధమున గౌణముగ వీరియందు సంభవించగలవు. (4) ప్రత్యేకముగ [చక్షుస్సని] యొకస్థానము నిర్దేశింపఁ బడుటచే ప్రకృత పురుషుఁడు బ్రహ్మము కానేరదు.

సిద్ధాంతి : ఇట్లు పూర్వపక్షము రాగా సిద్ధాంతి సమాధానము చెప్పుచున్నాఁడు. పరమేశ్వరుఁడే కంటియందు

ప్రకృతవాక్యలక్షణములు బ్రహ్మమునం దుపపన్నములు

గాన్పించు పురుషుఁడని ప్రకృతవాక్యమున నుపదేశింపబడుచున్నాఁడు. ఏలనన! (1) ఇచట చెప్పబడుచున్న అమృతత్వాభయత్వాది లక్షణములు బ్రహ్మమునందు సరిపోవుచున్నవి గనుక! ఆత్మత్వము ముఖ్యార్థముచేతనే పరమేశ్వరునియం దుపపన్నమగుచున్నది. "అదియే యాత్మ. ఆ యాత్మయే నీ వగుచున్నావని" (ఛాం 6-8-2) శ్వేతకేతున

తథాక్షిస్థానం సర్వలేపరహితముపదిష్టం 'తద్యద్యప్యస్మిన్సర్పిర్వోదకం వా సించతి వర్త్మనీ హ్యేవ గచ్ఛతీ'తి శ్రుతేః. సంయద్వామాదిగుణోపదేశశ్చ తస్మిన్నుపకల్పతే 'ఏతం సంయద్వామ ఇత్యాచక్షతే. ఏతం హి సర్వాణి వామాన్యభిసన్నయంతి ఏష ఉ ఏవ వామనీరేష హి సర్వాణి వామాని నయతి ఏష ఉఏవ భామినీరేష హి సర్వేషు లోకేషుభాతీ'తి (ఛాం.4-15, 2-3-4) చ. అత ఉపపత్తేరంతరః పరమేశ్వరః. ।

---

కుద్దాలకుఁ డుపదేశించెను. (2)అతనియం దమృతత్వాభయత్వములున్నట్లు శ్రుతులయందు తఱచు వినుచున్నాము. చక్షుస్సతనికి స్థానమనుట [సర్వగతుడగు] పరమేశ్వరుని కనురూపమగుచున్నది. పరమేశ్వరు(3)డే దోషముచేతను సంస్పృష్టుడుగాక సమస్తపాపములు తొలగినవాడని శ్రుతులయందు చెప్పినట్లే చక్షుస్థానముగూడ సమస్తదోషములచే నలిప్తమని ప్రకృతవాక్యము పలుకుచున్నది. "కంటియందు పడిన ఘృతముగాని నీరుగాని యిరుప్రక్కల జారిపోవునని యున్నది. (4)తరువాతవాక్యమున నుదాహరింపఁబడిన సంయద్వామత్వమనగా సర్వమంగళగుణాకరుఁడగుటచే నతని యుపాసించువాని కవి లభ్యమగుననియు, నతడే సర్వమంగళములను పొందించుననియు నతడు సర్వలోకములయందు బ్రకాశించుటచే గాంతిస్వరూపమనియుఁ దరువాత రెండుమూడునాల్గు వాక్యములలో జెప్పబడిన లక్షణములు పరమేశ్వరునియందు మాత్ర ముపపన్నమగుచున్నవి. ఇట్లు ప్రకృత వాక్యోదాహృతములగు లక్షణములన్నియుఁ బరమేశ్వరునియందు

## స్థానాదివ్యపదేశాచ్చ (సూ. 14)

కథం పునరాకాశవత్సర్వగతస్య బ్రహ్మణో ఽక్ష్యల్ప స్థానముపపద్యత ఇతి. అత్రోచ్యతే. భవేదేషానవక్లృప్తిః యద్యే తదేవైకం స్థానమస్య నిర్దిష్టం భవేత్. సంతి హ్యన్యాన్యపి పృథివ్యాదీని స్థానాన్యస్య నిర్దిష్టాని 'యః పృథివ్యాం తిష్ఠన్ని' త్యాదినా తేషు హి చక్షురపి నిర్దిష్టం 'యశ్చక్షుషి తిష్ఠన్ని'తి బృ. (3-1-3) స్థానాదివ్యపదేశా' దిత్యాదిగ్రహణేనైతద్దర్శయతి. న కేవలం

---

సంభవించుటచే నీవాక్యమునందలి పురుషుఁడు పరమేశ్వరుఁడే యగుచున్నాఁడు. 13

అ॥ సర్వవ్యాపియగు బ్రహ్మమునకు నేత్రమను నల్ప స్థానమును నిర్దేశించుట యుక్తముగాదను పూర్వపక్షి యాక్షేపణకు సమాధానము తరువాత సూత్రమున జెప్ప బడుచున్నది.

స్థాన ఆది వ్యపదేశాత్ చ = స్థానము, నామము, రూపము మొదలగునవి నిర్దేశింపబడుట వలన గూడ ప్రకృత పురుషుడు బ్రహ్మమే యగుచున్నాడు.

ఆకాశమువలె సర్వగతమగు బ్రహ్మమున కల్పమగు నేత్రము స్థానముగ నెట్లు చెప్పనగును? అను నాక్షేపణ కిట్లు జెప్పుచున్నాము.(5) బ్రహ్మమునకు నేత్ర మొక్కటియే స్థానముగఁ జెప్పినచో నయ్యది సంకుచితకల్పన మగును. కాని పృథివ్యాదీతర స్థానము లనేకము లద్దానికి జెప్పంబడినవి.

స్థానాదు లుపాసనకొరకు నిర్దేశింపబడినవి

స్థానమేవైకమనుచితం బ్రహ్మణో నిర్దిశ్యతే, కిం తర్హి? నామ రూపమిత్యేవంజాతీయకమప్యనామరూపస్య బ్రహ్మణోఽనుచితం నిర్దిశ్యమానం దృశ్యతే, 'తస్యోదితి నామ హిరణ్యశ్మశ్రుః' (ఛాం 1-6-5-6). రిత్యాది నిర్గుణమపి సద్బ్రహ్మ నామరూపగతైర్గుణైస్స గుణముపాసనార్థం తత్ర తత్రోపదిశ్యత ఇత్యేదప్యుక్తమేవ. సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపలబ్ధ్యర్థం స్థానవిశేషో న విరుధ్యతే సాలగ్రామ ఇవ విష్ణోరిత్యేతదప్యుక్తమేవ. ।

---

"ఏ యంతరాత్మ పృథివియందుండి" యని బృహదారణ్య (3-7-3) కవాక్యము గలదు. ఆ వాక్యమునందు ఎవడు చక్షుస్సునందుండి" యని చక్షుస్సుగూడ నద్దాని స్థానముగ నిర్దేశింపఁబడినది. 'స్థానము మొదలగునవి' యను సూత్రము నందలి పదములచే నీవిషయము ప్రదర్శింపఁబడుచున్నది. బ్రహ్మమున కనుచితముగ నొక్కస్థానము మాత్రము నిర్దేశింపఁబడి యుండలేదు. (6)మఱియేమన నామరూపరహితమగు బ్రహ్మమున కనుచితములగు నామరూపములుగూడ గల్పించి నట్లు గాన్పించుచున్నది. అద్దానికి ఉదితి, హిరణ్యశ్మశ్రు మొదలగు నామములు వినఁబడుచున్నవి. బ్రహ్మము నిర్గుణమైనను, ఉపాసనముకొఱకు, నామరూపాది గుణసముపేత మగు సగుణస్వరూప మచ్చటచ్చట నుపదేశింపఁబడుచున్నది యనుట యుక్తమేయగును. సర్వగతుఁడైనను, ఉపలబ్ధి కొఱకు బ్రహ్మమునకు స్థానవిశేషమును నిర్దేశించుట విరుద్ధము కాదు. విష్ణువునకు శాలగ్రామమువలె నిదియును యుక్తమే యగును. 14.

## సుఖవిశిష్టాభిధానాదేవ చ (సూ. 15)

అపిచ, నైవాత్ర వివదితవ్యం, కిం బ్రహ్మాస్మిన్ వాక్యేఽభిధీయతే నవేతి. సుఖవిశిష్టాభిధానాదేవ బ్రహ్మత్వం సిద్ధం. సుఖవిశిష్టం హి బ్రహ్మ యద్వాక్యోపక్రమే ప్రక్రాంతం 'ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మే'తి. తదేవేహాభిహితం, ప్రకృతపరిగ్రహస్య న్యాయ్యత్వాత్, 'ఆచార్యస్తు తే గతిం వక్తే'తి (ఛాం. 4-14-1) చ గతిమాత్రాభిధానత్వప్రతిజ్ఞానాత్.

---

అ॥ ప్రకృతవాక్యము ఛాందోగ్య 4-10-4 వాక్య ప్రకరణమునుబట్టిగూడ బ్రహ్మపరము కావలయునని తరువాత సూత్రమునం దుదాహరింపబడుచున్నది.

పూర్వప్రకరణమున బ్రహ్మము సుఖ విశిష్ట అభిధానాత్ ఏవ చ = సుఖముతో గూడుకొనియున్నట్లు చెప్పబడుటచేత గూడ బ్రకృత పురుషుఁడు బ్రహ్మ మగుచున్నాఁడు.

ప్రకృతవాక్యమునందు బ్రహ్మము చెప్పఁబడుచున్నదా లేదా యను వివాదము తగదు. (7) బ్రహ్మము సుఖవిశిష్టమనుట చేతనే వాక్యమునకు బ్రహ్మపరత్వము సిద్ధించుచున్నది. "ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మము" [అనగా సుఖగుణవిశిష్టమైన హార్దాకాశము బ్రహ్మము, హార్దాకాశ సంబంధముగల ప్రాణము గూడ బ్రహ్మము, ఆకాశప్రాణరూపములైన పరాపరబ్రహ్మము

పూర్వ వాక్యమునం దలి కంఖంపదములు బ్రహ్మపరములు

కథం పునర్వాక్యోపక్రమే సుఖవిశిష్టం బ్రహ్మ విజ్ఞాయత ఇతి. ఉచ్యతే. 'ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మే'త్యేత దగ్నీనాం వచనం శ్రుత్వోపకోసల ఉవాచ. 'విజానామీ'తి. తత్రేదం ప్రతివచనం. 'యద్వావ కం తదేవ ఖం యదేవ ఖం తదేవక'మితి (ఛాం. 4-10-5) తత్ర ఖంశబ్దో భూతాకాశే నిరూఢో లోకే. యది తస్య విశేషణత్వేన కంశబ్దస్సుఖవాచీ నోపాదీయేత, తథా సతి కేవలే భూతాకాశే బ్రహ్మశబ్దో నామాదిష్వివ ప్రతీకాభి

---

లీరూపమున సముచ్చయముచే ధ్యేయములనియు] ప్రకరణ ముపక్రమింపబడినది. ప్రకృతమును బరిగ్రహించుట న్యాయ మగుటవలన నాబ్రహ్మమే యిచటగూడ నభిహితమగుచున్నది. [త్రేతాగ్ను లుపకోసలునికి చేయఁదలచిన యుపదేశ మును బూర్తిచేసి యద్దానిఫలమును బొందు] మార్గమును మాత్రము నీగురువు నీకు దెలియజెప్పఁగలడని తెలియ జెప్పినవి. ప్రకరణారంభమునందు సుఖవిశిష్టమగు బ్రహ్మము నిర్దేశింపఁబడినదని యెట్లు తెలియుననంటిరేని చెప్పుచున్నాము. ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహ్మమని త్రేతాగ్నులు చెప్పిన వాక్యమును విని యుపకోసలుడు "ప్రాణము బ్రహ్మమన నాకు తెలిసినది. కాని అయ్యది సుఖము, ఆకాశమెట్లు కాగలదో నాకుఁ దెలియ లేదు". అని వారి నడిగెను. "ఏది సుఖమో యదియె యాకాశము; ఏది యాకాశమో యదియె సుఖము" అని వారు ప్రతివచనమును జెప్పిరి. లోకమునందు ఖం శబ్దము భూతాకాశమునందు నిరూఢము. ఈ 'ఖం' శబ్దమునకు సుఖ

ప్రియేణ ప్రియుక్త ఇతి ప్రతీతిస్స్యాత్. తథా కంశబ్దస్య విషయేంద్రియసంపర్కజనితే సామయే సుఖే ప్రసిద్ధత్వాత్. యది తస్య ఖంశబ్దో విశేషణత్వేన నోపాదీయేత లౌకికం సుఖం బ్రహ్మేతి ప్రతీతిస్స్యాత్. ఇతరేతరవిశేషితౌ తు కంఖంశబ్దౌ సుఖాత్మకం బ్రహ్మ గమయతః తత్ర ద్వితీయే బ్రహ్మశబ్దే౽నుపాదీయమానే కంఖంబ్రహ్మేత్యేవోచ్యమానే కంశబ్దస్య విశేషణత్వేనైవోపయుక్తత్వాత్సుఖస్య గుణస్యాధ్యేయత్వం స్యాత్, తన్మాభూదిత్యుభయోః కంఖంశబ్దయోః బ్రహ్మశబ్దశిరస్త్వం

---

మును బోధించు కం శబ్దమును విశేషణముగ గ్రహింపనిచో బ్రహ్మశబ్దము నితర నామములయందువలెనే ఆకాశమునందు బ్రీతికగా బ్రయుక్తమైనదని గ్రహింపవలసివచ్చును. అదే విధముగ కం శబ్దమునకుగూడ నింద్రియములు విషయములతో గూడినపుడు జనించునట్టియు, సాధనసహితమగుటచే దూషితమైనట్టియు నశ్వరమైనట్టియు సుఖము ప్రసిద్ధమగు నర్థము. ఆశబ్దమునకు ఖంశబ్దమును విశేషణముగ గ్రహింపనిచో, లౌకికసుఖము బ్రహ్మమని యర్థప్రతీతి గలుగును. కం ఖం శబ్దములు రెండు నొకదానికి మఱియొకటి విశేషణముగ గ్రహించుటచే నవి సుఖస్వరూపమగు బ్రహ్మమును దెలియ చేయుచున్నవి. 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' యను వాక్యమునందు, కం పదముతో బ్రహ్మపదము లేక 'కం ఖం బ్రహ్మ' అనియున్నచో కం శబ్దము లౌకికసుఖమును బోధించు నొకవిశేణషము మాత్రమగునుగాని సుఖము ధ్యానవిషయమని బోధింప నేరదు. ఇట్టి ముప్పు వాటిల్లకుండుటకై కం, ఖం శబ్దములు

'కం బ్రహ్మ ఖం బ్రహ్మే'తి ఇష్టం హి సుఖస్యాపిగుణస్య గుణి వద్ధ్యేయత్వం. తదేవం వాక్యోపక్రమే సుఖవిశిష్టం బ్రహ్మో పదిష్టం. ప్రత్యేకం చ గార్హపత్యాదయోఽగ్నయస్స్వం స్వం మహిమానముపదిశ్య 'ఏషా సోమ్య తే అస్మద్విద్యా ఆత్మ విద్యాచే' త్యుపసంహరంతః పూర్వత్ర బ్రహ్మ నిర్దిష్టమితి జ్ఞాప యంతి 'ఆచార్యస్తు తే గతిం వక్తే'తి చ గతిమాత్రాభిధానప్రతి జ్ఞానమర్థాంతరవివక్షాం వారయతి. 'యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంతే ఏవమేవంవిది పాపం కర్మ న శ్లిష్యత' (ఛాం4-14-3) ఇతి చాక్షిస్థానం పురుషం విజానతః పాప్మనానుపఘాతం

---

రెండింటితోను బ్రహ్మశబ్దమును జోడించి కం బ్రహ్మ ఖం బ్రహ్మ యని శ్రుతి బల్కుచున్నది. సుఖము గుణమైనను సుఖగుణము గలవానివలె దానిని ధ్యానించుట శ్రుతిసమ్మ తము. [కం బ్రహ్మ ఖం బ్రహ్మ యనుటచే, సుఖము, ఆకా శముగూడ బ్రహ్మలక్షణములని చెప్పబడుచున్నవి. కనుక బ్రహ్మలక్షణమగు సుఖ మాకాశమువలె సర్వవ్యాపకము కావలెనుగాని యల్పమగు లౌకికసుఖము గానేరదు. బ్రహ్మ శబ్దముతో జేరిన కంఖంశబ్దములు రెండు నొకదాని కొకటి విశేషణములైనపుడే యిట్టియర్థము లభించును]గార్హపత్యాద్య గ్నులు మూడును బ్రత్యేకముగ దమ తమ మహిమముల నుప దేశించి 'ఓయి సోమ్య! ఇదియే మా మా విద్యయు, నాత్మ విద్యయు నని తమ యుపదేశముల యుపసంహారముచే ప్రకరణా రంభమున యగ్నులు బ్రహ్మోపదేశము నుద్దేశించినట్లు దెలియ జేయుచున్నవి. "ఆచార్యుడు నీవిని పొందుటకు దగిన మార్గము

బ్రువన్నక్షిస్థానస్య పురుషస్య బ్రహ్మత్వం దర్శయతి. తస్మాత్ ప్రకృతస్యైవ బ్రహ్మణోఽక్షిస్థానతాం సంయద్వామత్వాదిగుణతాం చోక్త్వా అర్చిరాదికాం తద్విదో గతిం వక్ష్యామీత్యుపక్రమతే 'య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచేతి. ।

---

నుపదేశించును" అనుమాటలు అగ్ను లుపదేశించినదాని బొందుమార్గమును మాత్రము పలుకరించుచున్నవిగాని మరి యొక విషయము నాచార్యుడు చెప్పునను భావము నావా క్యము వారించుచున్నది. (8) 'తామర పత్రమును జలములంట నట్లె యిట్లు బ్రహ్మమును దెలిసినవానిని పాపకర్మ మంట దను, (ఛాం4-14-3) వాక్యము అక్షిస్థానమునందున్న పురు షుని గుర్తెఱింగిన వానిని పాప మంటదని చెప్పుచు, నక్షిస్థాన పురుషుడు బ్రహ్మమని తెలియజేయుచున్నది. అందువలన ప్రకృతవిషయమగు బ్రహ్మమును గూర్చియే వివరించుచూ నత డక్షిస్థానగతుఁడనియు సంయద్వామత్వాదిగుణములు గలవాఁడనియు చూపి యట్టిబ్రహ్మము నెఱింగినవా డర్చి రాదిమార్గమున బోవునని శ్రుతిచెప్పదలచి "నేత్రమునం దే పురుషుఁడు కాన్పించుచున్నాఁడో యాతఁడాత్మయని చెప్పుచున్నాడని బ్రహ్మప్రకరణము నుపక్రమించినది." 15

అ॥ అక్షిస్థానమందున్న పురుషు డీకారణముచేతగూడ పరమేశ్వరు డగుచున్నాడు.

## శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ (సూ. 16)

ఇతశ్చాక్షిస్థానః పురుషః పరమేశ్వరః ।

యస్మాచ్ఛ్రుతోపనిషత్కస్య శ్రుతరహస్యవిజ్ఞానస్య బ్రహ్మవిదో యా గతిర్దేవయానాఖ్యా ప్రసిద్ధా శ్రుతౌ—'అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మానమన్విష్యాదిత్యమభిజాయంతే ఏతద్వై ప్రాణానామాయతన మేతదమృతమభ

---

శ్రుత ఉపనిషత్క గతి అభిధానాత్ చ = ఉపనిషత్తులను శ్రవణము చేసినవారి గతిని చెప్పుటచేతనుగూడ ప్రకృతపురుషుడు బ్రహ్మ మగుచున్నాడు.

(9) ఉపనిషద్రహస్యమును వినిన బ్రహ్మవిదుడు బోవు దేవయానమార్గము శ్రుతియందు సుప్రసిద్ధముగ గాన్పించు చున్నది. 'జితేంద్రియత్వము బ్రహ్మచర్యము, వేదవిశ్వాసము, జ్ఞానము ఇవి గలాడు ప్రాణస్వరూపుఁడగు నాత్మ తానే యని దెలిసికొని యుత్తరాయణమార్గమున సూర్యలోకమునకుం బోవును. ఈలోకము సకల ప్రాణముల కాశ్రయము, వినాశరహితము, భయరహితము; ఇది శ్రేష్ఠమైన గతి. ఈ లోకముచేరి వెనుకకుఁ దిరిగి రాఁడు' అని ప్రశ్న శ్రుతి (1-10) పల్కుచున్నది. 'అగ్ని, జ్యోతిస్సు, శుక్లపక్షము, ఉత్తరాయణ మాఱుమాసములు-వీని యధిదేవతలుండు మార్గమున బోవునట్టి బ్రహ్మవిదులగు జనులు పరబ్రహ్మమును గ్రమముగాఁ బొందుదురు." అని గీత

ఉపనిషత్తుల వినినవాడు బ్రహ్మమును జేరును

యమేతత్పరాయణమేతస్మాన్న పునరావర్తంతే (ప్ర1-10) ఇతి. స్మృతావపి—"అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్, తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః"(గీ8-14) ఇతి. సైవేహాక్షిపురుషవిదోఽభిధీయమానా దృశ్యతే. 'అథ యదు చైవాస్మిఞ్ఛవ్యం కుర్వంతి యదు చ నార్చిషమేవాభిసంభవంతి' త్యుప్రక్రమ్య 'ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవస్స ఏనాన్బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతే' (ఛాం4-15-5) ఇతి తదిహ బ్రహ్మవిద్విషయయా ప్రసిద్ధయా గత్యాఽక్షిస్థానస్య బ్రహ్మత్వం నిశ్చీయతే. ।

---

(8-24) పల్కుచున్నది. ప్రకృతమగు నక్షిపురుషుని దెలిసికొనిన వానికింగూడ నీమార్గమే నిర్దేశింపబడినట్లు గాన్పించుచున్నది. "అక్షిపురుషుని దెలిసినవానికి శవకర్మ చేసినను చేయకపోయిన నతఁ డర్చిరాదిమార్గమునే బోవునని" యుపక్రమించి "అతడు సూర్యునినుండి చంద్రునికిఁ, చంద్రుని నుండి విద్యుత్తునకు బోవును. అచట నమానవుఁడగు నొక పురుషుఁ డితనిని బ్రహ్మను బొందించును. ఇది బ్రహ్మమును జేర్చు దేవమార్గము. ఈమార్గమున బ్రహ్మను జేరువారు తిరిగి మానవజన్మమునకు రారు" అని ఛాందోగ్యము (4-15-5) పల్కుచున్నది. అందువలన బ్రహ్మవిదునిగూర్చిన సుప్రసిద్ధమగు మార్గముచే నక్షిస్థానగతుఁడగు బురుషుడు బ్రహ్మమే యని నిశ్చయింపఁబడుచున్నది. 16

అ॥ అక్షిపురుషుడు పరబ్రహ్మమగుచున్నాడని స్వపక్షమును సిద్ధాంతముచేసి యాతడు ఛాయాత్మ విజ్ఞానాత్మ దేవ

## అనవస్థితేరసంభవాచ్చ నేతరః (సూ. 17)

యత్పునరుక్తం 'ఛాయాత్మా విజ్ఞానాత్మా దేవతాత్మా వా స్యాదక్షిస్థాన' ఇతి. అత్రోచ్యతే, న ఛాయాత్మాదిరితర ఇహ గ్రహణమర్హతి. కస్మాత్? అనవస్థితేః. న తావచ్ఛాయాత్మన శ్చక్షుషి నిత్యమవస్థానం సంభవతి. యదైవ హి కశ్చిత్పురుషశ్చ క్షురాసీదతి తదా చక్షుషి పురుషచ్ఛాయా దృశ్యతే; అపగతే తస్మి న్న దృశ్యతే, 'య ఏషోఽక్షిణి పురుష' ఇతి చ శ్రుతిః సన్నిధానా త్స్వచక్షుషి దృశ్యమానం పురుషముపాస్యత్వేనోపదిశతి. న చ స ఉపాసనాకాలే ఛాయాకారం కంచిత్పురుషం చక్షుస్సమీపే సన్ని

---

తాత్మలలో నొకరు కావచ్చునను పూర్వపక్షమునకు సమా ధానమును తరువాతసూత్రమున చెప్పుచున్నారు.

అనవస్థితేః = ప్రతిబింబరూపమగు ఛాయాత్మకు నిలకడ లేకుండుటచేతను అసంభవాత్ చ = అమృతత్వాది ధర్మము లచట సంభవము కాకుండుటచేతను ఛాయాత్మ అక్షి పురుషుడు గా నేరడు.

అక్షిస్థానపురుషుడు ఛాయాత్మ విజ్ఞానాత్మ దేవతాత్మ లలో నొకరుకావచ్చునని ప్రతివాది చెప్పినదాని కిటుల చెప్పదగును. ఛాయాత్మ మొదలగు నితరుల నిచట గ్రహింపదగదు. ఏల నన! (10) నిలకడ లేదుగనుక.

ఛాయాత్మ అక్షిపురుషుడు కాడనుటకు కారణములు.

ఛాయాత్మకు చక్షుస్సునం దెల్లపుడును నిలకడ సంభవము కాదు." ఒకానొకపురుషుఁడు చక్షుస్సున కాసన్నముగానున్న

ధాస్యోపాస్త ఇతి యుక్తం కల్పయితుం. 'అస్యైవ శరీరస్య నాశమన్వేష నశ్యతీ'తి (ఛాం 8-9-1) శ్రుతిశ్ఛాయాత్మనో ఽన వస్థితత్వం దర్శయతి. అసంభవాచ్చ. తస్మిన్నమృతత్వాదీనాం గుణానాం న ఛాయాత్మని ప్రతీతిః. తథా విజ్ఞానాత్మనో ఽపి సాధారణే కృత్స్నశరీరేంద్రియసంబంధే సతి న చక్షుష్యేవావస్థితత్వం శక్యం వక్తుం. బ్రహ్మణస్తు సర్వవ్యాపినో ఽపి దృష్ట ఉపలబ్ధ్యర్థో హృదయాదిదేశవిశేషసంబంధః. సమానశ్చ విజ్ఞానాత్మన్యప్య మృతత్వాదీనాం గుణానామసంభవః. యద్యపి విజ్ఞానాత్మా పరమాత్మనో ఽనన్య ఏవ తథాప్యవిద్యాకామకర్మకృతం తస్మిన్మర్త్య

---

పుడతని ఛాయ కంటియందు గాన్పించును. అతఁడు లేనపు డాఛాయ కాన్పింపదు. కంటియందున్న 'యే యీపురుషుఁడు గలఁడో' యను శ్రుతివాక్యము, సన్నిధానమువలనఁ గంటియందు 'గాన్పించుచున్న పురుషుఁ డుపాస్యుఁడుగ నుపదేశించుచున్నది. (11)ఉపాసనాకాలమునందు ఛాయ నిచ్చునటిదొక పురుషుని నేత్రసమీపము నందుంచుకొని యుపాసనము చేయునని కల్పించుట యుక్తముకాదు, 'ఈశరీరము నశించుచుండగ దాని ననుసరించి ఛాయాపురుషుఁడు నశించుచున్నాఁడని ఛాందోగ్యశ్రుతి (8-9-1) వలన ఛాయాత్మకు నిలకడలేనట్లు తెలియుచున్నది. అసంభవమగుటవలనఁగూడ నక్షిపురుషుఁడు ఛాయాత్మ గానేరఁడు"(12)అమృతత్వాదిగుణములు ఛాయాత్మయందున్నట్లు ప్రతీతిలేదు. (13) అదేవిధముగ విజ్ఞానాత్మ అనగా జీవునకు శరీరమంతటితోడ నింద్రియములతోడ సంబంధము సాధారణమగుచుండగ, నొకచక్షుస్సునందు

త్వమధ్యారోపితం భయం చేత్యమృతత్వాభయత్వే నోపపద్యేతే. సంయద్వామత్వాదయశ్చైతస్మిన్నైశ్వర్యాదనుపపన్నా ఏవ. దేవతాత్మనస్తు 'రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠిత' ఇతి శ్రుతేః. యద్యపి చక్షుష్యవస్థానం స్యాత్తథాప్యాత్మత్వం తావన్న సంభవతి, పరాగ్రూపత్వాత్. అమృతత్వాదయోఽపి న సంభవంతి, ఉత్పత్తి ప్రళయశ్రవణాత్. అమృతత్వమపి దేవతానాం చిరకాలావస్థా నాపేక్షం. ఐశ్వర్యమపి పరమేశ్వరాయత్తం న స్వాభావికం, 'భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్ని శ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ' ( తై 2-8 ) ఇతి మంత్ర

---

మాత్ర ముండునని పల్కుట శక్యముకాదు. బ్రహ్మము న్ననో, సర్వవ్యాపియయినను, నుపలబ్ధికొఱకు హార్దాకాశము మొదలగు స్థలవిశేషములతో నద్దానికిఁగల సంబంధము కాన్పించుచున్నది.(14)అమృతత్వాదిగుణముల యసంభవము ఛాయాత్మవిజ్ఞానాత్మలకు సమానమే. విజ్ఞానాత్మ పరమాత్మ కంటె నన్యుఁడుగాఁడు. కాని యవిద్యాకామకర్మలచే నతని యందు మర్త్యత్వము, భయము ఆరోపింపఁబడుచున్నవి. కనుక విజ్ఞానాత్మయం దమృతత్వము అభయత్వము సంభ వింపవు.(15)ఐశ్వర్యవిహీనుడగు విజ్ఞానాత్మయందు సంయద్వా మత్వాది గుణము లుపపన్నములుగావు. "తన కిరణములచేత సూర్యుఁడు నేత్రములయం దుండును" అను ప్రమాణవాక్య ముచేత సూర్యదేవతాత్మ చక్షుస్సునం దుండవచ్చునుగాక. అంతమాత్రముచే నతనికి యాత్మత్వము సిద్ధింపదు. అతఁడు బాహ్యరూపము గలవాఁడు.(16)దేవతలకుత్పత్తిప్రళయములు

వర్ణాత్. తస్మాత్పరమేశ్వర ఏవాక్షిస్థానః ప్రత్యేతవ్యః. అస్మింశ్చ పక్షే దృశ్యత ఇతి ప్రసిద్ధవదుపాదానం శాస్త్రాద్యపేక్షం విద్వద్విషయం ప్రరోచనార్థమితి. వ్యాఖ్యేయమ్. ।

---

వినబడుచుండుటవలన నమృతత్వముగూడ వారలయందు సిద్ధింపదు. దేవతలు చిరకాలము జీవించువారలగుటంజేసి యమృతులని యితరుల నపేక్షించి వ్యవహరింపబడుచున్నారు. (17) దేవతల యైశ్వర్యముగూడ పరమేశ్వరు నాధారము చేసికొనియున్నది. కాని వారల కది స్వభావసిద్ధమైనది కాదు. "ఈతని భయమువలన వాయువు వీచుచున్నది. సూర్యు డుదయించుచున్నాడు; అగ్ని చంద్రుడు, అయిదవవాడగు మృత్యువుగూడ నతని భయమువలననే స్వస్వవ్యాపారముల నిర్వహించుచున్నారు" యని తైత్తరీయశ్రుతి (2-8) పలుకుచున్నది. అందువలన నీయక్షిస్థానపురుషుడు పరమేశ్వరుఁడనియె తెలియనగును. విషయవాక్యమునందు వినుపించుచున్న దృశ్యమే బాహ్యనేత్రమునకు కాన్పించుచున్నదియను పదముచే శాస్త్రోపదిష్టమగు నుపాసకుల యనుభవము నుద్బోధము చేయుచున్నది. అనుభవ మద్దాని యర్థమని వ్యాఖ్యానింప తగును.

## (5) అంతర్యామ్యధికరణము (సూ. 18-20)

అధికరణ సంక్షేపార్థము : య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే యనుచోటి పురుషశబ్దము ఛాయాత్మాదులలో నొకరినిఁ జెప్పుచున్నది. కంటియందు ఛాయాత్మ స్పష్టముగ బాహ్యమునకుఁ గాన్పించుచున్నాడు. అమృతత్వాదిలక్షణము లేదో విధముగ వానియందు సమన్వయమగుచున్నవి. ప్రత్యేకము చక్షుఃస్థాన మాపురుషునికిఁ జెప్పఁబడుటచే నతడు సర్వవ్యాపి యగు పురుషుడు గానేరడు. అని పూర్వపక్షము. ఆ పురుషుడు పరమాత్మయని సిద్ధాంతము. విషయవాక్యమునం దుదాహరింపబడిన అమృతత్వాది గుణజాతమంతయు నతని యందు ముఖ్యార్థముగ సంభవించుచున్నది, ఉపాసనము కొఱకు సర్వవ్యాపియగు పరమేశ్వరుని కక్షిస్థానము ప్రత్యేకముగ నెత్తుకొనఁబడినది. విషయవాక్యప్రకరణమునం దుదాహరింపబడిన యలౌకికసుఖము పరమాత్మయందుమాత్రమే సంభవము. అక్షిపురుషుని యుపాసనమునకు బ్రహ్మలోకగమనము ఫలముగఁ జెప్పఁబడుచున్నది. ఛాయాత్మాదులకు నిలకడలేదు. అమృతత్వాదులు వారియం దసంభవము.

---

### (5) అంతర్యామ్యధికరణము

అ॥ పూర్వాధికరణమునందలి యక్షిస్థానపురుషశబ్దార్థ విచారణమునందు, ఉదాహరణరూపమున పృథివ్యాదులు పరమేశ్వరునికి సంభవింపగలవని స్థాననిర్దేశవ్యపదేశసూత్రమున (1-2-14) నుదాహరింపబడినది. ఆసూత్రమునం

# అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్ (సూ. 18)

'య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి భూతాని యోఽంతరో యమయతీ'త్యుపక్రమ్య శ్రూయతే 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృత' (బృ 3-5-1) ఇత్యాది. అత్ర 'అధిదైవతమధి

---

దుదాహరింపబడిన వ్యక్తి పరమేశ్వరుడు గానేరడుగనుక నట్టి యుదాహరణము సరికాదని యాక్షేపణ రాగా నందుకు సమాధానము రాబోవు నధికరణమున నివ్వబడుచున్నది.

విషయవాక్యము : "య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతాన్యన్తరో యమయతి" మొదలగు అంతర్యామ్యధికరణమంతయు (బృ 3-8).

సంశయము : ఇచట వినబడు నంతర్యామి యనువాడొక దేవతయా లేక నొక యోగియా, పరమాత్మయా, లేక ప్రధానమా?

పూర్వపక్షము: దేవతగాని యొకయోగిగాని లేక ప్రధానము గాని కావచ్చును. పరమేశ్వరుడు కానేరడు.

సిద్ధాంతము : పరమేశ్వరుడే యంతర్యామి.

సమాలోచనీయములగు శ్రుతివాక్యములు –

బృహదారణ్యకం 3-8, 3-7-3, 3-9-10.

లోకమధివేదమధియజ్ఞమధిభూతమధ్యాత్మం చ కశ్చిదంతరవస్థితో యమయితాంతర్యామీ’ తి శ్రూయతే. స కిమధిదైవతాద్యభిమానీ దేవతాత్మా కశ్చిత్, కిం, వా ప్రాప్తాణిమాద్యైశ్వర్యః కశ్చిద్యోగీ, కిం వా పరమాత్మా కిం వార్థాంతరం కించిదిత్యపూర్వసంజ్ఞాదర్శనాత్ సంశయః ।

---

అధిదైవాదిషు = అధిలోక, అధిదైవ, అధిభూతముల యందు వినబడుచున్న అంతర్యామీ = అంతర్యామి పురుషుడు బ్రహ్మయె యగుచున్నాడు. తత్ ధర్మ వ్యపదేశాత్ = అచట పరమాత్మ ధర్మములే వినవచ్చుచుండుటవలన.

ఈలోకమును పరలోకమును సమస్తభూతముల నంతరుఁడై యెవరు నియమించుచున్నాఁడో యని ప్రారంభించి “ఎవఁడు పృథివియందుండి, పృథివికంటె వేఱుగ నున్నాఁడో, యెవనిని పృథివి దెలిసికొనలేదో యెవనికి పృథివి శరీరమో, యెవడు పృథివిలో నుండి నియమించుచున్నాఁడో యీ అంతర్యామి యమృతుడు” అని పలుకు శ్రుతివాక్యము (బృ. 3-7-3-2) వినవచ్చుచున్నది. ఈ వాక్యములయందు అధిదైవతము, అధిలోకము, అధివేదము, అధియజ్ఞము, అధిభూతము ఆధ్యాత్మమునగు నొకఁ డంతర్యామియయి నియమనము చేయుచున్నట్లు వినుపించుచున్నది.

ఇచట వినబడు వ్యక్తి యధిదైవాద్యభిమానియగు నొక దేవతాస్వరూపమా లేక యణిమాదిసిద్ధులను బొందిన యొక యోగిపురుషుడా లేక పరమాత్మయా లేక మఱియొక

పూర్వపక్షీ : కిం తావన్నః ప్రతిభాతి? సంజ్ఞాయా అప్రసిద్ధత్వాత్సంజ్ఞినాప్యప్రసిద్ధేనార్థాంతరేణ కేనచిద్భవితవ్య మితి, అథవా నానిరూపితరూపమర్థాంతరం కించిదపి శక్యమస్తీత్యభ్యుపగంతుం. అంతర్యామిశబ్దశ్చాంతర్యమనయోగేన ప్రవృత్తో నాత్యంతమప్రసిద్ధః. తస్మాత్పృథివాద్యభిమానీ కశ్చిద్దేవోఽంతర్యామీ స్యాత్. తథా చ శ్రూయతే—'పృథివ్యేవ యస్యాయతనం అగ్నిర్లోకో మనోజ్యోతి' (బృ3-9-10) రిత్యాది. స చకార్యకరణవత్త్వాత్పృథివ్యాదీనంతస్తిష్ఠన్ యమయతీతి యుక్తం దేవతాత్మనో యమయితృత్వం. యోగినో వా కస్యచిత్సిద్ధస్య సర్వాను

---

జీవుడుగాని ప్రధానముగాని యగునా యని యచట కాన్పించు నపూర్వములగు చిహ్నములచే సంశయము కలుగుచున్నది.

పూర్వపక్షము : మా కేమితోచుచున్నదన నంతర్యామి యనునది యొక సంజ్ఞాపదము. అది యప్రసిద్ధము. కనుక నాసంజ్ఞాపదముచేఁ దెలియఁజేయబడు సంజ్ఞిగూడ నేదోయొక యప్రసిద్ధమగు మఱియొక విషయము కావలెను. అట్లుకానిచో, స్వరూపనిర్ధారణము కానపుడు మఱియొక వస్తువున్నట్లు నిశ్చయించుట శక్యముకాదు కనుకను, అంతర్యామిశబ్ద మంతర్నియమనముతో సంబద్ధమగుటచేఁ గేవల మప్రసిద్ధముకాదు కనుకను, బృథివ్యాద్యభిమాని యగు నొక దేవత యంతర్యామి కాఁదగును. 'ఎవనికి పృథివి యాయతనమో, యగ్ని చక్షుస్సో, మనస్సు జ్యోతిస్సో" (బృ3-9-10) యని వినబడుచున్నది. ఇట్టిదేవత కార్యసాధనములు గలిగి యుండుటచేత లోపలనేయుండి పృథివ్యాదులను నియమింపఁ

ప్రవేశేన యమయితృత్వం స్యాత్. న తు పరమాత్మా ప్రతీయతే అకార్యకరణత్వాదితి. ।

సిద్ధాంతీ: ఏవం ప్రాప్త ఇదముచ్యతే. యోఽంతర్యామ్యధిదైవాదిషు శ్రూయతే స పరమాత్మైవ స్యాన్నాన్య ఇతి. కుతః? తద్ధర్మస్య వ్యపదేశాత్, తస్య హి పరమాత్మనో ధర్మా ఇహ నిర్దిశ్యమానా దృశ్యంతే. పృథివ్యాది తావదధిదైవాదిభేదభిన్నం సమస్తం వికారజాతమంతస్తిష్ఠన్యమయతీతి పరమాత్మనో యమయితృత్వం ధర్మ ఉపపద్యతే. సర్వవికారకారణత్వే సతి సర్వశక్త్యుపపత్తేః. 'ఏష త ఆత్మాంతర్యామ్యమృత' ఇతి చాత్మత్వామృతత్వే ముఖ్యే పరమాత్మన ఉపపద్యేతే. 'యం పృథివీ న వేదే'తి చ పృథివీ

---

గలుగుటవలన దేవతాత్మకు నియమనకర్తృత్వము యుక్తమగుచున్నది. కార్యసాధనములు లేనివాడగుటంజేసి పరమాత్మ యిచటఁ దోఁచుట లేదు.

సిద్ధాంతి : ఇట్టిపూర్వపక్షము రాగా సమాధానము జెప్పుచున్నాము, అధిదైవాదులయందు వినబడుచున్న అంతర్యామి పరమాత్మగాని యన్యము కాదు. ఏలనన! అతని ధర్మములు వక్కాణింపఁబడుటవలన. ఆ పరమాత్మధర్మములే యిచట నిర్దేశింపఁబడుచున్నవి. అధిదైవాది భేదముచే విభిన్నమగుచున్న పృథివ్యాది వికారజాతమంతను లోపలనుండి నియమించు యమయితృత్వధర్మము పరమాత్మయందుపపన్నమగుచున్నది. అతడు సర్వవికారములకు కారణమగుచుండ సర్వశక్తిమత్త్వముగూడ నతనికి నుపపన్నము కావలెను. 'ఇతడే

నియంతృత్వము పరమాత్మధర్మము

దేవతాయా అవిజ్ఞేయమంతర్యామిణం బ్రువన్ దేవతాత్మనోఽన్య మంతర్యామిణం దర్శయతి 'పృథివీ దేవతా హ్యాహమస్మి పృథివీ త్యాత్మానం విజానీయాత్' తథా 'అదృష్టోఽశ్రుత' ఇత్యాదివ్య పదేశో రూపాదివిహీనత్వాత్పరమాత్మన ఉపపద్యతే. ।

యత్త్వకార్యకరణస్య పరమాత్మనో యమయితృత్వం నోపపద్యత ఇతి, నైష దోషః, యాన్నియచ్ఛతి తత్కార్యకరణై రేవ తస్య కార్యకరణవత్త్వోపపత్తేః. ।

---

నీ యాత్మ అతడన్తర్యామి అమృతుడు ' అనువాక్యమునందలి ఆత్మత్వామృతత్వములు రెండును పరమాత్మయందు ముఖ్యా ర్థమున సంపన్నములగుచున్నవి. "యం పృథివీ న వేద" ఎవరిని పృథివి తెలిసికొనలేదో యనువాక్యముచే పృథివీదేవ తను నియమించు నంతర్యామి తెలియరాకుండుటయే గాక నతడు పృథివీదేవతకంటె నన్యుడనిగూడ దెలియుచున్నది. తాను పృథివీస్వరూపమని పృథివీదేవతకు తెలుసును. 'కంటికి కాన్పించనివాడు, చెవికి వినుపింపనివాడు' అను లక్షణములు గూడ రూపాదివిహీనమగు పరమాత్మ కుపపన్నములగు చున్నవి.

కార్యకరణములు లేమింజేసి పరమాత్మకు యమయితృత్వ ముపపన్నముకాదను నది యొక దోషముకాదు. ఎవరిని నాతడు నియమనము చేయునో వారలయొక్క కార్యసాధన ములచేతనే యతనికి కార్యసాధనములు సమకూరుచున్నవి. [నియమనము చేయువానికి నియమముగ శరీరముండ నవసర ము లేదు. జనసామాన్యమునకు చేతనసాన్నిధ్యముచే నియమన

పూ.పక్షీ: తస్యాప్యన్యో నియంతేత్యనవస్థా దోషశ్చ ।

సిద్ధాంతీ : న సంభవతి భేదాభావాత్. భేదే హి సత్య నవస్థాదోషోపపత్తిః. తస్మాత్పరమాత్మైవాంతర్యామీ. ।

---

వ్యాపారము అందుకు దగిన సామర్థ్యముగూడ కలుగుచున్నది. అచింత్యమగు మాయాశక్తిగల చిదాత్మకు శరీరములేక నే యివి గల్గుచున్నవి.]

పూర్వపక్షి : జీవునికంటె భిన్నుడగు నంతర్యామి యొకడున్నాడని మీరందురేని యతనిని నియమించువాఁడు మఱియొకఁడు, అతనికి మఱియొకడు, ఇట్లు అనవస్థాదోషము గలుగును.

సిద్ధాంతి : ఇట్టి యనవస్థ సంభవము కాదు. భేదము లేకుండుటవలన. జీవునికిని అంతర్యామినికిని భేదమున్నచో ననవస్థ సంభవించును. [లోకసిద్ధమైన నియంతయగు జీవుడే పరమాత్మయగుచున్నాడు. ఉపాధిచేత వారివురకు భేదము కల్పింపఁబడుచున్నది. పరమాత్మయొక్క నిరంకుశనియంతృత్వము సర్వశ్రుతిసమ్మతము] కనుక ప్రకృతమగు నంతర్యామి పరమాత్మ యగుచున్నాడు. (18)

అ॥ సాంఖ్యస్మృత్యుక్తమగు ప్రధానమంతర్యామి కారాదాయను పూర్వపక్షమునకు తరువాత సూత్రమునందు సమాధానము చెప్పబడుచున్నది.

## న చ స్మార్తమతద్ధర్మాభిలాపాత్ (సూ. 19)

పూ.పక్షీ: స్యాదేతదదృష్టత్వాదయో ధర్మాస్సాంఖ్యస్మృతికల్పితస్య ప్రధానస్యాప్యుపపద్యంతే రూపాదిహీనతయా తస్య తైరభ్యుపగమాత్. "అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వత" (మను ! 5) ఇతి హి స్మరంతి. తస్యాపి నియంతృత్వం సర్వవికారకారణత్వాదుపపద్యతే. తస్మాత్ప్రధానమంతర్యామిశబ్దం స్యాత్. ।

---

చ = మఱియు స్మార్తం = సాంఖ్యస్మృతి సిద్ధమగు ప్రధానము న = అంతర్యామి కానేరదు. ఏలనన అతత్ ధర్మ అభిలాపాత్ = ప్రధానమునకు సంబంధింపని ధర్మములు చెప్పబడుటవలన.

సాంఖ్య పూర్వపక్షి : ఈ విషయ మట్లుండు గాక ! సాంఖ్యస్మృతిపరికల్పితమగు ప్రధానమునం దదృష్టత్వాది ధర్మము లుపపన్నములగుచున్నవి. ప్రధానమునకు రూపము లేదని యంగీకరింపబడుచున్నది. "సంపూర్ణముగ నిద్రిలో నున్నవానివలె ప్రధాన మూహించుటకును, తెలిసికొనుట కును శక్యముకానిది" యని సాంఖ్యస్మృతి పలుకుచున్నది. సర్వ వికారములకు ప్రధానము కారణమగుచున్నది [సత్వరజస్తమస్సులను మూడుగుణములయొక్క విషమావస్థవలన వికార జాతమంతయు ననఁగా సృష్టియంతయు గల్గుచున్నది. వికారకారణమగుటచే] నద్దానికి నియంతృత్వముగూడ సంభవించుచున్నది. కనుక ప్రధాన మంతర్యామి శబ్దబోధ్యము కాఁగలదు.

సిద్ధాంతీ : 'ఈక్షతేర్నాశబ్ద' (సూ. 1-1-5) మిత్యత్ర నిరాకృతమపి సత్ప్రధానమిహాదృష్టత్వాదివ్యపదేశసంభవేన పునరాశంక్యతే. తత ఉత్తరముచ్యతే న చ స్మార్తం ప్రధానమంతర్యామిశబ్దం భవితుమర్హతి. కస్మాత్? అతద్ధర్మాభిలాపాత్. యద్యప్యదృష్టత్వాదివ్యపదేశః ప్రధానస్య సంభవతి, తథాపి న ద్రష్టృత్వాదివ్యపదేశస్సంభవతి ప్రధానస్యాచేతనత్వేన తైరభ్యుపగమాత్. 'అదృష్టో ద్రష్టాఽశ్రుత శ్శ్రోతాఽమతో మంతాఽవిజ్ఞాతే' (బృ. 3-5-23)తి హి వాక్యశేష ఇహ భవతి. ఆత్మత్వమపి న ప్రధానస్యోపపద్యతే. ।

---

సిద్ధాంతి: "ఈక్షతేర్నాశబ్దం" (బ్ర సూ. 1-1-5) అను సూత్రమునం దీప్రధానవాదము నిరాకృతమైనను అదృష్టత్వము మొదలగుధర్మము లిచట ప్రసక్తములగుటచే దిరిగి యీవాదము శంకింపబడుచున్నది. అందుకు ప్రతివచనము చెప్పుచున్నాము. సాంఖ్యస్మృత్యుక్తమగు ప్రధానము నంతర్యామిశబ్దముచే నిచట చెప్పఁదగదు. ఏలనన! దానికి చెందతగని ధర్మము లిచట పేర్కొనబడుచుండుటవలన! అదృష్టత్వాది ధర్మములు ప్రధానమునందుగూడ సంభవించుచున్నవి. అయినను, ద్రష్టృత్వాది చేతనధర్మము లచట కానరావు. ప్రధాన మచేతనమని సాంఖ్యు లంగీకరించుచున్నారు "చూడఁబడడు, చూచును; వినబడఁడు, వినును; మననము చేయబడడఁడు, మననము చేయును; తెలియఁబడడు తెలిసికొనును, అనువాక్యము (బృ3-7-25) ప్రకృతప్రకరణము

(ఆత్మత్వధర్మము ప్రధానమునకు లేదు.)

పూ.పక్షీ: యది ప్రధానమాత్మత్వ ద్రష్టృత్వాద్యసంభవాన్నాంతర్యామ్యభ్యుపగమ్యతే శారీర స్తర్హ్యంతర్యామీ భవతు. శారీరో హి చేతనత్వాద్ద్రష్టా శ్రోతా మంతా విజ్ఞాతా చ భవత్యాత్మా చ ప్రత్యక్త్వాత్, అమృతశ్చ ధర్మాధర్మఫలోపభోగోపపత్తేః. అదృష్టత్వాదయశ్చ ధర్మాశ్శారీరే సుప్రసిద్ధాః దర్శనాది క్రియాయాః కర్తరి ప్రవృత్తివిరోధాత్. 'న దృష్టేర్ద్రష్టారం పశ్యే'దిత్యాది (బృ. 3-4-2) శ్రుతిభ్యశ్చ. తస్య చ కార్యకరణసంఘాతమంతర్యమయితుం

---

యొక్క యంతిమభాగమున కాన్పించుచున్నది. [జడమగుటచే] ప్రధానమున కాత్మత్వధర్మ ముండనేరదు.

పూ.పక్షి: ఆత్మత్వము ద్రష్టృత్వము మొదలగు ధర్మములు సంభవము కావుగనుక ప్రధాన మంతర్యామి కాకపోవచ్చును గాక! శరీరమునందుండు జీవుఁడంతర్యామి కావచ్చును. అతడు చేతనుడగుటవలన ద్రష్ట శ్రోత మన్త విజ్ఞాత గూడ కావచ్చును. జ్ఞానరూపుఁడగుటచే నాత్మ గూడ నగుచున్నాడు. ధర్మాధర్మఫలముల ననుభవించువాఁడు గనుక నత డమృతు డనదగును. [మరణశీలుడు జన్మాంతరకృతములగు పుణ్యాపాపఫలముల మఱియొకజన్మమున ననుభవింపలేఁడు. అతడే మఱియొకశరీరమును బొంది కర్మఫలము ననుభవించును. కనుక నమృతుడగుచున్నాడు] జీవుని యదృష్టత్వాదిధర్మములు సుప్రసిద్ధములు. దర్శనాదిక్రియలకు కర్తయగువాడు తనక్రియకు దానే కర్మ కానేరఁడు [అనగా తానితరులను చూడగలఁడుగాని తనను తాను చూడలేఁడు]

జీవు డంతర్యామి కావచ్చును.

శీలం భోక్తృత్వాత్. తస్మాచ్ఛారీరోఽంతర్యామీత్యత ఉత్తరం పఠతి. ।

## శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే (సూ. 20)

నేతి పూర్వసూత్రాదనువర్తతే. శారీరశ్చ నాంతర్యామీ స్యాత్. కస్మాత్? యద్యపి ద్రష్టృత్వాదయో ధర్మాస్తస్య సంభవంతి. తథాపి ఘటాకాశవదుపాధిపరిచ్ఛిన్నత్వాన్న కార్త్స్న్యేన పృథివ్యాదిష్వంతరవస్థాతుం నియంతుం చ శక్నోతి. అపి చ

---

"దృష్టిని చూచువానిని చూడలేవు" అని శ్రుతి (బృ 3-42) పలుకుచున్నది. కార్యకరణసంఘాతమును నియమించుట జీవునికి స్వభావము. అతఁడే భోక్త యగుచున్నాఁడు. అందువలన జీవుఁడంతర్యామి యగుచున్నాఁడు.' అని పూర్వపక్షము రాఁగా నందుకు సమాధానమును బఠించుచున్నారు. (19)

శారీరః చ = మఱియు, జీవుఁడంతర్యామి కానేరఁడు. ఏలనన! ఉభయే అపి = కాణ్వ మధ్యందిన శాఖలవారిద్దఱును ఏనం = ఈజీవుని, భేదేన = అంతర్యామి కంటె భిన్నముగా అధీయతే హి = పఠించుచున్నారు గదా!

న = కాదు అనుపదము పూర్వసూత్రమునుండి చటికి నధ్యాహారము చేసికొనవలయును. జీవుఁడంతర్యామి కానేరఁడు ఏలనన! నిజమే! ద్రష్టృత్వాది ధర్మములతనియందు గలవు అయినను జీవుఁడు ఘటములోని యాకాశమువలే శరీరోపాధిచేత పరిమితుఁడగుటంజేసి

జీవుఁడంతర్యామి కంటె భిన్నుఁడని రెండు బుక్శాఖలు పల్కుచున్నవి.

ఉభయేఽపి హి శాఖినః కాణ్వా మాధ్యందినాశ్చాంతర్యామిణో భేదేనైనం శారీరం పృథివ్యాదివదధిష్ఠానత్వేన నియమ్యత్వేన చాధీయతే. 'యో విజ్ఞానే తిష్ఠ' (బృ3-5-22) న్నితి కాణ్వాః. 'య ఆత్మని తిష్ఠ'న్నితి మాధ్యందినాః. 'య ఆత్మనితిష్ఠ'న్నిత్యస్మింస్తావత్పాఠే భవత్యాత్మశబ్దశ్శారీరస్య వాచకః. 'యో విజ్ఞానే తిష్ఠ' న్నిత్యస్మిన్నపి పాఠే విజ్ఞానశబ్దేన శారీర ఉచ్యతే విజ్ఞానమయో హి శారీర ఇతి. తస్మాచ్ఛారీరాదన్య ఈశ్వరోఽంతర్యామీతి సిద్ధం. ।

పూ. పక్షీ : కథం పునరేకస్మిన్ దేహే ద్వౌ ద్రష్టారా

---

పృథివ్యాది సమస్తవస్తుజాలమునందాంతరమున నుండి యవ్వాని నియమింప సమర్థుడు కాడు. మఱియు కాణ్వమాధ్యందిన శాఖల వారిద్దఱును శారీరుడగు జీవుడంతర్యామికంటె భిన్నుడనియు నంతర్యామి పృథివి జలము, అగ్ని. అంతరిక్షము వాయువు మొదలగువానిని యధిష్ఠానముగా గలిగి వానినివలెనే జీవునిగూడ నియమించుచున్నట్లు పలుకుచున్నారు [ఇచట బృహదారణ్యము 3-8 అంతర్యామిప్రకరణము చూడదగును] "ఎవడు విజ్ఞానమునందుండి" యని కాణ్వశాఖయు "ఎవడాత్మయందుండి" యనిమాధ్యందినశాఖయు చెప్పుచున్నవి. మాధ్యందినపాఠమునందలి యాత్మశబ్దము జీవుని చెప్పుచున్నది. కాణ్వపాఠమునందలి విజ్ఞానశబ్దముగూడ జీవుని చెప్పుచున్నది. జీవుడు విజ్ఞానమయుడు. [విజ్ఞానమన బుద్ధి] అందువలన నీశ్వరుడగు నంతర్యామి శారీరునికంటె భిన్నుమని సిద్ధముగుచున్నది.

పూర్వపక్షి : ఈశ్వరుడగు నంతర్యామి యొకడు,

వుపపద్యేతే. యశ్చాయమీశ్వరోఽంతర్యామీ యశ్చాయమితర
శ్శారీరః ।

సిద్ధాంతీ : కా పునరిహాఽనుపపత్తిః ?

పూ. పక్షీ : 'నాన్యోఽతోఽస్తి ద్రష్టే'త్యాదిశ్రుతివచనం విరుధ్యేత. అత్ర హి ప్రకృతాదంతర్యామిణోఽన్యం ద్రష్టారం శ్రోతారం మంతారం విజ్ఞాతారం చాత్మానం ప్రతిషేధతి. ।

సిద్ధాంతీ : నియంత్రంతరప్రతిషేధార్థ మేతద్వచనం. ।

---

తదన్యుడగు శారీరుడు మఱియొకడు- ఇట్లొక శరీరమునం దిద్దఱు ద్రష్ట లెటుల ?

సిద్ధాంతి : ఇచట నేమి యనుపపత్తి కలదు ?

పూర్వపక్షి : చూచువా డితనికంటె నన్యుఁడు లేఁడను శ్రుతివచనమునకు విరోధము గలుగును. ప్రకృతమగు నంతర్యామికంటె మఱియొక ద్రష్ట శ్రోత మంత, విజ్ఞాత యగు నాత్మ నీశ్రుతి నిషేధించుచున్నది.

సిద్ధాంతి : ఈశ్రుతివాక్యము మఱియొక నియంత లేడని చెప్ప నుద్దేశింపబడినది. [ద్రష్ట మఱియొకడు లేడను చెప్పు శ్రుతి మఱియొక ద్రష్ట శ్రోత మొదలగువాడు లేడని సామాన్యముగఁ బల్కినది. నియంతృత్వమేకాక ద్రష్టృత్వాది ధర్మములు గూడ గలవాడు అంతర్యామిదక్క మఱియొకడు లేడని ప్రతివాది వాదము. అందుచే శ్రుతి ధర్మవిశేషమును చెప్పక సామాన్యముగఁ జెప్పినదియని పూర్వపక్షి సమాధాన తాత్పర్యము.]

పూ. పక్షీ : ఇతి చేత్, న, నియంత్రంతరాప్రసంగాత్, అవిశేషశ్రవణాచ్చ. ।

సిద్ధాంతీ : అత్రోచ్యతే. అవిద్యాప్రత్యుపస్థాపితకార్యకరణోపాధినిమిత్తోఽయం శారీరాంతర్యామిణోర్భేదవ్యపదేశో న పారమార్థికః. ఏకో హి ప్రత్యగాత్మా భవతి న ద్వౌ ప్రత్యగాత్మానౌ సంభవతః. ఏకస్యైవ తు భేదవ్యవహార ఉపాధికృతః, యథా ఘటాకాశో మహాకాశ ఇతి. తతశ్చ జ్ఞాతృజ్ఞేయాదిభేదశ్రుతయః ప్రత్యక్షాదీని చ ప్రమాణాని సంసారానుభవో విధి

---

పూర్వపక్షి : మఱియొక నియంతనుగూర్చి ముచ్చటించుట కిచటఁ బ్రసక్తి లేదుగాన మఱియొక నియంత యని విశేషించి చెప్పక మఱియొక ద్రష్ట్రాదికము లేదని శ్రుతి సామాన్యముగఁ బల్కినది.

జీవాంతర్యాముల భేదముపాధి కల్పితము.

సిద్ధాంతి : ఇందుల కిట్లు చెప్పుచున్నాము. అవిద్యచే గల్పింపఁబడిన కార్యకారణములను నుపాధిభేదముచే జీవాంతర్యాముల కిట్టి భేదము నారోపించిరిగాని పరమార్థముచే నట్టి భేదము లేదు. ప్రత్యగాత్మ యొక్కఁడే. ఇద్దఱు ప్రత్యగాత్మలు లేరు. ఒక్కనికే యుపాధివశమున భేదవ్యవహారము గల్గుచున్నది. మహాకాశమున కొక్కదానికే ఘటమను నుపాధివశమున ఘటాకాశమను వ్యవహారము గల్గుచున్నది. అందువలననే జ్ఞాత జ్ఞేయము మొదలగు భేదముల నుదాహరించు శ్రుతులు ప్రత్యక్షము అనుమానము మొదలగు జ్ఞానసాధకములగు ప్రమాణములు

ప్రతిషేధశాస్త్రం చేతి సర్వమేతదుపపద్యతే. తథా చ శ్రుతిః— 'యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతీ'త్యవిద్యావిషయే సర్వవ్యవహారం దర్శయతి. 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యే'దితి విద్యావిషయే సర్వవ్యవహారం వారయతి.

---

సంసారానుభవము, [అహరహః సంధ్యాముపాసీత యను మొదలగు] విధిశాస్త్రము [న గురుదారాం గచ్ఛేత్ అను మొదలగు] నిషేధశాస్త్రము- ఇదియంతయు సహేతుకముగ నుపపన్నమగుచున్నది. "ఎచట ద్వైతమున్నట్లు కాన్పించుచున్నదో యచట నొకడు మఱియొకనిని జూచును." అను భేదమును పలుకు శ్రుతి యవిద్యావిషయమునందు సర్వ వ్యవహారమునుఁ బ్రదర్శించుచున్నది. ఎచటనైన నీజ్ఞానికి సర్వమాత్మయే యగుచున్నదో యచట నేసాధనముచే దేనిని జూచును? అను సర్వభేదనివారకమగు శ్రుతి విద్యావిషయమునందు సర్వవ్యవహారమునుఁ ద్రోసిపుచ్చుచున్నది.

---

<u>అధికరణార్థ సంక్షేపము</u>: అంతర్యామ్యధికరణమునందు వినబడు నంతర్యామిశబ్దము పృథివ్యాదులను నియమనము చేయు నొక యధిదేవత కావలెను. ఆయతనము నియమనసాధనములు వినబడుచున్నవి. ఇవి పరమాత్మకు తగవు. అని పూర్వపక్షము. పరమాత్మయె యంతర్యామి, విషయవాక్యమునందు వినబడు నమృతత్వ ఆత్మత్వము లతనియందే వర్తించును. ఆతడు నియమనముచేయువారి యుపకరణములే

యాతని యుపకరణము లగుచున్నవి. ఆతని నిరంకుశ నియంతృత్వము సర్వశ్రుతిప్రసిద్ధము. సాంఖ్యులు చెప్పు ప్రధానము అంతర్యామి కానేరదు. అది యచేతనము. ద్రష్టృత్వాది ధర్మము లచేతనమునకు సంభవింపవు. జీవుడుగూడ నంతర్యామి కాడు. అవిద్య యున్నంతవఱ కతడుగూడ నంతర్యామిచే నియమింపబడుచుండును. వా రుభయు లొకప్పడు రేయను జ్ఞానముకలిగినపు డిట్టి ప్రసక్తి కలుగదు. 20

---

## (6) అదృశ్యత్వాద్యధికరణము

---

అ॥ అదృశ్యత్వాదిధర్మము లచేతనమగు ప్రధానమునందు సంభవము కావుగనుక ప్రధాన మంతర్యామి కానేరదని పూర్వాధికరణమున త్రోసివేయబడినది. కాని దిగువ నుదాహరింపబడు ముండకవాక్యమునందు వినవచ్చు దృశ్యత్వాది గుణము లన్నియును బ్రధానమునందుగాన్పించుచున్నవిగనుక నావాక్యమునందు వినఁబడు భూతయోని ప్రధానముకాఁగలదని పూర్వపక్షము రాగా నందులకు సమాధానపూర్వకముగ రాఁబోవు నధికరణ మారంభింపఁబడుచున్నది.

విషయవాక్యము: "యత్తద్రదేశ్యమగ్రాహ్యం...తదవ్యయం
యద్భూతయోనిం పరిముచ్యంతి ధీరాః"
[ముండ. 1-1-5,6]

## అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః (సూ. 21)

'అథ పరా యయా తదక్షరమధిగమ్యతే యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం, తదవ్యయం యద్భూత

---

సంశయము : ఇచట వినబడుచున్న యదృశ్యత్వాదిగుణకమగు భూతయోని, ప్రధానమా, జీవుడా లేక పరమేశ్వరుఁడా యనిసందేహము.

పూర్వపక్షము : ప్రధానమో జీవుఁడో కాఁదగును.

సిద్ధాంతము : పరమేశ్వరుఁడగుచున్నాఁడు.

సమాలోచనీయములగు ప్రమాణములు –

ముండకం 1–1–5,6, 1–1–5, 1–1–9, 2–1–2, 1–2–13, 1–1–1, 1–25, 1–2–7, 2–1–2, 2–1–4, తై 3–10–6, ముం. 2–1–10.

విషయవాక్యమునందు అదృశ్యత్వ ఆఁది గుణకః = అదృశ్యత్వము మొదలగు ధర్మములు గలిగియున్నట్లుదాహరింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడు. ధర్మ ఉక్తేః = అతని ధర్మములే చెప్పబడుటవలన.

ఏ విద్యచే నక్షరుఁడు దెలియఁబడుచున్నాఁడో యది పరావిద్య యనఁబడుచున్నది. ఎయ్యది యదృశ్యమో, యగ్రాహ్యమో, గోత్రము జాతి లేనిదియో, చక్షుస్సు లేనిదియో, శ్రోత్రము లేనిదియో పాణిపాదములు లేనిదియో సర్వసమర్థమో నిత్యమో సర్వవ్యాపియో, అత్యంతము

యోనిం పరిపశ్యంతి ధీరాః' (ముం1-1-5-6) ఇతి శ్రూయతే. తత్ర సంశయః. కిమయమదృశ్యత్వాదిగుణకో భూతయోనిః ప్రధానం స్యాత్, ఉత శారీరః, ఆహోస్విత్పరమేశ్వర ఇతి.।

పూ. పక్షీ: తత్ర ప్రధానమచేతనం భూతయోనిరితి యుక్తం, అచేతనానామేవ తత్ర దృష్టాంతత్వేనోపాదానాత్ 'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషధయస్సంభవంతి యథా సతః పురుషాత్కేశలోమాని తథాక్షరాత్సంభవతీహ విశ్వ' (ముం1-1-7) మితి.।

---

సూక్ష్మమో వికారరహితమో సర్వభూతములను గారణమోయట్టి యక్షరుని పండితు లంతటను జూచుచున్నారని ముండక శ్రుతి (1-1-5-6) పల్కుచున్నది. అదృశ్యత్వాది గుణములు గల యీభూతయోని ప్రధానమా లేక జీవుడా లేక పరమేశ్వరుడా! వీరిలో నేది యగును ?

పూర్వపక్షి : (1) అచేతనమగు ప్రధానమే భూతయోని యగుటయుక్తము. తరువాత వాక్యమునం దచేతనములు మాత్రమే యీభూతయోనికి దృష్టాంతములుగ నుదాహరింపబడినవి సాలెపురు గే విధముగ దన శరీరము నుండి దారమును సృష్టించి తిరిగి గ్రహించుచున్నదో, పృథివి నుండి యోషధులెట్లు సంభవించుచున్నవో, జీవించి యున్న

భూతయోని ప్రధానము అని పూర్వపక్షము

మాధ్యమికః : నన్వూర్ణనాభిః పురుషశ్చ చేతనావిహ దృష్టాంతత్వేనోపాత్తౌ. ।

పూ. పక్షీ: నేతి బ్రూమః, న హి కేవలస్య చేతనస్య తత్ర సూత్రయోనిత్వం కేశలోమయోనిత్వం వాస్తి. చేతనాధిష్ఠితమచేతనం హ్యూర్ణనాభిశరీరం సూత్రస్య యోనిః పురుషశరీరం చ కేశలోమ్నామితి ప్రసిద్ధం. ।

మాధ్యమికః: అపి చ. పూర్వత్రాదృష్టత్వాద్యభిలాపసంభవేఽపి

---

పురుషునివలన లోమములెట్లు కేశములు బుట్టుచున్నవో అటులనే యక్షరునివలన జగత్తు బుట్టుచున్నది. (ము1-1-7) అని తరువాత వాక్యము వినవచ్చుచున్నది.

మధ్యస్థుడు : ఇచట దృష్టాంతముగ నుదాహరింపబడిన సాలెపురుగు పురుషుడు చేతనములు గదా !

పూర్వపక్షి : అట్లుకాదని మేమందుము. కేవలము చేతనములగు సాలెపురుగు పురుషుడు దారమునకుగాని లోమకేశములకుగాని కారణముకాదు. చేతనముచే నధిష్ఠితమైన సాలెపురుగుశరీరము దారమునకు కారణము, పురుషశరీరము కేశలోమములకు కారణము. ఇది సుప్రసిద్ధము.

మాధ్యమికుడు : [పూర్వాధికరణమునఁ బ్రధానము జగత్కారణము కాదని నిరసింపఁబడెనుగదా? తిరిగి యీవిషయము నెటు లెత్తుకొందురు?]

పూ. పక్షీ: ద్రిష్టృత్వాద్యఖిలాపాసంభవాన్న ప్రధానమభ్యుపగతం. ఇహ త్వదృశ్యత్వాదయో ధర్మాః ప్రధానే సంభవంతి. న చాత్ర విరుధ్యమానో ధర్మః కశ్చిదభిలప్యతే. ।

మాధ్యమికః : నను 'యస్సర్వజ్ఞస్సర్వవి' (ముం 1-9) దిత్యయం వాక్యశేషో ఽ చేతనే ప్రధానే న సంభవతి, కథం ప్రధానం భూతయోనిః ప్రతిజ్ఞాయత ఇతి. ।

పూ. పక్షీ: అతో౽భిధీయతే. యయా తదక్షరమధిగమ్యతే యత్త దద్రేశ్యమి'త్యక్షరశబ్దేనాదృశ్యత్వాదిగుణకం భూతయోనిం శ్రావ

---

పూర్వపక్షి : (2) పూర్వాధికరణమునందు ప్రధానమదృష్టమని పలుకరింపబడినను ద్రష్టృత్వము మొదలగు గుణములసంభవములు కనుక అద్దానియందవి నిరసింప బడినవి. ఇచట నుదాహరింపబడిన యదృశ్యత్వాది ధర్మములు ప్రధానమునందు ఘటించుచున్నవి; ప్రధానమునందు సంభవముగాని ధర్మ మిచట నొక్కటియు నుదాహరింపబడుటలేదు.

మాధ్యమికుడు : 'ఎవడు సర్వజ్ఞుడో, సర్వవేత్తయో' యను ప్రకృతవాక్యముయొక్క శేషించిన భాగము (ముండక 1-1-8) అచేతనమగు ప్రధానమునందు సమన్వయము కానేరదుగదా? ప్రధానమును భూతయోనిగ గుర్తింపదగునని మీరెట్లు వచియింపగలరు?

పూర్వపక్షి : ఇందు కిట్లు చెప్పుచున్నాము. 'దేనిచే నక్షరుడు తెలియబడుచున్నాడో' 'ఏది దృశ్యమో' అను వాక్యమునందు అక్షరశబ్దముచే నదృశ్యత్వాదిగుణములు గల

యిత్వా పునరన్తే శ్రావయిష్యతి 'అక్షరాత్పరతః పరః' (ముం 2-1-2) ఇతి. తత్ర యః పరోఽక్షరాచ్ఛ్రుతస్స సర్వజ్ఞస్సర్వవిచ్చ భవిష్యతి, ప్రధానమేవాక్షరశబ్దనిర్దిష్టం భూతయోనిః. యదా తు యోనిశబ్దో నిమిత్తవాచీ తదా శారీరోఽపి భూతయోనిస్స్యాత్, ధర్మాధర్మాభ్యాం భూతజాతస్యోపసర్జనాదితి. ।

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తేఽభిధీయతే—యోఽయమదృశ్యత్వాదిగుణకో భూతయోనిస్స పరమేశ్వరః స్యాన్నాన్య ఇతి. కథమే

---

భూతయోని యుదాహరింపబడినది. ప్రకరణాంతమున పరుడక్షరునికంటెను పరుడని చెప్పబడుచున్నది. (ముండక 2-1-2) అక్షరునికంటెను పరుడని బిలువఁబడిన వాడు సర్వజ్ఞుడు సర్వవేత్తయు నగుచున్నాడు. [ మాయోపాధిచేత సర్వమును దెలిసికొనువాడు సర్వజ్ఞుడు; అవిద్యోపాధిచే వ్యష్టిరూపమున వ్యష్టిశరీరసంబంధమగు సర్వమును దెలిసికొను జీవుఁడు సర్వవిత్తు ] అక్షరశబ్ద నిర్దిష్టమగు భూతయోని ప్రధానమగుచున్నది. [భూతయోని యనుపదమునందలి యోనిశబ్దమునకుపాదానకారణ మర్థమని గ్రహించి ప్రధానము జగత్కారణమని యర్థగ్రహణ మిచట చేయఁబడినది.] యోనిశబ్దమునకు నిమిత్తకారణ మర్థమైనపుడు జీవుడుఁ భూతయోని యగుచున్నాఁడు. ధర్మాధర్మములవలన భూతజాతమంతయు గలుగుచున్నది. [ధర్మాధర్మములన్నియు జీవకృతములు. వానివలన జన్మయు గల్గుచున్నది. అందువలన జీవుడు భూతయోని యగుచున్నాడు.]

సిద్ధాంతి: ఇట్లు పూర్వపక్షము రాగా సమాధానము చెప్ప

తదపగమ్యతే? ధర్మోక్తేః. పరమేశ్వరస్య హి ధర్మ ఇహోచ్యమానో దృశ్యతే 'యస్సర్వజ్ఞస్సర్వవి'దితి. న హి ప్రధానస్యాచేతనస్య శారీరస్య వోపాధిపరిచ్ఛిన్నదృష్టేః సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం వా సంభవతి. ।

మాధ్యమికః: నన్వక్షరశబ్దనిర్దిష్టాద్భూతయోనేః పరస్యైవైతత్సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం చ న భూతయోనివిషయమిత్యుక్తం. ।

సిద్ధాంతీ: అత్రోచ్యతే. నైవం సంభవతి యత్కారణం

---

చున్నాము. విషయవాక్యమునం దదృశ్యత్వాదిగుణములు కలిగియున్నట్లుదాహరింపబడిన భూతయోని పరమేశ్వరుఁడే యగుచున్నాఁడు. అన్యుఁడు కాఁడు. ఇది యెట్లుఁదెలియుచున్నది యన ధర్మము చెప్పబడుచున్నది గనుక. పరమేశ్వరుని ధర్మమే యిచట నుదాహరింపబడుచున్నది. "ఎవఁడు సర్వజ్ఞుఁడో ఎవఁడు సర్వవేత్తయో యని" వాక్యము గలదు. అచేతనమగు ప్రధానమునకుఁ నుపాధిచే పరిమితమగు దృష్టిగల జీవునికిగాని సర్వజ్ఞత్వము సర్వవేతృత్వము సంభవింపదు.

భూతయోని పరమేశ్వరుఁడని సిద్ధాంతము

మాధ్యమికుఁడు: అక్షరశబ్దముగూడ నిచట వినబడుట వలన భూతయోనికంటె భిన్నుఁడగు మఱియొకఁడుసర్వజ్ఞుఁడు సర్వవేత్తయు నగుచున్నాఁడనియు నాధర్మములు భూతయోని విషయము కావనియు పూర్వవాది చెప్పెనుగదా!

సిద్ధాంతీ: ఇందుకిట్లు చెప్పెదము. పూర్వపక్షి యన్నట్లు

' అక్షరాత్సంభవతీహ విశ్వ ' మితి ప్రకృతం భూతయోనిమిహ జాయమానప్రకృతిత్వేన నిర్దిశ్యానంతరమపి జాయమానప్రకృతిత్వేనైవ సర్వజ్ఞం నిర్దిశతి— "యస్సర్వజ్ఞస్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః, తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నం చ జాయత" ఇతి. తస్మాన్నిర్దేశసామ్యేన ప్రత్యభిజ్ఞాయమానత్వాత్ప్రకృతస్యైవాక్షరస్య భూతయోనేస్సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం చ ధర్మ ఉచ్యత ఇతి గమ్యతే. 'అక్షరాత్పరతః పర' ఇత్యత్రాపి న ప్రకృతాద్భూతయోనేరక్షరాత్పరః కశ్చిదభిధీయతే. కథమేతదవగమ్యతే? 'యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యా'(ముం1-2-13)మితి ప్రకృతస్యైవాక్షరస్య భూతయోనే

---

సంభవింపదు. 'అక్షరునివలన నీవిశ్వము సంభవించుచున్నది' యని ప్రకృతమగు భూతయోనిని జగదుపాదానకారణముగ నిర్దేశించిన తరువాత నాభూతయోనియే సర్వజ్ఞునియు జగదుపాదానకారణమనియు తిరిగి శ్రుతి పలుకుచున్నది.

భూతయోని జగదుపాదాన కారణము.

"ఎవడు సర్వజ్ఞుడు సర్వవిత్తు నగుచున్నాడో ఎవ్వని తపస్సు జ్ఞానాత్మకమో యతనివలన నీబ్రహ్మము, నామము రూపము, అన్నము పుట్టుచున్నవి" యనునది యా శ్రుతి. భూతయోనియే సర్వజ్ఞుడనియు జగదుపాదానకారణమనియుగూడ గుర్తింపబడుటవలన ప్రకృతమైన యక్షరుడగు భూతయోనియే సర్వజ్ఞత్వ సర్వవిత్త్వములను ధర్మములు గలిగి యున్నట్లు దెలియుచున్నది. అక్షరుడగు పరునికంటెఁ బరుడను వాక్యము గూడ ప్రకృతమగు

అక్షరునికంటె పరుడు లేడు.

రదృశ్యత్వాదిగుణకస్య వక్తవ్యత్వేన ప్రతిజ్ఞాతత్వాత్. కథం తర్హి 'అక్షరాత్పరతః పరః' ఇతి వ్యపదిశ్యత ఇత్యుత్తరసూత్రే వక్ష్యామః. అపి చాత్ర ద్వే విద్యే వేదితవ్యే ఉక్తే—'పరా చైవాపరా' చేతి. అత్రాపరామృగ్వేదాదిలక్షణాం విద్యాముక్త్వా బ్రవీతి 'అథ పరా యయా తదక్షరమధిగమ్యత' ఇత్యాది. తత్ర పరస్యా విద్యాయా విషయత్వేనాక్షరం శ్రుతం. యది పునః పరమేశ్వ

నక్షరుఁడైన పరునికంటె నన్యుఁడగు మఱియొకని జెప్పుటలేదు, ఇదియెట్లు దెలియుచున్నదనిన, ఏపరవిద్యచేత సత్యస్వరూపుడు అవినాశియు, అవ్యయుఁడు, పూర్ణుడు నగుపురుషుని దాను దెలిసికొనెనో యాబ్రహ్మమును దెలియజేయు పరవిద్యను గురువు యథాస్వరూపముగ దెలియజేయవలయును" అని శ్రుతి (ముం. 1–2–13) చెప్పుచున్నది. ఈవాక్యమునందు బ్రకృతమగు భూతయోని యదృశ్యత్వము మొదలగు గుణములు గలిగియున్న నక్షరుఁడే యుపదేశింపఁదగినవాడుగఁ దెలియఁజేయఁబడుచున్నాఁడు. అక్షరుఁడు పరునికంటెఁ బరుఁడని యేల నుదాహరింపఁబడెనో రాబోవు 22వ సూత్రమున వివరించెదము. మఱియు పరావిద్య, యపరావిద్య ఈ రెండు విద్యలు దెలిసికొనదగినవిగ నిచట నుదాహరింపఁబడినవి. ఋగ్వేదాదిలక్షణములతోఁ గూడినది యపరవిద్య యనిచెప్పి దేనిచే నక్షరుడు దెలియఁబడుచున్నాడో యది పరవిద్యయని తరువాతవాక్యముదాహరించుచున్నది. అక్షరుడీ పరవిద్యావిషయమని యీవాక్యమువలన దెలియుచున్నది.

రాదన్యదదృశ్యత్వాదిగుణకమక్షరం పరికల్ప్యేత నేయం పరావిద్యా స్యాత్. పరాపరవిభాగో హ్యాయం విద్యయోరభ్యుదయనిశ్శ్రేయసఫలతయా పరికల్ప్యతే. న చ ప్రధానస్య విద్యా నిశ్శ్రేయసఫలా కేనచిదభ్యుపగమ్యతే. తిస్రశ్చ విద్యాః ప్రతిజ్ఞాయేరన్ త్వత్పక్షేఽక్షరాద్భూతయోనేః పరస్య పరమాత్మనః ప్రతిపాద్యమానత్వాత్. ద్వే ఏవ తు విద్యే ఇహ వేదితవ్యే నిర్దిష్టే. 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీ'తి (ముం1-1-3) చైక

---

అదృశ్యత్వాదిగుణములు గల యక్షరుఁడు బరమేశ్వరునికంటె భిన్నుఁడగువాఁడొక డున్నాఁ డని యర్థకల్పనము చేసినచో, నావిద్య పరవిద్య కానేరదు. అపరవిద్యాఫలము అభ్యుదయము, పరవిద్యాఫలము నిఃశ్రేయసము. ఇట్టి ఫలభేదము ననుసరించి పరాపరవిద్యావిభాగము చేయబడినది. ప్రధానమును దెలియుటచే నిఃశ్రేయసఫలప్రాప్తి గలుగునని యెవరు నంగీకరింపరు. ప్రధానమును దెలియుటగూడ నొకవిద్యయయినచో నక్షరుఁడగు భూతయోనికంటెఁ బరమాత్మ యన్యుఁడని మీరే చెప్పుచున్నారు గనుక, పరవిద్య, యపరవిద్య, ప్రధానవిద్య యని మూఁడువిద్యలు సంభవించుచున్నవి. పరాపరవిద్యలు రెండే దెలిసికొనదగినవిగ శ్రుతి పలుకుచున్నది. మఱియు సర్వాత్మకమగు బ్రహ్మమును బ్రకృతమున నిర్దేశించినపుడే 'ఏది తెలియుచుండగా నిదియంతయు తెలియబడినది యగును?" (ముం. 1-1-3) అను ప్రశ్నమునం గుదాహరింపబడిన యేకవిజ్ఞాన

విజ్ఞానేన సర్వవిజ్ఞానాపేక్షణం సర్వాత్మకే బ్రహ్మణి వివక్ష్యమాణేఽవకల్పతే, నాచేతనమాత్రైకాయతనే ప్రధానే భోగ్యవ్యతిరిక్తే వా భోక్తరి. అపి చ 'స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠామథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహేతి. (ముం 1-1-1) బ్రహ్మవిద్యాం ప్రాధాన్యేనోపక్రమ్య పరాపరవిభాగేన పరాం విద్యామక్షరాధిగమనీం దర్శయంస్తస్యాః బ్రహ్మవిద్యాత్వం దర్శయతి. సా చ బ్రహ్మవిద్యా సమాఖ్యా తదభిగమ్యస్యాక్షరస్యాబ్రహ్మత్వే బాధితా స్యాత్. అపరా త్వృగ్వేదాదిలక్షణా కర్మవిద్యా బ్రహ్మ

---

ముచే సర్వవిజ్ఞానసిద్ధి సంభవించునుగాని యచేతనమాత్రము తెలిసినపుడుగాని భోగ్యజాతమునకు వ్యతిరిక్తమగు భోక్త యనగా జీవుడు తెలిసినపుడుగాని యట్టిసర్వవిజ్ఞానసిద్ధి కలుగదు ఇంతియ కాదు. "ఆబ్రహ్మ సర్వవిద్యలకు ప్రతిష్ఠాభూతమగు బ్రహ్మవిద్యను తన పెద్దకుమారుడగు నథర్వునికి యుపదేశించెను" (ముం. 1-1-1) అనువాక్యము బ్రహ్మవిద్యను ప్రధానముగా నుపక్రమించి విద్యను పరవిద్య, ఆపరవిద్యయని రెండు భాగములుగ జేసి పరవిద్య యక్షరుని పొందుటకు సాధనమగుట వలన బ్రహ్మవిద్య యగుచున్నదియని ప్రదర్శించినది. అట్టి బ్రహ్మవిద్యచేఁ బొందబడు నక్షరుఁడు బ్రహ్మముగానిచో నా విద్యకు బ్రహ్మవిద్యయను నామము బాధితమగును. బ్రహ్మ విద్యను బ్రశంసించుటకై బ్రహ్మవిద్యారంభమున ఋగ్వేదాది రూపము కర్మవిద్యయునగు నపరవిద్య యుదాహరింపఁబడినది. "యజ్ఞమును నిర్వర్తించునట్టి పదునార్వురు ఋత్విక్కులు

విద్యోపక్రమే ఉపన్యస్యతే బ్రహ్మవిద్యాప్రశంసాయై, "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ, ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా జరాం మృత్యుం తే పునరేవాపియంతి" ( ముం 1-2-7 ) ఇత్యేవమాదినిందావచనాత్. నిందిత్వా చాపరాం విద్యాం తతో విరక్తస్య పరవిద్యాధికారం దర్శయతి—"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ" ( ముం 1-2-12 ) మితి. యత్తూక్తమచేతనానాం పృథివ్యాదీనాం దృష్టాంతత్వేనోపాదానాద్దార్ష్టాంతికేనాప్యచేతనేనైవ భూతయోనినా భవితవ్యమితి,

---

పత్ని యజమానుడు వీరంద అస్థిరులు నశించువారు. వీర లాచరించు కర్మలు జ్ఞానరహితములగుటచే శ్రేష్ఠములు గావు. అదియే మోక్షమని యభినందించు మూఢులు స్వర్గానుభవానంతరము తిరిగి జరామరణముల పాలగుచున్నారు." (ముం. 1-2-7) అను వాక్య మపరవిద్యానిందాత్మక మగుచున్నది. "బ్రహ్మనిష్ఠను గోరువాడు కర్మప్రాప్తములగు స్వర్గాదిలోకములనిత్యములని పరిశీలించి కృతకమగు కర్మచేత నకృతకమగు మోక్షము కలుగదని వైరాగ్యమును బొంది యమృతస్వరూపమగు బ్రహ్మమును బొందుటకు సమిథలను హస్తమునం దిడుకొని వేదార్థసదాచారసంపన్నుడును బ్రహ్మనిష్ఠుడునగు గురువును సమీపింపవలయును" (ముం. 1-2-12) అని తరువాతవాక్యము చెప్పుచున్నది. పృథివి మొదలగు నచేతనములు దృష్టాన్తములుగ నుదాహరింపఁబడుటచే దార్ష్టాంతిక

తదయుక్తం. న హి దృష్టాంతదార్ష్టాంతికయోరత్యంతసామ్యేన భవితవ్యమితి నియమోఽస్తి. అపి చ స్థూలాః పృథివ్యాదయో దృష్టాంతత్వేనోపాత్తా ఇతి న స్థూల ఏవ దార్ష్టాంతికో భూతయోనిరభ్యుపగమ్యతే, తస్మాదదృశ్యత్వాదిగుణకో భూతయోనిః పరమేశ్వర ఏవ.।

## విశేషణభేదవ్యపదేశాభ్యాంచ నేతరౌ (సూ. 22)

ఇతశ్చ పరమేశ్వర ఏవ భూతయోనిః, నేతరౌ శారీరః ప్రధానం వా. కస్మాత్? విశేషణభేదవ్యపదేశాభ్యాం. విశినష్టి హి

---

మగు భూతయోనిగూడ నచేతనము కావలయునను ప్రతివాది వాదము యుక్తముకాదు. దృష్టాంతమునకును దార్ష్టాంతికమునకును సామ్యమన్నివిధముల సరిపోవలయునను నియమము లేదు. దృష్టాంతములుగా గ్రహింపఁబడిన పృథివ్యాదులు స్థూలపదార్థములు గనుక దార్ష్టాంతికమగు భూతయోనిగూడ స్థూలము కావలయునని యెవరు నంగీకరింపరుగదా! అందువలన నదృశ్యత్వాదిగుణములుగల జగత్కారణము పరమేశ్వరుడే యగుచున్నాడు. 21

"దివ్యో హ్యమూర్తః పురుషః" (ముం. 2-1-2) అను వాక్యమునందు విశేషణ=అప్రాణత్వాదివిశేషణముయొక్కయు అక్షరాత్ పురుషః పరః (ముం. 2-1-2) అనువాక్యమునందు అక్షరునికంటె భేద=భేదముయొక్కయు వ్యపదేశాభ్యాం చ=

ప్రకృతం భూతయోనిం శారీరాద్విలక్షణత్వేన 'దివ్యోహ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యంతరో హ్యజోఽప్రాణో హ్యమనాశ్శుభ్రః' (ముం2-1-2) ఇతి. న హ్యేతద్దివ్యత్వాదివిశేషణమవిద్యాప్రత్యుపస్థాపితనామరూపపరిచ్ఛేదాభిమానినస్తద్ధర్మాంశ్చాత్మని కల్పయతశ్శారీరస్యోపపద్యతే. తస్మాత్సాక్షాదౌపనిషదః పురుష ఇహోచ్యతే. ।

---

చెప్పబడుటవలన చ = గూడ ఇతరౌ = ప్రధానజీవులు న = పరమేశ్వరుడు కారు.

విషయవాక్యమునం దుదాహరింపబడిన భూతయోని చెప్పఁబోవు కారణముచేతగూడ పరమేశ్వరుడే యగుచున్నాఁడు గాని జీవప్రధానములు గానేరరు. ఏలనన! విశేషణము భేదముగూడ చెప్పబడుటవలన.

విశేషణ వ్యపదేశము

పరమపురుషుడు స్వయంజ్యోతి యగుటచే బ్రకాశించువాడును, ఆకారము లేనివాడును, పూర్ణుడును, బాహ్యాభ్యంతరముల నిండియున్నవాఁడును, ప్రాణములు లేనివాఁడును, శుద్ధుఁడు" అని దివ్యత్వము మొదలగు విశేషణములచే విశేషించి జీవునికంటెఁ బ్రకృతమగు పరమాత్మ విలక్షణుఁడని శ్రుతి (ముం 2-1-2) చెప్పుచున్నది. ఇచటఁ జెప్పఁబడిన దివ్యత్వాది విశేషణములు శరీరమునందుఁ బరిచ్ఛిన్నుడుగనున్న జీవునియందు వర్తింపవు. ఆతఁడవిద్యాపరికల్పితమగు నామము రూపము మొదలగువానిచేఁ బరిమితుఁడై వానియం దభిమానము గలిగి యాధర్మముల తనయందుఁ గల్పించుకొనుచున్నాఁడు. అందువలన సాక్షా

తథా ప్రధానాదపి ప్రకృతం భూతయోనిం భేదేన వ్యపదిశతి 'అక్షరాత్పరతః పర' ఇతి. అక్షరమవ్యాకృతం నామ రూపబీజశక్తిరూపం భూతసూక్ష్మమీశ్వరాశ్రయం తస్యైవోపాధిభూతం సర్వస్మాద్వికారాత్పరో యోఽవికారః తస్మాత్పరతః పర ఇతి భేదేన వ్యపదిశన్పరమాత్మానమిహ వివక్షితం దర్శయతి. నాత్ర ప్రధానం నామ కించిత్స్వతంత్రం తత్త్వమభ్యుపగమ్యతే.

---

దుపనిషద్బోధితమగు పురుషుడే యిచట బేర్కొనబడు చున్నాడు.

ఆ విధముగనే "పరుఁడగు నక్షరునికంటె బరుఁడ"ని యీవాక్యమునందే ప్రకృతమగు భూతయోని ప్రధానము కంటె భిన్నమని చెప్పఁబడుచున్నది. అక్షరమన నవ్యాకృతము, అనఁగా ననాది. నామరూపములకు బీజమగు నీశ్వరుని శక్తిరూపము; భూతముల యొక్క సూక్ష్మములగు సంస్కారముల కది యాఁటపట్టు. చిన్మాత్రస్వరూపమగు నీశ్వరుని యాశ్రయించియున్నది. చిన్మాత్రస్వరూపమగు నీశ్వరునికి నుపాధిభూతమై జీవత్వము గల్పించునది. సమస్తవికారస్వరూపముకంటెను బరమైనది. స్వయముగా వికారములేనిది. అందువలన నది బరముకంటెను బరమైనది. ఈవిధముగ భేదముచే నక్షరాత్పరతః పరమ్మను వాక్యమునందుఁ బరమాత్మయే చెప్పబడుచున్నాడు. ఇచట బ్రధానమను స్వతంత్రమగు నొక వ్యక్తిని మేమంగీకరించుట లేదు. మఱియేమన, బ్రధానమను నది యొకటికలదనియు నది యవ్యాకృతశబ్దముచేఁ జెప్పబడు

భేదవ్యపదేశము.

తస్మాద్భేదవ్యపదేశ ఉచ్యతే. కిం తర్హి ? ప్రధానమపి కల్ప్యమానం శ్రుత్యవిరోధేనావ్యాకృతాదిశబ్దవాచ్యం భూతసూక్ష్మం పరికల్ప్యేత, కల్ప్యతాం! తస్మాద్భేదవ్యపదేశాత్పరమేశ్వరో భూతయోనిరిత్యేతదిహ ప్రతిపాద్యతే. ।

కుతశ్చ పరమేశ్వరో భూతయోనిః ?

## రూపోపన్యాసాచ్చ (సూ. 23)

వృత్తికారః అపి చ 'అక్షరాత్పరతః పర' ఇత్యస్యానంతరం 'ఏతస్మాజ్జాయతే ప్రాణ' ఇతి ప్రాణప్రభృతీనాం పృథివీపర్యంతానాం తత్త్వానాం సర్గముక్త్వా తస్యైవ భూతయోనేస్సర్వవికా

---

చున్నదనియు, భూతసూక్ష్మమను నీ యర్థము శ్రుతి విరుద్ధముగాదని మీరు కల్పించిన కల్పించుదురుగాక! ఆ పక్షము నందుగూడ వీనికన్నిటికంటెను పరమేశ్వరుడు భిన్నుఁడని శ్రుతి చెప్పుచున్నది గనుక పరమేశ్వరుఁడే యిచట భూతయోనిగ జెప్పఁబడుచున్నాఁడని మే ముపపాదించుచు చున్నాము. 22

పరమేశ్వరుఁడే భూతయోనియని మఱియేకారణము చేత చెప్పవచ్చునన !

రూప ఉపన్యాత్ చ = అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ (ముం. 2–1–4) అనువాక్యమునందు రూప ముదాహరింపఁబడుటచేతగూడ జీవప్రధానములు పరమేశ్వరుడు గారు.

[మున్ముం దీ సూత్రమునకు వృత్తికార మతము ననుసరించి భాష్యకారు లిట్లు వ్యాఖ్యానము చేయుచున్నారు.] మఱియుఁ బరుఁడగు నక్షరుని కంటె పరమేశ్వరుడు

రాత్మకం రూపముపన్యస్యమానం పశ్యామః "అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మే"తి (ముం2-1-4-) తచ్చ పరమేశ్వరస్యైవో చితం, సర్వవికారకారణత్వాత్, న శారీరస్య తనుమహిమ్నః, నాపి ప్రధానస్యాయం రూపోపన్యాసస్సంభవతి, సర్వభూతాంత రాత్మత్వాసంభవాత్, తస్మాత్పరమేశ్వర ఏవ భూతయోనిర్నే

---

పరుడని చెప్పినతరువాత, నతనివలనఁ బ్రాణము బుట్టుచున్నది యను మొదలగు వాక్యమునందు ప్రాణము మొదలు పృథివివఱకును గల తత్త్వములన్నిటియొక్కయు సృష్టి పలుకరింపఁబడినది. ఈతని శిరస్సు ద్యులోకము; నేత్రములు సూర్యచంద్రులు; శ్రోత్రములు దిక్కులు; వాగింద్రియవ్యాపారములు వేదములు; దేహధారకమగు ప్రాణము వాయువు; అన్తఃకరణము ప్రపంచము; ఆతని పాదములవలన పృథివి బుట్టుచున్నది; ఈతడు త్రైలోక్యాధిపుడు, అనంతుడు సర్వభూతముల కంతరాత్మయు నగుచున్నాఁడు" అని తరువాత వాక్యము (ముండ 2-1-4) పేర్కొనుచున్నది. ఈవాక్యము పూర్వముదాహరింపఁబడిన భూతయోనియొక్క సర్వవికారస్వరూపమగు రూపమును దెలియఁ జేయుచున్నది.

వృత్తికారమతము.

సర్వవికార కారణమగుటచే నిట్టి రూపము పరమేశ్వరునికే తగును. స్వల్పశక్తిగల జీవునికిగాని, సర్వభూతముల కంతరాత్మయగుటకు వీలులేనందున ప్రధానమునకుగాని యిట్టిరూప మున్నటులఁ జెప్పవీలు లేదు. అందు

తరావితి గమ్యతే. కథం పునర్భూతయోనేరయం రూపోపన్యాస ఇతి గమ్యతే? ప్రకరణాత్, 'ఏష' ఇతి చ ప్రకృతానుకర్షణాత్, భూతయోనిం హి ప్రకృత్య 'ఏతస్మాజ్జాయతే ప్రాణ ఏష సర్వ భూతాంతరాత్మే'త్యాదివచనం భూతయోనివిషయమేవ భవతి. యథోపాధ్యాయం ప్రకృత్య 'ఏతస్మాదధీష్వ ఏష వేదవేదాంత పారగ' ఇతి వచనముపాధ్యాయవిషయం భవతి తద్వత్. కథం పునరదృశ్యత్వాదిగుణకస్య భూతయోనేర్విగ్రహవద్రూపం

---

వలనఁ బరమేశ్వరుఁడే భూతయోని గావలయును. జీవప్రధానములు రెండును గానేరవని తెలియుచున్నది. ఈరూపము భూతయోనికే చెప్పబడినట్లుఁ బ్రకరణబలముచేఁ దెలియుచున్నది. [యత్తదద్రేశ్యం అగ్రాహ్యం'' అని (ముం1-1-6) భూతయోనివివరణముతోఁ బ్రకరణ మారంభమగుచున్నది]. రూపమును దెలియఁజేయుచున్న వాక్యమునం దాభూతయోనియే ఏషః ఇతఁడు అని పరామర్శింపబడుచున్నాఁడు. "ఇతనినుండియే ప్రాణము పుట్టుచున్నది." "ఇతఁడే సర్వభూతాన్తరాత్మ'' యను భూతయోనినిఁ బ్రకృతముగా జేయు నీవచనము భూతయోనినిగురించియె చెప్పును. ఈయనవలన వేదాధ్యయనము చేయుము. ఈయన వేద వేదాంగపారగుఁడు'' అని యుపాధ్యాయుని ప్రకృతముగా జేసికొను వచన ముపాధ్యాయవిషయమే యగును. అదృశ్యత్వాదిగుణములు గలిగియున్న (సూ 1-2-21)ట్లు దాహరింపబడిన భూతయోనికి విగ్రహముగల రూపమెట్లు సంభవించు

సంభవతి ? సర్వాత్మత్వవివక్షయేదముచ్యతే నతు విగ్రహవత్త్వ వివక్షయేత్యదోషః 'అహమన్నమహమన్నమహమన్నం అహమన్నాద' (తై 3-10-6) ఇత్యాదివత్ ।

సిద్ధాంతీ : అన్యేపునర్మన్యంతే-నాయం భూతయోనే రూపోపన్యాసః జాయమానత్వేనోపన్యాసాత్ 'ఏతస్మాజ్జాయతే ప్రాణో

---

నన, భూతయోని యొక్క సర్వాత్మత్వమును వివరించుట కట్లు చెప్పబడెనుగాని యద్దానికి విగ్రహవంతమగు నాకారమున్నదని చెప్పుటకుఁగాదు. అందువలన దోషమేమియు లేదు. [బ్రహ్మవిదుఁడగు నొకానొకఁడు] "నేను అన్నమును, నేను అన్నము దినువాడను" (తై 3-10-6)అని సామగానము చేసినట్లె యిచటనుగూడ దెలియనగును. [అన్నముగాని అన్నము భుజియించువాడుగాని తన స్వరూపమును బ్రకటించుకొనుట కట్లు గానము చేయుటలేదు. అట్లుచేయుటచేఁ బ్రయోజనము లేదు. అట్టిగానముచేఁ దన సర్వాత్మత్వభావమును మాత్రము ప్రకటించుచున్నాడు.]

అ॥ ఇట్లు వృత్తికారమతమును వివరించి నద్దానిఖండన పూర్వకముగ భాష్యకారులు స్వాభిప్రేతమగు నర్థము నిట్లు తెలియఁజేయుచున్నారు.

సిద్ధాంతి : తదితరు లిట్లు తలంచుచున్నారు. "శిరస్సు అగ్ని" యను మొదలగు రూపవర్ణనము భూతయోనికి సంబంధించినదిగాదు. ఆరూపము గలవానినిఁ బుట్టుచున్న వానిగ శ్రుతి యుదాహరించినది. "ఇతనివలన ప్రాణము

మనస్స ర్వేంద్రియాణి చ, ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ'తి హి పూర్వత్ర ప్రాణాదిపృథివ్యంతం తత్త్వజాతం జాయమానత్వేన నిరదిక్షత్. ఉత్తరత్రాపి చ 'తస్మాదగ్నిస్సమిధో యస్య సూర్య' ఇత్యేవమాది, 'అతశ్చ సర్వా ఓషధయో రసాశ్చే' త్యేవమంతం జాయమానత్వేనైవ నిర్దేక్ష్యతి. ఇహైవ కథమక స్మాదంతరాళే భూతయోనే రూపముపన్యసేత్. సర్వాత్మత్వమపి సృష్టిం పరిసమాప్యోపదేక్ష్యతి 'పురుష ఏవేదం విశ్వం కర్మే'

---

మనస్సు సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని జలములు సమస్తమును ధరించు పృథివి, యివి యన్నియు నితనివలనఁ బుట్టుచున్నవి" యని (ముండ 2-1-3) పూర్వవాక్యమునఁ బ్రాణము మొదలు పృథివివరకుఁగల తత్త్వజాతమంతయుఁ బుట్టినట్లుఁ జెప్పబడినది. "సూర్యుఁడు సమిధగానున్న ద్యులోకాగ్ని" మొదలు ( ముండ 2-1-5 ) "సమస్తములగు నోషధులు మధురాది షడ్రసములు" వరకు ( ముండ 2-1-9 ) గల సమస్తతత్త్వ జాతము ఆతనివలననే బుట్టినట్లు తిరువాత వాక్యములు చెప్పు చున్నవి. ఇట్లు భూతయోనివలన నుత్పన్నమగుచున్న ప్రపంచముయొక్క రూపవర్ణన ప్రకరణమునం దాకస్మిక ముగ మధ్యన భూతయోనిస్వరూప మెట్లు చెప్పశక్యము? [ఆవాక్యములన్నియు సృష్టిస్వరూపమును చెప్పుచున్నవిగాని భూతయోనిరూపమును వర్ణించుటలేదు. భూతయోనియొక్క సర్వాత్మత్వమును అగ్నిర్మూర్ధా అనువాక్యమునందు శ్రుతి చెప్పియుండలేదు]. ఈప్రపంచమంతయు పరమపురుషుడే

సిద్ధాంతము.

(ముం2-1-10) త్యాదినా. శ్రుతిస్మృత్యోశ్చ త్రైలోక్యశరీరస్య ప్రజాపతేర్జన్మ నిర్దిశ్యమానముపలభామహే 'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్, స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమే'తి, (ఋసం10-121-1) సమవర్తతేతి అజాయత ఇత్యర్థః. తథా 'స వై శరీరీ ప్రథమస్స వై పురుష ఉచ్యతే. "ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తతే"తి. చ వికారపురుషస్యాపి సర్వభూతాంతరాత్మత్వం సంభ

---

(ముం 2-1-10) యను వాక్యమునందు శ్రుతి సర్వాత్మత్వము నుదాహరించి సృష్టివర్ణనమును సమాప్తము చేయుచున్నది. మూడులోకములు స్వరూపముగాగల హిరణ్యగర్భుని యుత్పత్తి శ్రుతిస్మృతులయందు నిర్దేశింపడి యున్నది. "ప్రప్రథమమున హిరణ్యగర్భుడు బుట్టెను. ఆతడు సమస్తమున కధిపతి. అతడు స్థూలమగు పృథివినంతను ధరించెను. ఆతనికి మనము హవిస్సు నిచ్చెదము" అని ఋక్సంహిత చెప్పుచున్నది. సమవర్తత అను శబ్దమునకు బుట్టెనని యర్థము. 'హిరణ్యగర్భుడు ప్రథమశరీరి; ఆతఁడు బురుషుఁడని పిలువఁబడుచున్నాడు. సర్వభూతములకు నాది సృష్టికర్తయగు బ్రహ్మ మున్ముందుఁ బుట్టెను' అని స్మృతి చెప్పుచున్నది. ఇట్టి పురుషుడు వికారస్వరూపుడు. [ఆదికారణుడు గాడు. పూర్వకల్పమునం దాచరించిన ప్రకృష్టమగు నుపాసనాకర్మసముచ్చయబలముచే నీకల్పమునందు] సర్వభూతాంతరుఁ డగుచున్నాఁడు. ప్రాణస్వరూపముచే నతఁడన్నిభూతములయం దున్నాడు. ఈపక్షమునందు [అగ్ని

వతి, ప్రాణాత్మనా సర్వభూతానామధ్యాత్మమవస్థానాత్. అస్మి న్పక్షే 'పురుష ఏవేదం విశ్వం కర్మే'త్యేవమాదిసర్వరూపో పన్యాసః పరమేశ్వరప్రతిపత్తిహేతురితి వ్యాఖ్యేయమ్. ।

---

ర్మార్థా యనువాక్యము పరమేశ్వరుని సర్వాత్మత్వము చెప్పుట లేదుగనుక నది ప్రకృతసూత్రవిషయము కానే రదు.] 'పురుష ఏవేదం విశ్వం కర్మ' అను వాక్యమునందు సర్వప్రపంచరూపము పేర్కొనబడుచుండుటచే నది పర మేశ్వరుని గ్రహించుటకుఁ గారణమగుచున్నది. [అనగా శ్రౌతస్మార్తాదికము సఫలమునగు సర్వకర్మజాతము తపస్సు గూడ పురుషస్వరూపమని సర్వాత్మత్వ ముపదేశింపఁబడు టచే జ్ఞేయమగు భూతయోనియందు సంపూర్ణమగు సమన్వ యము కుదురుచున్నది యని భావము. స్వపక్షానుసారముగ సూత్రమునకు] ఈవిధముగ వ్యాఖ్యానము చేయఁదగును.

<u>అధికరణ సంక్షేపార్థము</u> : అదృశ్యత్వాది గుణోపేతమగు భూతయోని ప్రధానపరమో జీవపరమో కాఁదగును. అచేతనమగు ప్రధానము భూతయోని కాఁదగుననుట కచేతన ములే దృష్టాంతములుగ నుదాహరింపబడుచున్నవి. అదృశ్య త్వాదిగుణములు ప్రధానమునందు ఘటించుచున్నవి. ప్రధా నము భూతయోని; జగదుపాదానకారణ మగుటచే భూత యోని కాఁదగును. భూతయోనిశబ్దముచేత జగత్తుయొక్క నిమిత్తకారణము చెప్పబడినచో, జీవుఁడు భూతయోని యగుచున్నాడు. భూతజాతకారణములగు ధర్మాధర్మములకు

జీవుఁడు కారణ మగుచున్నాఁడు. ఇది పూర్వపక్షము. ఇందుకు సమాధానము. పరమేశ్వరుఁడు భూతయోని యగుచున్నాఁడు సర్వజ్ఞత్వాది ధర్మములు పరమేశ్వరునియందు సమకూరును గాని ప్రధానమునందుఁ గానేరవు. ఆ సర్వజ్ఞుఁడే యక్షరుఁడగుచున్నాఁడు. సర్వవిజ్ఞానహేతువగు బ్రహ్మజ్ఞాన మిచట నిర్దేశ్యమగుచున్నది. అచేతన జ్ఞానముచేతను జీవజ్ఞానము చేతను, సర్వవిజ్ఞానము సిద్ధింపదు. బ్రహ్మవిద్యచేతనే యక్షరుఁడు తెలియఁబడుచున్నాఁడు. అపరవిద్య బ్రహ్మవిద్యాస్తోత్రపరమగుచున్నది. పరమేశ్వరుడు స్వయంజ్యోతిఃస్వరూపము మొదలగు విశేషణముచే జీవునికంటె భిన్నముగఁ జెప్పఁబడుచున్నాఁడు. అక్షరశబ్దముచే భూతయోని ప్రధానముకంటె భిన్నమని తెలియుచున్నది. సర్వాత్మత్వరూపము నుదాహరించుటచేతఁ బరమేశ్వరుఁడే ప్రస్తుత మగుచున్నాఁడు.

---

## (7) వైశ్వానరాధికరణము (24-32)

---

అ॥ త్రైలోక్యదేహియగు పరమాత్మ స్వరూపము "పురుష ఏవేదం విశ్వం కర్మ" యను వాక్యబలముచే పై సూత్రమునం దుదాహరింపబడినట్లు సిద్ధాంతము చేయబడినది. అచట నుదాహరింపబడిన త్రైలోక్యదేహి వైశ్వానరు డేలకాకూడదని సందేహము రాగా నందులకు సమాధానపూర్వకముగ నీయధికరణ మారంభింపబడుచున్నది.

# వైశ్వానరస్సాధారణశబ్ద విశేషాత్ (సూ. 24)

'కోన అత్మా కిం బ్రహ్మే'తి 'ఆత్మానమేవేమం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహీ'తి (ఛాం5-11-1-6)

---

విషయవాక్యము : యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభి విమానమాత్మానం వైశ్వానరముపాస్తే స సర్వేషులోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వా త్మస్వన్నమత్తి.తస్య......ఆస్యమాహవనీయః [ ఛాం 5-18-1,2. ]

సందేహము : ఇచట వినబడుచున్న వైశ్వానరశబ్దముచే నెవరు బోధింపఁబడుచున్నారు. జాఠరాగ్నియా భూతాగ్నియా, లేక అగ్ని దేవతా? లేక జీవుడా? వీ రెవరుగాక పరమేశ్వరుఁడా?

పూర్వపక్షము : ,జాఠరాగ్ని కావచ్చును. లేక తదితరు లైననుఁ గావచ్చును గాని పరమేశ్వరుఁడు కానేరడు.

సిద్ధాంతము : పరమేశ్వరుడే వైశ్వానరుడు.

అవలోకింపదగిన శ్రుతివాక్యములు —

ఛాం 5-18-2, 5-11-1, 5-9-4, 5-24-3, 5-19-1.

సాధారణశబ్దవిశేషాత్=విషయవాక్యమునందు వినబడు 'ఆత్మ' 'వైశ్వానరుడు' అను సామాన్యశబ్దములమధ్య బ్రహ్మ యను విశేషశబ్దమువలన వైశ్వానరః=అచట వినవచ్చుచున్న వైశ్వానరుడు పరమేశ్వరుడేఁ యగుచున్నాడు.

చోపక్రమ్య ద్యుసూర్యవాయ్వాకాశవారిపృధివీనాం సుతేజస్త్వాది గుణయోగమేకైకోపాసననిందయా చ వైశ్వానరం ప్రత్యేషాం మూర్ధాదిభావముపదిశ్యామ్నాయతే "యస్త్వేతమేవం ప్రాదేశ మాత్రమభివిమాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి తస్య హ వా ఏత

---

"మనయొక్క యాత్మ యన నెవరు? బ్రహ్మమన నెవరు?" (ఛాం. 5-11-1) [ఈవిధముగ ప్రాచీనశాలుడు సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు మొదలగు వారు కలిసి బ్రహ్మవిచారము చేయసాగిరి. ఆవిషయమును దెలిసికొనుట కుద్దాలకునికడ కేగిరిగాని యాయనకుగూడ నీవిషయము తెలియనందున వీరార్వురుగలసి యశ్వపతియను కేకయరాజును సమీపించి] "వైశ్వానరుఁడాత్మయని మీరెఱుంగుదురు ఆవైశ్వానరుని మాకెఱుంగఁజెప్పుడు" [అనివారాయన నడిగిరి. అందుమీద కేకయ మహారాజు ద్యులోకము ఆదిత్యుడు వాయువు ఆకాశము జలములు పృథివి యనువానిని క్రమముగా వైశ్వానరునిగా నీయార్వురు దెలిసికొని యుపాసించుచున్నట్లుగ్రహించి] ద్యులోకము, సూర్యుడు, వాయువు, ఆకాశము, జలము పృథివి మొదలగునవి సుతేజస్త్వము, విశ్వరూపము, పృథగ్వర్త్మత్వము, బహులాత్మత్వము, ధనత్వము,ప్రతిష్ఠాత్వము అనుగుణములను వరుసగా బ్రత్యేక ప్రత్యేకముగా గలిగియున్నట్లు వీరలు చేయువైశ్వానరైకైకోపాసనమును ప్రకరణారంభమునందు నిందించి వైశ్వానరునికి ద్యులోకము శిరస్సు, సూర్యుడు చక్షుస్సు, వాయువు

స్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహుళో వస్తిరేవ రయిః పృథివ్యేవ పాదావుర ఏవ వేదిర్లోమాని బర్హిర్హృదయం గార్హపత్యో మనోऽన్వాహార్యపచన ఆస్యమాహవనీయ" (ఛాం 5-18-2) ఇత్యాది.।

---

ప్రాణము, ఆకాశము శరీరమధ్యప్రదేశము, జలము మూత్రసంగ్రహస్థానము, పృథివి పాదములు నగుచున్నవియని యశ్వపతి వారల కుపదేశించెను. అటుపిమ్మట అపరోక్షముగ సమస్తప్రపంచమును దెలిసికొను అనగా సర్వజ్ఞుండైన వైశ్వానరాత్మనిట్లు జానెడుప్రదేశము అనగా నల్పప్రదేశముగలిగిన వానివలె నెవ డుపాసించునో యాతడు సర్వలోకములయందు, సర్వశరీరములయందు, సర్వజీవులయందు నన్నము దినును, ఆవైశ్వానరాత్మకు శిరస్సు సుతేజస్సు, చక్షుస్సు విశ్వరూపుడగు సూర్యుడు, ప్రాణము నానావిధగమనస్వభావముగల యాకాశము, మూత్రస్థానము ధనగుణముగల జలములు, పాదములు ప్రతిష్ఠాత్వగుణముగల పృథివి, [ఇంతవరకువైశ్వానరశరీరమువివరింపబడినది. ఇకనతఁడు సమస్తహోమముల కాధారుఁడని చూపబడుచున్నది.] అతని వక్షఃస్థలము వేదిక, లోమములు దర్భలు హృదయము గార్హపత్యాగ్ని, మనస్సు అన్వాహార్యపచనాగ్ని, ముఖ మాహవనీయాగ్నియని తెలియ చెప్పెను. ఈవిధముగ వైశ్వానరుఁడు ఛాందోగ్యమున (5-18-2) వివరింపఁబడెను.

తత్రి సంశయః. కిం వైశ్వానరశబ్దేన జాఠరోఽగ్నిరుపదిశ్యతే? ఉత భూతాగ్నిః అథ తదభిమానినీ దేవతా అథవా శారీర ఆహోస్విత్పరమేశ్వర ఇతి. కిం పునరత్ర సంశయకారణం? వైశ్వానర ఇతి జాఠరభూతాగ్నిదేవతానాం సాధారణశబ్దప్రయోగాదాత్మేతి చ శారీరపరమేశ్వరయోః. తత్రి కస్యోపాదానం న్యాయ్యం కస్య వా హానమితి భవతి సంశయః. ।

పూ.పక్షి: కిం తావత్ప్రాప్తం, జాఠరోఽగ్నిరితికుతః? తత్రి హి విశేషేణ క్వచిత్ప్రియోగో దృశ్యతే–'అయమగ్నిర్వైశ్వానరో యోఽయమంతఃపురుషే యేనేదమన్నం పచ్యతే యదిద

ఇచట వైశ్వానరశబ్దముచేత జఠరమునందుండు అగ్నియుపదేశింపబడుచున్నదా లేక పంచభూతములలో నొకటియగు నగ్నియా లేక యగ్నికభిమానదేవతయా లేక జీవుఁడా, లేకపరమేశ్వరుఁడా? ఇట్టిసంశయము గలుగుటకు

సందేహము

గారణమేమి? వైశ్వానరశబ్దము జాఠరాగ్నిభూతాగ్ని, తదభిమానదేవతల పరముగ సాధారణముగ నుపయోగింపఁబడుచున్నది. ఆత్మశబ్దము జీవపరమాత్మలయందు వాడఁబడుచున్నది. ఈఅర్థములలో దేని గ్రహించుట న్యాయము, ఏది పరిహరింపఁదగును? అని సంశయము

పూర్వపక్షి: ఇపు డేమి సంప్రాప్తిమైనదనిన, వైశ్వానరశబ్దము జాఠరాగ్నిని జెప్పుచున్నది. ఏలనన! ఈ విశేషార్థమున నీపద మచ్చటచ్చట వాడఁబడుచున్నది. "పురుషుని లోపలనున్న యాయగ్ని వైశ్వానరుడుఅతనిచే మనము తిను నన్నము పచనము చేయఁబడుచున్నది.

మద్యత' (బృ 5-9) ఇత్యాదౌ. అగ్నిమాత్రం వా స్యాత్తత్సా మాన్యేనాపి ప్రయోగదర్శనాత్ 'విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతుమహ్నామకృణ్వ'న్ని (ఋసం 10-88-12) త్యాదౌ. అగ్నిశరీరావా దేవతా స్యాత్తస్యామపి ప్రయోగదర్శనాత్ 'వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీ' (ఋసం 1-88-1) రిత్యేవమాద్యాయాశ్శ్రుతేర్దేవతాయామైశ్వర్యాద్యుపేతాయాం సంభవాత్. అథాత్మశబ్దసామానాధికరణ్యాదుపక్రమే చ 'కోన ఆత్మా కిం బ్రహ్మే' తి కేవలాత్మశబ్దప్రయోగాత్మశబ్దవశేన వైశ్వానరశబ్దం పరిణేయ ఇత్యుచ్యతే. తథాపి శారీర

---

యని ( బృహ. 5-9 ) శ్రుతి గలదు. లేక కేవలాగ్నికూడ గావచ్చును. "దేవతలు సమస్తప్రపంచమునకు నగ్నిని దినములకు చిహ్నమగు సూర్యునిగ జేసిరి" యనిఋగ్వేదసంహిత పలుకుచున్నది. అగ్నియె శరీరముగాగల దేవతయుఁ గావచ్చును. అట్టి ప్రయోగము. కాన్పించుచున్నది. "మేము వైశ్వానరునికి సుముఖుల మగుదుముగాక ! అతఁడు సుఖప్రదుడగు రాజు. అతఁడు (శ్రీ) యభిముఖముగా గలవాడు అనగా నీశ్వరుడు." (ఋ.సం. 1-98-1) అను నీ మొదలగుఋక్కులలో నైశ్వర్యసంపన్నయగు దేవత నాపదము తెలియజేయుచున్నది. మఱియు, నాత్మబ్రహ్మశబ్దములకు సామానాధికరణ్యము చెప్పుటచేతను, "మన ఆత్మ యెవరు? బ్రహ్మ మన నెవరు? అనువాక్యమునందు కేవల మాత్మపద ముపయోగింపఁబడుట వలనను, ఆత్మశబ్దార్థమున కనుకూలముగ వైశ్వానరశబ్దమున కర్థనిర్వచనము చేయవలసివచ్చినను, జీవుఁడే యాత్మశబ్ద

ఆత్మా స్యాత్తస్య భోక్తృత్వేన వైశ్వానరసన్నికర్షాత్, ప్రాదేశ మాత్రమితి చ విశేషణస్య తస్మిన్నుపాధిపరిచ్ఛిన్నే సంభవాత్. తస్మాన్నేశ్వరో వైశ్వానర ఇత్యేవం ప్రాప్తం.।

సిద్ధాంతీ: తతేదముచ్యతే—వైశ్వానరః పరమాత్మా భవితు మర్హతి. కుతః? సాధారణశబ్దవిశేషాత్. సాధారణశబ్దయోర్విశేషః సాధారణశబ్దవిశేషః. యద్యప్యేతావుభావప్యాత్మవైశ్వానరశబ్దౌ సాధారణశబ్దౌ, వైశ్వానరశబ్దస్తు త్రయాణాం సాధారణః, ఆత్మశబ్దశ్చ ద్వయోః, తథాపి విశేషో దృశ్యతే యేన పరమేశ్వర పరత్వం తయోరవగమ్యతే 'తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజా' ఇత్యాది. అత్ర హి పరమేశ్వర ఏవ

---

బోధితుఁడగును. జీవుడు భోక్తయగుటచే వైశ్వానరునికి సన్నికృష్టముగ నుండినవాఁడగుచున్నాఁడు. [విషయవాక్యమునందుదాహరింపబడిన] ప్రాదేశమాత్రమను విశేషణ ముపాధిచే పరిచ్ఛిన్నుఁడగు జీవునియందు వర్తించును. అందువలన నీ వైశ్వానరుఁ డీశ్వరుఁడు గానేరఁడు.

ప్రాకృతములగు వైశ్వానరలక్షణములు అన్నియు బ్రహ్మలింగములు

సిద్ధాంతి: ఇట్లు పూర్వపక్షము రాగా సమాధానము చెప్పుచున్నాము. వైశ్వానరుడు పరమాత్మ యగును. ఏలనన! సాధారణశబ్దముల మధ్యనున్న విశేషశబ్దమువలన! ఆత్మ వైశ్వానరశబ్దములు సాధారణములు. వైశ్వానరశబ్దము మూఁడింటియందు వర్తించుచున్నది. ఆత్మశబ్దము రెండింటియందు వర్తించుచున్నది. అయినను విశేషము కాన్పించుచున్నది.

ద్యుమూర్ధత్వాదివిశిష్టోఽవస్థాంతరగతః ప్రత్యగాత్మత్వేనోపన్యస్త ఆధ్యానాయేతి గమ్యతే కారణత్వాత్. కారణస్య హి సర్వాభిః కార్యగతాభిరవస్థాభిరవస్థావత్త్వాత్ ద్యులోకాద్యవయవత్వముపపద్యతే. 'స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తీ'తి చ సర్వలోకాద్యాశ్రియం ఫలం శ్రూయమాణం పరమకారణపరిగ్రహే సంభవతి. 'ఏవగ్ం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంత' (ఛాం 5-24-3) ఇతి చ తద్విదస్సర్వపాప్మప్రదాహశ్రవణం. 'కో న ఆత్మా కిం బ్రహ్మే'తి

---

ఈవిశేషముచే నాత్మవైశ్వానరశబ్దములు పరమేశ్వరపరములని నిశ్చయింపఁదగును. "ఆత్మయగు నీవైశ్వానరునియొక్క శిరస్సు సుతేజఃస్వరూపుడగు సూర్యుడు" అనువాక్యమునందు, పరమేశ్వరుడు ద్యులోకము శరీరముగా గలవాడనియు, త్రైలోక్యాత్మస్వరూపమగు మఱియొక యవస్థను బొందినవాఁడనియు, ధ్యానమునిమిత్తము ప్రత్యగాత్మగా జెప్పఁబడినాఁడనియు దెలియుచున్నది. ఈశ్వరుఁడు సర్వప్రపంచమున కుపాదానకారణమగుటవలన నిట్లు జెప్పఁబడుచున్నాడు. కార్యగతములగు నవస్థలన్నియు గారణమునం దిమిడియున్నవిగనుక, కార్యములగు ద్యులోకాదులన్నియు కారణమగు పరమేశ్వరుని అవయవములని చెప్పుట సమంజసమేయగును. అతఁడు సర్వలోకములయందు, సర్వశరీరములయందు, సర్వజీవులయందు, నన్నమును దినునని శ్రుతిచే జెప్పఁబడిన సర్వలోకాద్యాశ్రియాదిఫలముగూడ వైశ్వానరుఁడు పరమకారణుఁడయినపుడే సంభవించును. "ఈవిధముగ నితని సమస్తపాపములు

చాత్మశబ్దబ్రహ్మశబ్దాభ్యాముపక్రమ ఇత్యేవమంతాని లింగాని పరమేశ్వరమేవ గమయంతి. తస్మాత్పరమేశ్వర ఏవ వైశ్వానరః।

## స్మర్యమాణమనుమానం స్యాదితి (సూ. 25)

ఇతశ్చ పరమేశ్వర ఏవ వైశ్వానరః, యస్మాత్పరమేశ్వరస్యైవ అగ్నిరాస్యం ద్యౌర్మూర్ధేతీదృశం త్రైలోక్యాత్మకం రూపం స్మర్యతే "యస్యాగ్ని రాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చ

---

దహింపఁబడుచున్నవి" (ఛాం వ 24-3) అను శ్రుతివాక్యమునందు వినబడుచున్న వైశ్వానరుఁడు పరమేశ్వరుడని తెలిసికొనినవాని సమస్తపాపదహనముగూడ నిజ్జై సంభవించును. "మన ఆత్మయన నెవరు? బ్రహ్మమన నెవరు?" అని ప్రకరణమారంభమగుచున్నది. ఇవి యన్నియును బ్రహ్మలింగములై వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడే యని తెలియవచ్చుచున్నది. అందువలన వైశ్వానరుడు పరమేశ్వరుఁడే యగుచున్నాడు. 24

అ॥ శ్రుతిబోధితమైన యీయర్థము స్మృతులవలనగూడ నూహింపవచ్చునని తరువాతసూత్రము చెప్పుచున్నది.

స్మర్యమాణం = విష్ణుపురాణాది స్మృతులయందు తెలియవచ్చుచున్న రూపము మూలభూతమగు శ్రుతిని జ్ఞాపకముచేయుచు వైశ్వానరశబ్దము పరమేశ్వరునికి అనుమానం స్యాత్ = సూచకమగుచున్నది.

ఈ కారణముచేతగూడ వైశ్వానరుఁడు పరమేశ్వరుడే యగుచున్నాడు. "ఎవని ముఖము అగ్నియో శిరస్సు ద్యులో

రణౌ క్షితిః, సూర్యశ్చక్షు ర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమ" ఇతి విష్ణుపురాణే. తత్స్మర్యమాణం రూపం మూలభూతాం శ్రుతి మనుమాపయదస్య వైశ్వానరశబ్దస్య పరమేశ్వరపరత్వేనాను మానం లింగం గమకం స్యాదిత్యర్థః. ఇతి శబ్దో హేత్వర్థే. యస్మా దిదం గమకం తస్మాదపి వైశ్వానరః పరమాత్మైవేత్యర్థః. ।

యద్యపి స్తుతిరియం 'తస్మై' లోకాత్మనే నమ ఇతి తథాపి స్తుతిత్వమపి నాసతి మూలభూతే వేదవాక్యే సమ్యగీదృశేన రూపేణ సంభవతి. "ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి ఖం వై నాభిం చంద్రసూర్యౌ చ నేత్రే, దిశః శ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సోఽచింత్యాత్మా సర్వభూతప్రణేతే" త్యేవం జాతీయకా చ స్మృతి రిహోదాహర్తవ్యా. ।

---

వైశ్వానరుడు పరమేశ్వరుడని స్మృతులు సూచించుచున్నవి.

కమో, నాభిప్రదేశ మాకాశమో చరణములు పృథివియో, చక్షుస్సు సూర్యుడో, శ్రోత్రము దిక్కులో, యట్టి లోకాత్మకునికి నమస్కారము" అను విష్ణుపురాణవాక్యమునందు పరమేశ్వరునియొక్క ముఖమగ్ని, శిరస్సు ద్యులోకము మొదలగు త్రైలోక్యాత్మకమగు రూపము స్మరియింపఁబడుచున్నది. ఇట్లు స్మృతిబోధితమగు రూపము మూలభూతమగు శ్రుతి నాధారముచేసికొని యున్నట్లూహింపఁదగినదై వైశ్వానరశబ్దము పరమేశ్వరపర మని యూహించుటకుఁ దగిన లింగమగుచున్నది. సూత్రము నందలి "ఇతి" శబ్దమునకుఁ గారణమర్థము. ఈస్మృతివాక్యము ప్రకృతార్థమును స్ఫురింపచేయుటవలన వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడని యర్థమగుచున్నది.

## శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న తథా దృష్ట్యుపదేశాదసంభవా త్పురుషమపి చైనమధీయతే (సూ. 26)

ఈ స్మృతివాక్యము కేవల స్తుతిపరమని ' అట్టి లోకాత్మకునకు నమస్కారముల 'ను శబ్దములవలన దెలియుచున్నది. [స్తుతివాక్యములకు శ్రుతి యాధార మవసరము లేదు] అని యంటిరేని, మూలభూతమగు నేదియో యొక వేదవాక్య మాధారము లేక నీ విధమగు సంపూర్ణ రూపవర్ణనము సంభవము గాదు. "ఎవని శిరస్సు ద్యులోకమనియు, నాభి ఆకాశమనియు, నేత్రములు చంద్రసూర్యులనియు, శ్రోత్రము దిక్కులనియు, పాదములు భూమియనియు, పెద్దలు చెప్పుచున్నారో యట్టి యచింత్యరూపుఁ డగువాఁడు సర్వభూతములకుఁ బ్రభువగుచున్నాఁడు." అని పలుకు మఱియొకశ్రుతిని గూడ నిచట నుదాహరింపఁ దగును. 25

అ॥ ఇట్లు నిశ్చయము చేయఁబడిన సిద్ధాంతమునకు వాజసనేయవాక్యము నాధారము చేసికొని మఱియొకవిధముగ వచ్చిన యాక్షేపణ నుదాహరించి యందుకు సమాధానమును రాఁబోవు సూత్రము చెప్పుచున్నది.

శబ్ద ఆదిభ్యః = వైశ్వానరుఁడు, అగ్ని, హృదయము, గార్హపత్యము మొదలగు శబ్దములవలన అంతఃప్రతిష్ఠా

పూ.పక్షీ: అత్రాహ—న పరమేశ్వరో వైశ్వానరో భవితుమర్హతి. కుతః? శబ్దాదిభ్యోఽంతఃప్రతిష్ఠానాత్. చశబ్దస్తావద్వైశ్వానరశబ్దో న పరమేశ్వరే సంభవతి, అర్థాంతరే రూఢత్వాత్. తథాగ్నిశబ్దః 'స ఏషోఽగ్నిర్వైశ్వానర' ఇతి. ఆదిశబ్దాద్హృద

---

నాత్ = జఠరప్రదేశమువలనను, చ = వైశ్వానరుడు పరమేశ్వరుడు న ఇతి చేత్ = కాఁడంటివేని న = అది సరి కాదు. ఏలనన! తథా = ఆవిధముగ దృష్టి ఉపదేశాత్ = ధ్యానముపదేశింపఁబడుటచేతను అసంభవాత్ = కేవల జాఠరాగ్నికి ద్యుమూర్ధత్వాదులు సంభవము కావుగనుకను ఏనం = ఈవైశ్వానరుని పురుషం = పురుషునిగ, వాజసనేయులు, అధీయతే = పలుకుచున్నారుగనుకను, జాఠరాగ్నికి, శిరస్సు ద్యులోకముగానుండుట మొదలగు నవయవ సంపత్తి యసంభవమగుటచేతను, వైశ్వానరుఁడు పురుషుఁడని వాజసనేయులు పఠించుటచేతను, జాఠరాగ్ని వైశ్వానరుఁడన వీలులేదు.

పూ.పక్షి: ఇట్లు నిశ్చయింపబడిన సిద్ధాంతమును పూర్వవాదు లీవిధముగ నాక్షేపించుచున్నారు. వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడు కాఁదగఁడు. ఎలనన? శబ్దాదులవలనను, శరీరమునందు ప్రవేశించియుండుటచేతను. శబ్దమనగా వైశ్వానరశబ్దము. అయ్యది పరమేశ్వరునియందు సంభవింపదు. (1) ఆ పదము మఱియొక యర్థమున రూఢముగ నున్నది.'ఆఁయాతడు వైశ్వానరాగ్ని యగుచున్నాఁడు' అనువాక్యమునందు, అగ్ని శబ్దముగూడ నట్లె రూఢ్యర్థమున వాడఁబడుచున్నది. అగ్ని

యం గార్హపత్య (ఛాం5-15-2) ఇత్యాద్యగ్నిత్రేతాకల్పనం. 'తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయ' (ఛాం5-19-1) మిత్యాదినా చ ప్రాణాహుత్యధికరణతాసంకీర్తనం. ఏతేభ్యో హేతుభ్యో జాఠరో వైశ్వానరః ప్రత్యేతవ్యః. తథాంతఃప్రతిష్ఠానమపి శ్రూయతే—'పురుషేఽంతఃప్రతిష్ఠితం వేద' ఇతి. తచ్చ జాఠరే సంభవతి. యదప్యుక్తం 'మూర్ధైవ సుతేజా' ఇత్యాదేర్విశేషాత్కారణాత్పరమాత్మా వైశ్వానర ఇతి, అత్ర బ్రూమః. కుతోఽస్త్వేష

---

యనుశబ్దమువలన "వైశ్వానరుని హృదయము గార్హపత్యాగ్ని మొదలగు త్రేతాగ్నులు సూచింపఁబడినట్లు గ్రహింపనగును. (2) "ప్రథమమున వేసికొనబడు ప్రాణాహుతుల యన్నము హోమద్రవ్య మగుచున్నది"(ఛాం5-19-1) యనువాక్యమునందు వైశ్వానరుఁడు ప్రాణాహుతిస్థానమైనట్లు తెలియుచున్నది. ఈ కారణములవలన వైశ్వానరశబ్దము జాఠరాగ్నినిఁ జెప్పుచున్నదియని తెలిసికొనఁదగును."వైశ్వానరుఁడు పురుషునిలోపలఁ బ్రతిష్ఠితమైనవానినిగాఁ దెలిసికొనుము" అనుశ్రుతియందు వైశ్వానరునియొక్క పురుష శరీరాన్తఃప్రతిష్ఠితత్వము గూడ వినఁబడుచున్నది. అంతః ప్రతిష్ఠితత్వము జాఠరాగ్నియందు సంభవించును. 'అతని శిరస్సు' అను మొదలగు విశేషకారణములచేత వైశ్వానరుడు పరమాత్మ యగుచున్నాడు అను వాదమున కిట్లు సమాధానము చెప్పుచున్నాము. ఈ విశేషకారణము లుభయ వాదములయందును సమానము [ఆకాశము శిరస్సను విశేషణ మీశ్వరునియందెట్లు సమన్వయమగునో అట్లే సర్వ

నిర్ణయో యదుభయథాపి విశేష ప్రతిభానే సతి; పరమేశ్వర విషయ ఏవ విశేష ఆశ్రియణీయో న జాఠర విషయ ఇతి అథవా భూతాగ్నేరంతర్బహిశ్చావతిష్ఠమానస్యైష నిర్దేశో భవిష్యతి. తస్యాపి హి ద్యులోకాదిసంబంధో మంత్రవర్ణేఽవగమ్యతే 'యో భానునా పృథివీం ద్యాముతేమామాతతాన రోదసీ అంతరిక్ష' (ఋసం10-88-3) మిత్యాదౌ. అథవా తచ్ఛరీరాయా దేవతాయా ఐశ్వర్యయోగాద్ద్యులోకాద్యవయవత్వం భవిష్యతి. తస్మాన్న పరమేశ్వరో వైశ్వానర ఇతి. ।

---

హోమముల కాధారమగుటవలన వైశ్వానరునియందు గూడ సమన్వయమగుచున్నది. ఆపక్షమున నీవిశేషణము] పరమేశ్వరుని పరముగనే గ్రహించవలెనుగాని జాఠరాగ్నిపరముగ గూడదని మీరేల నిర్ణయించవలెను? లేదా (3) ప్రకృత విషయవాక్యము బాహ్యాభ్యంతరముల నున్నట్టి భూతాగ్నిని నిర్దేశించుచున్నట్లు తలంచవచ్చును. "ఏ యగ్ని సూర్యరూపమున పృథివిని ద్యులోకమును వానిమధ్యను వ్యాపించి యున్నవాడో" అను మొదలగు వాక్యములయం దగ్ని యొక్క ద్యులోకాదిసంబంధము దెలియుచున్నది. (4) లేదా అగ్నియె శరీరముగాగల యభిమానదేవత యైశ్వర్యవంతమగుటవలన ద్యులోకాదు లద్దాని యవయవములు కావచ్చును. అందువలన వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు.

సిద్ధాంతీ: అత్రోచ్యతే. న తథా దృష్ట్యుపదేశాదితి. న శబ్దాదిభ్యః కారణేభ్యః పరమేశ్వరస్య ప్రత్యాఖ్యానం యుక్తం. కుతః? తథా జాఠరపరిత్యాగేన దృష్ట్యుపదేశాత్. పరమేశ్వరదృష్టిర్హి జాఠరే వైశ్వానర ఇహోపదిశ్యతే — 'మనో బ్రహ్మేత్యుపాసీతే' (ఛాం 3-18-1) త్యాదివత్, అథవా జాఠరవైశ్వానరోపాధిః పరమేశ్వర ఇహ ద్రష్టవ్యత్వేనోపదిశ్యతే — 'మనోమయః

---

సిద్ధాంతి: ఇందుకిట్లు చెప్పుచున్నాము. ఆవిధముగ దృష్టిని నిలుపవలసినదిగా నుపదేశింపబడుచున్నందున మీ వాదము సరికాదు. మీరు చెప్పు శబ్దాదికారణములచేత వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడు గానేరడని నిరసించుట యుక్తముగాదు. ఏలన! (2) జాఠ

వైశ్వానరశబ్దము కేవల జాఠరాగ్ని పరము కాదు.

రాగ్నినిఁ బరిత్యజింపకుండ ఆ రూపమున బ్రహ్మమునందు దృష్టిని నిలుపునట్లుపదేశింపఁబడినదిగనుక జాఠరుడగు వైశ్వానరునియందు "మనస్సు బ్రహ్మముగ నుపాసించవలయును (ఛాం 3-18-1) అనుస్థలమునవలెనే పరమేశ్వరదృష్టి యుపదేశింపఁబడుచున్నది. [ఉపాసనలయందు నికృష్టవస్తువునం దుత్కృష్టవస్తుదృష్టిని నిల్పి ధ్యానముచేయుట సంప్రదాయ సిద్ధము. సాలగ్రామమందు విష్ణుస్వరూపమును భావించి ధ్యానము చేయుట శాస్త్రమునం దుపదేశింపబడుచున్నది. ఇట్టి నికృష్టవస్తువు ప్రతీక యనబడును.] లేక జాఠరమగు వైశ్వానరు డుపాధిగాగల పరమేశ్వరుడిచట నుపాస్యుడుగ నుపదేశింపబడు చున్నాడు. 'ఆతడు మనోమయుడు, ప్రాణమతని శరీరము,

ప్రాణశరీరో భారూప' (ఛాం 3-14-2) ఇత్యాదివత్. యది చేహ పరమేశ్వరో న వివక్ష్యేత, కేవల ఏవ జాఠరోఽగ్నిర్వివక్ష్యేత, తతః 'మూర్ధైవ సుతేజా' ఇత్యాదేర్విశేషస్యాసంభవ ఏవ స్యాత్. యథాతు దేవతాభూతాగ్నివ్యపాశ్రయేఽప్యయం విశేష ఉపపాదయితుం న శక్యతే తథోత్తరసూత్రే వక్ష్యామః. యది చ కేవల ఏవ జాఠరో వివక్ష్యేత పురుషేఽన్తఃప్రతిష్ఠితత్వం కేవలం తస్య స్యాన్నతు పురుషత్వం, పురుషమపి చైనమధీయతే వాజసనేయినః—"స ఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషస్సయో హైతమే

---

ప్రకాశ మతని స్వరూపము' (ఛాం 3-14-2) అను శ్రుతి వాక్యము పరిచ్ఛిన్నమగు పరమేశ్వరోపాసనము నుపదేశించుచున్నది. [పరమేశ్వరుడు సర్వవ్యాపి యయినను ఉపాసనాసౌకర్యముకొఱకు పరిచ్ఛిన్నభావమున నిర్దేశింపబడుచున్నాడు. ప్రతీకోపాసనమునం దుపాస్యవస్తువు గౌణముగ భావింపఁబడుచున్నది. ఉపాధిపరిచ్ఛిన్నోపాసనమునందు కేవల ముపాస్యవస్తువే దృష్టివిషయమగుచున్నది]. ఇచటఁ బరమేశ్వరునిఁ జెప్పక కేవలమగు జాఠరాగ్ని నే చెప్పఁదలఁచిన యెడల శిరస్సు సుతేజోవంతము అను మొదలగు విశేషోక్తి యసంగతమగును. (4) వైశ్వానరశబ్దము అభిమానదేవతాపరముగను, పంచభూతములలో జేరిన యగ్నిపరముగను, గ్రహించినపుడుగూడ నీవిశేషోక్తి యెట్లు వర్తింపదో ఆ విషయము రాఁబోవు సూత్రమున వివరించెదము. వైశ్వానరశబ్దముచేఁ గేవలజాఠరాగ్నియె చెప్పబడినచో, నతనికి పురుషునిలోపల ప్రవేశము మాత్రము

వాగ్నిం వైశ్వానరం పురుషం పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితత్వం చోభయమప్యుపపద్యతే. యేతు 'పురుషవిధమపి చైనమధీయత' ఇతి సూత్రావయవం పఠంతి తేషామేషోఽర్థః — కేవలజాఠరపరిగ్రహే పురుషేఽన్తఃప్రతిష్ఠితత్వం కేవలం స్యాత్, న తు పురుషవిధమపి చైనమధీయతే వాజసనేయినః పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేదేతి. పురుషవిధత్వం చ ప్రకరణాత్. యదధిదైవతం ద్యుమూర్ధత్వాదిపృథివీ ప్రతిష్ఠితత్వాంతం, యచ్చాధ్యాత్మం ప్రసిద్ధం మూర్ధత్వాదిచుబుకప్రతిష్ఠితత్వాంతం, తత్పరిగృహ్యతే.

---

సంభవించునుగాని పురుషత్వము సంభవముగాదు. "ఈవైశ్వానరాగ్ని పురుషుడు, అతఁడు పురుషాకారము గలవాఁడనియు, పురుషునిలోపల ప్రవేశించినాఁడనియు దెలిసికొనినవాఁడు" అని శతపథబ్రాహ్మణమునం దతఁడు పురుషుఁడని ఉదాహరింపబడినది. పరమేశ్వరుఁడు సర్వాత్ముఁడు గనుక నతనికి పురుషాకారము, పురుషునియందు ప్రవేశముగూడ సంభవించును. సూత్రమునందలి 'పురుషమపి చైనమధీయతే' యనుపదములకు బదులు "పురుషవిధమపి చైనమధీయతే" యని పాఠాంతరము నాశ్రయించువారి భావమిదిగ గాన్పించుచున్నది. కేవలజాఠరాగ్నిని గ్రహించినచో, నంతఃప్రవేశము సంభవించునుగాని పురుషవిధత్వము సంభవముకాదు. కాని యతఁడు పురుషవిధము గలవాడు, అంతఃప్రవిష్టుడును అగుచున్నాఁడు" అని వాజసనేయులు పురుషవిధత్వమునుగూడ పఠించుచున్నారు. ప్రకరణసందర్భముచే పురుషవిధత్వశబ్దమున

## అత ఏవ న దేవతా భూతం చ (సూ. 27)

యత్పునరుక్తం భూతాగ్నేరపి మంత్రవర్ణే ద్యులోకాది సంబంధదర్శనాన్మూర్ధైవ సుతేజా ఇత్యాద్యవయవకల్పనం తస్యైవ భవిష్యతీతి తచ్ఛరీరాయా దేవతాయా ఐశ్వర్యయోగాదితి తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే.—అత ఏవోక్తేభ్యో హేతుభ్యో న దేవతా

---

కర్థకల్పనము చేయవలయును. ద్యులోకము శిరస్సు మొదలు పృథివి పాదములు అనువఱకునుగల రూపము ఆధిదైవతముగు విరాడ్దేహాకారము, శిరస్సు మొదలు ఉపాసకుని చుబుకము వఱకుగల యాకారము పురుషాకారమనియు గ్రహింపవలయును. 26

అ॥ వైశ్వానరశబ్దము జాఠరాగ్నిపరము గాదనిచూపి దేవతాపరము భూతపరము గూడ కానేరదని రాఁబోవు సూత్రమున నిరాకరింపఁబడుచున్నది.

అతఃఏవ = ఈకారణములచేతనే వైశ్వానరశబ్దము దేవతా=దేవతాపరము గాని భూతంచ=పంచభూతములలో నొకదానిపరము గాని న = కానేరదు.

వైశ్వానరశబ్దము దేవతాపరము కాదు.

పంచభూతములలో జేరిన అగ్ని ద్యులోకాదులతో సంబంధియున్నట్లు మంత్రములలో గాన్పించుటచేత శిరస్సు సుతేజోవంతము అను మొదలగు నవయవకల్పనము భూతాగ్నినిగూర్చి చెప్పినట్లగుచున్నది లేక. ఐశ్వర్యసహితముగ నుదాహరింపబడుటవలన వైశ్వానరుడు శరీరముగాగల

వైశ్వానరః, తథా భూతాగ్నిరపి న వైశ్వానరః. న హి భూతాగ్నేరౌష్ణ్యప్రకాశమాత్రాత్మకస్య ద్యుమూర్ధత్వాదికల్పనోపపద్యతే, వికారాన్తరాత్మత్వాసంభవాత్. తథా దేవతాయాస్సత్యప్యైశ్వర్యయోగే న ద్యుమూర్ధత్వాదికల్పనా సంభవతి, అకారణత్వాత్పరమేశ్వరాధీనైశ్వర్యత్వాచ్చ. ఆత్మశబ్దాసంభవశ్చ సర్వేషు పక్షేషు స్థిత ఏవ.

---

దేవతయయినను ప్రకృతమగుచున్నది. ఇట్లు పూర్వపక్షులు చేయుచున్న వాదమును పరిహరింపవలసియున్నది. ఈసందర్భమున నిట్లు వచియించుచున్నాము ఇంతకుపూర్వముదాహరించిన [అనగా ద్యులోకము శిరస్సుగా కలిగియుండుట, సర్వలోకఫలభాక్త్వము సర్వపాపనాశకత్వము మొదలగు] కారణములవలన వైశ్వానరుడు దేవతాస్వరూపము కానేరదు. అదేవిధముగ భూతాగ్నిగూడ వైశ్వానరుడు గానేరదు. భూతాగ్నికి నుష్ణత్వము ప్రకాశముమాత్రము గలవు. అట్టివానికి ద్యులోకము శిరస్సు అను మొదలగు నవయవకల్పన ముపపన్నముకాదు. భూతాగ్ని భూతాకాశమువాయువులవలన బుట్టిన వికారస్వరూపము. అట్టివికారము మఱియొక వికారవస్తువునకు స్వరూపము కానేరదు. దేవత అయినను, ఐశ్వర్యముండవచ్చునుగాని ద్యుమూర్ధత్వాదు లుండనేరవు, దేవతగూడ కారణముకాదు. కార్యము మాత్రమగుచున్నది. ఆదేవతయొక్క ఐశ్వర్యము పరమేశ్వరాధీనము. ఆత్మశబ్దము వీనియందు వర్తింపనేరదు. ఈయాక్షేపణ మీమూడుపక్షములకును సమానమగుచున్నది.

## సాక్షాదప్యవిరోధం జైమినిః (సూ. 28)

పూర్వం జాఠరాగ్నిప్రతీకో జాఠరాగ్న్యుపాధికో వా పరమేశ్వర ఉపాస్య ఇత్యుక్తమంతఃప్రతిష్ఠితత్వాద్యనురోధేన. ఇదానీం తు వినైవ ప్రతీకోపాధికల్పనాభ్యాం సాక్షాదపి పరమేశ్వరోపాసనపరిగ్రహే న కశ్చిద్విరోధ ఇతి జైమినిరాచార్యో మన్యతే. ।

---

అ॥ జాఠరాగ్నిస్వరూపమున బరమేశ్వరుఁడే యుపాస్యమగుచున్నాఁడని 26 సూత్రమున వ్యాఖ్యానము చేయఁబడినది. అట్టియవసరములేకనే వై. శ్వానరశబ్దమునకు బఁరమేశ్వరార్థత్వము సిద్ధించుచున్నదియను జైమిని యభిప్రాయమును రాబోవుసూత్రమున వివరించుచున్నారు.

సాక్షాత్ అపి = జాఠరాగ్నిస్వరూప పరిగ్రహణమవసరము లేకయె వైశ్వానరశబ్దము సాక్షాత్తుగ పరబ్రహ్మపరముగ గ్రహించినను అవిరోధం = విరోధము లేదని జైమినిః = జైమిన్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

వైశ్వానర శబ్దము సాక్షాత్తుగ పరమేశ్వర పరమని జైమిన్యాచార్య మతము.

జాఠరాగ్నిస్వరూపమునఁగాని జాఠరాగ్నియను పరిమితమగు నుపాధియందుగాని యుపాస్యమగు వైశ్వానరుఁడు పరమేశ్వరుడని యన్తఃప్రతిష్ఠితత్వము మొదలగు లక్షణముల ననుసరించి 26 వ సూత్రమున నిశ్చయింపబడెను. ప్రతీకము ఉపాధి మొదలగువాని కల్పనలతో నవసరములేకయే వైశ్వానరశబ్దమును సాక్షాత్తుగ బఁరమేశ్వ

పూ. పక్షీ : నను జాఠరాగ్న్యపరిగ్రహే౽న్తఃప్రతిష్ఠితత్వ వచనం శబ్దాదీని చ కారణాని విరుధ్యేరన్నితి. ।

సిద్ధాంతీ : అత్రోచ్యతే. అన్తఃప్రతిష్ఠితత్వవచనం తావన్న విరుధ్యతే. న హీహ 'పురుషవిధం పురుషే౽న్తఃప్రతిష్ఠితం వేద' ఇతి జాఠరాగ్న్యభిప్రాయేణేదముచ్యతే తస్యాప్రకృతత్వాదసంశబ్దితత్వాచ్చ ।

---

రపరముగ గ్రహించినను విరోధ మేమియు లేదని జైమిన్యాచార్యులు తలంచుచున్నారు.

పూర్వపక్షి : వైశ్వానరశబ్దముచే జాఠరాగ్నినిం బరిగ్రహింపకుండిచో, నన్తఃప్రతిష్ఠితత్వమును పలుకరించుచున్న "స ఏషో౽గ్నిర్వైశ్వానరో యత్పురుషః స యో హైతమేవాగ్నిం వైశ్వానరం పురుషవిధం పురుషే౽న్తః ప్రతిష్ఠితం వేద (శ. బ్రా. 10-6-1-11) అను వాక్యమునకును, రూఢ్యర్థములుగల వైశ్వానర, అగ్ని మొదలగు శబ్దములకును విరోధమగునుగదా?

సిద్ధాంతి : ఇందుకు సమాధానమును జెప్పుచున్నాము [వైశ్వానరశబ్దమును సాక్షాత్పరమేశ్వరపరముగ గ్రహించినచో] అన్తఃప్రతిష్ఠితత్వమును బోధించువాక్యమునకు విరోధములేదు. "పురుషవిధం పురుషే౽న్తఃప్రతిష్ఠితం వేద" యను వాక్యము జాఠరాగ్ని నుద్దేశించి పలుకుటలేదు. జాఠరాగ్ని యీ వాక్యమునకు బ్రకృతవిషయము గాదు. జాఠరాగ్నిని గూర్చి స్పష్టముగ జెప్పశబ్ద మచట నెద్దియు గానరాదు.

పూ. పక్షీ: కథం తర్హి।

సిద్ధాంతీ : యత్ప్రకృతం మూర్ధాదిషు చుబుకాంతేషు పురుషావయవేషు పురుషవిధత్వం కల్పితం తదభిప్రాయేణేదముచ్యతే—'పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేదే'తి, న జాఠరాగ్న్యభిప్రాయేణ యథా వృక్షే శాఖాం ప్రతిష్ఠితాం పశ్యతీతి తద్వత్. అథ వా యః ప్రకృతః పరమాత్మా అధ్యాత్మమధిదైవతం చ పురుషవిధత్వోపాధిః, తస్య యత్కేవలం సాక్షిరూపం తదభిప్రాయేణేదముచ్యతే—పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం

---

పూర్వపక్షి : అట్లుకానిచో మఱియెట్లు?

సిద్ధాంతి : ఆప్రకరణమునందు పరమేశ్వరునికి శిరస్సు మొదలు చుబుకాంతమువరకు నొకపురుషాకారము కల్పింపబడినది. అట్టి కల్పననుసరించియే ప్రకృతమగు పురుషవిధత్వ ముదాహరింపబడుచున్నది. వృక్షమునందు శాఖ అన్తఃప్రతిష్ఠితముగ గాన్పించుచున్నది. అటులనే ప్రకృతమునగూడ దెలియఁదగును. అట్లు గానిచో (బురుషవిధత్వకల్పనము చేసి యట్టియుపాధియందు (బరమేశ్వరుఁడు కేవలసాక్షిరూపమున నున్నాఁడను అభిప్రాయముతో అంతఃప్రతిష్ఠితుఁడగుచున్నాఁడని యీవాక్య మట్లుదాహరించినది. పూర్వాపరసందర్భబలమువలన ప్రకరణము పరమాత్మవిషయమని నిశ్చయింపబడుచుండగా, వైశ్వానరశబ్దముగూడ నేదోయొకవిధముగ పరమేశ్వరవిషయముగ సమన్వయము కాఁగలదు. విశ్వుఁడగు నరుఁడు అనగా నతఁడే సర్వాత్ముఁడగు పరమేశ్వరుఁడు, వ్యష్టిరూపుఁడగు జీవుఁడు లేక [ప్రాణులందఱికిని (బ్రభువగు

వేదేతి. నిశ్చితే చ పూర్వాపరపర్యాలోచనావశేన పరమాత్మప్రతిగ్రహే తద్విషయ ఏవ వైశ్వానరశబ్దః కేనచిద్యోగేన వర్తిష్యతే, విశ్వశ్చాయం నరశ్చ విశ్వానరః, విశ్వేషాం వాఽయం నరః, విశ్వే వా నరా అస్యేతి విశ్వానరః పరమాత్మా, సర్వాత్మకత్వాత్, విశ్వానర ఏవ వైశ్వానరః తద్ధితోఽనన్యార్థః రాక్షసవాయసాదివత్. అగ్నిశబ్దోఽప్యగ్రణీత్వాది యోగాశ్రయణేన పరమాత్మవిషయ ఏవ భవిష్యతి. గార్హపత్యాదిప్రకల్పనం ప్రాణాహుత్యధికరణత్వం చ పరమాత్మనోఽపి సర్వాత్మత్వాదుపపద్యతే. ।

---

టచేతగాని, అన్నివికారములకుఁ గర్తయగుటచేతగాని] జీవులందరు అతని సంబంధులనిగాని, [జీవులంద ఱతనికి స్వరూపభూతులగుటచేతగాని, నియమ్యులగుటచేతగాని] జీవులందఱినిఁ గలిగియున్నవాఁడనిగాని యర్థకల్పనము చేయవచ్చును. ఇట్లర్థకల్పనము చేయుటచే విశ్వానరః అనురూప మేర్పడుచున్నది. ఇట్లు విశ్వానరశబ్దమునకు సర్వమునకు స్వరూపభూతుఁడగుచున్నాఁడని యర్థము తేలుచున్నది. అనగా బరమాత్మయని భావము. విశ్వానరశబ్దముయొక్క తద్ధితరూపమే వైశ్వానరశబ్దము. తద్ధితరూపముచే నర్థభేదము సంభవింపదు. రక్షఃశబ్దతద్ధితరూపమగు రాక్షసశబ్దమునకును, వయఃశబ్దతద్ధితరూపమగు వాయసశబ్దమునకు తద్ధితరూపముచే నర్థభేదము లేదు. అగ్నిశబ్దమునకు అగ్రణియను వ్యుత్పత్త్యర్థమును గ్రహించిన నాపదము పరమేశ్వరుని బోధించును. సర్వాత్మత్వలక్షణమువలనఁ బరమాత్మకుగూడ గార్హపత్యాదికల్పనము, ప్రాణాహుతులకు స్థానకల్పనముగూడ సమంజసమేయగును.

కథం పునః పరమేశ్వరపరిగ్రహే ప్రాదేశమాత్ర శ్రుతిరుపపద్యేత ఇతి తాం వ్యాఖ్యాతుమారభతే —

అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః (సూ. 29)

అతిమాత్రస్యాపి పరమేశ్వరస్య ప్రాదేశమాత్రత్వమభివ్యక్తినిమిత్తం స్యాత్. అభివ్యజ్యతే కిల ప్రాదేశమాత్ర పరిమాణః పరమేశ్వర ఉపాసకానాం కృతే. ప్రదేశవిశేషేషు హృదయాదిషూపలబ్ధిస్థానేషు విశేషేణాభివ్యజ్యతే. అతః పర

---

[కర్మయొక్క ఫలమును ముందుగా పొందించునదియని అగ్రణి యనుశబ్దమున కర్థము. లేక సంతటను గమనము గలది యనియు, సర్వజ్ఞాతృత్వము గలదనియుగూడ నగ్రణుంచుటచే నగ్నిశబ్దము పరమార్థమగుచున్నది.] 28.

అ॥ వైశ్వానరశబ్దమును బరమేశ్వరపరముగ గ్రహించి నచో, "యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానం" (ఛాం 5–18–1) అని జానెడు పరిమాణము నుచ్చారించు శ్రుతి యెట్లు ఘటించునని శంకరాగా నాశ్రుతి వాక్యార్థము రాబోవుసూత్రమునందు విచారింపఁబడుచున్నది.

సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరునికి అభివ్యక్తేః = అభివ్యక్తినిమిత్తము ప్రాదేశమాత్రత్వము కల్పింపబడినది యని ఆశ్మరథ్యః = ఆశ్మరథ్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

సర్వపరిమాణముల కతీతుఁడయినను పరమేశ్వరునికిఁ బ్రాదేశమాత్రపరిమాణ మభివ్యక్తినిమిత్తము చెప్ప

మేశ్వరేऽపి ప్రాదేశమాత్రశ్రుతిరభివ్యక్తేరుపపద్యత ఇత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే ।

## అనుస్మృతేర్బాదరిః (సూ. 30)

ప్రాదేశమాత్రహృదయప్రతిష్ఠితేన వాఽయం మనసాఽనుస్మర్యతే తేన ప్రాదేశమాత్ర ఇత్యుచ్యతే. యథా ప్రస్థమితా యవాః ప్రస్థా ఇత్యుచ్యంతే తద్వత్. యద్యపి చ యవేషు స్వగతమేవ పరిమాణం ప్రస్థసంబంధాద్వ్యజ్యతే; న చేహ పరమేశ్వర

---

ప్రాదేశమాత్రశ్రుతికి ఆశ్మరథ్యునియర్థము

బడుచున్నది. ఉపాసకుల ప్రయోజనమును గోరి పరమేశ్వరుఁడు ప్రాదేశమాత్రపరిమాణముగలవాఁడగుచున్నాడు. పరిమిత పరిమాణములుగల హృదయాదులు పరమేశ్వరుని విశేషముగ పొందగల స్థానములగుచున్నవి [హార్దాకాశము పరమాత్మోపలబ్ధిస్థానముగ తైత్తిరీయమునం దుపదేశింపఁబడినది.] కనుక ప్రాదేశమాత్రశ్రుతి పరమేశ్వరునియందు ఘటించునని యాశ్మరథ్యాచార్యుఁడు తలంచుచున్నాడు. 29

అ॥ ప్రాదేశమాత్రశ్రుతికి బాదర్యాచార్యుడు చెప్పిన యర్థమును తరువాత చూపుచున్నారు.

ఈ పరమేశ్వరుఁడు ప్రాదేశమాత్రమగు హృదయమునం దున్నవానిగ మనస్సుచేత ధ్యానింపబడుచున్నాడు.

ప్రాదేశశ్రుతికి నర్థము

అందువలన అతఁడు ప్రాదేశమాత్రుఁడని చెప్పబడుచున్నాఁడు. కొలపాత్రయగు మానికె యందున్న యవలు మానెడని వ్యవహరింపఁ

గతం కించిత్పరిమాణ మస్తి యద్ధృదయసంబంధాద్వ్యజ్యేత. తథాపి ప్రయుక్తాయాః ప్రాదేశమాత్రశ్రుతేః, సంభవతి యథా కథంచిదనుస్మరణమాలంబనమిత్యుచ్యతే ప్రాదేశమాత్రత్వేన హ్యయమప్రాదేశమాత్రోఽప్యనుస్మరణీయః; ప్రాదేశమాత్ర శ్రుత్యర్థవత్త్వాయ. ఏవమనుస్మృతినిమిత్తా పరమేశ్వరే ప్రాదేశ మాత్రశ్రుతిరితి బాదరిరాచార్యో మన్యతే. ।

---

బడుచున్నవి. అటులనే నిచటఁగూడ. కాని యవలకు స్వీయ మగు పరిమాణము గలదు. అట్టి పరిమాణము కొలపాత్ర సంబంధముచే నభివ్యక్తమగుచున్నది. హృదయసంబంధ ముచే నభివ్యక్తమగు పరిమాణము స్వయముగఁ బరమేశ్వరు నికి లేదు. ధ్యానమున కాలంబనముగ గ్రహింపఁబడుటచే, ప్రాదేశపరిమాణమును చెప్పు శ్రుతికి నవకాశ మేదోవిధ ముగ గలుగుచున్నది. ప్రాదేశమాత్రముచేఁ గొలుచుటకు శక్యముగాకున్నను పరమేశ్వరుఁడు ప్రాదేశమాత్రుఁడుగ ధ్యానింపఁదగినవాఁడని ఆ శ్రుతికి నర్థము చెప్పవచ్చును. ఈ విధముగఁ బరమేశ్వరునియందు ప్రాదేశమాత్రశ్రుతి సమన్వ యము కాఁగలదని బాదర్యాచార్యుఁడు తలంచుచున్నాడు. 30

అ॥ వైశ్వానరశబ్దము సాక్షాత్పరమేశ్వరపరముగ గ్రహింపవచ్చునని జైమిన్యాచార్యుని మతము 28వ సూత్ర మున ప్రదర్శింపబడినది. ప్రాదేశమాత్రశ్రుతికి 29వసూత్రమున ఆశ్మరథ్యాభిప్రాయమును 30వసూత్రమున బాదర్యాచార్యుని యభిప్రాయమును ప్రదర్శింపబడినవి. రాబోవుసూత్రమున ఆ శ్రుతికి జైమిన్యాచార్యుని యభిప్రాయమును చెప్పుచున్నారు.

# సంపత్తేరితి జైమినిస్తథా హిదర్శయతి

( సూ. 31 )

సంపత్తినిమిత్తా వా స్యాత్ప్రాదేశమాత్రశ్రుతిః. కుతః? తథాహి సమానప్రకరణం వాజసనేయిబ్రాహ్మణం ద్యుప్రభృతీన్పృథివీపర్యంతాన్ త్రైలోక్యాత్మనో వైశ్వానరస్యావయవాన్ అధ్యాత్మమూర్ధప్రభృతిషు చుబుకపర్యంతేషు దేహావయవేషు సంపాదయత్ప్రాదేశమాత్రసంపత్తిం పరమేశ్వరస్య దర్శయతి — "ప్రాదేశమాత్రమివ హ వై దేవాస్సువిదితా అభిసంపన్నాస్తథా తు వ ఏతాన్వక్ష్యామి యథా ప్రాదేశమాత్రమేవాభిసంపాద

---

సంపత్తేః ఇతి = శిరస్సు మొదలు చుబుకము వఱకు నవయవసంపత్తి గల్గియున్నట్లు వర్ణింపబడుటవలన ప్రాదేశమాత్రశ్రుతికి విరోధము లేదని, జైమినిః = జైమిన్యాచార్యు డనుచున్నాడు. శ్రుతిః = శ్రుతి, తథా = ఆ విధముగ, దర్శయతి హి = ప్రదర్శించుచున్నది గదా!

అవయవసంపత్తిని హేతువుగా గైకొని ప్రాదేశమాత్ర శ్రుతి యట్లు పలికియుండవచ్చును. అది యెట్లన, ఈవిషయము నే ప్రస్తావించు వాజసనేయి శ్రుతియందు శిరస్సు మొదలు చుబుకము వఱకు గల వైశ్వానరావయవములు త్రైలోక్యస్వరూపుడగు పరమేశ్వరుని యవయవములుగ వర్ణించి పరమేశ్వరుని ప్రాదేశమాత్రసంపత్తిని ప్రదర్శించుచున్నది. "ఆ ప్రాదేశ

వైశ్వానరావయవములు పరమేశ్వరావయవములుగనుపపాదింపబడినవి.

యిష్యామీతి సహోవాచ మూర్ధానముపదిశన్నువాచ, ఏష వా అతిష్ఠా వైశ్వానర ఇతి, చక్షుషీ ఉపదిశన్నువాచ, ఏష వై సుతేజా వైశ్వానర ఇతి, నాసికే ఉపదిశన్నువాచ, ఏష వై పృథగ్వర్త్మాత్మా వైశ్వానర ఇతి, ముఖ్యమాకాశముపదిశన్నువాచ ఏష వై బహులో వైశ్వానర ఇతి. ముఖ్యా ఆప ఉపదిశన్నువాచ, ఏష వై ప్రతిష్ఠా వైశ్వానర" ఇతి. చుబుకమిత్యధరం ముఖఫలకముచ్యతే. యద్యపి వాజసనేయకే ద్యౌరతిష్ఠాత్వగుణా సమామ్నా

---

మాత్రపురుషుని వైశ్వానరునితో సమన్వయము చేసికొనుటకుగాను, వాని యవయవముల నశ్వపతిరాజు ప్రాచీనశాలాదుల కిట్లువివరించెను. తన శిరఉపరిభాగమును చూపించుచు, నిది యాతని శిరస్సు. భూరాదిలోకముల నన్నిటి నతిక్రమించి యున్నది యని చెప్పెను. చేతితోఁ దన నేత్రములను చూపించుచు సంపూర్ణమగు తేజస్సుగల నీ సూర్యుఁ డాతని నేత్రములనియు, నాసికను జూపించుచు, ననేకమార్గముల ప్రసరించు వాయు వాతని ప్రాణమనియు, దన ముఖమునందున్న యాకాశమును జూపుచు నది ముఖ్యాకాశమనియు, దనముఖమునందలి చొంగను జూపుచు నది వైశ్వానరుని మూత్రకోశమునందలి జలమనియు, దన చుబుకమును జూపుచు, బృథివి వైశ్వానరునికి ప్రతిష్ఠాభూతమగు పాదమనియు నశ్వపతి వారలకు వివరించెను. ముఖఫలకమగు గడ్డము చుబుకమనబడును. వాజసనేయిశ్రుతియందు, ద్యులోకము అతిక్రమణగుణము కలిగినట్లును, సూర్యుడు సుతేజోగుణము కలిగి యున్నట్లును వర్ణింపఁబడియున్నది. ఛాందోగ్యము నందన్ననో,

యతే, ఆదిత్యశ్చ సుతేజస్త్వగుణః, ఛాందోగ్యేతు ద్యౌస్సుతేజ స్త్వగుణా సమామ్నాయతే, ఆదిత్యశ్చ విశ్వరూపత్వగుణః, తథాపి వైరూపతా విశేషేణ నిర్దిశ్యతే ప్రాదేశమాత్రశ్రుతేర విశేషాత్సర్వశాఖాప్రత్యయత్వాచ్చ. సంపత్తినిమిత్తాం ప్రాదేశ మాత్రశ్రుతిం యుక్తతరాం జైమినిరాచార్యో మన్యతే.।

---

ద్యులోకము సుతేజస్త్వగుణము కలిగియున్నట్లు, సూర్యుడు విశ్వరూపగుణము కలిగియున్నట్లు నుదాహరింపఁబడియున్నది. అనేకవిధముల నిర్దిష్టమైన వైశ్వానరవిద్యయొక్క యైక్యమున కింతమాత్రముచేఁ గొఱంత గలుగనేరదు. ప్రాదేశమాత్ర త్వము నుభయశాఖాశ్రుతులు పలుకరించుచున్నవి. భావన కొఱ కుపదేశింపఁబడు నవయవము లుభయశాఖలయందు భిన్నముగా నుండినను, రెండింటియందును ప్రాదేశమాత్ర త్వమే పలుకరింపఁబడుచున్నది. ఒకవిద్యనే యుభయశాఖలు బోధించుచున్నవి. ఇట్లు ప్రాదేశమాత్రశ్రుతికి సంపత్తినిమిత్త ముగ నర్థకల్పనము సేయుట యుక్తతరమని జైమిన్యాచార్యుడు తలంచుచున్నాడు. 31

అ॥ ప్రాదేశమాత్రశ్రుతి సంపత్తినిమిత్తమను జైమిన్యా చార్యుని యభిప్రాయమును బలపఱచు జాబాలశ్రుతిప్రమాణ మును తరువాతసూత్రమున నుదాహరించుచున్నారు.

---

## ఆమనన్తి చైనమస్మిన్ (సూ. 32)

ఆమనంతి చైనం పరమేశ్వరమస్మిన్ మూర్ధచుబుకాంతరాలే జాబాలాః. 'య ఏషోऽనంతోऽవ్యక్త ఆత్మా సోऽవిముక్తే ప్రతిష్ఠిత ఇతి, సోऽవిముక్తః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి వరణాయాం నాస్యాం చ మధ్యే ప్రతిష్ఠిత ఇతి. కా వై వరణా కా చ నాసీతి.' తత్ర చేమామేవ వరణాం నాసాం చేతి నిరుచ్య సర్వాణీంద్రియకృతాని పాపాని వారయతి సా వరణా సర్వాణీంద్రియ కృతాని పాపాని నాశయతి చేతి సా నాశీతి వరణా నాశీతి నిరుచ్య పునరప్యామనంతి-'తతమచ్చాస్య స్థానం భవతీతి.

---

అస్మిన్ = ఈ మూర్ధచుబుకాంతరాళమునం దుపాసనముకొఱకు, ఏనం = ఈ పరమేశ్వరుని, జాబాలశ్రుత్యనుయాయులు, ఆమనంతి = పఠించుచున్నారు.

పరమేశ్వరుఁడు శిరస్సునకును, చుబుకమునకును మధ్యప్రదేశమునం దున్నట్లు జాబాలశ్రుతి పలుకుచున్నది. "ఈయాత్మ యనంతుఁడు. అవ్యక్తుఁడు. [అతనిని దెలిసికొనుటెట్లని అత్రిమహాముని యడుగ యాజ్ఞవల్క్యుఁ డిట్లు చెప్పెను.] అతఁడు [కామాదులచేత బద్ధుఁడై] విముక్తుఁడుగాని జీవుని యందుఁ బ్రతిష్ఠితునిగ నుపాసింపఁదగినవాఁడు. అవిముక్తుఁడగు జీవుఁడెచట బ్రతిష్ఠితు డగుచున్నాఁడనిన, నాతఁడు వరణకును, నాసికిని మధ్యప్రదేశమున నున్నాడు. వరణ యననేమి? నాసి యన నేమి? ఈనాసికయె యింద్రియకృతములగు సర్వపాపములను నివారించునుగనుక వరణ యనియు, అట్టి పాపములను

భ్రువోర్ఘ్రాణస్య చ యస్సంధిః. స ఏష ద్యులోకస్య పరస్య చ సంధిర్భవతీ'తి. (జాబా. 1) తస్మాదుపపన్నా పరమేశ్వరే ప్రాదేశ మాత్రశ్రుతిః. అభివిమానశ్రుతిః ప్రత్యగాత్మత్వాభిప్రాయా. ప్రత్యగాత్మతయా సర్వైః ప్రాణిభిరభివిమీయత ఇత్యభివిమానః. అభిగతో వాయం ప్రత్యగాత్మత్వాత్. విమానశ్చ మానవియోగా దిత్యభివిమానః, అభివిమిమీతే వా సర్వం జగత్కారణత్వాదిత్యభి విమానః, తస్మాత్పరమేశ్వర ఏవ వైశ్వానర ఇతిసిద్ధమ్.

ఇతి శ్రీమచ్ఛారీరక మీమాంసాభాష్యే శ్రీశంకర
భగవత్పాదకృతౌ ప్రథమాధ్యాయస్య
ద్వితీయః పాదః.

---

నశింపచేయునుగనుక నాశి యనియు శ్రుతియె యర్థనిర్వ చనము చేసినది. దీనికి స్థానమెద్దియన, రెండు కనుబొమలకును, ఘ్రాణమునకును సంధిస్థాన మద్దాని స్థలము. ఈ స్థలము స్వర్గ లోకమునకును, బ్రహ్మలోకమునకును సంధిస్థాన మగుచున్నది ( జాబాల ) అనిగూడ నాశ్రుతి బోధించుచున్నది. కనుక ప్రాదేశమాత్రశ్రుతి పరమేశ్వరునియందు సమంజసమే యగు చున్నది. పరమేశ్వరుఁడు ప్రత్యగాత్మస్వరూపుఁ డగుటంజేసి యభివిమానుఁడని చెప్పఁబడుచున్నాఁడు. [నేను బ్రహ్మమని ముఖ్యముగఁ దెలిసికొనువాఁ డని యభివిమాన శబ్దమున కర్థము] సమస్తప్రాణులచే నతడు ప్రత్యగాత్మస్వరూపమున గణింపఁబడువాఁడు గనుక నభివిమానుఁ డనిపించుకొనుచు న్నాఁడు. లేక ప్రత్యగాత్మయగుటచే నతఁ డభిగతుఁ డగు

చున్నాఁడు. అతనినిఁగొలుచు కొలమానము లేకుండుటచే విమానుఁడు నగుచున్నాఁడు. ఇతఁడు అభిగతుడు విమానుఁడు గనుక నభివిమానుఁ డనఁబడుచున్నాఁడు. లేక సర్వజగత్కా రణుఁ డగుటవలన, సద్దాని కొలుచువాఁడని యర్థము. అందు వలన వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడే యని సిద్ధమగు చున్నది. 32

<u>అధికరణ సంక్షేపార్థము</u>: ఛాందోగ్యము 5-18-2 వాక్య ములో వినఁబడుచున్న వైశ్వానరశబ్దముచే జాఠరాగ్నియో, పంచభూతములలోఁ జేరిన అగ్నియో, తదధిదేవతయో, లేక జీవుఁడో బోధింపఁబడుచున్నాఁడు. అట్టి ప్రయోగము లనేక ములు కాన్పించుచున్నవి. ఆ పదము పరమేశ్వరపరము గానేరదు. ఇది పూర్వపక్షము. ఆపదము పరమేశ్వరపరమని సిద్ధాంతము. జాఠరాగ్ని, భూతాగ్ని, ఆదిత్యుఁడు, దేవతలు వీరియందు వైశ్వానరశబ్దము సాధారణము. జీవపరమా త్మలయం దాత్మశబ్దము సాధారణము. అయిన నావైశ్వానర శబ్దము పరమేశ్వరునియందు విశేషముగ సమన్వయ మగు చున్నది. ఈ యర్థమునే స్మృతులు గూడఁ జెప్పుచున్న ట్లూహింపవచ్చును. ఉపాసనముకొఱకుఁ బరమేశ్వరునికి బ్రతీకగనో, లేక వానికట్టి స్వరూపమో యుపదేశింపఁబడి నది. శిరస్సు సూర్యుఁ డగుచున్నాఁడు అను మొదలగు నవ యవవర్ణనమువలన వైశ్వానరుఁడు జాఠరాగ్ని యగుట యసంభవము. ఆతనికి వాజసనేయుఁలు పురుషవిధత్వమునుగూడ జెప్పుచున్నారు. వికారరూపమగు నగ్నికి ద్యులోకాద్యాత్మక

మగు మఱియొక వికారస్వరూపము కానేరదు. వైశ్వానరుఁడగ్ని దేవతకూడ కానేరఁడు. అతని ఐశ్వర్యము పరమేశ్వరాధీన మగుచున్నది. వైశ్వానరశబ్దమునకు వ్యుత్పత్త్యర్థమునుబట్టి పరమేశ్వరుఁడని యర్థమును జైమిన్యాచార్యుఁడు చెప్పుచున్నాఁడు. అపరిచ్ఛిన్నుఁడగు పరమేశ్వరునికి నుపాసనార్థము హృదయాది ప్రాదేశమాత్రత్వము విరుద్ధముగాదు. లేక హృదయపుండరీకము నందు స్మరింపఁ బడుట చేతను ప్రాదేశమాత్రత్వము సంభవము. త్రైలోక్యాత్మకుఁడగు పరమేశ్వరునికి శిరస్సు మొదలు చుబుకాంతమునగు ప్రాదేశమాత్రస్వరూప ముపాసనానిమిత్తము కల్పింపఁబడుచున్నది. కనుకఁ బరమేశ్వరుఁడే వైశ్వానరశబ్దముచే బోధింపఁబడుచున్నాఁడు.

ప్రథమాధ్యాయము - ద్వితీయపాదము

సమాప్తము.





బ్రహ్మసూత్ర

# శాంకర మీమాంసాభాష్యమ్

కల్యాణ కౌముదీ సమేతమ్.

ప్రథమాధ్యాయే - తృతీయః పాదః.



## (1) ద్యుభ్వాద్యధికరణమ్ (సూ. 1–6)

ద్యుభ్వాద్యధికరణము

అ॥ అస్పష్టబ్రహ్మలింగములు ఉపాస్యబ్రహ్మపరములు నగు వాక్యములు కొన్ని గడచినపాదమునందు విచారింప బడినవి. "మనోమయః ప్రాణమయః" (ఛాం. 3–14–1–2) మృత్యుర్యస్యోపసేచనం (కఠ 1–2–25) "గుహాం ప్రవిష్టౌ" (కాఠ 1–3–1) "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" (ఛాం 4–15–1) "సర్వాణి భూతాన్యంతరో యమయతి" (బృ 3–7–1–2) "తదక్షరమధిగమ్యతే" (ముం డ 1–1–5–6) "ప్రాదేశ మాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే" (ఛాం.5–18–2) అను శ్రుతివాక్యములు పరమేశ్వర

పరములని 1–7 అధికరణములయందు సహేతుకముగ సిద్ధాంతము చేయబడినవి. అస్పష్ట బ్రహ్మలింగములు జ్ఞేయ బ్రహ్మపరములు నగు మఱికొన్ని శ్రుతి వాక్యములు తృతీయ పాదమున సమన్వయము చేయబడుచున్నవి. పూర్వాధి కరణమున త్రైలోక్యాత్మయగు వైశ్వానరుఁడు పరమేశ్వరు డని నిశ్చయింపఁబడినది. "యస్మిన్ ద్యౌః పృథివీ చాన్త రిక్షమోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముంచ థామృతస్యైష సేతుః" (ముం 2–2–5) అను వాక్యమునందు త్రైలోక్యాయతనము గల యొక పురుషుఁడు తెలియ వచ్చుచున్నాడు. ఇట్టి పురుషు డెవఁడని సందేహము గలుగుచున్నది. ఈ యర్థవిచార ణము కొఱకీ యధికరణ మారంభింప బడుచున్నది.

విషయవాక్యము : యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః తమే వైకం జానథ ఆత్మాన మన్యా వాచోవిముంచ థామృతస్యైష సేతుః (ముం 2–2–5).

సంశయము : ఈ వాక్యమునందు తెలియ వచ్చుచున్న ద్యుప్రభృతుల కాయతనము పరబ్రహ్మ మగునా లేక ప్రధానము మొదలగు మఱి యొకటి యేదైన నగునా ?

పూర్వపక్షము : అర్థాంతర మెద్దియో యగును.

సిద్ధాంతము : పరబ్రహ్మమె యగును.

## ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ (సూ. 1)

ఇదం శ్రూయతే 'యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైస్తమేవైకం జానథ, ఆత్మానమన్యా వాచో విముంచథామృతస్యైష సేతు (ముం2-2-5) రితి. ।

---

అవలోకనము చేయతగిన ప్రమాణ వాక్యములు –

ముం 2-2-5, బృ 2-4-12, శ్వే 3-5-2, ఛాం 6-8-4, ముం 2-2-11, కాం 2-4-11, బృ 4-5-13, ముం 2-2-8, 3-2-8, బృ 4-4-7, బృ 4-4-21, ముం 1-1-3, ముం 3-1-1 .........

అ॥ ద్యు భూ ఆది ఆయతనం = విషయ వాక్యమునందు వినవచ్చుచున్న ద్యులోకము, భూలోకము మొదలగువానికి, ఆయతనం = అధిష్ఠానము పరబ్రహ్మము. ఏలయన, స్వ శబ్దాత్ = ఆత్మశబ్దము ప్రయోగింపబడుటవలన.

"ఎవ్వని యందు ద్యులోకము, భూమి, యాకాశము, సర్వేంద్రియోపేతమగు మనస్సుగూడ పడుగు పేకవలె కలసికొని యున్నవో యట్టి యద్వితీయుఁడగు నక్షరస్వరూపునే ప్రత్యగాత్మగా దెలిసికొని సాధనసముపేతమగు కర్మను బోధించు నపరవిద్యాత్మక ప్రసంగముల ముముక్షువులు మానవలయును. అట్టివాని జ్ఞానము సంసారసాగరమును దాటుటకు సేతువువంటిది." అని ముండక శ్రుతి పల్కుచున్నది.

సందేహము; తత్ర యదేతద్ద్యుప్రభృతీనా మోతత్వవచనాదా యతనం కించిదవగమ్యతే తత్కిం పరంబ్రహ్మ స్యాదాహోస్విదర్థాంతరమితి సందిహ్యతే. ।

పూ.పక్షి: తత్రార్థాంతరం కిమప్యాయతనం స్యాదితి ప్రాప్తం. కస్మాత్? 'అమృతస్యైష సేతు' రితి శ్రవణాత్. పారవాన్ హి లోకే సేతుః ప్రఖ్యాతః. న చ పరస్య బ్రహ్మణః పారవత్త్వం శక్యమభ్యుపగంతుం 'అనంతమపార' మితి.(బృ2-4-12)శ్రవణాత్.

---

ఈవాక్యమునందు ద్యులోకము మొదలగునవి పడుగు పేకవలె కలిసిపోవుచున్నటుల చెప్పబడుటవలన నొక నివాసస్థానము వినబడుచున్నది. ఆనివాసస్థానము పరబ్రహ్మమగునా? లేక మఱియొకటి యేదయిన నగునా? యని సందేహము కలుగుచున్నది.

పూ. పక్షి: పైవాక్యమునం దుదాహరింపబడిన ఆయతనము మఱియొకటి యేదియో యగును. [కాని పరబ్రహ్మము కానేరదు] ఏలనన ఈత డమృతత్వమునకు సేతువువంటివాడని శ్రుతియందు వినబడుటవలన. [అమృతత్వమున కనగా పరబ్రహ్మమున కతడు సేతువువంటివాఁడనుటచే నట్టిసేతువగువాఁడు పరబ్రహ్మము కంటె భిన్నుడగుచున్నాఁడు.] సేతుశబ్దమువలన నది దాటిపోఁగల యొకతీరమున్నట్లు లోకప్రసిద్ధముగ దెలియుచున్నది. పరబ్రహ్మము [దేశతః కాలతః గూడ ననంతముగనుక] పారము కలిగి యున్నదని యంగీకరింప వీలులేదు. బ్రహ్మము అనంతము, అపారము అని

అర్థాంతరే చాయతనే పరిగృహ్యమాణే స్మృతిప్రసిద్ధం ప్రధానం పరిగృహీతవ్యం, తస్య హి కారణత్వాదాయతనత్వోపపత్తేః. శ్రుతిప్రసిద్ధో వా వాయుస్స్యాత్ 'వాయుర్వావ గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవంతీ'తి. (బృ3 5-2) వాయోరపి విధారణత్వశ్రవణాత్. శారీరో వా స్యాత్. తస్యాపి భోక్తృత్వాద్భోగ్యం ప్రపంచం ప్రత్యాయతనత్వోపపత్తేరితి. ।

సిద్ధాంతీ: ఏవం ప్రాప్త ఇదమాహ.—ద్యుభ్వాద్యాయతనమితి. ద్యౌశ్చ భూశ్చ ద్యుభువౌ ద్యుభువావాదీ యస్య తద్ద్యుభ్వాది,

---

బృహదారణ్యకశ్రుతి పలుకుచున్నది. శ్రుతిగతమగు నాయతన శబ్దమునకు మఱియొక అర్థము చెప్పవలసివచ్చినపుడు స్మృతి ప్రసిద్ధమగు ప్రధానమును గ్రహింపదగును. ప్రపంచ కారణ మగుటచే నది ఆయతనమని చెప్పనొప్పును. లేక శ్రుతి ప్రసిద్ధమగు వాయువైనను గావచ్చును "ఓయి గౌతమ! వాయు వాసూత్రము కావచ్చును. సూత్రముచేతను వలె వాయువుచే నీలోకము పరలోకము సర్వభూతములుగూడ నొకటిగా గ్రుచ్చబడుచున్నవి (బృ 3-7-2)" అనువాక్యము చేత వాయువు సమస్తమునకు విధారకమని తెలియుచున్నది. లేక జీవు డాయతనము కావచ్చును. అతడు భోక్త. భోగ్య మగు ప్రపంచమును గూర్చి యాత డాయతనమగుచున్నాడు.

సిద్ధాంతి: ఇట్లు పూర్వపక్షము రాగా సూత్రకారులు పైసూత్రమును రచియించిరి. ద్యులోకము, పృథివి, అంత రిక్షము, మనస్సు, ప్రాణములు మొదలగు జగత్తంతయు

యదేతదస్మిన్ వాక్యే ద్యౌఃపృథివ్యంతరిక్షం మనః ప్రాణా ఇత్యేవమాత్మకం జగదోతత్వేన నిర్దిష్టం తస్యాయతనం పరం బ్రహ్మ భవితు మర్హతి. కుతః? స్వశబ్దాత్ ఆత్మశబ్దాదిత్యర్థః. ఆత్మశబ్దో హీహ భవతి 'తమేవైకం జానథ ఆత్మాన' మితి. ఆత్మశబ్దశ్చ పరమాత్మపరిగ్రహే సమ్యగవకల్పతే నార్థాంతరపరిగ్రహే. క్వచిచ్చ స్వశబ్దేనైవ బ్రహ్మణ ఆయతనత్వం శ్రూయతే—'సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠాః' (ఛా6-8 4) ఇతి. స్వశబ్దేనైవ చేహ పురస్తాదుపరిష్టాచ్చ బ్రహ్మ సంకీర్త్యతే-

---

పఙుగు పేకవలె నెచ్చట నేయబడి యున్నదో అదియే ఆయతనము పరబ్రహ్మమగుచున్నాడు. ఎచట నీ జగమంతయు నోతఃప్రోతమై యున్నదో, యదియే జగమున కాయతనము. అది బ్రహ్మము. ఏలయన: స్వశబ్దము వలన అనగా, నాత్మశబ్దము వలన. "అతనినొక్కని నాత్మగా దెలిసికొనుము" అను వాక్యమునం దాత్మశబ్దము వినవచ్చు చున్నది. ఆత్మశబ్దము పరమాత్మపరముగ గ్రహించినప్పుడే సంపూర్ణముగ నర్థవంత మగును గాని మఱియొక విధముగ నా పదమున కర్థకల్పనము చేసినప్పు డర్థవంతముగాదు. కొన్ని స్థలముల స్వశబ్దముచేత బ్రహ్మము ఆయతనముగ సాక్షాత్తుగ తెలియజేయబడుచున్నది. "ఈ ప్రజ లందఱు సత్పదార్థమే మూలముగా గలిగియున్నారు. సత్పదార్థము ఆయతనముగా గలిగియున్నారు. సత్పదార్థము ప్రతిష్ఠాస్థానముగ గలిగియున్నారు." అని ఛాందోగ్యశ్రుతి (6-8-4) పల్కుచున్నది.

ఆయతన శబ్దార్థము

'పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మపరామృత'మితి, 'బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణ తశ్చోత్తరేణే'తి (ముం2-2-11) చ. తత్ర త్వాయతనాయతన వద్భావశ్రవణాత్ 'సర్వం బ్రహ్మే'తి చ సామానాధికరణ్యాత్. యథా హ్యనేకాత్మకో వృక్షః శాఖా స్కంధో మూలం చేత్యేవం నానారసో విచిత్ర ఆత్మేత్యాశంకా భవతి. తాం నివర్తయితుం

---

[ఇచట సచ్ఛబ్దము బ్రహ్మపరము] అట్లు కానిచో ప్రస్తుత విషయవాక్యమునకు పూర్వాపరములు వినబడుచున్న వాక్యములయందు బ్రహ్మ మాత్మశబ్దముచే నెట్లుసంకీర్తనము చేయబడెను. " ఈ ప్రపంచ మంతయు పరమ పురుషుడే. అగ్నిహోత్రాది కర్మలు, జ్ఞానము, పురుషుడే- అనగా అమృత స్వరూపమగు పరబ్రహ్మమె " యని ముండకము (2-1-10) వాక్యమునందును, "ఇదియంతయు నిశ్చయముగా బ్రహ్మమె, అతడంతట నున్నాడు. మనకు ముందు, వెనుక, దక్షిణము, నుత్తరమున నున్నా" డని ముండక (2-2-11) వాక్యమునందును బ్రహ్మమె సంకీర్తనముచేయ బడుచున్నది. [కనుక పై వాక్యముల మధ్యగతమగు ప్రకృతవాక్యము గూడ బ్రహ్మపరముగనే గ్రహింప నగును]ప్రకృత వాక్యము నందు "పరబ్రహ్మ మాయతన మనియు, జగత్తున కంతకు నోతః ప్రోతముగ నమర్పబడిన దాని కాపరబ్రహ్మ మా యతన" మనియు వినవచ్చుటవలనను, సర్వము బ్రహ్మ మని సర్వబ్రహ్మశబ్దములకు సామానాధికరణ్యము చెప్పబడుట చేతను, శాఖలు, వేళ్లు మొదలగు వివిధరూపములుగల

సావధారణమాహ,— 'తమేవైకం జానథ ఆత్మాన' మితి. ఏత దుక్తం భవతి న కార్యప్రపంచవిశిష్టో ఽపి చిత్ర ఆత్మా విజ్ఞేయః. కిం తర్హి? అవిద్యాకృతం కార్యప్రపంచం విద్యయా ప్రవిలాపయంతః తమేవైకమాయతనభూతమాత్మానం జానీథైకరసమితి. యథా-యస్మిన్నాస్తే దేవదత్తస్తదానయేత్యుక్తే ఆసనమేవానయతి న దేవదత్తం తద్వదాయతనభూతస్యైవైకరసస్యాత్మనో విజ్ఞేయత్వ ముపదిశ్యతే వికారానృతాభిసంధానస్య చాపవాదశ్శ్రూయతే-'మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతీ'తి

---

వృక్షమువలె నాత్మగూడ నానారూపములు గలిగిన ట్లొక శంకకలుగవచ్చును. ఇట్టి శంకను నివారించుటకై "అతని నొక్కనినే యాత్మగా దెలిసికొనుము" అని ప్రకృతవాక్యమున నేవకారము ప్రయోగింపబడినది. ఇట్లు "ఏవ" కారప్రయోగముయొక్క తాత్పర్యము గ్రహింపనగును. "కార్యస్వరూప మగు ప్రపంచముతో గూడిన విచిత్రాత్మకమైనది ఆత్మయని తెలిసికొనగూడదు. మఱియెట్లన, నవిద్యాకల్పితము, కార్యరూపము నగు ప్రపంచమును జ్ఞానముచే బుద్ధినుండి తొలగించి యాయతనభూతము, ఏకరసము నగు నాత్మనొక్కదానినే తెలిసికొను" మని 'ఏవ' కారము యొక్క యర్థము. దేనియందు దేవదత్తు డుపవిష్టుడైనాడో దానిని గొనికొనిరమ్మని చెప్పినప్పు డాసనమునే తీసికొని వచ్చును. కాని దేవదత్తుని దీసికొనిరాడు. ఆరీతిననే ప్రపంచమున కంతకు నాయతనభూతము, నేకరసము నగు నాత్మయె విజ్ఞేయమని ప్రకృతవాక్య ముపదేశించుచున్నది. "ఎవ డేలోకము

(కా2-4-11) సర్వం బ్రహ్మేతి తు సామానాధికరణ్యం ప్రపంచ విలాపనార్థం నానేకరసతాప్రతిపాదనార్థం 'స యథా సైంధవ ఘనోఽనంతరో బాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరేఽయమాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవే' (బృ4-5-13) త్యేకరసతాశ్రవణాత్. తస్మాద్ద్యుభ్వాద్యాయతనం పరం బ్రహ్మ. ।

యత్తూక్తం సేతుశ్రుతేః సేతోశ్చ పారవత్త్వోపపత్తే

---

నం దనేకత్వమును మాత్రమె గ్రహించునో యతడు మృత్యు పరంపర వాతబడు" నను కాఠకశ్రుతి (2-4-11) వికారము, అనృతమునగు ప్రపంచమునం దభిసంధిగల వానిని నిందించుచున్నది. 'సమస్తము బ్రహ్మ' మని ప్రపంచమునకు, బ్రహ్మమునకు ఈయబడుచున్న సామానాధికరణ్యముచే ప్రపంచము త్రోసిపుచ్చ బడుచున్నది. కాని బ్రహ్మ మనేకాత్మక మని చెప్పబడుటలేదు. [అవిద్యారోపితమైన ప్రపంచమంతయు పరమార్థముచే బ్రహ్మముగాని, బ్రహ్మ మనునది ప్రపంచము కాదనియీవాక్యమునకర్థము]' ఉప్పుగడ్డయంతయు నాంతరము, బాహ్యము అనుభేదములేక యొకే రసముగలిగి యున్న ట్లీయాత్మగూడ బాహ్యాభ్యంతరభేదము లేక కృత్స్నమగు ప్రజ్ఞానపుగడ్డ' యను బృహదారణ్యకవాక్యము(4-5-13) బ్రహ్మము యొక్క యేకరసత్వమును బోధించుచున్నది. కనుక ద్యులోకము, భూలోకము మొదలగువానియొక్క యాయతనము బ్రహ్మమగుచున్నది.

సేతుశబ్దము శ్రుతియందు వినబడుటచేత చేరగల

ర్బ్రహ్మణోఽర్థాంతరేణ ద్యుభ్వాద్యాయతనేన భవితవ్యమితి, అత్రోచ్యతే-విధరణత్వమాత్రమత్ర సేతుశ్రుత్యా వివక్ష్యతే న పారవత్త్వాది. న హి మృద్దారుమయో లోకే సేతుర్దృష్ట ఇత్యత్రాపి మృద్దారుమయ ఏవ సేతురభ్యుపగమ్యతే. సేతుశబ్దార్థోఽపి విధరణత్వమాత్రమేవ న పారవత్త్వాది షిఞో బంధనకర్మణః సేతుశబ్దవ్యుత్పత్తేః. ।

అపర ఆహ — 'తమేవైకం జానథ ఆత్మాన'మితి-యదేతత్సంకీర్తితమాత్మజ్ఞానం యచ్చైతత్ 'అన్యా వాచో విముంచథే'తి వాగ్విమోచనం తదత్రామృతత్వసాధనత్వాద

---

మఱియొక తీర ముండవలయునని పూర్వవాది చెప్పినదాని కిట్లు సమాధానము చెప్పబడుచున్నది. సేతుశబ్దమున కిచట సేతుధర్మమగు ధారణము మాత్ర మర్థము చెప్పవలయును.

సేతు శబ్దార్థము

కాని యంతకంటె భిన్నమగు తీర మర్థమని చెప్పవీలు లేదు. లోకమునందు గాన్పించు మృత్తు దారువుతో నిర్మింపబడిన సేతువువంటి సేతు వొకటి యిచట నభిప్రేతము గానేరదు. సేతుశబ్దము షిఞ్ అను ధాతువునుంచి వచ్చినది, షిఞ్ ధాతువునకు బంధన మర్థము; కనుక సేతుశబ్దమునకు బంధన మని వ్యుత్పత్త్యర్థము. బంధన శబ్దముచే విధారణ మవగతమగుచున్నది.

ఇతర వ్యాఖ్యాతలు సేతుశబ్దమున కిట్లర్థమును నిరూపించిరి. "ఆవస్తువునొక్కదానినే యాత్మగా దెలిసికొనుము" అని, సంకీర్తనముచేయబడిన యాత్మజ్ఞాన మేదిగలదో, అదియు "ఇతరవాక్కులను వదలివేయుము" అను వాగ్విమోచనము,

మృతస్యైష సేతురితి సేతుశ్రుత్యా సంకీర్త్యతే న తు ద్యుభ్వాద్యాయతనం. తత్రి యదుక్తం సేతుశ్రుతే ర్బ్రిహ్మణోఽర్థాంతరేణ ద్యుభ్వాద్యాయతనేన భవితవ్యమిత్యేతదయుక్తమ్. ।

## ముక్తోపసృప్యవ్యపదేశాత్ (సూ: 2)

ఇతశ్చ పరమేవ బ్రిహ్మ ద్యుభ్వాద్యాయతనం యస్మాన్ముక్తోపసృప్యతాఽస్య వ్యపదిశ్యమానా దృశ్యతే ముక్తైరుపసృప్యం. దేహాదిష్వనాత్మసు అహమస్మీ త్యాత్మబుద్ధిరవిద్యా. తతస్తత్పూ

---

ఈరెండు నమృతత్వసాధనము లగుటవలన, "అమృతస్య సేతుః" అను సేతుశ్రుతిచే స్తోత్రిము చేయబడుచున్నవి. కాని యీ శ్రుతి ద్యులోక భూలోకముల యాయతనత్వమును చెప్పుట లేదు. ఆపక్షమున, ద్యుభ్వాద్యాయతనము బ్రిహ్మముకంటె నన్యమని భావింపదగియున్నది. [అనగా జ్ఞాన మమృతత్వమునకు సేతు వని గ్రిహింపవలయును.] 1

యదా సర్వే ప్రిముచ్యన్తే(బృ4–4–9)తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః (ముం 3–2–8) మొదలగు శ్రితుల యందు ద్యుభ్వాయతనము, ముక్త ఉపసృప్య వ్యపదేశాత్ = ముక్తులచే జేరదగిన స్థలముగ నుపదేశింప బడుటవలన పర బ్రిహ్మ మగును.

చెప్పబోవు కారణమువలనగూడ ద్యుభ్వాద్యాయతనము పరబ్రిహ్మమేయగుచున్నది. ముక్తులగు వారీ ఆయతనమును బొందుదు రని చెప్పబడుచున్నది. అనాత్మభూతములగు దేహాదులు నే నగుచున్నానను జ్ఞాన మవిద్య;

జనాదౌ రాగః, తత్పరిభవాదౌ ద్వేషః, తదుచ్ఛేదదర్శనాద్భయం మోహాశ్చేత్యేవమయమనంతభేదోఽనర్థవ్రాతస్సంతత స్సర్వేషాం నః ప్రత్యక్షః, తద్విపర్యయేణావిద్యారాగద్వేషాదిదోషముక్తైరుప సృప్యముపగమ్య మేతదితి ద్యుభ్వాద్యాయతనం ప్రకృత్య వ్యపదేశో భవతి. కథం? "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ము2-2-8) ఇత్యుక్త్వా బ్రవీతి — 'యథా నద్యస్స్యందమానాస్సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ, తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం' (ముం3-2-8) మితి.

---

అందువలన సద్దానిపూజింపుటయందు రాగము, దానికి బరిభవము కలిగినపుడు ద్వేషము, దానికి నాశకారణము కాన్పించినపుడు భయము, చిత్తవైకల్యము ఇట్లనేక విధముల అపరిమితములునగు తెంపులేని యనర్థపరంపరలు మనకు బ్రత్యక్షములుగ నున్నవి. ఇందుకు భిన్నముగ నవిద్య, రాగము, ద్వేషము మొదలగు దోషముల తొలగినవారు దీనిని బొందుచున్నారని ప్రకృతమగు ద్యుభ్వాద్యాయతనమును గూర్చిన

ముక్తులు పొందునది బ్రహ్మము.

శ్రుతి చెప్పుచున్నది. అదియెట్లనిన, పరాత్పరుడగు నా పరమాత్మదర్శనమగు చుండ బుద్ధినాశ్రయించి పీటముడివలె గట్టిపడిన యవిద్యావాసనాజాలము వీడిపోవును. నదీప్రవాహము వలె నవిచ్ఛిన్నముగ ప్రవహించుచున్న సర్వసంశయ సంతానము విచ్ఛిన్నమగును. (ముం 2-2-8) అని చెప్పి 'నదులు సముద్రము నందువలె, విద్వాంసుడు తన నామ

బ్రహ్మణశ్చ ముక్తోపసృప్యత్వం ప్రసిద్ధం శాస్త్రే, 'యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః, అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత' (బృ4-4-7) ఇత్యేవమాదౌ. ప్రధానాదీనాం తు న క్వచిన్ముక్తోపసృప్యత్వం ప్రసిద్ధమస్తి.।

అపి చ 'తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముంచథే'తి వాగ్విమోచనపూర్వకం విజ్ఞేయత్వమిహ ద్యుభ్వాద్యాయతనస్యోచ్యతే. తచ్చ శ్రుత్యంతరే బ్రహ్మణో దృష్టం — 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః. నానుధ్యాయాద్బహూంఛబ్దాన్ వాచో విగ్లాపనం హి త' (బృ4-4-21) దితి. తస్మాదపి ద్యుభ్వాద్యాయతనం పరం బ్రహ్మ.।

---

రూపములను గోల్పోయి ప్రకాశాత్మకుడగు పరాత్పరుని యందనన్యత్వము నొందుచున్నాడు' అని శ్రుతి పల్కుచున్నది. ముక్తులగువారు బ్రహ్మమును బొందుదురని "హృదయము నాశ్రయించియున్న కామములు విడిపోయినపుడు మర్త్యుడమృతుడై బ్రహ్మమును బొందు"ను బృహదారణ్యకశ్రుతి మొదలగువానియందు సుప్రసిద్ధము. ముక్తులగువారు ప్రధానాదులను బొందుదురని శాస్త్రప్రసిద్ధ లేదు.

"ఆ మాయతనము నొక్కదానినే యాత్మగ దెలిసికొనుము. తదన్యములగు వాక్కులను వదలివేయుము. అమృతమునకిది సేతువు" అనువాక్యమునందు ద్యుభ్వాద్యాయతనము సర్వవాగ్విమోకపూర్వకముగ దెలిసికొనదగినట్లుదాహరింపబడినది. ఇట్టి లక్షణము శ్రుత్యంతరమునందు బ్రహ్మమును గూర్చి చెప్పబడియున్నది. "ధీరుడగు బ్రహ్మజ్ఞాని బ్రహ్మ

యథా బ్రహ్మణః ప్రతిపాదకో వైశేషికో హేతురుక్తః నైవమర్థాంతరస్య వైశేషికో హేతుః ప్రతిపాదకోఽస్తీత్యాహ. ।

## నానుమానమతచ్ఛబ్దాత్ (సూ. 3)

నానుమానం సాంఖ్యస్మృతిపరికల్పితం ప్రధానమిహ ద్యుభ్వాద్యాయతనత్వేన ప్రతిపత్తవ్యం. కస్మాత్? అతచ్ఛబ్దాత్. తస్యాచేతనస్య ప్రధానస్య ప్రతిపాదకశ్శబ్దస్తచ్ఛబ్దః న

---

మును దెలిసికొని స్థిరబుద్ధిని బొందవలయును. అనేకములగు నితరశబ్దములను ధ్యానింపగూడదు. అవి వాగింద్రియమునకు శ్రమ కారణము"లని బృహదారణ్యక (4-4-21)శ్రుతి. కనుక ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమగుచున్నది. (2)

అ॥ ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమనుటకు ప్రత్యేక కారణములు కాన్పించుచున్నట్లు మఱియొకదానిని గూర్చి కాన్పించుటలేదని తరువాత సూత్రమునం దుదాహరింపబడుచున్నది.

అనుమానం = అనుమానప్రమాణముచేత దెలియదగు ప్రధానము, న = ద్యుభ్వాద్యాయతనము కానేరదు, అతత్ శబ్దాత్ = ప్రధానమును బోధించు వైదికశబ్దములు కానరాకుండుట వలన.

సాంఖ్యదర్శనమునందు గల్పింపబడిన ప్రధానమును, ప్రకృతమునగు ద్యుభ్వాద్యాయతనముగ గ్రహింపతగదు. ఏలయన: దానిని బోధించు వైదిక శబ్దములు కానరాకుండుట

తచ్ఛబ్దోఽతచ్ఛబ్దః. న హ్యత్రాచేతనస్య ప్రధానస్య ప్రతిపాదకః కశ్చిచ్ఛబ్దోఽస్తి యేనాచేతనం ప్రధానం కారణత్వేనాయతనత్వేన వాఽవగమ్యేత. తద్విపరీతస్య చేతనస్య ప్రతిపాదకశబ్దోఽత్రాస్తి 'యస్సర్వజ్ఞస్సర్వవి' (ము 1-1-9) దిత్యాదిః అత ఏవ న వాయు రపీహ ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రీయతే. ।

---

ప్రధానము వేద్యము కాదు.

వలన. సూత్రమునందలి తచ్ఛబ్దము అచేతనమగు ప్రధానమును చెప్పుచున్నది. తచ్ఛబ్దము కానిది అతచ్ఛబ్దము. అచేతనమగు ప్రధానము జగత్తునకు కారణమనిగాని, ఆయతనమనిగాని తెలిసికొనదగిన శబ్దమొక్కటిగూడ నీప్రకరణమున కానరాదు. ప్రధానమునకు విరుద్ధమగు చేతన మాయతనమని బోధించు శబ్ద మిచట కాన్పించుచున్నది. "ఎవడు సర్వజ్ఞుడో, ఎవడు సర్వవేత్తయో" యను ముండకవాక్యమున (2-2-7) వినబడు సర్వజ్ఞుడు సర్వవేత్త అవశ్యము చేతను డగుచున్నాడు. వాయు వాయతన మని బోధించు శబ్దముకూడ కానరానందున దీనియందుగూడ ద్యుభ్వాద్యాయతనత్వము సంభవింపనేరదు. (3)

అ॥ అచేతన మగు ప్రధానమున కాయతనత్వము సంభవింపకుండుగాక. చేతనుడగు జీవునికి సంభవింపగూడదా యను ప్రశ్నకు దరువాత సూత్రమున సమాధానము చెప్పబడుచున్నది.

## ప్రాణభృచ్చ (సూ. 4)

యద్యపి ప్రాణభృతో విజ్ఞానాత్మన ఆత్మత్వం చ సంభవతి తథాప్యుపాధిపరిచ్ఛిన్నజ్ఞానస్య సర్వజ్ఞత్వాద్యసంభవే సత్యస్మాదేవాతచ్ఛబ్దాత్ప్రాణభృదపి న ద్యుభ్వాద్యాయతనత్వే నాశ్రయితవ్యః. న చోపాధిపరిచ్ఛిన్నస్యావిభోః ప్రాణభృతో ద్యుభ్వాద్యాయతనత్వమపి సమ్యక్సంభవతి. పృథగ్యోగకరణ ముత్తరార్థం.।

---

ప్రాణభృత్ చ = విజ్ఞానాత్మయగు జీవుడు గూడ నాయతనము కానేరడు.

విజ్ఞానాత్మయగు జీవునికి ఆత్మత్వము, చేతనత్వము గూడ సంభవించినను, ఉపాధిచే బరిచ్ఛిన్నుడగుటచే నతని జ్ఞానము గూడ పరిచ్ఛిన్నమగుచున్నది.సర్వజ్ఞత్వాదిగుణము లతనికి సంభవముగావు. కనుక నతనిని దెలియజేయు శబ్దములు లేవను కారణముచేతనే ద్యుభ్వాద్యాయతనత్వము జీవునియందు ఘటింపదు. జీవుడుపాధిపరిచ్ఛిన్నుడగుటచే నతడు సర్వవ్యాపి గూడ గానేరడు. అందువలన ద్యుభ్వాద్యాయతనత్వముగూడ నీతనికి సంపూర్ణముగ సిద్ధముకాదు. ఈసూత్రార్థమును బూర్వసూత్రార్థమునందు గలిపిచెప్పుటకు వీలైనను రాబోవుసూత్రత్రయము నుద్దేశించి యీసూత్రము ప్రత్యేకముగ రచింపబడినది. [ప్రధానము ద్యుభ్వాద్యాయతనము కాదనుటకు అతచ్ఛబ్దమొక కారణముగ

(జీవబ్రహ్మలకు భేద ముదాహరింప బడినది.)

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రయితవ్యః?

## భేదవ్యపదేశాత్ చ (సూ. 5)

భేదవ్యపదేశశ్చేహ భవతి 'తమేవైకం జానథ ఆత్మాన' మితి జ్ఞేయజ్ఞాతృభావేన. తత్ర ప్రాణభృత్తావన్ముముక్షుత్వాత్ జ్ఞాతా, పరిశేషాదాత్మశబ్దవాచ్యం బ్రహ్మ జ్ఞేయం ద్యుభ్వాద్యాయతనమితి గమ్యతే న ప్రాణభృత్.।

---

నుదాహరింప బడినది. జీవుడు కాదనుటకు గల కారణములన్నియు(5-6-7)సూత్రములయందు నుదాహరింప బడినది.] (4)

మఱి యేకారణముల వలన జీవునికి ద్యుభ్వాద్యాయతనత్వము ఘటింప దనిన

జీవునికిని ద్యుభ్వాద్యాయతనమునకును భేదము పాటింప బడుటచేత జీవు డాయతనము కానేరడు.

"ఆ ఆత్మ నొక్కదానినే ఆయతనముగ దెలిసికొనుము" అనువాక్యమునందు ఆత్మ జ్ఞేయ మనియు, జీవుడు తెలిసికొనువా డనియు,జ్ఞేయము జ్ఞాత యను భేదభావ ముపదిష్టమగుచున్నది. జీవు డన్ననో, ముముక్షు వగుటచేత జ్ఞాతయగుచున్నాడు. మిగిలిన యాత్మశబ్దవాచ్యుడు జ్ఞేయమునగు బ్రహ్మము ద్యుభ్వాద్యాయతనము కావలయును గాని జీవుడు కానేరడు. [ఈసూత్రమును (1-1-21) సూత్రముతో పోల్చి చూడవలెను.] (5)

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రయితవ్యః?

## ప్రకరణాత్ (సూ. 6)

ప్రకరణం చేదం పరమాత్మనః. 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీ' (ము౦1-1-3) త్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానాపేక్షణాత్. పరమాత్మని హి సర్వాత్మకే విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం స్యాత్, న కేవలే ప్రాణభృతి.।

---

మఱియే కారణముచేత జీవుడు ద్యుభ్వాద్యాయతనము కానేరడన

ప్రకరణవిషమును బట్టిగూడ జీవుడు ద్యుభ్వాద్యాయతనము కానేరడు.

ప్రకృత ప్రకరణము పరమాత్మకు సంబంధించినది. "దేనిని దెలిసికొనిన నిది యంతయు దెలిసినదియగును?"(ముం 1-1-3) [బ్రహ్మజిజ్ఞాసు వగు శౌనకుడీప్రశ్నను అంగీరసు నడిగెను.సమాధానమునకై ముండకము ప్రవర్తించుచున్నది.]ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞానమపేక్షింపబడుచున్నది. సర్వస్వరూపుడగు పరమాత్మను దెలిసికొనినపుడే, యిదియంతయు దెలియబడినది యగును. జీవుని దెలిసికొనిన నిది యంతయు దెలియబడదు. ( సువర్ణమును దెలిసి కొనిన తత్స్వరూపము లగు నాభరణము లన్నియు దెలియును.ప్రపంచ మంతయు బ్రహ్మస్వరూపము గనుక బ్రహ్మము దెలిసిన బ్రపంచ మంతయు దెలియును.) (6)

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రి
యితవ్యః?

## స్థిత్యదనాభ్యాం చ (సూ. 7)

ద్యుభ్వాద్యాయతనం ప్రకృత్య 'ద్వా సుపర్ణా సయుజా సఖాయే' (ముం3-1-1) త్యత్ర స్థిత్యదనే నిర్దిశ్యేతే. 'తయోరన్యః పిప్పలం స్వాద్వత్తీ'తి కర్మఫలాశనం 'అనశ్నన్నన్యో అభిచాక శీతీ' త్యౌదాసీన్యేనావస్థానం, తాభ్యాం చ స్థిత్యదనాభ్యామీశ్వర క్షేత్రజ్ఞౌ తత్ర గృహ్యేతే. యది చేశ్వరో ద్యుభ్వాద్యాయతనత్వేన

---

మఱి యేకారణముచేత జీవుడు ద్యుభ్వాద్యాయత నము కానేర డనిన

"ద్వాసుపర్ణా" (ముండ 3-1-1) యనుమంత్రమునందు బ్రహ్మమునకు సాక్షిరూపమున నునికియు, జీవునికి గర్మఫలాను భవము, అదనాభ్యాంచ = స్థిత్యదనము లను పదములచే గూడ చెప్పబడుటచేతను జీవు డాయతనము కానేరడు.

విడిపోక యెల్లపుడు గలిసియుండునట్టియు, సమానమైన నామములు గలిగినట్టియు రెండు పక్షులు అను మొదలుగాగల ముండకవాక్యము (3-1-1) ద్యుభ్వాద్యాయతనమునుగూర్చి ఆశంసించుచు, ఉనికిని అనుభవమును బలుకరించుచున్నది. "వానిలో నొకటి రుచ్యమగు కర్మఫలము ననుభవించు చున్నది" యని యొకదాని కర్మఫలానుభవమును, "రెండ వది యేమియు ననుభవింపక చూచుచుమాత్ర ముండు"నని రెండవదాని ఔదాసీన్యస్థితిని నావాక్య ముదాహరించు

వివక్షితః తతస్తస్య ప్రకృతస్య క్షేత్రజ్ఞాత్పృథగ్వచనమవకల్పతే, అన్యథా హ్యాపరికృతవచనమాకస్మికమసంబద్ధం స్యాత్. ।

పూ.పక్షి: నను తవాపి క్షేత్రజ్ఞస్యేశ్వరాత్పృథగ్వచన మాకస్మిక మేవ పరిసజ్యేత. ।

సిద్ధాంతీ: న తస్యావివక్షితత్వాత్. క్షేత్రజ్ఞో హి కర్తృత్వేన భోక్తృత్వేన చ ప్రతిశరీరం బుద్ధ్యాద్యుపాధిసంబంధో లోకత ఏవ ప్రసిద్ధః నాసౌ శ్రుత్యా తాత్పర్యేణ వివక్ష్యతే. ఈశ్వ

---

చున్నది. ఈరెండు స్థితులచే నీశ్వరజీవులు తెలియచేయబడు చున్నారు. ద్యుభ్వాద్యాయతనము నీశ్వరు డని జెప్పినపుడే యతఁడు జీవునికంటె భిన్నుడని చెప్పుట సమంజసము. [జీవుడు గాని, హిరణ్యగర్భుడుగాని ద్యుభ్వాద్యాయతన మైనచో] ఆ ప్రకరణమున బరమాత్మ ప్రసంగ మప్రసక్తము నాకస్మి కము నగును.

పూ. పక్షి: ద్వాసుపర్ణాయను వాక్యమునం దుదాహ రింపబడిన పక్షిద్వయము ఈశ్వర క్షేత్రజ్ఞులని వాదించు మీా వాదము నందుగూడ నీశ్వరునికంటె క్షేత్రజ్ఞుడు వేఱని యుప పాదించుట యాకస్మికమే యగుచున్నది కదా ?

సిద్ధాంతి: మీారు చెప్పునట్లుకాదు. జీవుని గూర్చి వివరించుట శ్రుతితాత్పర్యముకాదు. క్షేత్రజ్ఞుడు ప్రతిశరీరము నందును బుద్ధ్యుపాధిసంబంధుడై కర్తయని భోక్తయని సుప్రసిద్ధముగ దెలియుచున్నాడు. కనుక నతనిగూర్చి ప్రత్యేకముగ చెప్పుట యందు శ్రుతికి తాత్పర్యము లేదు. ఈశ్వరు డన్ననో యప్ర

రస్తు లోకతోఽపరిసిద్ధత్వాత్ శ్రుత్యా తాత్పర్యేణ వివక్ష్యత ఇతి న తస్యాకస్మికవచనం యుక్తం. 'గుహాం ప్రవిష్టావాత్మానౌ హి' త్యత్రాప్యేతద్దర్శితం. ద్వాసుపర్ణేత్యస్యామృచి ఈశ్వరక్షేత్రజ్ఞావుచ్యేతే ఇతి. ।

యదాపి పైంగ్యుపనిషత్కృతేన వ్యాఖ్యానేనాస్యామృచి సత్త్వక్షేత్రజ్ఞావుచ్యేతే తథాపి న విరోధః కశ్చిత్. కథం? ప్రాణభృదిహ ఘటాదిచ్ఛిద్రవత్సత్త్వాద్యుపాధ్యభిమానిత్వేన ప్రతిశరీరం గృహ్యమాణో ద్యుభ్వాద్యాయతనం న భవతీతి ప్రతిషిధ్యతే. యస్తు సర్వశరీరే షూపాధిభిర్వినోపలక్ష్యతే పర ఏవ

---

సిద్ధుడు. ప్రత్యేక మతని గూర్చి శ్రుతి చెప్ప దలంచుటయం దాకస్మికత యేమియు లేదు. "ద్వాసుపర్ణా" అను ఋక్కునం దీశ్వర క్షేత్రజ్ఞులనుగూర్చి చెప్పబడుచున్నది యని "గుహాం ప్రవిష్టౌ" (సూ2-11) అను సూత్రవ్యాఖ్యానమునందు వివరించి యున్నాము.

ఈ ఋక్కునందు సత్త్వక్షేత్రజ్ఞులు పలుకరింపబడుచున్నట్లు పైంగ్యుపనిషద్వ్యాఖ్యానమునం దుదాహరింప బడినది. [సత్త్వమనబుద్ధి (1-2-12) సూత్రవ్యాఖ్యానమును చూడవలెను.] అయినను క్షేత్రజ్ఞుడు ద్యుభ్వాద్యాయతనము కానేరడను మావాదమునకు విరోధము లేదు. ఎట్లన? మహాకాశ ముపాధిభేదముచే ఘటాకాశము మఠాకాశమని వివిధములుగ భాగింపబడినట్లె జీవుడుగూడ బ్రతిశరీరమునందు దానికంటె భిన్నముగానున్న బుద్ధియను ఉపాధి నాశ్రయించినవాడై దానియం దభి

పైంగిమతానుసారము సూత్రసమన్వయము.

స భవతి. యథా ఘటాదిచ్ఛిద్రాణి ఘటాదిభిరుపాధిభిర్వినోప లక్ష్యమాణాని మహాకాశ ఏవ భవంతి తద్వత్ప్రాణభృతః పరస్మా దన్యత్వానుపపత్తేః ప్రతిషేధో నోపపద్యతే, తస్మాత్సత్వాద్యుపా ధ్యభిమానిన ఏవ ద్యుభ్వాద్యాయతనత్వప్రతిషేధః తస్మాత్పర మేవ బ్రహ్మ ద్యుభ్వాద్యాయతనం. తదేతత్ 'అదృశ్యత్వాది గుణకో ధర్మోక్తే' రిత్యత్రైవ సిద్ధం, తస్యైవ హి భూతయోని వాక్యస్య మధ్య ఇదం పఠితం—'యస్మిన్ ద్యౌః పృథివీ చాంత రిక్ష' మితి ప్రపంచార్థం తు పునరుపన్యస్తం. ।

---

మానముగలిగి యనేకత్వము నొందుచున్నాడు. కనుక నతడు ద్యుభ్వాద్యాయతనము కానేరడని ప్రకృతసూత్రము నందును, అంతకు పూర్వసూత్రముల యందును నిషేధింపబడినది అతడే వివిధశరీరసంపాత మగు నుపాధిసంబంధము లేక విచారింప బడినపుడు పరమాత్మయగుచున్నాడు. వివిధ ఘటములయం దున్న యవకాశములు, ఘటములు పోయినపుడు మహాకాశమే యగుచున్నవి. జీవుడు పరమాత్మకంటె భిన్నుడు కాడు; కనుక నతడు ద్యుభ్వాద్యాయతనము కానేర డనుట తగదు. బుద్ధి మొదలగు నుపాధిసంబంధము కలిగిన దశయందు మాత్రమే యతనికి ద్యుభ్వాద్యాయతనత్వము నిషేధింపబడుచున్నది. కనుక పరబ్రహ్మమే ద్యుభ్వాద్యాయతన మగుచున్నాడు. ఈ విషయము "అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" (సూ 1-2-21) అనుసూత్రమున నిశ్చయింపబడినది. అచట విచా రింపబడిన భూతయోనివాక్య సందర్భమున "దేనియందు ద్యులోకము, పృథివి, అంతరిక్షము" (ము. 2-2-5) ప్రస్తా

పింపబడినదో యీ విషయమునే విపులము చేయుటకై తిరిగి
యిచట ప్రస్తావింపబడినది. 7

<u>అధికరణ సంక్షేపము</u> : “యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షం. ఇత్యాది ముండక (2-2-5) వాక్యమునందు వినబడుచున్న ద్యులోక భూలోకాదుల ఆయతనము ప్రధానమో, వాయువో, జీవుడో కావలెను గాని పరమేశ్వరుడు కానేరడు. “అమృతస్యైష సేతుః” అను వాక్యముచేత నీ యాయతన మమృతత్వముకంటె భిన్నము కావలెను. పరిచ్ఛిన్నము గూడ కావలెను. లేక భోగ్యమగు ప్రపంచమంతయు భోక్తయగు జీవుని యధీనమునం దుండుటచేత జీవు డాయతనము కావచ్చును. ఇది పూర్వపక్షము. పరమేశ్వరుడే యీ యాయతనమని సిద్ధాంతము. “తమేవైకం జానథ ఆత్మానం” అను తరువాతవాక్యమునం దాత్మశబ్దము వినబడుటయే గాక ఆతనినే తెలిసికొనుమని యవధారణపూర్వకముగ చెప్పబడుచున్నది. ఆత్మశబ్దముచే పరబ్రహ్మ మనేకస్థలముల నిర్దేశింపబడుచున్నాడు. సేతుశబ్దమునకు ధారణమర్థము. రాగాది దోషముల నుండి విముక్తులగు వారా ఆయతనమును జేరుచున్నారు. అనుమానముచే నూహింపదగు ప్రధానముగాని జీవుడుగాని వైదిక శబ్దములచే జెప్పబడుటలేదు. జీవునికిని ఈశ్వరునికిని భేదము చెప్పబడుచున్నది. ప్రకరణము జీవప్రకరణము గాదు. ఫలము ననుభవించువాడు జీవుడు, దూరము నుండి యుదాసీనభావమున జూచువా డీశ్వరుడని చెప్పబడుచున్నది.

## (2) భూమాధికరణము

అ॥ "తమేవైకం జానథ ఆత్మానం" అను ముండక వాక్యములోని ఆత్మశబ్దబలముచే ద్యుభ్వాద్యాయతనము పరబ్రహ్మ మని పూర్వాధికరణమున నిశ్చయింప బడినది. "తరతి శోకమాత్మవిత్" (ఛాం 7-1-3) అను వాక్యమునం దాత్మశబ్దము బ్రహ్మపరముగాను, ప్రాణపరముగాను గూడ ప్రయోగింపబడుటవలన నా పదము నియతముగ బ్రహ్మపరమన వీలు లేదని వచ్చిన పూర్వపక్షమును నివారించుటకై భూమాధికరణ మారంభింప బడుచున్నది.

విషయవాక్యము : "భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః భూమానం భగవో విజిజ్ఞాస" (ఛాం 7-23-1).

సంశయము : భూమశబ్ద మిచట ప్రాణపరమా? పరమాత్మపరమా?

పూర్వపక్షము : ప్రాణపరము.

సిద్ధాంతము : పరమాత్మపరము.

అవలోకనము చేయదగిన శ్రుతులు –

ఛాం. సప్తమాధ్యాయ మంతయు, బృహదారణ్యకము 4-5-15-4-3-32,3-4-2, ప్రశ్నోపనిషత్తు 4-2-3, 4-2-6 శ్వేతాశ్వతరము 6-15 కౌషీతకి 3-2,

# భూమా సంప్రసాదా దధ్యుపదేశాత్
(సూ. 8-9)

ఇదమామనంతి 'భూమాత్వేవ విజిజ్ఞాసితవ్య' ఇతి, 'భూమానం భగవో విజిజ్ఞాస' ఇతి. 'యత్ర నాన్యత్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా, అథ యత్రాన్యత్పశ్య త్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్ప' (ఛాం23-24) మిత్యాది. । తత్ర సంశయః, కిం ప్రాణో భూమా స్యాదాహో

---

భూమా త్వేవ విజిజ్ఞాసి తవ్యః (ఛాం 7-23-1) అను శ్రుతి యందలి భూమశబ్దము పరమాత్మపరము. ఏలయన ? సంప్రసాదాత్ అధి = జీవుని కంటె నుపరిభాగమున, ఉప దేశాత్ = ఉపదేశింపబడుటవలన.

భూమమే తెలిసికొనదగినది. [అని సనత్కుమారుడు చెప్పెను.] భూమమునే నేను దెలిసికొనెదను. [అని నారదుడు చెప్పెను.]ఏతత్త్వమునందు మఱియొక సాధనముచేత చూడ తగినది తెలిసికొన దగినది, వినదగినది లేదో అది భూమము. ఎచట నుఱియొకసాధనముచే చూడ తగినది, వినదగినది, తెలిసికొన దగినది మఱియొకటి గలదో యది యల్పము. [అని సనత్కుమారుడునారదునకుపదేశించెను. (ఛాం.7-23-24) అని ఛాందోగ్యశ్రుతి పల్కుచున్నది. భూమశబ్దమునకు నిరతిశయ సుఖ మర్థము.]

ఈ వాక్యమునందు భూమము ప్రాణ మగునా లేక పరమాత్మ యగునా యని సంశయము, ఈ సంశయ మేల

స్విత్పరమాత్మేతి. కుతస్సంశయః? భూమేతి తావద్బహుత్వ మభిధీయతే. 'బహోర్లోపో భూ చ బహోః' (పా. ౬, ౪. ౧౫౮) ఇతి భూమశబ్దస్య భావప్రత్యయాన్తతాస్మరణాత్. కిమాత్మకం పునస్తద్బహుత్వమితి విశేషాకాంక్షాయాం 'ప్రాణో వా ఆశాయా భూయా'నితి సన్నిధానాత్ప్రాణో భూమేతి ప్రతిభాతి. తథా 'శ్రుతం హ్యేవమేవ భగవద్దృశేభ్య స్తరతి శోకమాత్మవి' దితి, 'సోఽహం భగవశ్శోచామి తం మా భగవాన్ శోకస్య పారం తారయత్వి (ఛాం. 7-1-3)'తి. ప్రకరణోత్థానాత్ పరమాత్మా భూమేత్యపి ప్రతిభాతి. తత్ర కస్యోపాదానం న్యాయ్యం కస్య వా హానమితి భవతి సంశయః ।

---

కలుగవలెను? పాణిని (6-4-158) సూత్రమువలన భూమశబ్దముచే బహుత్వము చెప్పబడుచున్నది. ఇట్టి బహుత్వము యొక్క స్వరూపమెట్టిది యని విశేషజిజ్ఞాస కల్గుచున్నది. ఆశకంటె ప్రాణము భూయస్తర మని (ఛాం. 7-15-1) సన్నిధానవాక్యము వినబడుచున్నది. కనుక ప్రాణము భూమ మని కాన్పించుచున్నది. "ఆత్మను దెలిసికొనిన వాడు శోకసాగరమును దాటునని మీబోటి పెద్దలు చెప్పగా వినుచున్నాము. నేనాత్మవిదుడను గానని శోకించుచున్నాను. అట్టి నన్ను దయచేసి శోకసాగరము దరికి చేర్చుడని [నారదవచనముతో] ప్రకరణ మారంభ మగుటవలన పరమాత్మ భూమము కాదగు నని కాన్పించుచున్నది. ఈ రెండిటిలో దేనిని విడిచిపెట్టి దేనిని పరిగ్రహించుట న్యాయ మని సంశయము గలుగుచున్నది.

కిం తావత్ప్రాప్తం? ప్రాణో భూమేతి. కస్మాత్? భూయసః ప్రశ్నప్రతివచనపరంపరాదర్శనాత్. యథాహి 'అస్తి భగవో నామ్నో భూయ' ఇతి 'వాగ్వావ నామ్నో భూయసీ'తి తథా 'అస్తి భగవో వాచో భూయ' ఇతి, 'మనో వావ వాచో భూయ' ఇతి నామాదిభ్యో హ్యాప్రాణాద్భూయః ప్రశ్న ప్రతివచనప్రవాహః ప్రవృత్తః, నైవం ప్రాణాత్పరం భూయఃప్రశ్న ప్రతివచనం దృశ్యతే. 'అస్తి భగవః ప్రాణాద్భూయ' ఇతి 'అదో వావ ప్రాణాద్భూయ' ఇతి ప్రాణమేవ తు నామాదిభ్య ఆశాంతేభ్యో భూయాంసం 'ప్రాణో వా ఆశాయా భూయా' నిత్యాదినా సప్రపంచముక్త్వా ప్రాణదర్శినశ్చాతివాదిత్వం 'అతివాద్యసీ'తి

---

పూర్వపక్ష మిట్లు సంప్రాప్త మగుచున్నది. ప్రాణము భూమ మగుచున్నది. ఏలయన? ప్రాణ మాశకంటె భూయస్తర మని (7-15-1) వాక్యమున నుదాహరింప బడినది. అటు తరువాత పూర్వమువలె ప్రాణముకంటె భూయస్తర మేది యని ప్రశ్నగాని దానికి ప్రతివచనము గాని తిరిగి కాన రాకుండుటవలన. నామముకంటె భూయస్తర మేమయిన కలదా? (ఛాం7-1-5) అను ప్రశ్నయు, వాక్కు నామముకంటె భూయస్తర మని (ఛాం7-2-1) ప్రతివచనము. వాక్కుకంటె భూయస్తర మగునది కలదా? (7-2-2) యని ప్రశ్నయు, మనస్సు వాక్కుకంటె నధికతర మని (ఛాం7-3-1) ప్రతివచనము. ఇట్లు నామము మొదలు ప్రాణమువఱకు భూయస్తర మగు దానిని గూర్చి తిరిగి తిరిగి ప్రశ్న, ప్రతివచన ప్రవాహము ప్రవృత్తమైనది. కాని ప్రాణముకంటె, భూయస్తర మగునది

'అతి వాద్యస్మీతి బ్రూయాన్నాపహ్నువీతే' త్యభ్యనుజ్ఞాయ, 'ఏష తు వా అతివదతి యస్సత్యేనాతివదతీ'తి ప్రాణప్రితమతివాదిత్వమనుకృష్యాపరిత్యజ్యైవ ప్రాణం సత్యాదిపరంపరయా భూమానం సమవతారయన్, 'ప్రాణమేవ భూమానం మన్యతే' ఇతి గమ్యతే. ।

---

యేమైననుగలదా? యని ప్రశ్న గాని, ప్రాణముకంటె నిది భూయస్తర మగునది కలదని గాని, ప్రాణముతరువాత ప్రశ్న ప్రతివచనములు కాన్పించుటలేదు. నామము మొదలాశవఱకు గలవాని యన్నిటి కంటెను ప్రాణమె భూయస్తమ మని విస్తరించి చెప్పబడినది. మఱియు "ప్రాణమును దెలిసికొనిన వాడతివాది యని లోకులు పలికిన, నిజమే నేనతివాదినే యని యొప్పుకొనవలయును" (ఛాం 7-15-4) అని ప్రాణదర్శి యొక్క యతివాదిత్వ మంగీకరింప బడుచున్నది. ఇంతియ కాదు. "తానే సర్వేశ్వరు డగు ప్రాణమని తెలిసికొనిన వాడతివాది కానేరడు." (ఛాం 7-16-1) అను వాక్యమునందు ప్రాణమును బరిత్యజింపకయె ప్రాణపదము ననుసరించియే సత్యాదిపరంపరచే చివరకు భూమమును శ్రుతి ప్రవేశపెట్టుచున్నది. [అనగా ప్రాణము, మతి, శ్రద్ధ, నిష్ఠ, కృతి, సుఖము అనునవి పూర్వపూర్వమున కుత్తరోత్తరము కారణమై పూర్వపూర్వముకంటె నుత్తరోత్తర మధిక తరమని ప్రాణము ద్వారా సుఖ ముపదేశింప బడినది. కనుక ప్రాణమే భూమ మని శ్రుతి తాత్పర్యముగ కాన్పించుచున్నది.

మధ్యవర్తి: కథం పునః ప్రాణే భూమ్ని వ్యాఖ్యాయమానే 'యత్ర నాన్యత్పశ్యతీ' త్యేతద్భూమ్నో లక్షణపరం వచనం వ్యాఖ్యాయే తేతి. ।

పూ. పక్షి. ఉచ్యతే — సుషుప్తావస్థాయాం ప్రాణగ్రస్తేషు కరణేషు దర్శనాదివ్యవహారనివృత్తిదర్శనాత్ సంభవతి ప్రాణస్యాపి 'యత్ర నాన్యత్పశ్యతీ' త్యేతల్లక్షణం. తథా చ శ్రుతిః— 'నశృణోతి న పశ్యతీ' త్యాదినా సర్వకరణవ్యాపారప్రత్యస్తమయరూపాం సుషుప్తావస్థాముక్త్వా 'ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతీ' (ప్ర.4-2-3) తి తస్యామేవావస్థాయాం పంచవృత్తేః ప్రాణస్య జాగరణం బ్రువతీ ప్రాణప్రధానాం సుషు

---

మధ్యవర్తి: ప్రాణమే భూమ యని వ్యాఖ్యానము చేసిన చో, నెచటనట్టి యేదియు కాన్పింపదో (ఛాం7-24-1) యని భూమలక్షణమును నిరూపించుచున్న వాక్యమునకు సమన్వయ మెట్లు చేయదగును ?

పూ.పక్షి: సమాధానము చెప్పుచున్నాము. సుషుప్త్యవస్థయందు చక్షురాదీంద్రియము లన్నియు ప్రాణమునందు లయమగుచున్నవి. అక్కాలమున దర్శనాదిసర్వవ్యవహారలోపము కాన్పించుచున్నది. కనుక పైనుదహరింపబడిన భూమలక్షణము ప్రాణమునందు సమకూరుచున్నది. [సుషుప్తియందు] "దేనిని వినదు, దేనిని చూడదు?" అని సర్వేంద్రియవ్యాపారోపరమమును ప్రదర్శించి "ఈశరీరమునందు చక్షురాదికరణములు నిద్రించుచుండగ నగ్నులవలె ప్రకాశించుచున్న పంచప్రాణములు మాత్రము మేల్కొనియుండును" (ప్రశ్న 4-2-3)

ప్తావస్థాం దర్శయతి. యచ్చ తద్భూమ్నస్సుఖత్వం శ్రుతం 'యో వై భూమా తత్సుఖ' (ఛాం. 7-23) మితి తదప్య విరుద్ధం, 'యత్రైష దేవస్స్వప్నాన్న పశ్యతి అథైతస్మిన్ శరీరే సుఖం భవతీ (ప్ర 4-6) తి సుషుప్తావస్థాయామేవ సుఖశ్రవణాత్. యచ్చ 'యో వై భూమా తదమృత' మితి, తదపి ప్రాణస్యా విరుద్ధం, 'ప్రాణో వా అమృత' (కౌ 3-2) మితిశ్రుతేః.

మాధ్యమికః: కథం పునః ప్రాణం భూమానం మన్య మానస్య 'తరతి శోకమాత్మవి' దిత్యాత్మవివిదిషయా ప్రకరణ స్యోత్థాపనముపపద్యేత.

---

4-2-3) అని పంచవృత్త్యాత్మకమగు ప్రాణము యొక్క జాగరితముతో నొప్పుచున్న ప్రాణ ప్రధానమగు సుషుప్త్య వస్థను శ్రుతి బోధించుచున్నది. "భూమమేది కలదో యదియే సుఖము"(ఛాం 7-23) అని చెప్పబడుచున్న భూమము యొక్క సుఖస్వరూపము గూడ విరుద్ధము కాదు. "ఈ సుషుప్త్యవస్థ యందు స్వస్వరూపభూత మగు సుఖము నతడనుభవించు చున్నాడు"(ప్రశ్న 4-6) అను వాక్యమునందు సుషుప్త్యవస్థ యందు సుఖానుభవము వినిపించు చున్నది. "భూమమే యమృతము" (ఛాం 7-24-1) అను వాక్యమునందు విన వచ్చుచున్న యమృతత్వము ప్రాణపక్షమున విరుద్ధముకాదు. "ప్రాణ మమృత"మని కౌషీతకిశ్రుతి (3-2) పల్కుచున్నది.

మాధ్యమికః: ప్రాణమే భూమమయినచో ఆత్మను దెలిసి కొనినవాడు శోకపారము చేరునని యాత్మజ్ఞానముతో నుపక్ర మింపబడినప్రకరణవిషయ మెట్లు ఘటించును?

పూ. పక్షీ : ప్రాణ ఏవేహాత్మా వివక్షిత ఇతి బ్రూమః తథా హి—'ప్రాణో హ పితా ప్రాణో మాతా ప్రాణో భ్రాతా ప్రాణస్స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః' (ఛా 7-15-1) ఇతి ప్రాణమేవ సర్వాత్మానం కరోతి. 'యథా వా అరా నాభౌ సమర్పితా ఏవమేవాస్మిన్ ప్రాణే సర్వం సమర్పితమ్' ఇతి చ సర్వాత్మత్వారనాభినిదర్శనాభ్యాం చ సంభవతి వైపుల్యాత్మికా భూమరూపతా ప్రాణస్య. తస్మాత్ప్రాణో భూమే త్యేవం ప్రాప్తం. ।

సిద్ధాంతీ : తత ఇదముచ్యతే. పరమాత్మైవేహ భూమా భవితుమర్హతి, న ప్రాణః. కస్మాత్? సంప్రసాదాదధ్యుపదేశాత్.

---

పూ. పక్షి: ప్రాణమే యిచట నాత్మగ నుదహరింపబడినది యని మే మనుచున్నాము. "ప్రాణము తండ్రి, ప్రాణము తల్లి, ప్రాణము సోదరుడు, ప్రాణము తోఁబుట్టువు, ప్రాణ మాచార్యుడు, ప్రాణము బ్రాహ్మణుడు" అనిగదా ఛాందోగ్యమునందు (7-15-1) చెప్పబడినది. ఈవాక్యముచే సర్వమునకు బ్రాణమే స్వరూప మని తెలియుచున్నది. 'బండి యాకులు కుండయందు వలె సర్వము ప్రాణమునం దమర్పబడి యున్నది' యను వాక్యమునందు బ్రాణము రథనాభికి బోల్పబడినది. ఇట్లు సర్వాత్మత్వరథనాభినిదర్శనములచే బ్రాణమునకు విపుల మగు భూమరూపత్వము సంభవించుచున్నది. కనుక బ్రాణము భూమ మని సిద్ధమగుచున్నది.

సిద్ధాంతి: ఇందు కిట్లు సమాధానము చెప్పుచున్నాము. పరమాత్మయె భూమము కాఁతగును గాని ప్రాణము కానేరదు.

సంప్రసాద ఇతి సుషుప్తిస్థానముచ్యతే. సమ్యక్ప్రసీదత్యస్మిన్నితి నిర్వచనాత్. తథా బృహదారణ్యకే చ స్వప్న జాగరితస్థానాభ్యాం సహ పాఠాత్. తస్యాం చ సంప్రసాదావస్థాయాం ప్రాణో జాగర్తీతి ప్రాణోఽత్ర సంప్రసాదోఽభిప్రేయతే ప్రాణా దూర్ధ్వం భూమ్న ఉపదిశ్యమానత్వాదిత్యర్థః. ప్రాణ ఏవ చేద్భూమా స్యాత్ స ఏవ తస్మాదూర్ధ్వముపదిశ్యేతేత్యశ్లిష్టమేవైతత్స్యాత్. నహి నామ్నైవ నామ్నో భూయ ఇతి నామ్న ఊర్ధ్వముపదిష్టం. కిం తర్హి? నామ్నోఽన్యదర్థాంతరముపదిష్టవాగాఖ్యం

---

సూత్రార్థ వివరణము

ఏలయన?సంప్రసాదము తరువాత భూమ ముపదేశింపబడుటవలన. (1) సంప్రసాద మనగా సుషుప్తిస్థానము. లెస్సగా ప్రసన్నమగునది యని యా శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. బృహదారణ్యక (4-3-15) వాక్యమున స్వప్నజాగరితములతో గూడ పఠింపబడుటచే నీ సంప్రసాదశబ్దమునకు సుషుప్త్యర్థము చెప్పదగును. సంప్రసాదావస్థయందు ప్రాణము జాగరితావస్థయం దుండుటవలన ప్రాణమిచట సంప్రసాదశబ్దముచే నభిప్రేత మగుచున్నది. కనుక ప్రాణమును గూర్చి చెప్పిన తరువాత భూమ ముపదేశింప బడుటచేత 'పరమాత్మయె భూమశబ్దముచే దెలియబడుచున్నది' యని సూత్రార్థము. ప్రాణమే భూమశబ్దార్థమైనచో ప్రాణమును గూర్చి చెప్పిన పిదప భూమమును గూర్చి పలుకరించుట విపరీతముగ కాన్పించును. నామమును గూర్చి చెప్పిన తరువాత నామముకంటె నామము భూయస్తరమని పూర్వమున జెప్పబడియుండలేదు. నామమును గూర్చి

'వాగ్వావనామ్నోభూయసీ'తి, తథా వాగాదిభ్యో హ్యాప్రాణాదర్థాంతరమేవ తత్ర తత్రోర్ధ్వముపదిష్టం, తద్వత్ప్రాణాదప్యూర్ధ్వముపదిశ్యమానో భూమా ప్రాణాదర్థాంతరభూతో భవితుమర్హతి.।

పూ. పక్షీ: నన్విహ నాస్తి ప్రశ్నః, అస్తి భగవః ప్రాణాద్భూయ ఇతి. నాపి ప్రతివచనమస్తి ప్రాణాద్వావ భూయోఽస్తీతి. కథం ప్రాణాదధి భూమోపదిశ్యత ఇత్యుచ్యతే? ప్రాణవిష

---

చెప్పిన తరువాత నామముకంటె వాక్కు భూయస్తర మని నామముకంటె భిన్నమగు వాక్కును గూర్చి చెప్పబడినది. అదేవిధముగ ప్రాణమువఱకు వాక్కు మొదలగు వానికంటె భిన్నములగు నితరము లుపదేశింప బడినవి. అదేవిధముగ ప్రాణము తరువాత నుపదేశింపబడు భూమము ప్రాణము కంటె భిన్నము కావలయును.

పూ. పక్షి: [నామము, వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మృతి, ఆశ, ప్రాణము వీనిలో పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము భూయస్తరమని సనత్కుమారుడు నారదుని ప్రశ్నమీఁద వివరించెను. ఆవిధముగ] ప్రాణముకంటె భూయస్తరమగునది మఱియేమైనను కలదా యని [నారదుని] ప్రశ్నకాని ప్రాణముకంటె భూయస్తరమగునది మఱియొకటి కలదని [ సనత్కుమారుని ] ప్రతివచనము కాని యిచట కాన్పింపదు. ఆ పక్షమున శ్రుతి ప్రాణము

యమేవాతివాదిత్వము త్తరతాऽనుకృష్యమాణం పశ్యామః. 'ఏష తు వా అతివదతి యస్సత్యేనాతివదతీ'తి, తస్మాన్నాస్తి ప్రాణాదధ్యుపదేశ ఇతి. ।

సిద్ధాంతీ: అతోऽభిధీయతే-నతావత్ప్రాణవిషయస్యైవాతివాదిత్వస్యైతదనుకర్షణమితి శక్యం వక్తుం, విశేషవాదాత్, యస్సత్యేనాతి వదతీతి. ।

---

తరువాత భూమము నుపదేశించినది యని చెప్ప నెట్లు శక్యము ? ప్రాణము నామాదుల రీత్యా బ్రహ్మ మని పలుకు వా డతివాదికాడు] " ఎవడు సర్వోత్కృష్టము పర మార్థసత్యము నగు భూమపదార్థమును తెలిసికొని ప్రాణ మును గూర్చి యతివాదముచేయునో వా డతివాది యగు చున్నాడు" (ఛాందో 7-16-1) అనువాక్యమునకు ప్రాణ విషయమగు నతివాదిత్వము సంబంధించియున్నది. కనుక శ్రుతి ప్రాణము గూర్చి చెప్పినతరువాత విశేషవిషయము నేమియు చెప్పుటలేదు. [మితిమీరిపలుకుట అతివదనము.]

సిద్ధాంతి : ఇందుకిట్లు ప్రతివచనము చెప్పుచున్నాము. పై వాక్యము కేవలము ప్రాణవిషయమునుగూర్చిన యతి వదనమునకు సంబంధించినది యనిచెప్పవీలులేదు. "ఎవడు సత్యము నపేక్షించి యతివదనము చేయునో" అని విశేషమును గూర్చిన యతివదనము వినబడు చున్నది.

అతివదన విచారణ

పూ. పక్షీ : నను విశేషవాదోఽప్యయం ప్రాణవిషయ ఏవ భవిష్యతి. కథం? యథా 'ఏషోఽగ్నిహోత్రీ యస్సత్యం వదతీ'త్యుక్తేన సత్యవచనేనాగ్నిహోత్రిత్వం, కేనతర్హి ? అగ్నిహోత్రేణైవ, తత్సత్యవచనం త్వగ్నిహోత్రిణో విశేష ఉచ్యతే, తథా 'ఏష తు వా అతివదతి యస్సత్యేనాతివదతీ'త్యుక్తే న సత్యవచనేనాతివాదిత్వం, కేన తర్హి? ప్రకృతేన ప్రాణవిజ్ఞానేనైవ, సత్యవచనం తు ప్రాణవిదో విశేషో వివక్ష్యత ఇతి. ।

సిద్ధాంతీ : నేతి బ్రూమః, శ్రుత్యర్థ పరిత్యాగ

---

పూ. పక్షి : ఈవిశేష వాదము కూడ ప్రాణమునకు సంబంధించియే యున్నది. అది యెట్లనిన? ఈయగ్నిహోత్రి సత్యమును బలుకు చున్నాడని నపుడు, సత్యవదనముచే నతనికి నగ్నిహోత్రిత్వము కలిగినదియని యర్థముకాదు. క్రమముగ నగ్నిహోత్రము చేయుచుండుటచే నత డగ్నిహోత్రి యగుచున్నాడు. సత్యవదన మతనికి విశేషలక్షణము. ఎవడు సత్యము నపేక్షించి యతివదనము చేయునో యాత డతివాది యగుచున్నా డను వాక్యమునందుగూడ సత్యవదనముచే నతనికి నతివాదిత్వము సంభవించుటలేదు. ప్రకృతమగు ప్రాణవిషయముచేత నతనికి నతివాదిత్వము తటస్థించుచున్నది. ప్రాణవిజ్ఞానము గలవానికి సత్యమునుగూర్చిన యతివదన మొకవిశేషలక్షణ మని వాక్యతాత్పర్యము. [ప్రాణవిజ్ఞానముగలవాడు సత్యమును గూర్చి యతివదనము చేయగలడు అనిభావము.]

సిద్ధాంతి : మీ వాదము సరికాదని మే మనుచున్నాము.

ప్రసంగాత్, శ్రుత్యా హ్యత్ర సత్యవదనేనాతివాదిత్వం ప్రతీయతే యస్సత్యేనాతివదతి సోఽతివదతీతి. నాత్ర ప్రాణవిజ్ఞానస్య సంకీర్తనమస్తి. ప్రకరణాత్తు ప్రాణవిజ్ఞానం సంబధ్యేత. తత్ర ప్రకరణానురోధేన శ్రుతిః పరిత్యక్తా స్యాత్. ప్రకృతవ్యావృత్త్యర్థశ్చ తుశబ్దో న సంగచ్ఛేత. 'ఏషతు వా అతివద'తీతి. 'సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్య'మితి (ఛాం7-16) చ ప్రయత్నాంతరకరణమర్థాంతరవివక్షాం సూచయతి. తస్మాద్యథైకవేదిప్రశంసాయాం ప్రస్తుతాయాం'ఏషతు మహాబ్రాహ్మణో యశ్చతురో

---

శ్రుత్యర్థమును మీరు పరిత్యజించుచున్నారు. 'సత్యవదనముచే నతివాదిత్వము సంభవించుచున్నది' యనిశ్రుతివలన దెలియుచున్నది. "ఎవడు సత్యము నపేక్షించి యతివదనము చేయునో యాతడతివాది యగుచున్నాడు. ప్రాణవిజ్ఞానమునుగూర్చి యిచ్చట నేమియు ప్రస్తావన కాన్పించుటలేదు. ప్రకరణమునుబట్టి ప్రాణవిజ్ఞానమునకు సంబంధింప వచ్చును గాక. కాని ప్రకరణము ననుసరించినచో సాక్షాత్ శ్రుత్యర్థము పరిత్యజింపబడును. " ఇత డన్ననో అతివాది యగుచున్నాడు''అనువాక్యమునందలి 'యన్ననో' (మూలమునందలి 'తు'అనుశబ్దము) పూర్వార్థము నుత్తరార్థమునుండి విడదీయుచున్నది. మీవాద మీవిషయమును గమనించుటలేదు. "సత్యముమాత్రమన్ననో తెలిసికొనదగినది." (ఛాం 7-16) అను వాక్యమువలన తెలిసికొనదగిన అన్యవిషయవివక్షారూపమగు నొక నూతనప్రయత్నము తెలియుచున్నది.

వేదానధీత' ఇత్యేక వేదేభ్యోఽర్థాంతరభూతశ్చతుర్వేదః ప్రశస్యతే
తాదృగేతద్ద్రష్టవ్యం. స చ ప్రశ్నప్రతివచనరూపయైవార్థాంతర
వివక్షయా భవితవ్యమితి నియమోఽస్తి, ప్రకృతసంబంధాసంభవ
కారితత్వాదర్థాంతరవివక్షాయాః. తత్ర ప్రాణాంతమనుశాసనం
శ్రుత్వా తూష్ణీమ్భూతం నారదం స్వయమేవ సనత్కుమారో
వ్యుత్పాదయతి. యత్ప్రాణవిజ్ఞానేన వికారానృతవిషయేణాతి
వాదిత్వమనతివాదిత్వం తత్ 'ఏష తు వా అతివదతి యస్సత్యే
నాతివదతీ'తి. తత్ర సత్యమితి పరం బ్రహ్మోచ్యతే పరమార్థ

---

ఒక్క వేదము నధ్యయనము చేసినవారిగూర్చి ముచ్చటించు
చుండగా "ఈయన యన్ననో మహాబ్రాహ్మణుడు, చతుర్వేద
ముల నధ్యయనము చేసినవాడు" అని మఱియొకడు చెప్పు
వాక్య మొక వేదము నధ్యయనము చేసినవారిని పరిత్య
జించి చతుర్వేదపారగుని ప్రాశస్త్యము తెలియచేయు
చున్నది. అతివాది వాక్యమునుగూర్చిగూడ నీవిధము నే
యర్థసమన్వయము చేయవలయును. 'ప్రశ్నప్రతివచన రూప
ముగమాత్రమే నూతనవిషయమును ప్రవేశపెట్ట వలయును'
అను నియమము లేదు. పూర్వోత్తరవిషయములకెట్టి సంబంధము
కాన్పింపనపుడు రెండవవిషయము నూతనవిషయమని స్పష్ట
ముగ తెలియగలదు. ప్రకృతమగు భూమప్రకరణమునందు
నామము మొదలు ప్రాణాంతము చేయబడిన యుపదేశమును
నారదుడు విని యూరకుండెను. [మిథ్యాజ్ఞానము చే సంతుష్టుడైన

రూపత్వాత్ ‘సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే’తి (తై 2-1) శ్రుత్యంతరాత్. తథా వ్యుత్పాదితాయ నారదాయ ‘సోఽహం భగవస్సత్యేనాతివదా’నీ త్యేవం ప్రవృత్తాయ విజ్ఞానాదిసాధన పరంపరయా భూమానముపదిశతి. తత్ర యత్ప్రాణాదధిసత్యం వక్తవ్యం ప్రతిజ్ఞాతం తదేవేహ భూమేత్యుచ్యత ఇతి గమ్యతే. తస్మాదస్తి ప్రాణాదధి భూమ్న ఉపదేశ ఇత్యతః ప్రాణాదన్యః పరమాత్మా భూమా భవితుమర్హతీతి. ఏవం చాత్రవివిదిషయా ప్రకరణస్యోత్థానముపపన్నం భవిష్యతి. ప్రాణ ఏవేహాత్మా

---

నారదుడడుగకపోయినను ప్రాణముతరువాతభూమ ముపదేశింపబడుచున్నది.

యాయన యొక్క యపోహను తొలగించి] యథార్థజ్ఞానోత్పాదనమునకు సనత్కుమారుడు స్వయముగ నుపక్రమించెను. వికారము, అనృతము నగు ప్రాణమును దెలిసికొని యతివదనము చేయువాడు సత్యమును దెలిసికొనినవానికంటె నతివదనము చేసినవా డగునని బోధించెను. పరమార్థముగుటచే నిచట పరబ్రహ్మము సత్యశబ్దముచే చెప్పబడుచున్నది. “సత్యము బ్రహ్మము. జ్ఞానము బ్రహ్మము. ఆనందము బ్రహ్మము” అని తైత్తిరీయ శ్రుతి చెప్పుచున్నది. ఇట్లుద్బోధితుడై ‘సత్యమే యెక్కువది యని చెప్పెదనుగాక’ యనిపలికిన నారదునికి సనత్కుమారుడు విజ్ఞానాదిసాధనములచే భూమము నుపదేశించెను. అందువలన ప్రాణమును గూర్చి చెప్పినతరువాత వక్తవ్యముగ దెలియజేయబడిన సత్యము భూమమే యగుచున్నది. ఇట్లు ప్రాణముతరువాత భూమ ముపదేశింపబడుచున్నది. కనుక ప్రాణముకంటె

వివక్షిత ఇత్యేతదపి నోపపద్యతే. న హి ప్రాణస్య ముఖ్యయా వృత్త్యా ఆత్మత్వమస్తి. న చాన్యత్ర పరమాత్మజ్ఞానాచ్ఛోక నివృత్తిరస్తి, 'నాన్యః పంథా విద్యతేఽయనాయే'తి (శ్వే6–15) శ్రుత్యంతరాత్. 'తం మా భగవాన్ శోకస్య పరం పారం తారయత్వి'తి (ఛాం7-1-3) చోపక్రమ్యోపసంహరతి 'తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవాన్ సనత్కుమార' ఇతి. తమస ఇతి శోకాదికారణమవిద్యోచ్యతే. ప్రాణాంతే చానుశాసనే న ప్రాణస్యాన్యాయత్తతోచ్యేత 'ఆత్మతః ప్రాణః (ఛాం 7-26-1) ఇతి చ బ్రాహ్మణం.। ప్రకరణాంతే చ పర

---

భిన్నమగు భూమము పరమాత్మ యగుచున్నది. ఈపక్షమున నాత్మజిజ్ఞాసతో ప్రకరణోపక్రమము సమంజస మగుచున్నది. (4) ప్రాణమే ఆత్మగ నుదాహరింపబడినదను పూర్వవాది వాద ముపపన్నము కాదు. ప్రాణమున కాత్మ ముఖ్యార్థము కాదు. పరమాత్మజ్ఞానముకంటె మఱియొకవిధమున శోకము తొలగ నేరదు. [జ్ఞానముదక్క] "అనుసరింపదగిన మార్గ మన్యము లేదు." అని శ్వేతాశ్వరశ్రుతి (6–15)పల్కుచున్నది. "హే పూజ్య! అట్టినన్ను శోకపారమును జేర్పు"డని [నారద వాక్యముతో శ్రుతి యుపక్రమించి] రాగద్వేషాదిదోషములు తొలగిపోయిన నారదునికి పూజ్యుడగు సనత్కుమారుడు తమస్సను సముద్రము యొక్క దఱిని చూపెను. (ఛాం 7–26–2)" అను వాక్యముతో ప్రకరణ ముపసంహరింపబడినది. శోకాదికారణ మగు నవిద్య తమస్సని చెప్పబడుచున్నది. సనత్కుమారుని యుపదేశము ప్రాణముతో ముగిసినచో,

మాత్మవివక్షా భవిష్యతి, భూమాతు ప్రాణ ఏవేతిచేన్న.। 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' (ఛాం 7-24-1) త్యాదినా భూమ్న ఏవాప్రకరణసమాప్తేరను కర్షణాత్. వైపుల్యాత్మికా చ భూమరూపతా సర్వకారణత్వాత్పర మాత్మనస్సుతరాముపపద్యతే.।

---

నది మఱియొక దానిమీద నాధారపడినట్లుచెప్పుట సరికాదు. "ప్రాణమాత్మనుంచి కలుగుచున్నది". యని (ఛాం7-26-1) శ్రుతిపలుకుచున్నది. ప్రకరణాంతమున నాత్మ చెప్పబడుచున్నది. అంతకుముందుదాహరింపబడిన భూమ మన్ననో ప్రాణమే కావచ్చునుగదా? అనుటసరికాదు. "హేపూజ్య! భూమము దేనియందు ప్రతిష్ఠితమగుచున్నది?"(యను నారదునిప్రశ్నకు) "తనమహిమయందే" యని [సనత్కుమారుని సమాధానము చేత భూమవివరణముతో] ప్రకరణము సమాప్తముచేయబడినది. విపులత్వము భూమముయొక్కస్వరూపము. కనుక సర్వకారణమగు పరమాత్మయందు భూమత్వ ముపపన్నమగుచున్నది. 8

అ॥ భూమశబ్దము పరమాత్మపర మనుటకు మఱియొక సూచన నుదాహరించుచున్నారు.

## ధర్మోపపత్తేశ్చ (సూ. 9)

అపి చ యే భూమ్ని శ్రూయంతే ధర్మాస్తే పరమాత్మన్యుపపద్యంతే. 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమే'తి దర్శనాదివ్యవహారాభావం భూమన్యవగమయతి. పరమాత్మని చాయం దర్శనాదివ్యవహారాభావోఽవగతః 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యే' (బృ4-5-15) దిత్యాది శ్రుత్యంతరాత్. యోఽప్యసౌ సుషుప్తావస్థాయాం దర్శనాదివ్యవహారాభావ ఉక్తః సోఽప్యాత్మన ఏవాసంగత్వవివక్షయోక్తో న ప్రాణస్వభావవివక్షయా, పరమాత్మ

---

ధర్మ=భూమమందు తెలియవచ్చుచున్న సుఖరూపత్వ అమృతత్వాది ధర్మములు, ఉపపత్తేః చ = పరమాత్మయందు సమన్వయమగుటవలన గూడ భూమము పరమాత్మ యగుచున్నది.

మఱియు భూమమునందు వినబడుచున్న ధర్మములు పరమాత్మయం దుపపన్నమగుచున్నవి. "ఏతత్త్వమునందు మఱియొక సాధనముచేత చూడదగినది మఱియొకటి లేదో, తెలిసికొనదగినది వినదగినది లేదో యది భూమము" (ఛాం 7-24-1) అనువాక్యము భూమము నందు దర్శనాదివ్యవహారాభావమును దెలియచేయుచున్నది. "బ్రహ్మవిదునకి సర్వము బ్రహ్మమైనపు డతడు దేనిచే దేనిని జూచును" (బృ4-5-15) అను మొదలగు నితరశ్రుతుల వలన పరమాత్మయందు గూడ

భూమధర్మములు బ్రహ్మమునందు కాన్పించుచున్నవి.

ప్రకరణాత్. యదపి తస్యామవస్థాయాం సుఖముక్తం తద
ప్యాత్మన ఏవ సుఖరూపత్వవివక్షయోక్తం. యత ఆహ 'ఏషోఽస్య
పరమ ఆనంద ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా
ముపజీవంతీ'తి. (బృ4-3-32) ఇహాపి 'యో వై భూమా తత్సుఖం
నాల్పే సుఖమస్తి భూమైవ సుఖ'మితి సామయసుఖనిరాకరణేన
బ్రహ్మైవ సుఖం భూమానం దర్శయతి 'యో వై భూమా తద
మృత'మితి, అమృతత్వమపీహ శ్రూయమాణం పరమకారణం
గమయతి, వికారాణామమృతత్వస్యాపేక్షికత్వాత్ 'అతోఽన్య

---

నిట్టిదర్శనాద్యభావ మున్నట్లు తెలియుచున్నది. (ప్రశ్న 4-2
వాక్యమునందు సుషుప్త్యవస్థయందు దర్శనాదివ్యవహారా
భావము పేర్కొనబడినది. ఆత్మ యసంగుడని బోధించుటకుగా
నట్లు బోధింపబడినది గాని ప్రాణముయొక్క స్వభావము
నుదాహరించుట కట్లు పేర్కొనబడ లేదు. ప్రకరణము పర
మాత్మ ప్రకరణము. [కాని ప్రాణప్రకరణము కాదు.] ఆత్మ
సుఖస్వరూప మని బోధించుటకుమాత్ర మచట సుషుప్తిసుఖ
ముదాహరింపబడినది. "ఇదియె యుత్కృష్టమగు నానందము.
ఇతరానందములన్నియు నీయానందముయొక్క స్వల్ప
భాగము నాధారము చేసికొని యున్నవి" (బృ4-3-32) అని
బృహదారణ్యకవాక్యము చెప్పుచున్నది. ప్రకృత మగు భూమ
ప్రకరణమునందుగూడ "నిరతిశయమగునది యేదికలదో యది
భూమము. అదియె సుఖము. సాతిశయము లగు సుఖములు
నిజమగు సుఖములుగావు. అవియన్నియు నల్పములు" (ఛాం
7-23-1) అను వాక్యమునందు నశ్వరములగు సుఖములు

వార్త' (బృ 3-4-2) మితి చ శ్రుత్యంతరాత్. తథా చ సత్యత్వం స్వమహిమప్రతిష్ఠితత్వం సర్వాత్మమితి చైతే ధర్మాశ్శ్రూయమాణాః పరమాత్మన్యేవోపపద్యంతే. నాన్యత్ర తస్మాద్భూమా పరమాత్మేతి సిద్ధమ్.

---

సుఖములు గావని తోసిపుచ్చబడి బ్రహ్మమే భూమ మగు సుఖమని చూపబడుచున్నది. "భూమ మగునది ఏదియో యది యమృతము" (ఛాం7-24-1) అని వినబడుచున్న యమృతత్వముగూడ పరమకారణమును దెలియజేయుచున్నది. వికారములగు వాని యమృతత్వము సాపేక్షిక మని "బ్రహ్మముకంటె భిన్నమగునది యంతయు నశ్వర"మను బృహదారణ్యకవాక్యము (3-4-2) తెలియచేయుచున్నది. అదేవిధముగ భూమమునందు వినబడుచున్న సత్యత్వము, (ఛా67-16-1) స్వమహిమప్రతిష్ఠితత్వము (ఛాం7-24-1) సర్వగతత్వము (ఛాం7-25-1) సర్వాత్మత్వము (ఛాం7-25-2) మొదలగు ధర్మములు పరమాత్మ యందుమాత్రి ముపపన్నములగుచున్నవి గాని యితరస్థలముల నగుటలేదు. అందువలన భూమము పరమాత్మయని సిద్ధమగుచున్నది. 9

<u>భూమాధికరణ సంక్షేపార్థము</u> : "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" అను ఛాందోగ్యవాక్యము నందు వినబడుచున్న భూమ శబ్దము ప్రాణపరమా పరమాత్మపరమా యని సందేహము. ప్రాణము ఆశబ్దమునకు సన్నిధానమున వినబడుచున్నది. కనుక నాశబ్దము ప్రాణపరము కావచ్చును. ప్రక

రణము పరమాత్మ జిజ్ఞాసతో నారంభ మగుటచే నాశబ్దము పరమాత్మపరము గూడ కావచ్చును. ఇట్టి సందేహస్థలము నందు భూమశబ్దము ప్రాణమును బోధించుచున్నది యని పూర్వపక్షము కలుగుచున్నది. నామము మొదలు ప్రాణము వఱకు ప్రశ్నప్రతివచనపరంపర కానవచ్చుచున్నది. ప్రాణము తరువాత నట్టి ప్రశ్నప్రతివచనము కానరాదు. ప్రాణము నాశ్రయించి యతివాదిత్వము చెప్పబడుచున్నది. భూమము నకు చెప్పబడుచున్న దర్శనాద్యభావము, సుఖానుభవము సుషుప్త్యవస్థయందు సంభవ మగుచున్నది. ప్రకరణారంభమునం దుదాహరింపబడిన యాత్మగూడ ప్రాణమే యగుచున్నది. ఇది పూర్వపక్షము. భూమశబ్దము పరమాత్మపర మని సిద్ధాంతము. ప్రాణమునుగూర్చి చెప్పిన తరువాత భూమ ముపదేశింపబడు చున్నది. ప్రాణము భూమము కంటె భిన్నము. సత్యమును దెలిసి కొనినవాడు ప్రాణమును గూర్చి యతి వదనము జేయలేడు. సత్య వదనముచే బ్రాణము తోసివేయ బడుచున్నది. ప్రాణమును గూర్చి నారదునికి కలిగిన యపోహను తొలగించుటకై సత్య ముపదేశింపబడినది. సత్య మన పరబ్రహ్మము. ఆత్మోప దేశము ప్రకరణవిషయము. ప్రాణమునకు ఆత్మముఖ్యార్థము కాదు. ప్రకరణాంతమున పరమాత్మ వివరింప బడుచున్నది. భూమమునందు వినబడుచున్న సత్యత్వ స్వమహిమప్రతిష్ఠి తత్వ సర్వగతత్వ సర్వాత్మత్వాది ధర్మములు, దర్శనాది వ్యవ హారాభావము పరమాత్మ యందు కాన్పించుచున్నవి. కనుక భూమము పరమాత్మ యగుచున్నది.

# (3) అక్షరాధికరణమ్ (సూ. 10–12)

## (3) అక్షరాధికరణము

అ॥ సత్యశబ్దము బ్రహ్మమునందు రూఢ మగుటవలన భూమపదము బ్రహ్మపర మని నిశ్చయింపబడినది. అదేవిధముగ "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్యస్థూలం" (బృహ) అను వాక్యము నందలి యక్షరశబ్దము వర్ణమునందు రూఢము గనుక వర్ణమే యక్షరశబ్దార్థ మని పూర్వపక్షము రాగా నీశబ్దార్థవిచారము తరువాత అధికరణమున జేయబడుచున్నది.

విషయవాక్యము – "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్యస్థూల మనణు –(బృ 3–8–7,8)

సంశయము – అక్షరశబ్దము వర్ణపరమా? లేక పరమేశ్వర పరమా?

పూర్వపక్షము – వర్ణపరము.

సిద్ధాంతము – పరమేశ్వరపరము.

అవలోకనీయమగు శ్రుతి వాక్యములు :–

(బృ. 3–8–7–8 ఛాం. 2–23–3 బృ. 3–8–12, 3–8–10, 3–8–11.

## అక్షరమంబరాంతధృతేః (సూ. 10)

'కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చే'తి 'సహోవాచ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్యస్థూలమనణ్వ' (బృ3-8.7) త్యాది శ్రూయతే. ।

తత్ర సంశయః. కిమిహాక్షరశబ్దేన వర్ణ ఉచ్యతే కిం వా పర ఏవేశ్వర ఇతి. ।

పూ. పక్షి : తత్ర 'యేనాక్షరసమామ్నాయ'ఇత్యాదావక్షరశబ్దస్య వర్ణే ప్రసిద్ధత్వాత్ప్రసిద్ధ్యతిక్రమస్య చాయుక్తత్వాత్

---

అక్షరం = విషయవాక్యమునందలి యక్షరశబ్దము పరమాత్మ పరము. ఏలయన?అంబర అంత = పృథివి మొదలు ఆకాశమువఱకు, ధృతేః : ధరించుటవలన.

అవ్యాకృత మగు నాకాశము పడుగుపేకవలె దేనిచే వ్యాపింపబడుచున్నది ? [అనుగార్గిప్రశ్నకు] అక్షరము దాని వ్యాపించియున్నది యని బ్రహ్మవిదులు చెప్పుదురు. 'అది స్థూలము గాదు, సూక్ష్మము గాదు' అని యాజ్ఞవల్క్యుడు సమాధానము చెప్పెను. (బృ3-8-8-9) అనువాక్యము వినబడుచున్నది.

ఇచట నక్షరశబ్దముచేత వర్ణము చెప్పబడుచున్నదా? లేక పరమేశ్వరుడు చెప్పబడుచున్నాడా? యనిసంశయము.

పూ.పక్షి: (1)"అక్షరసమామ్నాయః"అను పాణినీయ సూత్రమునం దక్షరశబ్దము వర్ణమునందు సుప్రసిద్ధముగ వాడబడినది. ప్రసిద్ధార్థము నతిక్రమించుట యుక్తము కాదు.

‘ఓంకార ఏవేదం సర్వ’ (ఛాం2-23-3) మిత్యాదౌ చ శ్రుత్యంతరే వర్ణస్యాప్యుపాస్యత్వేన సర్వాత్మకత్వావధారణాద్వర్ణ ఏవాక్షరశబ్ద ఇతి. ।

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే ఉచ్యతే—పర ఏవాత్మాఽక్షరశబ్దవాచ్యః. కస్మాత్? అంబరాంతధృతేః పృథివ్యాదేరాకాశాంతస్య వికారజాతస్య ధారణాత్. తత్ర హి పృథివ్యాదేస్సమస్తస్య వికారజాతస్య కాలత్రయవిభక్తస్య ‘ఆకాశ ఏవ తదోతం చ ప్రోతంచే’ త్యాకాశే ప్రతిష్ఠితత్వముక్త్వా ‘కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ

---

(2) “ఇదియంతయు నోంకారమే” యను ఛాందోగ్య శ్రుతి (2-23-3) మొదలగువానియందుపాసననిమిత్తమక్షరము సర్వాత్మకముగ నిశ్చయింపబడినది. అందువలన నక్షరశబ్దము వర్ణమును చెప్పుచున్నది.

సిద్ధాంతి: పూర్వపక్షమిట్లురాగా సమాధానము చెప్పబడుచున్నది. (1) పరమాత్మయే యక్షరశబ్దముచే జెప్ప బడుచున్నాడు. ఏలయన? ఆకాశమువఱకు ధరించుటవలన. పృథివి మొదలు ఆకాశమువఱకుగల వికారజాతమును ధరించుటవలన. “ద్యులోకమున కూర్ధ్వముననుపృథివికి నధోభాగముననుఏది గలదో, యేది ద్యులోకమో, యేది పృథివీలోకమో, యేది వీనిమధ్యనున్నదో, యేది భూతము భవిష్యత్తు వర్తమానమని చెప్పబడుచున్నదో అది యంతయు నవ్యాకృతమగు నాకాశముచే వ్యాపింపబడుచున్నది” (బృ 3-8-4) యను వాక్యమునందు కాలత్రయవిభక్తమగు పృథివ్యాదిసమస్త

ప్రోతశ్చేత్యనేన ప్రశ్నేనేదమక్షరమవతారితం, తథా చోప సంహృతం—‘ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చే’తి. న చేహాంబరాంతధృతిర్బ్రహ్మణో ఽన్యత్ర సంభవతి. యదపి ‘ఓంకార ఏవేదం సర్వ’ మితి తదపి బ్రహ్మ ప్రతిపత్తిసాధనత్వాత్ స్తుత్యర్థం ద్రష్టవ్యం. తస్మాన్నక్షరత్య శ్నుతే చేతి నిత్యత్వవ్యాపిత్వాభ్యామక్షరం పరమేవ బ్రహ్మ.।

పూ.పక్షి: స్యాదేతత్ కార్యస్య చేత్కారణాధీనత్వమంబరాంత

---

వికారజాత మాకాశమునందు ప్రతిష్ఠితమైనట్లు చెప్పబడినది. తరువాత “ఆకాశము దేనిచే వ్యాపింపబడుచున్నది?” (బృ 3-8-8) యను గార్గిప్రశ్నపూర్వకముగ నీయక్షరము ప్రవేశ పెట్టబడినది. చివరకు “అక్షరునిచే నవ్యాకృతమగు నాకాశము వ్యాపింపబడినది” (బృ 3-8-12) యని ప్రకరణ ముపసంహ రింపబడినది. బ్రహ్మమునకుదక్క మఱియొకరి కిట్టి ఆకాశాంత మగు ధారణము సంభవముకాదు. (2) “ఈసమస్తము ఓం కారమే” యనుఛాందోగ్యవాక్యము (2-23-3) బ్రహ్మమును బొందుటకు సాధనమునుబోధించుటచే, ఓంకారమునకుస్తావక మాత్రమగుచున్నది. నశించునదికాదుగనుక నక్షరము, లేక సర్వవ్యాపిగనుక నక్షరము అని యేయర్థమును బరిగ్రహించి నను, నిత్యత్వము వ్యాపిత్వము అను రెండులక్షణములచేత గూడ నక్షరుడు పరబ్రహ్మమే యగుచున్నాడు. 10

పూ. పక్షి : మీరుచెప్పినది సరియయిన నగుగాక ! కార్యమగు నంబరాంతమగు జగత్తును గారణము ధరించు

ష్ఫృతిరప్యుపగమ్యతే ప్రధానకారణవాదినోఽపీయముపపద్యతే కథమంబరాంతధృతేర్బ్రహ్మ ప్రతిపత్తిరితి. ।

సిద్ధాంతీ: అత ఉత్తరం పఠతి. ।

## సా చ ప్రశాసనాత్ (సూ. 11)

సా చాంబరాంతధృతిః పరమేశ్వరస్యైవ కర్మ. కస్మాత్ ? ప్రశాసనాత్. ప్రశాసనం హీహ శ్రూయతే – 'ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠత' (బృ 3-8-9)

---

చున్నది యని మీరంగీకరించినచో, బ్రధానము జగత్కారణ మని వాదించు సాంఖ్యులకుగూడ నీయుక్తి యుపకరించు చున్నది. [ప్రధానము జగత్కారణమని సాంఖ్యులు వాదించు చున్నారు. కనుక సర్వప్రపంచమును ధరించు నక్షరము ప్రధానము కావచ్చునుగదా? ఆపక్షమున] బ్రహ్మ మంబ రాంతధారణము చేయుచున్నది యని చెప్పనెట్లు శక్యము?

సిద్ధాంతి : ఇందుకు సమాధానముగ నుత్తరసూత్రము పఠింపబడుచున్నది.

సా చ = అంబరాంతధారణముగూడ పరమేశ్వరుని కర్మయే. ఏలయన? ప్రశాసనాత్ = ఆతని ఆజ్ఞయందుండుట వలన.

పూర్వసూత్రమునందలి యంబరధారణ మొక్క పర మేశ్వరుని కర్మమాత్రమగుచున్నది. ఏలన ? ప్రశాసనము వలన. "ప్రచండమగు నీ యక్షరుని శాసనముచేత నే సూర్యుడు, చంద్రుడు, స్వస్వస్థానముల యందున్నవారు" (బృ 3-8-10)

ఇత్యాది. ప్రశాసనం చ పారమేశ్వరం కర్మ, నాచేతనస్య ప్రధానస్య ప్రశాసనం సంభవతి. నహ్యచేతనానాం ఘటాదికారణానాం మృదాదీనాం ఘటాదివిషయం ప్రశాసనమస్తి. ।

## అన్యభావవ్యావృత్తేశ్చ (సూ. 12)

అన్యభావవ్యావృత్తేశ్చ కారణాద్బ్రహ్మైవాక్షరశబ్దవాచ్యం, తస్యైవ చాంబరాంతధృతిః కర్మ నాన్యస్య కస్యచిత్. కిమిదమన్యభావవ్యావృత్తేరితి? అన్యస్య భావోఽన్యభావః

---

అనువాక్యమునందు ప్రశాసనము వినబడుచున్నది. ప్రశాసన మనునది పరమేశ్వరుని కర్మగాని యచేతనమగు ప్రధానము యొక్క కర్మ గానేరదు. ఘటాదికార్యములకు కారణములగు మృదాద్యచేతనములు ఘటాదులను [నియమనము చేయు] ప్రశాసనము కాన్పించుటలేదు.

అ॥ ప్రధాన మక్షరము కానేరదనుటకు రాబోవు సూత్రమున మఱియొక కారణమును జూపుచున్నారు.

అన్యభావ = బ్రహ్మముకంటె భిన్నమగు స్వభావము గలవానిని అక్షరమునుండి, వ్యావృత్తేః చ = తొలగించుట వలనగూడ, అక్షరుడు పరమేశ్వరుడగుచున్నాడు.

శ్రుతి అన్యభావమును తొలగించుచున్నదను కారణమువలన బ్రహ్మమే యక్షరశబ్దముచే జెప్పబడుచున్నది. అంబరాంతధారణకర్మ బ్రహ్మది కాని మఱియొకదానిది దేనిదికాదు. ఈ 'అన్యభావవ్యావృత్తేః' యను సూత్రమున

అన్యభావాద్వ్యావృత్తిరన్యభావవ్యావృత్తిరితి. అన్యభావవ్యావృత్తే
రితి, ఏతదుక్తం భవతి యదన్యద్బ్రహ్మణోఽక్షరశబ్దవాచ్యమిహా
శంక్యతే తద్భావాదిదమంబరాంతవిధరణమక్షరం వ్యావర్తయతి
శ్రుతిః—'తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్టృ అశ్రుతం
శ్రోతృ అమతం మంతృ అవిజ్ఞాతం విజ్ఞాతృ' (బృ3-8-4) ఇతి.
తత్రాదృష్టత్వాదివ్యపదేశః ప్రధానస్యాపి సంభవతి, ద్రష్టృత్వాది
వ్యపదేశస్తు న తస్య సంభవత్యచేతనత్వాత్, తథా 'నాన్యద
తోఽస్తి ద్రష్టృ నాన్యదతోఽస్తి శ్రోతృ నాన్యదతోఽస్తి మంతృ
నాన్యదతోఽస్తి విజ్ఞాతృ' ఇత్యాత్మభేదప్రతిషేధాత్ న శారీర

---

కర్థమేమి? మఱియొకదానియొక్క భావము అన్యభావము.
ఆభావమునుండి తొలగించుటయె యన్యభావవ్యావృత్తి యన
బడుచున్నది. దీని తాత్పర్యమిది. అక్షరశబ్దముచే బ్రహ్మము
కంటె వ్యతిరిక్తమగు నేయేభావ మూహింపబడుచున్నదో
యాభావమునుండి ఆ యంబరాంతవిధారకమగు నక్ష
రుని శ్రుతి వేఱుపఱచుచున్నది. "అక్షర మెన్నడును జూడ
బడదు; తాను జూచును. వినబడదు; వినును. మననము
చేయబడదు; మననముచేయును; తెలియబడదు; తెలిసి
కొనును" (బృ 3-8-12) అని యక్షరమునుంచి సర్వమును
శ్రుతి తోసిపుచ్చుచున్నది. (3) ఈవాక్యమునం దుదాహ
రింపబడిన యదృష్టత్వము, అశ్రుతత్వము, అవిజ్ఞాతత్వము
మొదలగు లక్షణములు ప్రధానమునందుగూడ వర్తించును
గాక. అచేతనమగుటవలన ద్రష్టృత్వము, శ్రోతృత్వము మొద
లగునవి సంభవింపవు. "అక్షరునికంటె నన్యుడెవడును చూచు

స్యాప్యుపాధిమతోఽక్షరశబ్దవాచ్యత్వం 'అచక్షుష్క మశ్రోత్రమవాగమన' (బృ3-8-8) ఇతి చోపాధిమత్తా ప్రతిషేధాత్. న హి నిరుపాధికశ్శారీరో నామ భవతి. తస్మాత్పరమేవ బ్రహ్మాక్షరమితి నిశ్చయః.।

---

వాడు, వినువాడు, మననముచేయువాడు, తెలిసికొనువాడు లేడు" అని తరువాత వాక్యమునందు ఆత్మకంటె భిన్నమగునదేదియును లేదని నిషేధించుటవలన ఉపాధిగతుడగు జీవుడుగూడ అక్షరశబ్దవాచ్యుడు కానేరడు. "అక్షరుడు చక్షుస్సు, శ్రోత్రము, వాక్కు, మనస్సు లేనిది" ( బృ 3-8-9 ) యనువాక్య మక్షరునికి నుపాధిని నిషేధించుచున్నది. ఉపాధిలేక జీవునికి ఉనికిలేదు. కనుక పరబ్రహ్మమే యక్షరుడని నిశ్చయింపబడుచున్నది.

అంబరాధికరణ సంక్షేపార్థము : " తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి "యను వాక్యమునందు వినబడుచున్న యక్షరశబ్దము పాణినీయసూత్రముచే వర్ణమునందు సుప్రసిద్ధముగనుకను వర్ణరూపమగు నోంకారము సమస్తమని శ్రుతి పల్కుటచేతను, అది వర్ణపర మగుచున్నది యని పూర్వపక్షము. పృథివ్యాది వికారజాతమంతయు నక్షరముచే ధరింపబడుచుండుటచేత నట్టిధారణము బ్రహ్మకు దక్క తదితరమునకు సంభవముకాదుగనుకను, అక్షరశబ్దమునకు నిత్యత్వము సర్వవ్యాపిత్వము లర్థమగుటచేతను, అక్షరుడు సర్వమును శాసించుచున్నట్లు శ్రుతిచెప్పుటచేతను, నట్టిభావ మక్షరేతర

మునకు నిషేధింపబడుటచేతను, పరబ్రహ్మమే యక్షరమగు చున్నది. ద్రష్ట్రుత్వాది లక్షణము లచేతనమగు ప్రధానము నకు సంభవముకాదుగనుక, నుపాధి నిషేధముచేత జీవుడు నక్షరము కానేరడు.

## (4) ఈక్షతికర్మాధికరణము

అ॥ ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి (ప్రశ్న 5–2) యని సత్యకామునకు పిప్పలాదుడు చెప్పెను. ఇచట వినబడు నోంకార మక్షరమని సుప్రసిద్ధము. పూర్వాధికరణమున నక్షరమను పదము పరబ్రహ్మబోధక మని నిశ్చయము చేయబడినది. అక్షరాత్మకమై యిచట వినబడుచున్న యోంకారరూపమున పరము అపరము గూడ పలుకరింపబడుచున్నవి. కనుక నీ వాక్యమున ఓంకారరూపమున ధ్యానింపబడిన పురుషు డెవడని ప్రశ్న కలుగుచున్నది. ఇట్టి ప్రశ్నకు సమాధానము రాబోవు అధికరణమున చెప్పబడుచున్నది. ఓంకారమును గూర్చి ప్రత్యేక మధికరణము పుట్టుటచే పూర్వాధికరణపూర్వపక్ష మోంకారమును గూర్చి పలుకరించినను భాష్యకారు లచట సమాధానము ప్రత్యేకముగ చెప్పక పండ్రెండవ సూత్రార్థమున సూక్ష్మముగ సూచించిరి.

## ఈక్షతి కర్మ వ్యపదేశాత్ (సూ. 13)

'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతీ' తి

విషయవాక్యము – "యఃపునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత" (ప్రశ్న 5-2.)

సంశయము – ఇచట చెప్పబడు పరమపురుషుడెవరు ? పరబ్రహ్మమా లేక అపరబ్రహ్మమా ?

పూర్వపక్షము – అపరబ్రహ్మము.

సిద్ధాంతము – పరబ్రహ్మము.

అవలోకనము చేయదగిన వాక్యములు :-

ప్రశ్న 5-2-3; 5-5-4 కఠ 1-3-11.

"యేస్త్వేతం" (ప్రశ్న 5-2-5) అను శ్రుతి యందలి "పరం పురుషమభిధ్యాయీత" ఓంకారముచే పరమపురుషుని ధ్యానము చేయవలెను అను వాక్యమునందుదాహరింపబడిన పరుడు, పరమాత్మ ; ఏలయన, ఈక్షతి = పురుషం ఈక్షత పురుషుని సాక్షాత్కారము చేసికొనుట యను క్రియకు కర్మ = కర్మను 'చేసికొనుట' యను క్రియలో గర్మగా వ్యపదేశాత్ = చెప్పుటవలన.

"సత్యము అక్షరము పురుషాఖ్యము నగు పరబ్రహ్మము ప్రాణాఖ్యము, ప్రథమజము నగు పరబ్రహ్మము,

ప్రకృత్య శ్రూయతే. ‘యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతే నైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత’ ఇతి. (ప్ర. 5-5)।

కిమస్మిన్వాక్యే పరం బ్రహ్మాభిధ్యాతవ్యముపదిశ్యతే ఆహోస్విదపరమితి. ఏతేనైవాయతనేన పరమపరం వైకతర మన్వేతీతి ప్రకృతత్వాత్సంశయః।

పూ. పక్షః : తత్రాపరమిదం బ్రహ్మేతి ప్రాప్తం, కస్మాత్ ? ‘స తేజసి సూర్యే సంపన్నః స సామభిరున్నీయతే

---

ఈ రెండు నోంకారమే యగుచున్నవి. అందువలన పరాపర బ్రహ్మములు రెండు నోంకారమే యని తెలిసి కొనినవాడు విస్తృతమగు నోంకారధ్యానముచే గోరిన అన్యతరమును బొందును.” అని యుపక్రమించిన వాక్యము తరువాత “ఎవ్వడు మాత్రాత్రయ విశిష్టము సూర్యాంతర్గతము నగు పురుషునిగా నోంకారమును ధ్యానించునో యతడు” అను వాక్యము వినవచ్చుచున్నది. (ప్రశ్న 5-5-1.)

ఈ వాక్యమునం దభిధ్యాతవ్యముగ పరబ్రహ్మము చెప్పబడుచున్నదా ? లేక అపరబ్రహ్మము చెప్పబడు చున్నదా ? ఈ ‘ఓంకారముచేతనే’ పరాపరబ్రహ్మములలో నన్యతరము పొందదగునని యుభయబ్రహ్మములు ప్రకృతములుగ నుదాహరింపబడుటచే నీ సంశయము గలుగుచున్నది.

పూ. పక్షః: అపరబ్రహ్మమే యిచట చెప్పబడుచున్నట్లు పూర్వపక్షము సంప్రాప్తమగుచున్నది. ఏలయన ! “అట్లు ధ్యానించువాడు తేజోవిశిష్టమగు సూర్యుని జేరుచున్నాడు,

బ్రహ్మలోక' మితి చ తద్విదో దేశపరిచ్ఛిన్నస్య ఫలస్యోచ్య మానత్వాత్. నహి పరబ్రహ్మవిద్దేశపరిచ్ఛిన్నం ఫలమశ్ను వీతేతి యుక్తం, సర్వగతత్వాత్పరస్య బ్రహ్మణః. ।

మాధ్యమిక : నన్వపరబ్రహ్మపరిగ్రహే పరం పురుష మితి విశేషణం నోపపద్యతే. ।

పూ. పక్షి : నైష దోషః, పిండాపేక్షయా ప్రాణస్య పరత్వోపపత్తేః. ।

సిద్ధాంతి: ఇత్యేవం ప్రాప్తేఽభిధీయతే. పరమేవ

---

అతడు సూర్యలోకమునుండి సామములచే బ్రహ్మలోకమును బొందింపబడును" అను వాక్యముల యందు ఓంకారమును దెలిసికొనిన వానికి బరిమిత మగు బ్రహ్మలోకము ఫల మని చెప్పబడుచున్నది. (2) పరబ్రహ్మను దెలిసికొనినవాడు పరిచ్ఛిన్న దేశమగు ఫలము ననుభవించు ననుట యుక్తము కాదు. పరబ్రహ్మము సర్వగతము.

మాధ్యమికుడు : అపరబ్రహ్మము నిచట గ్రహించిన-నో పరమపురుషుడు అను విశేషణము సమన్వయము కాదుగదా?

పూ. పక్షి : ఇది యొకదోషము కాదు. శరీరమునుబట్టి ప్రాణము పరమని చెప్పతగును. [అనగా స్థూల మగు విరాట్టు కన్న సూక్ష్మమగు సూత్రము పరతరమని యర్థము.]

సిద్ధాంతి: ఇట్లు పూర్వపక్షము రాగా సమాధానము చెప్పు చున్నాము. పరబ్రహ్మమే యిచట నభిధ్యాతవ్యముగ నుప

బ్రహ్మాభిధ్యాతవ్యమిహోపదిశ్యతే. కస్మాత్? ఈక్షతికర్మవ్యపదేశాత్. ఈక్షతిర్దర్శనం. దర్శనవ్యాప్యమీక్షతికర్మ, ఈక్షతికర్మత్వేనాస్యాభిధ్యాతవ్యస్య పురుషస్య వాక్యశేషే వ్యపదేశో భవతి. 'స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే, ఇతి. తత్రాభిధ్యాయతేరతథాభూతమపి వస్తు కర్మ భవతి మనోరథకల్పితస్యాప్యభిధ్యాయతికర్మత్వాత్. ఈక్షతేస్తు తథాభూతమేవ వస్తు లోకే కర్మ దృష్టమిత్యతః పరమాత్మైవాయం సమ్యగ్దర్శన

---

దేశింపబడుచున్నది. ఏలయన? చూచుట యను క్రియకు కర్మగా నుపదేశింపబడుట చేత. [ఈక్షతికర్మ యన ధ్యానవిషయము.] ఈక్షతి యనగా దర్శనము. దర్శన మీక్షతికర్మలో చేరి యున్నది. అభిధ్యాతవ్యు డగు పురుషుడు 'ఈక్షతి' క్రియకు కర్మగా తరువాత వాక్యమునం దుదాహరింపబడుచున్నాడు. "జీవఘనుడగు హిరణ్యగర్భునికంటెను పరుడగు పరమపురుషుని తనశరీరమునందు చూడగలడు" (ప్రశ్న 5-5) అనుతరువాత వాక్యముచే అయథార్థవస్తువుగూడ ధ్యానవిషయము కాదగును. మనోరథకల్పితములు గూడ ధ్యానవిషయము లగుచున్నవి. కాని యథార్థములగు వస్తువులుమాత్రమే లోకమునందు దర్శనక్రియకు విషయము లగుట చూచుచున్నాము. కనుక సంపూర్ణ దర్శనవిషయ మగు పరమాత్మయె యిచట దర్శనకర్మకు విషయముగా నుపదేశింపబడినట్లు తెలియు చున్నది. అతడే ప్రకృతవాక్యమునందు పర, పురుషశబ్ద

పరమపురుషుడు ఈక్షితవ్యుడు.

విషయీభూత ఈక్షతికర్మత్వేన వ్యపదిష్ట ఇతి గమ్యతే. స ఏవ చేహ పరపురుషశబ్దాభ్యామభిధ్యాతవ్యః ప్రత్యభిజ్ఞాయతే. ।

పూ. పక్షీ : నన్వభిధ్యానే పరపురుష ఉక్తః, ఈక్షణే తు పరాత్పరః, కథమితర ఇతరత్ర ప్రత్యభిజ్ఞాయత ఇతి. ।

---

ములచే నభిధ్యానవిషయముగ నుదాహరింపబడినట్లు గుర్తింపబడుచున్నాడు. [అనగా 5-5 వాక్యము పూర్వభాగమున త్రిమాత్రాత్మకమగు ఓంకారముచేత పరమపురుషుని ధ్యానము జేసినవాడు తేజోవిశిష్టమగుసూర్యుని జేరునని చెప్పబడినది. తరువాత నతడు సర్వపాపవినిర్ముక్తుడై హిరణ్యగర్భునిచే బ్రహ్మలోకమునకు తీసికొనిపోబడు ననియు నచట హిరణ్యగర్భునిచే జ్ఞానోపదిష్టుడై హిరణ్యగర్భునికంటె బరుడగు పురుషుని సాక్షాద్దర్శనము చేసికొనుననియు వివరింపబడినది. ఈ రెండు స్థలముల నుదాహరింపబడిన పరమపురుష పరాత్పరులొకరే యని గుర్తింపదగును. అతడు పరబ్రహ్మము. అత డుపాసనాయోగ్యుడు గూడ నగుచున్నాడు. అతని యుపాసనచే బ్రహ్మలోకావాప్తి, బ్రహ్మలోకము నందు హిరణ్యగర్భోపదిష్టజ్ఞానబలముచే సాక్షాద్దర్శనము కలుగునని తాత్పర్యము.]

పూ. పక్షి : అభిధ్యానమునకు పరమపురుషు డనియు దర్శనమునకు పరాత్పరుడనియు చెప్పబడినది గదా? వీ రిద్ద రొకరే యని యెట్లు గుర్తింపదగును?

సిద్ధాంతీ. అతోఽభిధీయతే. పరపురుషశబ్దౌ తావదుభయత్ర సాధారణౌ. న చాత్ర జీవఘనశబ్దేన ప్రకృతోఽభిధ్యాతవ్యః పరః పురుషః పరామృశ్యతే యేన తస్మాత్పరాత్పరోఽయమీక్షితవ్యః పురుషోఽన్యస్స్యాత్. కస్తర్హి జీవఘన ఇతి, ఉచ్యతే. ఘనో మూర్తిః జీవలక్షణో ఘనో జీవఘనః సైంధవఖిల్యావత్ యః పరమాత్మనో జీవఘనరూపః ఖిల్యాభావ ఉపాధికృతః పరశ్చ విషయేంద్రియేభ్యః సోఽత్ర జీవఘన ఇతి. |

---

సిద్ధాంతి : ఇందు కిట్లు చెప్పెదము. ఈ రెండు వాక్యములయందును పరపురుష శబ్దములు సమానముగ వినబడుచున్నవి. [ప్రకృతవాక్యము చివర భాగమునందు వినబడుచున్న] జీవఘన శబ్దముచే నభిధ్యానయోగ్యుడగు పరమపురుషుడు చెప్పబడుటలేదు. అట్లయినచో దర్శనయోగ్యుడగు పరాత్పరుడతని కంటె నన్యుడు కావలసివచ్చును. జీవఘను డెవడనిన, 'ఘన' మన మూర్తి. జీవుడే లక్షణముగాగల మూర్తి జీవఘనుడు. అల్పభావమును బొందిన లవణపుముద్దవలె నుపాధికృతమగు పరమాత్మయొక్క యల్పభావము జీవుడు. అతడీ జీవరూపమున విషయములకంటెను ఇంద్రియముల కంటెను గూడ పరుడు. అట్టివాడిచట జీవఘనమని చెప్పబడుచున్నాడు. [అనగా సంసారులగు సమస్తజీవులకును హిరణ్యగర్భుడాత్మభూతుడు. ఈతడు సర్వభూతములకును లింగరూపమున నంతరాత్మ యగుచున్నాడు. లింగరూప మగు నీ హిరణ్యగర్భుని

ఈక్షితవ్యుడు, దర్శనీయుడు నొకడే

అపర ఆహ 'స సామభిరున్నీయతే బ్రహ్మలోక' మితి, అతీతానంతరవాక్యనిర్దిష్టో యో బ్రహ్మలోకః పరశ్చ లోకాంతరేభ్యః సోఽత్ర జీవఘన ఇత్యుచ్యతే. జీవానాం హి సర్వేషాం కరణపరివృతానాం సర్వకరణాత్మని హిరణ్యగర్భే బ్రహ్మలోకనివాసిని సంఘాతోపపత్తేర్భవతి బ్రహ్మలోకో జీవఘనః. తస్మాత్పరో యః పురుషః పరమాత్మేక్షణకర్మభూతః స ఏవాభిధ్యానేఽపి కర్మభూత ఇతి గమ్యతే. పరం పురుషమితి చ విశేషణం పరమాత్మపరిగ్రహ ఏవావకల్ప్యతే. పరో హి

---

యందు సమస్త జీవులు సంహతులగుచున్నారు. అందుచే నతడు జీవఘను డని చెప్పబడుచున్నాడు.]

అ॥ ఇచట నితర వ్యాఖ్యానకర్తలభావము నుదాహరించుచున్నారు.

ఇచట నితరుల తాత్పర్యము.

ఇతర వ్యాఖ్యాత లిట్లు తలంచుచున్నారు 'అతడు సామములచే బ్రహ్మలోకమును బొందింపబడుచున్నా డని' పూర్వవాక్యమునందు నిర్దిష్టమైన బ్రహ్మలోకమితర లోకముల కంటె పరమగు జీవఘనమని చెప్పబడుచున్నది. సమస్త కారణములతో సముపేతు లగు జీవు లందఱు బ్రహ్మలోకనివాసియు సర్వ కరణముల కాత్మభూతుడు నగు హిరణ్యగర్భునియందు సమూహముగ నుండుటవలన బ్రహ్మలోకము జీవఘనమనదగును. అట్టి జీవఘనునికంటె బరుడై ఈక్షణక్రియకు విషయమగువాడే యభిధ్యానమునకుగూడ విషయమగు

పురుషః పరమాత్మైవ భవతి యస్మాత్పరం కించిదన్యన్నాస్తి 'పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః'ఇతి శ్రుత్యంతరాత్. 'పరం చాపరం చ బ్రహ్మ యదోంకార' ఇతి చ విభజ్యానంతరమోంకారేణ పరం పురుషమభిధ్యాతవ్యం బ్రువన్పరమేవ బ్రహ్మ పరం పురుషం గమయతి. 'యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవం హైవ స పాప్మనా వినిర్ముచ్యత' ఇతి చ పాప్మవినిర్మోకఫలవచనం పరమాత్మానమిహాభిధ్యాతవ్యం సూచయతి. ।

---

చున్నాడని తెలియవచ్చుచున్నది. పరమాత్మను బరిగ్రహించినపుడే పరమపురుషుడను విశేషణము సమంజసమగును. ఎవనికంటె బరుడు లేడో యట్టి పరమపురుషుడు పరమాత్మయే కావలెను. "పురుషునికంటె సూక్ష్మతరము మహత్తరము నగు మఱియొక వస్తు వేదియు లేదు. సూక్ష్మత్వమహత్వప్రత్యగాత్మత్వముల కతడే పరమావధి" యని కఠవల్లి (1-3-11) పల్కుచున్నది. పరాపరబ్రహ్మములు రెండు నోంకార మగుచున్నవి యని పరాపరబ్రహ్మవిభాగము చేసి యోంకారముచేత బరమపురుషు నభిధ్యానము చేయవలయునని చెప్పబడిన పరమపురుషుడు పరబ్రహ్మమని తెలియచేయుచున్నది. "సర్పము కుబుసముచే వదలివేయబడినట్లు ఆతడు పాపములచే విడువబడుచున్నాడు" అని పాపవిముక్తిని ఫలముగ జెప్పుచున్న వాక్యము పరమాత్మయె యభిధ్యానవిషయమని సూచించుచున్నది.

అథ యదుక్తం పరమాత్మాభిధ్యాయినో న దేశపరిచ్ఛిన్నం ఫలం యుజ్యత ఇతి. అత్రోచ్యతే.— త్రిమాత్రేణోంకారేణాలంబనేన పరమాత్మానమభిధ్యాయతః ఫలం బ్రహ్మలోకప్రాప్తిః క్రమేణ చ సమ్యగ్దర్శనోత్పత్తిరితి క్రమముక్త్యభిప్రాయమేతద్భవిష్యతీత్యదోషః

---

పరమాత్మ నభిధ్యానము చేయువానికి బరిచ్ఛిన్న దేశమగు బ్రహ్మలోకప్రాప్తి తగదని చెప్పిన పూర్వపక్షమునకు సమాధానమిట్లు జెప్పుదుము. [అకార ఉకార మకారములను] త్రిమాత్రాత్మకమగు నోంకారము నాలంబనముగా గ్రహించి పరమాత్మ నభిధ్యానము చేయువానికి బ్రహ్మలోకప్రాప్తి క్రమముగ సంపూర్ణమగు బ్రహ్మదర్శనము ఫలము సిద్ధించుచున్నది. ఇది క్రమముక్తినుద్దేశించి చెప్పబడుచున్నది. కనుక దోషమేమియు లేదు.

<u>ఈక్షతికర్మాధికరణ సంక్షేపార్థము</u>: యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత అను వాక్యమునందు పేర్కొనబడిన పరమపురుషుడు అపర బ్రహ్మమా? లేక పరబ్రహ్మమా? అని సందేహము. అపర బ్రహ్మమని పూర్వపక్షవాదను. పరమపురుషుని తెలిసికొనినవారు పరిచ్ఛిన్నప్రదేశమగు బ్రహ్మలోకమును పొందుచున్నట్లు చెప్పబడుచున్నది. శరీరాపేక్షచే నతడు పరుడు గనుక నపరబ్రహ్మము పరమపురుషుడుగ పేర్కొనబడుచున్నాడు ఇందుకు సిద్ధాంతి యిట్లనుచున్నాడు. పర

బ్రహ్మమే యభిధ్యానవిషయముగ నిచట బేర్కొనబడు చున్నాడు. ఆత డీక్షణక్రియకు విషయముగ నిర్దేశింపబడు చున్నాడు. ఆతడే ఈక్షతిక్రియ కర్మ డగుచున్నాడు. ఆతడే ఘనఘనముగ నుదాహరింపబడుచున్నాడు. ఉపాధిగతులగు జీవులంద ఱాతనియందు సంక్షీభూతులగుచున్నారు. ఎవ డభిధ్యానవిషయమగుచున్నాడో అతడే ధ్యానక్రియాఫలభూత మగు బ్రహ్మలోకమును పొంది, యచట పరబ్రహ్మ సాక్షాత్కారమును పొందును. పరమపురుషు డను విశేషణము పర బ్రహ్మమునందే సమంజసము. అతనికంటె బరుడెవ్వడును లేడుగనుక నతడు పరాత్పరుడగుచున్నాడు. ఇది క్రముముక్తి విషయము.

13

## (5) దహరాధికరణము

అ। పురుషశబ్దము బ్రహ్మమునందు రూఢమగుటవలన పరబ్రహ్మ ముపాస్య మని పూర్వాధికరణమునందు నిశ్చయింపబడినది. "అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాకాశః" (ఛాం 8-1-1) అనువాక్యమునందు వినిబడుచున్న ఆకాశశబ్దము భూతాకాశ మున రూఢియగుటవలన భూతాకాశమే యుపాస్యమని పై వాక్యము చెప్పుచున్నది యని పూర్వపక్షము రాగా నీయధికర ణమున సమాధానము చెప్పబడుచున్నది.

## దహర ఉత్తరేభ్యః (సూ. 14)

'అథ యదిదమస్మిన్బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరో ఽ స్మిన్నంతరాకాశస్తస్మిన్ యదంతస్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్య' (ఛాం8-1-1) మిత్యాదివాక్యం సమామ్నాయతే. ।

---

విషయవాక్యము – అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతరాకాశస్తస్మిన్ యదంతస్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" (ఛాం 8-1-1)

సంశయము – ఇచట నుదాహరింపబడిన ఆకాశశబ్దము భూతాకాశపరమా? లేక జీవపరమా? లేక పరమాత్మపరమా? యని సంశయము.

పూర్వపక్షము – భూతకాశపరమో లేక జీవపరమో.యగుచున్నది.

సిద్ధాంతము – పరమాత్మపరము.

అవలోకనచేయవలసిన ఉపనిషద్భాగము –

ఛాందోగ్యము 8 అధ్యాయము సంపూర్ణముగజూడవలెను.

విషయ వాక్యములోని దహరః = దహరశబ్దము పరమాత్మపర మగుచున్నది. ఉత్తరేభ్యః=తరువాత నుదహరింపబడు కారణముల వలన.

"బ్రహ్మమునకు నగరముగానున్న ఈ శరీరమునందు స్వల్పమై పుండరీకమునుబోలు హృదయ మను గృహమునం దున్న సూక్ష్మతరమగు నాకాశమునందలి యాకాశ మన్వే

తత్ర యోఽయం దహరే హృదయపుండరీకే దహర ఆకాశశ్శ్రుతః స కిం భూతాకాశోఽథ విజ్ఞానాత్మాఽథవా పరమాత్మేతి సంశయ్యతే. కుతస్సంశయః? ఆకాశ బ్రహ్మపుర శబ్దాభ్యామ్. ఆకాశశబ్దో హ్యయం భూతాకాశే పరస్మింశ్చ బ్రహ్మణి ప్రయుజ్యమానో దృశ్యతే. తత్ర కిం భూతాకాశ ఏవ దహరస్స్యాత్కిం వా పర ఇతి సంశయః. తథా బ్రహ్మపురమితి కిం జీవోఽత్ర బ్రహ్మనామా తస్యేదం పురం శరీరం బ్రహ్మపురం అథవా పరస్యైవ బ్రహ్మణః పురం బ్రహ్మపురమితి. తత్ర

---

షింప తగినదియు, సాక్షాత్కారము చేసికొన దగినదియు" నను ఈ మొదలగు వాక్యములు ఛాందోగ్యమునందు బఠింపబడు చున్నవి.

పై వాక్యమునం దల్పమగు హృదయపుండరీకమునం దున్నట్లు వినబడుచున్న స్వల్పాకాశము భూతాకాశమగునా? లేక జీవుడగునా ? లేక పరమాత్మ యగునా ? యని సంశయింప బడుచున్నది. ఈ సంశయమేల కలుగవలెనన, ఆకాశము బ్రహ్మపురము లను శబ్దములవలన. ఆకాశ శబ్దమున్నుగో భూతాకాశమునందును, పరబ్రహ్మమునందును గూడ బ్రయోగింపబడుచున్నది. కనుక భూతాకాశము దహరాకాశమగుచున్నదా ? లేక పరబ్రహ్మము దహరాకాశ మగుచున్నదా? యని సంశయము. అదేవిధముగ బ్రహ్మ మనుపేరుగల వాడు జీవుడు. అతని పురమగు నీ శరీరము బ్రహ్మపురమనియు జెప్పవచ్చును. లేక బ్రహ్మ మన పర

జీవస్య పరస్య వాన్యతరస్య పురస్వామినో దహరాకాశత్వే సంశయః.

పూ. పక్షీ: తత్రాకాశశబ్దస్య భూతాకాశే రూఢత్వాద్భూతాకాశ ఏవ దహరశబ్ద ఇతి ప్రాప్తం, తస్య చ దహరాయతనాపేక్షయా దహరత్వం 'యావాన్వా అయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశ' ఇతి చ బాహ్యాభ్యంతరభావకృతభేదస్యోపమానోపమేయభావో ద్యావాపృథివ్యాది చ తస్మిన్నంతస్సమాహితమవకాశాత్మనాఽఽకాశస్యైకత్వాత్. అథవా జీవో దహర ఇతి ప్రాప్తం బ్రహ్మపురశబ్దాత్, జీవస్యహీదం పురం సచ్ఛరీరం

---

బ్రహ్మము. అతనిపురము బ్రహ్మపుర మని యర్థమగుచున్నది. ఆపక్షమున పురస్వాములగు జీవబ్రహ్మములలో నన్యతరుని యందు దహరాకాశశబ్దము సమన్వయము కావచ్చును.

పూ. పక్షి : ఆకాశశబ్దము భూతాకాశమున రూఢమగుటచే దానియందే దహరశబ్దము వాడబడుచున్న దని పూర్వవాదివాదము. (1) భూతాకాశమునుబట్టి యీ యాకాశమాయతనాపేక్షచే అని వాని యుద్దేశము. సుప్రసిద్ధమైన భౌతికాకాశ మెంతపరిమాణము గలదో, హృదయాకాశము గూడ నంతపరిమాణముగల దని ( 8-1-3 ) వాక్యమునందు [భూతాకాశ హార్దాకాశముల కుపమానోపమేయ భావము చెప్పబడుటచేత రెండునొకటి కానేరవని యాక్షేపింపనవసరము లేదు. బాహ్యాభ్యంతర భేదముచేనారెంటిని భిన్నముగ భావించి] ఉపమానోపమేయభావము కల్పింపబడినది. [ఇట్టిభేదము

బ్రహ్మపురమిత్యుచ్యతే. తస్య స్వకర్మణోపార్జితత్వాత్. భక్త్యా చ తస్య బ్రహ్మశబ్దవాచ్యత్వమ్. నహి పరస్య బ్రహ్మణః శరీరేణ స్వస్వామిలక్షణస్సంబంధోఽస్తి. తత్ర పురస్వామినః పురైకదేశేఽవస్థానం దృష్టం యథా రాజ్ఞః, మన ఉపాధికశ్చ జీవో మనశ్చ ప్రాయేణ హృదయే ప్రతిష్ఠితమిత్యతో జీవస్యైవేదం హృదయేఽన్తరవస్థానం స్యాత్. దహరత్వమపి తస్యైవారా

---

ధ్యానముకొఱకు గల్పింపబడి రెండిటికిని సాదృశ్యము చెప్పబడినది.] లేక అవకాశమునిచ్చుటయే యాకాశలక్షణము. [కనుక, రెండునొకటియె యగుచు సర్వాశ్రయమగుచున్నవి.] అందువలన ద్యావాపృథివ్యాదు లద్దానియందు సమాహితములగుచున్నవి. (2) లేదా దహరశబ్దముచేత జీవుని గ్రహింపదగును. బహ్మపురశబ్ద మిచటగలదు. జీవునికి ఈశరీరము పురమగుటచే బ్రహ్మపురమని చెప్పబడుచున్నది. స్వీయమగుకర్మచే జీవుడే శరీరము నుపార్జించుకొనుచున్నాడు. ఈపక్షమున జీవుడు గౌణముగ బ్రహ్మమని చెప్పబడుచున్నాడు. (3) పరబ్రహ్మమునకు శరీరస్వామిత్వము గాని, యద్దానితో సంబంధముగాని లేదు. పురస్వామి యగురాజు పురమునందొకచోట నుండునట్లు శరీరస్వామి యగుజీవుడు శగీరైకదేశమగు హృదయమునందుండెనని ప్రకృతవాక్యమున గాన్పించుచున్నది. మఱియు జీవునికి మనస్సుపాధియగుచున్నది. మనస్సు హృదయమునందు ప్రతిష్ఠితమైయున్నది. కనుక జీవుడే హృదయమునందుండినట్లు చెప్పబడుచున్నాడు. (4) మఱియు జీవుడు ములుకఱ్ఱచివరభాగమంతపరిమాణముగలవాడని శ్వేతాశ్వతరము (5–8) నందు

గ్రోపమితత్వాదవకల్పతే. ఆకాశోపమితత్వాది చ బ్రహ్మాభేద వివక్షయా భవిష్యతీతి న చాత్ర దహరస్యాకాశస్యాన్వేష్టవ్యత్వం విజిజ్ఞాసితవ్యత్వం చ శ్రూయతే ‘తస్మిన్ యదన్త’రితి పరవిశేషణత్వేనోపాదానాదితి.

సిద్ధాంతీ : అత ఉత్తరం బ్రూమః.—పరమేశ్వర ఏవాత్ర దహరాకాశో భవితుమర్హతి న భూతాకాశో జీవో వా. కస్మాత్? ఉత్తరేభ్యో వాక్యశేషగతేభ్యో హేతుభ్యః. తథాహి— అన్వేష్టవ్యతయాఽభిహితస్య దహరాకాశస్య ‘తం చేద్బ్రూయు’రిత్యుపక్రమ్య ‘కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజి

---

చెప్పబడినది. కనుక నతనికి నల్పత్వముగూడ సిద్ధించుచున్నది. జీవబ్రహ్మముల కభేదమును బోధించుటకై యాకాశముతో బోల్పబడినట్లు గ్రహింపదగును. (5) దహరాకాశ మిచట సన్వేష్య మనిగాని విజిజ్ఞాసితవ్య మనిగాని శ్రుతి చెప్పుటలేదు. “దానియందేది యున్నదో” యనువాక్యము సంతస్థ మగు మఱియొక వస్తువునకు విశేషణముగ నుదాహరింపబడుచున్నది.

సిద్ధాంతి : ఇట్లు పూర్వపక్షము వచ్చినందున సమాధానము చెప్పుచున్నాము. దహరాకాశము పరమేశ్వరుడే యగుచున్నాడు. భూతాకాశముగాని జీవుడుగాని

**దహరాకాశము భూతాకాశము కానేరదు.**

కానేరడు. ఏలయన? ప్రకృతవాక్యశేషమునం దుదాహరింపబడిన కారణములవలన. వాక్యశేషమునం దిట్లుగదా చెప్పబడినది. అన్వేష్టవ్యమగు దహరాకాశమునుగూర్చి ప్రస్తావనముచేయుచు నిట్లుపక్రమింపబడినది. “పరిచ్ఛిన్నమగు శరీరమునందలి స్వల్ప

జ్ఞాసితవ్య' మిత్యేవమాక్షేపపూర్వకం ప్రతిసమాధానవచనం భవతి 'స బ్రూయాద్యావాన్వా అయమాకాశస్తావానేషో ఽ న్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అంతరేవ సమాహితే' (ఛాం 8-1-3) ఇత్యాది. తత్ర పుండరీకదహరత్వేన ప్రాప్తదహరత్వస్యాకాశస్య ప్రసిద్ధాకాశోపమ్యేన దహరత్వం నివర్తయన్భూతాకాశత్వం దహరస్యాకాశస్య నివర్తయతీతి గమ్యతే. యద్యప్యాకాశశబ్దో భూతాకాశే రూఢస్తథాపి తేనైవ తస్యోపమా నోపపద్యత ఇతి భూతాకాశశంకా నివర్తితా భవతి. ।

---

మగు హృత్పుండరీకమునందుండు దంతికంటెను స్వల్పతరమగు నాకాశమున దెలిసికొనదగినది, సాక్షాత్కారము జేసికొనదగినది యేమికలదని శిష్యుడడిగినచో వానికి "సుప్రసిద్ధమైన భౌతికాకాశ మెంత పరిమాణము గలదో యంతపరిమాణము హృదయాకాశముకూడ గలదు. హార్దాకాశమునందాకాశము పృథివి, అగ్ని, వాయువు, సూర్యుడు, విద్యుత్తు, నక్షత్రములు, మఱియు నీప్రపంచమున నున్నదిలేనిది యంతయు నచటసంపూర్ణముగ నున్నది." యని గురువుసమాధానము చెప్పెను. (ఛాం. 8-1-2-3). (1) ఈ వాక్యమునందు దహరాకాశము భూతాకాశముతో బోల్పబడుటవలన హృత్పుండరీకమల్పమగుటచే హార్దాకాశము గూడ నల్పముగా నుండవలయు ననుభావము తొలగుటయెకాక హార్దాకాశము భూతాకాశము కానేరదనియు గూడ దెలియుచున్నది. [ దహరాకాశభూతాకాశములు రెండు నొకటియే యైనచో దహరాకాశము భూతాకాశముతో బోల్పశక్యముకాదు.] ఏవస్తువు

మధ్యవర్తీ : నన్వేకస్యాప్యాకాశస్య బాహ్యాభ్యంతరత్వ కల్పితభేదేనోపమానోపమేయభావస్సంభవతీత్యుక్తం. ।

సిద్ధాంతీ: నైవం సంభవతి. అగతికా హీయం గతిః, యత్కాల్పనికభేదాశ్రియణం. అపి చ కల్పయిత్వాపి భేదముపమానోపమేయభావం వర్ణయతః పరిచ్ఛిన్నత్వాదభ్యంతరాకాశస్య న బాహ్యాకాశపరిమాణత్వముపపద్యతే.

పూ. పక్షీ. నను పరమేశ్వరస్యాపి 'జ్యాయానాకాశా' (శత. బ్రా 106-3-2) దితి శ్రుత్యంతరాన్నైవాకాశపరిమాణత్వముపపద్యతే,

---

నైనను దానిని దానితో పోల్చదగదు. కనుక దహరాకాశము భూతాకాశ మగునా యనుశంక తొలగుచున్నది.

మధ్యవర్తి : ఆకాశ మొకటియయినను బాహ్యాభ్యంతర భేదముచే భిన్నమగుటంజేసి యుపమానోపమేయభావ మారెంటికిని సంభవింపగల.దని పూర్వవాది చెప్పియుండెగదా ?

సిద్ధాంతి : ఇది సంభవముకాదు. కల్పితభేదము నాశ్రియించి చెప్పబడు నుపమానోపమేయ భావము అగతికమగును. ఒకవేళ కల్పితభేదమునుబట్టి యారెండింటికిని నుపమానోపమేయభావమును వర్ణించినను అంతరంగికాకాశము పరిచ్ఛిన్నమగుటచే నద్దానికి బాహ్యాకాశపరిమాణ మబ్బనేరదు.

పూ. పక్షి : పరమేశ్వరు డాకాశముకంటె పెద్దవాడని (శతపథ బ్రాహ్మ 10–6–3–2) మఱియొకశ్రుతి చెప్పుటవలన ఆకాశ పరిమాణము పరమేశ్వరునికిగూడ తగదుగదా? [మీ

సిద్ధాంతీ : నైష దోషః, పుండరీక వేష్టనప్రాప్తదహరత్వనివృత్తిపరత్వాద్వాక్యస్య న తావత్త్వప్రతిపాదనపరత్వం. ఉభయప్రతిపాదనే హి వాక్యం భిద్యేత. న చ కల్పితభేదే పుండరీకవేష్టితే ఆకాశైకదేశే ద్యావాపృథివ్యాదీనామంతస్సమాధానముపపద్యతే. 'ఏష ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామస్సత్యసంకల్ప' ఇతి చాత్మత్వాపహతపాప్మత్వాదయో గుణా న భూతాకాశే సంభవంతి

---

వాదముప్రకారము దహరాకాశము పరమేశ్వరుడైనచో పరమేశ్వరుని పరిమాణమునం దాకాశమునకు బోల్చుట సాధ్యము కాదు. శ్వేతాశ్వతరశ్రుతికి విరుద్ధమగును.]

సిద్ధాంతి : ఇదియొకదోషము కాదు. దహరాకాశ మల్పము కాదని చెప్పుటకుమాత్రమది భూతాకాశముతో బోల్చబడినది; కాని భూతాకాశ పరిమాణమద్దానికి కలదని చెప్పుటయం దావాక్యమునకు దాత్పర్యము కాదు. ఒకవేళ దహరాకాశమున కల్పత్వము, భూతాకాశమువలె నపరిమితత్వమునుగూడ చెప్పుద మన్నచో వాక్యము భేదించును. [ఒకేవాక్యము భిన్నార్థముల బోధించునపు డది భేదించు నని శాస్త్రమర్యాద.] బాహ్యాంతరములచే కల్పితభేదము నంగీకరించినచో హృదయపుండరీకముచే బరివేష్టితము, భూతాకాశములో నల్పభాగము నగు దహరాకాశమున ద్యావాపృథివ్యాదు లుండుట సంభవము కాదు. "ఈయాత్మ పోయిన పాపములుగలవాడు, వార్ధక్యము లేనివాడు, మృత్యువు లేనివాడు, శోకము లేనివాడు, ఆకలి దప్పులు లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు" అను

మధ్యవర్తీ: యద్యప్యాత్మశబ్దో జీవే సంభవతి తథా పీతరేభ్యః కారణేభ్యో జీవాశంకాపి నివర్తితా భవతి. న హ్యుపాధిపరిచ్ఛిన్నస్యారాగ్రోపమితస్య జీవస్య పుండరీక వేష్టనకృతం దహరత్వం శక్యం నివర్తయితుం.

పూ. పక్షీ : బ్రహ్మాభేదవివక్షయా జీవస్య సర్వగత త్వాది వివక్ష్యత ఇతి చేత్

సిద్ధాంతీ: యదాత్మతయా జీవస్య సర్వగతత్వాది వివక్ష్యతే తస్యైవ బ్రహ్మణస్సాక్షాత్సర్వగతత్వాది వివక్ష్యతామితి'

---

శ్రుతియందు వినబడుచున్న ఆత్మత్వాపహతపాప్మత్వాది గుణములు భూతాకాశమునందు సంభవముకాదు.

మధ్యవర్తి : ఆత్మశబ్దము జీవపరముగ వాడబడుగాక. ఇతర కారణములచేత దహరాకాశము జీవపర మగునను ఆశంక తొలగుచున్నది. అత డుపాధిపరిచ్ఛిన్నుడు. ములుగఱ్ఱ మొనతో పోల్చబడినవాడు. హృత్పుండరీక కృతమగు అల్పత్వ మతని నుండి తొలగింప శక్యముకాదు. [కనుక నతనికి భూతాకాశోపమానము సరిపోదు.]

దహరాకాశము జీవపరము కానేరదు.

పూ. పక్షి: జీవబ్రహ్మల కభేదమును జెప్పగోరి జీవునికి సర్వగతత్వాది లక్షణములు చెప్పబడుచున్నవనగూడదా?

సిద్ధాంతి : దహరాకాశము జీవుడు. అతడు సర్వగతుడు. కనుక జీవబ్రహ్మల కభేదము సంభవించుచున్నది యనుటకంటె దహరాకాశమే సర్వగతమగుటచే సాక్షాద్బ్రహ్మమని చెప్పుట యుక్తము.(8)పురస్వామి యగు జీవుడు రాజువలె నొకప్రదేశ

యుక్తం. యదప్యుక్తం 'బ్రహ్మపుర' మితి జీవేన పురస్యోపలక్షితత్వాద్రాజ్ఞ ఇవ జీవస్యైవేదం పురస్వామినః పురైకదేశవర్తిత్వమస్త్వితి. అత్ర బ్రూమః—పరస్యైవేదం బ్రహ్మణః పురం సచ్ఛరీరం బ్రహ్మపురమిత్యుచ్యతే బ్రహ్మశబ్దస్య తస్మిన్ముఖ్యత్వాత్. తస్యాప్యస్తి పురేణానేన సంబంధః ఉపలబ్ధ్యధిష్ఠానత్వాత్. 'స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే సవా అయం పురుషస్సర్వాసు పూర్షు పురిశయ' (బృ2-5-18) ఇత్యాదిశ్రుతిభ్యః. అథవా జీవపుర ఏవాస్మిన్బ్రహ్మ సన్నిహిత

---

మునందుండుటచేతనే బ్రహ్మపురమను పద మన్వర్థము కాగలదను పూర్వపక్షమున కిట్లు సమాధానము చెప్పుచున్నాము. ఈ శరీరము పరబ్రహ్మమునకు చెందియుండుటచేతనే బ్రహ్మపుర మని చెప్పబడుచున్నది. ఈ పక్షమున బ్రహ్మశబ్దమునకు ముఖ్యార్థమును గ్రహింపవచ్చును. బ్రహ్మపురశబ్దము గౌణముగమాత్రము జీవపురముగ గ్రహించినను జీవపురము కాగలదు. బ్రహ్మమునకుగూడ నీ శరీరముతో సంబంధము గలదు. అయ్యది బ్రహ్మోపలబ్ధికి అధిష్ఠాన మగుచున్నది.

బ్రహ్మ సంబంధమగుటచే శరీరము బ్రహ్మ పుర మనబడుచున్నది.

"జీవఘనుడగు హిరణ్యగర్భునికంటెను పరుడగు పరమపురుషుని దనశరీరమునందు చూడగలడు" (ప్రశ్న 5-5) "అన్ని శరీరములందున్న ఆ యీపరమపురుషుడు" (బృ 2-5-18)అను మొదలగు శ్రుతులీయర్థమును తెలియజేయుచున్నవి. లేక బ్రహ్మపురమును జీవపురమని గ్రహించినపుడుకూడ శాల్ల

ముపదేక్ష్యతే. యథా సాలగ్రామే విష్ణుస్సన్నిహితః ఇతి తద్వత్. 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయత' (ఛాం 8.16) ఇతి చ కర్మణామంతవత్ఫలత్వ ముక్త్వా 'అథ య ఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్కామాంస్తేషాం సర్వేషు లోకేషు కామాచారో భవతీ' తి ప్రకృతదహరాకాశవిజ్ఞానస్యానంతఫలత్వం వదన్పరమాత్మ

---

గ్రామయందు విష్ణువు సన్నిహితుడైనట్లు బ్రహ్మ మీా శరీరము నందు సన్నిహితముగనున్నాడు. "ఈలోకమున కర్మచే సంపాదింపబడిన యుపభోగములునశించినట్లే పుణ్యము చేత సంపాదింపబడిన యుత్తమలోకములుగూడ నశించును" (ఛాం 8-1-6) అని కర్మలయొక్క ఫలము నశ్వర మనిచూపి ప్రకృత మగు దహరాకాశవిజ్ఞానముచే ననంతఫలమును శ్రుతి బోధించుచున్నది. దహరాకాశము

*దహరాకాశ విజ్ఞాన మనంత ఫలప్రదమని శ్రుతి పల్కుచున్నది*

పరమాత్మయని శ్రుతి తరువాత వాక్యమున పల్కుచున్నది. "జ్ఞానకర్మల రెండింటికి నధికారులు యోగ్యులు నగువారెవరు శాస్త్రాచార్యోపదిష్టము, నిర్దిష్టము నగు బ్రహ్మమును దెలిసి కొనక యీ శరీరమును వదలిపోవుచున్నారో, ఇంక నెవరు స్వాత్మగతములు సత్యములునగు సంకల్పితకార్యములను గుర్తెఱుంగక మరణించుచున్నారో వారందఱికిని సమస్తలోక ములయందు నస్వాతంత్ర్యమె సంప్రాప్తమగును. ఆత్మలక్షణ మును గుర్తెఱింగి శరీరమును వదలిపోవువారు సమస్తలోకముల యందును సార్వభౌమునివలె స్వతంత్రమగు కామచారమును

త్వమస్య సూచయతి. యదప్యేతదుక్తం, న దహరస్యాకాశస్యా న్వేష్టవ్యత్వం విజిజ్ఞాసితవ్యత్వం చ శ్రుతం పరవిశేషణత్వేనో పాదానాదితి,అత్ర బ్రూమః—యద్యాకాశో నాన్వేష్టవ్యత్వేనోక్త స్స్యాత్ 'యావాన్వా అయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశ' ఇత్యాద్యాకాశస్వరూపప్రదర్శనం నోపపద్యేత.

మధ్యవర్తి: నన్వేతదప్యంతర్వర్తివస్తుసద్భావదర్శనాయైవ ప్రదర్శ్యతే, తం చేద్బ్రూయుర్యదిదమస్మిన్బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతరాకాశః కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసితవ్య'మిత్యాక్షిప్య పరి

---

దహరాకాశ మన్వేష్టవ్యమని శ్రుతిపల్కుచున్నది.

బొందుదురని యీవాక్యము బోధించుచున్నది. (4) దహరాకాశము అన్వేష్టవ్యము విజిజ్ఞాసితవ్యమని ప్రకృతవాక్యము చెప్పుటలేదు. అన్వేష్టవ్యము విజిజ్ఞాసితవ్యము అనురెండుపదములు పరబ్రహ్మమునకు విశేషణములై [ఆపరమార్థవస్తు వన్వేష్టవ్యము విజిజ్ఞాసితవ్యమని చెప్పుచున్నది]యని పూర్వవాది యాక్షేపణమున కిట్లుసమాధానము చెప్పుచున్నాము. ఆకాశ మన్వేష్టవ్యముగాను విజిజ్ఞాసితవ్యముగాను శ్రుతి చెప్పదలవనిచో "ఈ భూతాకాశ మెంతటిదో హృదయాకాశ మంతది" యని ఆకాశస్వరూప ప్రదర్శనము నిరుపయోగమగును.

మధ్యవర్తి: ఆకాశస్వరూపముగూడ, నంతర్వర్తియగు నొక వస్తువున్నదని చెప్పుటకు ప్రదర్శింపబడినదిగదా ? "పరిచ్ఛిన్నమగు శరీరమునందలి స్వల్పమగు హృత్పుండరీకమునందంత

హారావసరే ఆకాశౌపమ్యోపక్రమేణ ద్యావాపృథివ్యాదీనామంతస్సమాహితత్వప్రదర్శనాత్.

సిద్ధాంతీ: నైతదేవం. ఏవం హి సతి యదంతస్సమాహితం ద్యావాపృథివ్యాది తదన్వేష్టవ్యం విజిజ్ఞాసితవ్యం చోక్తం స్యాత్. తత్ర వాక్యశేషో నోపపద్యేత 'అస్మిన్కామాస్సమాహితా ఏష ఆత్మాపహతపాప్మే'తి హి ప్రకృత్య ద్యావాపృథివ్యాదిసమాధారమాకాశమాత్మానమనుకృష్య 'అథ య ఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్కామా' నితి

---

కంటెను స్వల్పతరమగు నాకాశమున తెలిసికొనతగినది సాక్షాత్కారము చేసికొనతగినది యేమికలదని యడిగినచో" (ఛాం 8-1-2) నను వాక్యమునం దాకాశమునందు తెలిసికొనదగిన దేదియు లేదని యాక్షేపింపబడుచున్నది. ఇట్టియాక్షేపణను పరిహరించుటకై భూతాకాశముతో దహరాకాశమును బోల్చి భూతాకాశమునందు వలెనే దహరాకాశమునందుగూడ ద్యావాపృథివ్యాదులున్నవని 8-1-3 వాక్యమునందు ప్రదర్శింపబడినది గదా!

సిద్ధాంతి : మీవాదము సరికాదు. మీవాదమే సరియయినచో హార్దాకాశమునందున్న ద్యావాపృథివ్యాదులు అన్వేష్టవ్యములు విజిజ్ఞాసితవ్యములని చెప్పినట్లగుచున్నది. ఆపక్షమున తరువాతవాక్యమున కవకాశము లేదు. "ఈబ్రహ్మపురమునందే జనులచే నాశింపబడు సర్వకామములు ప్రతిష్ఠితములగుచున్నవి. ఈబ్రహ్మనన్యమగు నాత్మయే మీ

దహరాకాశమున తెలిసికొనతగినది మరియొకటి లేదు.

సముచ్చయార్థేన చ శబ్దేనాత్మానం చ కామాధారమాహితాంశ్చ కామాన్విజ్ఞేయాన్వాక్యశేషో దర్శయతి. తస్మాద్వాక్యోపక్రమేఽపి దహర ఏవాకాశో హృదయపుండరీకాధిష్ఠానః సహాంతస్థైస్సమాహితైః పృథివ్యాదిభిస్సత్యైశ్చ కామైర్విజ్ఞేయ ఉక్త ఇతి గమ్యతే. స చోక్తేభ్యో హేతుభ్యః పరమేశ్వర ఇతి స్థితం.

---

స్వరూపము. అది ధర్మాధర్మాఖ్యమగు పాపము లేనిది" యని తరువాతవాక్యము గలదు. ఈవాక్యమునందు ద్యావాపృథివ్యాదుల కాధారమగు దహరాకాశమును బురస్కరించుకొని చివరకు ఆత్మలక్షణమును సత్యమగుకామములనుగూడ ధ్యానముచేగుర్తెఱింగి శరీరమును వదలిపోవువారు సమస్తలోకములయందును సార్వభౌమునివలె స్వతంత్రమగు కామచారమును బొందుదురు" అని(ఛాం 8–1–6)ఫలశ్రుతి చెప్పబడుచున్నది. ఈ వాక్యమునందుగాన్పించుచున్న చకారార్థమగు సముచ్చయము చేత సర్వకామముల కాశ్రయమైన యాత్మయు, నాత్మనాశ్రయించియున్న కామములుగూడ విజ్ఞేయములని ప్రదర్శింపబడుచున్నది. కనుక వాక్యారంభమున నుపక్రమింపబడిన హృదయపుండరీకములోని దహరాకాశముగూడ నద్దానియందిమిడియున్న పృథివ్యాదులు, సత్యములగు కామములతో గూడి విజ్ఞేయమగుచున్నది యని తెలియుచున్నది॥ 14

అ॥ పూర్వసూత్రమునం దుదాహరింపబడిన కారణముల విస్తరించుటకు దరువాత సూత్రములు ప్రవర్తించుచున్నవి.

## గతిశబ్దాభ్యాం తథాహిదృష్టం లింగం చ. (సూ. 15)

సిద్ధాంతి: దహరః పరమేశ్వర ఉత్తరేభ్యో హేతుభ్య ఇత్యుక్తం. త ఏవోత్తరే హేతవ ఇదానీం ప్రపంచ్యంతే. ఇతశ్చ పరమేశ్వర ఏవ దహరః యస్మాద్దహరవాక్యశేషే పరమేశ్వరస్యైవ ప్రతిపాదకౌ గతిశబ్దౌ భవతః. 'ఇమాస్సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందంతి' ఇతి(ఛాం 6-8-1). తత్ర ప్రకృ

---

గతి = జీవులు బ్రహ్మమును గూర్చి బోవుట, శబ్దాభ్యాం=బ్రహ్మలోకశబ్దము వినబడుట, ఈ రెండు కారణముల వలన దహరాకాశము బ్రహ్మమగుచున్నది. తథా = జీవులు బ్రహ్మలోకమునకు బోవుచున్నట్లు దృష్టంహి = శ్రుతియందు వినవచ్చుచున్నదిగదా! లింగం చ=ఈ గమనము బ్రహ్మలోక శబ్దార్థనిర్వచనమునకు సూచకముగూడ నగుచున్నది.

జీవుల బ్రహ్మలోక గమనము.

సిద్ధాంతి: ముందుదాహరింపబడు కారణములవలన దహరాకాశము పరమేశ్వరుఁడే కావలయునని పూర్వసూత్రమునఁ జెప్పబడినది. ఆ హేతువులే ప్రకృతమున విస్తరింపబడుచున్నవి. దహరాకాశమును జెప్పు వాక్యశేషమునందు పరమేశ్వరునిగూర్చి తెలియచేయు గతియు శబ్దము వినబడుచున్నవి. "అజ్ఞానులు ప్రతిదినము సుషుప్తిసమయమున బ్రహ్మమను లోకమును జేరుచున్నను తమరు బ్రహ్మభావమును బొందుచున్నట్లు కనుగొన లేకున్నారు" (ఛాం 8-3-2) అను వాక్యముగలదు. ఈ వాక్యము ప్రకృతవిచారవిషయమగు దహరాకాశమును

తం దహరం బ్రహ్మ లోకశబ్దేనాభిధాయ తద్విషయా గతిః ప్రజాశబ్దవాచ్యానాం జీవానామభిధీయమానా దహరస్య బ్రహ్మతాం గమయతి. తథా హ్యాహరహర్జీవానాం సుషుప్త్యవస్థాయాం బ్రహ్మవిషయగమనం దృష్టం శ్రుత్యంతరే 'సతా సోమ్య తదా సంపన్నో భవతీ'త్యేవమాదౌ. లోకేఽపి కిల గాఢం సుషుప్తమాచక్షతే 'బ్రహ్మీభూతో బ్రహ్మతాం గత' ఇతి.తథా బ్రహ్మలోకశబ్దోఽపి ప్రకృతే దహరే ప్రయుజ్యమానో జీవభూతాకాశశంకాం నివర్తయన్బ్రహ్మతామస్య గమయతి.

---

బ్రహ్మలోకశబ్దముచే నిర్దేశించి ప్రజాశబ్దముచే తెలియబడుచున్న జీవులందరచటికేగుచున్నట్లు చెప్పుచున్నది. అందువలన దహరాకాశము బ్రహ్మమని తెలియచేయుచున్నది. అదేవిధముగ మరియొక శ్రుతిగూడ ప్రతిదినము జీవులు సుషుప్తియందు బ్రహ్మనుగూర్చి పోవుచున్నట్లు పలుకుచున్నది. "పురుషుడు సుషుప్తియందు సత్ అని పిలువబడు దేవతతో నేకీభూతుడగుచున్నాడు" (ఛాందోగ్యము 6-8-1) అను మొదలగు శ్రుతులు గలవు. గాఢనిద్రయందున్నవానిని జూచి యీతడు బ్రహ్మీభూతుడైనాడు బ్రహ్మమును బొందెనని చెప్పుట లోకమునందు గలదు. అదేతీరున బ్రహ్మలోకశబ్దము గూడ ప్రకృతమగు దహరాకాశమును బరామర్శచేయుటచే దహరాకాశము జీవుడుగాని భూతాకాశముగాని కాదగునను శంకను తొలగించుచున్నది.

పూ. పక్షీ: నను కమలాసనలోకమపి బ్రహ్మలోకశబ్దో గమయేత్.

సిద్ధాంతీ: గమయేద్యదీదం బ్రహ్మణో లోక ఇతి షష్ఠీసమాసవృత్త్యా వ్యుత్పాద్యేత. సామానాధికరణ్యవృత్త్యా తు వ్యుత్పాద్యమానో బ్రహ్మైవ లోకో బ్రహ్మలోక ఇతి పరమేవ బ్రహ్మ గమయిష్యతి. ఏతదేవ చాహరహర్బ్రహ్మలోకగమనం దృష్టం బ్రహ్మ లోకశబ్దస్య సామానాధికరణ్యవృత్తిపరిగ్రహే లింగం. న హ్యాహరహరిమాః ప్రజాః కార్యబ్రహ్మలోకం సత్యలోకాఖ్యం గచ్ఛంతీతి శక్యం కల్పయితుం. 3

---

పూ. పక్షి. బ్రహ్మలోకమను శబ్దము కమలాసనుని లోకమును గూడ తెలియజేయునుగదా ?

సిద్ధాంతి : బ్రహ్మలోకము అను శబ్దమునకు బ్రహ్మము యొక్క లోకము అని షష్టీసమాసార్థమును చెప్పినచో నా పదము కమలాసనలోకమునే తెలియజేయును.

బ్రహ్మలోక శబ్దార్థము.

బ్రహ్మమే లోకము అని సామానాధికరణ్యార్థమును చెప్పినచో నా పదము పరబ్రహ్మమునే తెలియజేయును. బ్రహ్మలోకశబ్దమున కిట్టి యర్థకల్పనమునకు ప్రతిదినము బ్రహ్మలోకమునకు పోవుచున్నదను విషయము లింగమగుచున్నది. ప్రతిదిన మీా జనము సత్యలోకమని ప్రసిద్ధిచెందిన కార్యబ్రహ్మలోకమున కరుగుచున్నదనుట శక్యముగాదు. 15

## ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః. (సూ. 16)

ధృతేశ్చ హేతోః పరమేశ్వర ఏవాయం దహరః. కథం? దహరోఽస్మిన్నంతరాకాశ' ఇతి హి ప్రకృత్యాకాశౌపమ్య పూర్వకం తస్మింత్సర్వసమాధానముక్త్వా తస్మిన్నేవ చాత్మశబ్దం ప్రయుజ్యాపహతపాప్మత్వాదిగుణయోగం చోపదిశ్య తమేవానతి వృత్తప్రకరణం నిర్దిశతి 'అథ య ఆత్మా స సేతుర్విధృతిరేషాం లోకానామసంభేదాయే'తి. (ఛాం 8-4-1) తత్ర విధృతిరిత్యాత్మ

---

అస్య = ఈ దహరాకాశమునకు ధృతేః మహిమ్నః = ధృతిరూపమగు మహిమయొక్క ఉపలబ్ధేః చ = నిరూప ణముచేతగూడ నది పరమాత్మ యగుచున్నది.

దహరాకాశ విధరణత్వము

ధారణమను హేతువుచేతకూడ ప్రకృతమగు దహ రము పరమేశ్వరు డగుచున్నది. ఎట్లన! "హృదయపుండ రీకమునందు సూక్ష్మతరమగు నాకాశము" (ఛాం 8-1-1) అని ప్రకరణ మారంభింపబడినది. ఈ దహరాకాశమును భూతాకాశమునకు పోల్చి యద్దానియందు ద్యావాపృథివ్యాదు లున్నట్లు నిరూపింపబడి నది. (ఛాం 8-1-3) అటుతరువాత నట్టిదహరాకాశము నాత్మ శబ్దముచే పరామర్శ చేయబడి నశించినపాపము మొదలగు గుణ ములు గలిగియున్నట్లు పేర్కొనబడినది. (ఛాం 8-1-5). అటు పిమ్మట నీప్రకరణము ననుసరించియే "ఈయాత్మ సర్వలోక ములను ధరించు సేతువు వలెనున్నాడు. అందుచే లోకములు విచ్ఛేదమునొంది చెల్లాచెదరు కాకున్నవి" (ఛాం8-4-1) యని

శబ్దసామానాధికరణ్యాద్విధారయితోచ్యతే, క్షేత్రకర్తరిస్మరణాత్. యథోదకసంతానస్య విధారయితా లోకే సేతుః క్షేత్రసంపదామ సంభేదాయ ఏవమయమాత్మైషామధ్యాత్మాదిభేదభిన్నానాం లోకానాం వర్ణాశ్రమాదీనాం చ విధారయితా సేతురసంభేదాయా సంకరాయేతి. ఏవమిహ ప్రకృతే దహరే విధరణలక్షణం మహిమానం దర్శయతి. అయం చ మహిమా పరమేశ్వర ఏవ శ్రుత్యంతరాదుపలభ్యతే. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః." (బృ 3-8-10) ఇత్యాదేః. తథాన్యత్రాపి నిశ్చితపరమేశ్వరవాక్యే శ్రూయతే—"ఏష సర్వే

---

శ్రుతిపలుకుచున్నది. ఆత్మశబ్దముతో సంబంధించి యిచట విధృతిశబ్దము వినబడుటవలన విధృతిశబ్దమునకు విధారకుడని యర్థమును చెప్పవలయును. క్షేత్రములు కలిసిపోకుండునటుల జలప్రవాహము నరికట్టునట్లే యాత్మ అధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధిదైవతములచే విభిన్నములగు లోకములు వర్ణాశ్రమములు సాంకర్యమునుజెందక నిలుపుచున్నది. [సేతువు సాంకర్యమును దొలగించును. విధారకు డున్న స్థితియందు నిలుపును.] ఈవిధముగ ప్రకృతమగు దహరమునందు యథాస్థితి సంరక్షణరూపమగు మహిమ ప్రదర్శింపబడుచున్నది. అక్షరుడగు నీతనియొక్క యాజ్ఞచేతనే సూర్యాచంద్రమసులు వారివారిస్థానముల యందున్నారు' (బృ 3-5-9) అనుశ్రుతి పరమేశ్వరునియొక్క మహిమనుగూర్చి చెప్పుచున్నది. "సర్వమున కితడీశ్వరుడు, సర్వభూతముల కతడధిపతి; సర్వభూతసంరక్షణా

దహరాకాశ మహిమ

శ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామ సంభేదాయే'తి ఏవం ధృతేశ్చ హేతోః పరమేశ్వర ఏవాయం దహరః.

## ప్రసిద్ధేశ్చ (సూ. 17)

ఇతశ్చ పరమేశ్వర ఏవాయం 'దహరోఽస్మిన్నంతరాకాశ' ఇత్యుచ్యతే యత్కారణం ఆకాశశబ్దః పరమేశ్వరే

---

కర్త, లోకము లన్యోన్యము సంఘట్టనము చెందక యథాస్థానమున నుంచు నడ్డుగట్టు" అని బృహదారణ్యకశ్రుతి(4-4-22) పల్కుచున్నది. ఈవాక్యమునందు పరమేశ్వరుడు స్పష్టముగ నుదాహరింపబడుచున్నాడు. దానియందు పరమేశ్వరుని మహిమ చెప్పబడుచున్నది. [బృహదారణ్యవాక్యమునందు విధారకత్వాదిమహిమ సాక్షాత్తుగ పరమేశ్వరునియందు నుపపాదింపబడుచున్నది. ఛాందోగ్యవాక్యమునందు, విధరణత్వమహిమ గలిగినట్లు చెప్పబడుచున్నది. ప్రకరణ మాత్మప్రకరణ మగుటచే దహరాకాశమును పరామర్శ చేయుచున్నది.] ఇట్లు విధరణత్వకారణముచేత దహరాకాశము పరమేశ్వరుడే యగుచున్నాడు. 16

ప్రసిద్ధేః చ=ఆకాశశబ్దము బ్రహ్మమునందు ప్రసిద్ధముగ వాడబడుటచేత దహరాకాశము బ్రహ్మమగును.

ఈ కారణమువలనగూడ దహరాకాశము పరమాత్మయగుచున్నది. ఆకాశశబ్దము పరమేశ్వరునియందు ప్రసిద్ధ

ప్రసిద్ధః 'ఆకాశో హ వై నామరూపయోర్నిర్వహితా (ఛాం8-1-4) సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశాదేవ సముత్పద్యంతే' (ఛాం1-9-1) ఇత్యాదిప్రయోగదర్శనాత్. జీవేతు న క్వచిదాకాశ శబ్దః ప్రయుజ్యమానో దృశ్యతే. భూతాకాశస్తు సత్యామప్యాకాశశబ్దప్రసిద్ధావుపమానోపమేయభావాద్యసంభవాన్న గృహీతవ్య ఇత్యుక్తమ్.

---

ఆకాశశబ్దము బ్రహ్మమునందు ప్రసిద్ధము.

ముగ నున్నది. "ఆకాశము నామరూపములను నిర్వహించుచున్నది." (ఛాం 8-14). "ఈ భూతములన్నియు ఆకాశమునుండియె సముత్పన్నములగుచున్నవి." (ఛాం 1-9-1) ఈ మొదలగు ప్రయోగములు కాన్పించుచున్నవి. [నామరూపములు, జగదుత్పత్తిస్థానమగు పరమేశ్వరుని యందు సుప్రసిద్ధములు, ఆకాశమునందు కావు.] ఆకాశశబ్దము జీవుని యందు ప్రయోగింపబడినట్లు కాన్పింపదు, ఆశబ్దము భూతాకాశమునందు సుప్రసిద్ధమైనను, "ఈ యాకాశమెట్లో ఆంతరమగు దహరాకాశముగూడ నట్లెయని" (ఛాం 8-1-8) చెప్పబడిన] యాకాశోపమానము భూతాకాశపక్షమున సంభవము కాదు. దాని భూతాకాశమునకు బోల్పవీలుకాదు. కనుక ప్రకృతమున భూతాకాశమును గ్రహించుటకు వీలులేదు. 17

అ॥ వాక్యశేషమునందు దహరశబ్దముచే బరమేశ్వరుడే చెప్పబడుచున్నాడను వాదమునకు జీవపరామర్శగూడ వినవచ్చుచున్నదను పూర్వపక్షమును బ్రదర్శించి అందుకు సమాధానమును దరువాతసూత్రమున జెప్పుచున్నారు.

## ఇతరపరామర్శాత్ స ఇతి చేన్నాసంభవాత్(సూ.18)

పూ. పక్షి: యది వాక్యశేషబలేన దహర ఇతి పరమేశ్వరః పరిగృహ్యేత అస్తి హీతరస్యాపి జీవస్య వాక్యశేషే పరామర్శః 'అథ య ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచే'తి, (ఛాం8-3-4) అత్ర హి సంప్రసాదశబ్దః శ్రుత్యంతరే సుషుప్తావస్థాయాం దృష్టత్వాత్తదవస్థావంతం జీవం శక్నోత్యు

---

"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే" యను శ్రుతి వాక్యమునందు బ్రహ్మశబ్దముచేత ఇతర పరామర్శాత్ = జీవుడు పరామర్శింపబడుటవలన దహరాకాశము సః = జీవుడగుచున్నాడు. ఇతి చేత్ = అని యంటివేని న = అది సరి కాదు. అసంభవాత్ = సత్యసంకల్పాది ధర్మములు జీవుని యందసంభవమగుటవలన.

పూ. ప. వాక్యశేషబలముచేత దహరాకాశము పరమేశ్వరుడని గ్రహించినచో "సంప్రసాదుడు శరీరమునుండి లేచి జ్ఞానప్రకాశాత్మకమగు స్వస్వరూపమును బొందును. ఇట్టి సంప్రసాదు డాత్మయగుచున్నాడు" (ఛాం 8-3-4) అనువాక్యశేషమునందు జీవుడుగూడ పరామర్శచేయబడుచున్నాడు. ఈసంప్రసాదశబ్దము సుషుప్త్యవస్థాపరముగ (ఛాం 8-3) శ్రుతియందు వాడబడుచున్నది. కనుక నట్టి యవస్థాగతుడగు జీవుని జెప్పవలయునుగాని మఱియొక

వాక్యశేషము జీవునిగూడ చెప్పుచున్నది.

స్థాపయితుం నార్థాంతరం. తథా శరీరవ్యపాశ్రియస్యైవ జీవస్య శరీరాత్సముత్థానం సంభవతి. యథాకాశవ్యపాశ్రయాణాం వాయ్వాదీనామాకాశాత్సముత్థానం తద్వత్. యథా చాదృష్టోఽపి లోకే పరమేశ్వరవిషయ ఆకాశశబ్దః పరమేశ్వరధర్మసమభివ్యాహారాత్ 'ఆకాశో వై నామరూపయోర్నిర్వహితే'త్యేవమాదౌ పరమేశ్వరవిషయోఽభ్యుపగతః. ఏవం జీవవిషయోఽపి భవిష్యతి. తస్మాదితరపరామర్శాత్ 'దహరోఽస్మిన్నంతరాకాశ' ఇత్యత్ర స ఏవ జీవ ఉచ్యత ఇతి చేత్.

---

యర్థము చెప్పవీలులేదు. శరీరము నాశ్రయించియున్న జీవునికిమాత్రమే శరీరమునుండి లేచిపోవుట సంభవించును. [సంప్రసాదుడు శరీరమునుండి లేచి జ్ఞానప్రకాశాత్మకమగు స్వస్వరూపమును బొందును" అని (ఛాం. 8-3-4) శ్రుతి పలుకుచున్నది] ఆకాశము నాశ్రయించియున్న వాయ్వాదుల కచటనుండి సముత్థానమశక్య మగును. "ఆకాశము నామరూపముల నిర్వహించుచున్నది" (ఛాం. 8-14) అను వాక్యమునందు బరమేశ్వరధర్మ మాకాశమునకుజెప్పబడుట వలన, లోకమునం దట్టిప్రయోగము కానరాకున్న నాశబ్దము పరమేశ్వరపరముగ గ్రహింపబడుచున్నది. ఆ రీతిగనే జీవ విషయమునగూడ జెప్పనగును. అందువలన వాక్యశేషమునం దితరపరామర్శచేత "హృదయ పుండరీకమునందలి సూక్ష్మాకాశము" (ఛాం. 8-1-1) అనువాక్యమునందు జీవుడు చెప్పబడుచున్నాడని యంటిరేని.

(29)

సిద్ధాంతీ: నైతదేవం స్యాత్, కస్మాత్? అసంభవాత్. న హి జీవో బుద్ధ్యాద్యుపాధిపరిచ్ఛేదాభిమానీ సన్నాకాశేనోపమీయేత న చోపాధిధర్మానభిమన్యమానస్యాపహతపాప్మత్వాదయో ధర్మాస్సంభవంతి. ప్రపంచితం చైతత్ప్రథమే సూత్రే అధికాశంకాపరిహారాయ తు పునరుపన్యస్తం. పఠిష్యతి చోపరిష్టాత్— '‘అన్యార్థశ్చ పరామర్శ’, (బ్రు1-3-20) ఇతి. (సూ. ౧. ౩. ౨౦)

---

సిద్ధాంతి: అట్లుకానేరదు. ఏలనన! అసంభవమగుటవలన! జీవుడు బుద్ధిమొదలగు నుపాధులచే పరిచ్ఛిన్నుడు వానియందభిమానము గలవాడు. అట్టివాని నాకాశముతో బోల్చతగదు. మఱియు నుపాధిధర్మములయందభిమానముగలిగి యవి తనవియని తలంచువానికి పాపములు లేకపోవుట మొదలగు ధర్మములు సంభవములుకావు. ఈవిషయము 14 సూత్రమున విస్తరింపబడినది. జీవుడు బ్రహ్మముకంటె వ్యతిరిక్తుడు కాదాయను శంకానివారణకొఱకిచట తిరిగి చెప్పబడినది. 1-3-20 సూత్రమునం దీవిషయము తిరిగి వివరింపబడుచున్నది. 18

జీవునికి ఆకాశోపమానము సంభవముకాదు.

అ॥ ఛాందోగ్యము 8-3-4 వాక్యమునందు జీవుడు పలుకరింపబడుచున్నాడను వాదము నంగీకరించి యపహతపాప్మత్వాదిలక్షణములు జీవునికి సంభవము కావుగనుక దహరాకాశము జీవపరము కానేరదని పూర్వసూత్రమున జూపబడినది. ఈ యాశంకయే పునరుద్ధారము చేయబడుటచే నీసూత్రమున సమాధానము చెప్పబడుచున్నది.

## ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు (సూ. 19)

ఇతరపరామర్శాద్యా జీవాశంకా జాతా సా అసంభవాన్నిరాకృతా. అథేదానీం మృతస్యైవామృతసేకాత్పునస్సముత్థానం జీవాశంకాయాః క్రియతే|

పూ. పక్షీ: ఉత్తరస్మాత్ప్రాజాపత్యాద్వాక్యాత్. తత్ర హి 'య ఆత్మాపహతపాప్మే' త్యపహతపాప్మ త్వాది గుణకమాత్మానమన్వేష్టవ్యం విజిజ్ఞాసితవ్యం చ ప్రతిజ్ఞాయ

---

దహరాకాశప్రకరణముయొక్క ఉత్తరాత్ = ఉత్తర వాక్యమగు "స ఏష సంప్రసాదః" అనువాక్యమువలన జీవుడు ప్రతిపాదింపబడుచున్నాడని చేత్ = అంటివేని అది సరికాదు; ఏలనన! తు = అచ్చట నుదాహరింపబడిన జీవుడయితె ఆవిర్భూతస్వరూపః = ముక్తుడగు జీవుడగుచున్నాడు॥

ఛాం 8-3-4 వాక్యశేషముచే దహరాకాశము జీవుడగునను యాశంక, యసంభవమని త్రోసివేయబడినది. చనిపోయిన వానికి నమృతసేచనము చేతనువలెనే తరువాత ప్రకరణమున ప్రజాపతినిగూర్చి వినబడువాక్యముచే నీజీవాశంక తిరిగి యుద్ధరింపబడుచున్నది.

ప్రజాపతి జీవుని యుపదేశించెను.

పూ. పక్షి: [ప్రజాపతియొక్క దహరాకాశోపదేశమును కరాకర్ణికగ విని అపహతపాప్మత్వాదిగుణములుగల పరాత్మను దెలిసికొనుటకై యింద్రవైరోచను లిద్దరాయన కడకేగిరి] 'అపహతపాప్మత్వాదిగుణములుగల యాత్మ యన్వేషింపదగినది తెలిసికొనదగినది' యని ప్రజాపతి యింద్రవైరోచ

'య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మే'తి (ఛాం 8-7-4) ఋ్రివన్నక్షిస్థం ద్రిష్టారం జీవమాత్మానం నిర్దిశతి. 'ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామీ'తి (ఛాం 8-9-3) చ తమేవ పునఃపునః పరామృశ్య 'య ఏష స్వప్నే మహీయమానశ్చర త్యేష ఆత్మే'తి (ఛాం 8-10-1) తద్యత్రైతత్సుప్తస్సమస్తస్సం ప్రసన్నస్స్వప్నం న విజానాత్యేష ఆత్మే'తి చ జీవమేవావస్థాం తరగతం వ్యాచష్టే. తస్యైవ చాపహతపాప్మత్వాది ప్రదర్శయతి— 'ఏతదమృతమభయమేతద్బ్రహ్మే'తి. 'నాహ ఖల్వయమేవం

---

నలు కుపదేశించెను (ఛాం 8-7-3) తరువాత "కంటియందు కాన్పించుచున్న యీపురుషుడే యాత్మ" యని చెప్పి నేత్రము నందుండి చూచువాడు జీవాత్మయని నిర్దేశించెను. (ఛాం 8-3-4) ఇతనినిగూర్చియె దిరిగి తెలియజెప్పదలచి పలుమఱతనినే పరామర్శచేయుచు "సజ్జనులచే బూజింపబడుచు ననేకవిధములగు స్వప్నభోగముల ననుభవించువాడే యాత్మ" (ఛాం 8-10-1) యని చూపి తరువాత "సుషుప్తి యందు జీవుడు సర్వసంచారరహితుడు, సంప్రసాదస్థితియందుండి స్వప్నము నెఱుగడు, అతడే యాత్మ" (ఛాం 8-11-1) యని యవస్థాంతరమును బొందినజీవునే ప్రజాపతి బోధించెను. "ఈతడమృతుడు అభయము, ఈతడే బ్రహ్మ"మని యాతనికి అపహతపాప్మత్వాది గుణములున్నట్లును బ్రదర్శించెను. కాని యీసంప్రసాదావస్థయందు దానాత్మయని యెఱుంగ లేకున్నాడు; ఇతర భూతముల నెఱుంగలేకున్నాడు; కనుక నాయవస్థ

సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవేమాని భూతాని (ఛాం 8-11-2) తి చ సుషుప్త్యావస్థాయాం దోషముపలభ్య 'ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి నో ఏవాన్యత్రై తస్మా' దితి చోపక్రమ్య శరీరసంబంధనిందాపూర్వకం ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుష' ఇతి జీవమేవ శరీరాత్సముత్థితముత్తమం పురుషం దర్శయతి. తస్మాదస్తి సంభవో జీవే పారమేశ్వరాణాం ధర్మాణాం. అతః 'దహరోఽస్మిన్నంతరాకాశ' ఇతి జీవ ఏవోక్త ఇతి. చేత్కశ్చిద్బ్రూయాత్.

తం ప్రతి బ్రూయాదావిర్భూతస్వరూపస్త్వితి. తుశబ్దః పూర్వపక్షవ్యావృత్త్యర్థః. నోత్తరస్మాదపి వాక్యాదిహ జీవాశంకా

---

దోషగ్రస్తమైనది (ఛాం 8-11-1) యనితలంచిన యింద్రుని కీవిషయమునే 'నీకుతిరిగి వివరించెదనని' యుపక్రమించి, "అవిద్యచే దేహతాదాత్మ్యమును నొందిన జీవుడు ప్రతిబుద్ధుడైన తరువాత సంప్రసాదస్థితిచేరి యీశరీరమును వదలి దేహాదులకంటె విలక్షణమగు స్వస్వరూపమును బొందును. అతడుత్తమ పురుషుడు" అని శరీరమునుండి సముత్థితుడైన జీవుని నుత్తమ పురుషునిగ బ్రజాపతి ప్రదర్శించెను. కనుక బరమేశ్వరధర్మములు జీవునియందు సంభవింపగలవు. అందువలన హృదయ పుండరీకమునందలి దహరాకాశము జీవుడే యగుచున్నాడని యొకానొకడనవచ్చును.

సిద్ధాంతి : " అటులయినచో నభివ్యక్తస్వరూపుడు " అని సమాధానము చెప్పదగును. తు యను పదముచే బూర్వ

సంభవతీత్యర్థః. కస్మాత్? యతస్తత్రావిర్భూతస్వరూపో జీవో వివక్ష్యతే. ఆవిర్భూతం స్వరూపమస్యేత్యావిర్భూతస్వరూపః భూతపూర్వగత్యా జీవవచనః, ఏతదుక్తం భవతి—'య ఏషోऽక్షిణీ'త్యక్షిలక్షితం ద్రష్టారం నిర్దిశ్యోదశరావబ్రాహ్మణేనైనం శరీరాత్మతయా వ్యుత్థాప్య 'ఏతం త్వేవ తే' ఇతి పునః పునస్తమేవ వ్యాఖ్యేయత్వేనానుకృష్య స్వప్నసుషుప్తోపన్యాసక్రమేణ 'పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే' ఇతి

---

పక్షము నిరాకరింపబడుచున్నది. తరువాతనున్న వాక్యశేషముచేతగూడ బ్రకృత దహరవాక్యమునందు జీవాశంక కలుగనేరదు. ఏలనన; ఉత్తరవాక్యశేషమునందుగూడ నభివ్యక్తస్వరూపుడగు జీవుడు చెప్పబడుచున్నాడు. ఎవని నిజస్వరూపమావిష్కృత మగుచున్నదో యాతడావిష్కృతస్వరూపుడు. ఆవిష్కరణమునకు బూర్వస్థితినిబట్టి యాతడు జీవుడని చెప్పబడుచున్నాడు. దీని పర్యవసితార్థమేమన "నేత్రమునందే పురుషుడున్నాడో" (ఛాం 8-7-4) అను పదములచే మున్ముందక్షిగతుడగు పురుషుడాత్మయని ప్రజాపతి నిర్దేశించెను. తరువాత నలంకృతులుగాను అనలంకృతులుగానున్న యింద్రవైరోచనుల ప్రతిబింబముల నుదశరావమునందు జూపించి యట్టి స్వరూపమే యాత్మ యని యుదశరావబ్రాహ్మణమునందు (ఛాం 8-8.) బోధించెను. ఇట్టి యాత్మయె వ్యాఖ్యేయమని పలుమఱు తెలియజెప్పి (8-9-3) క్రమముగా స్వప్నసుషుప్తుల (8-10-11) యందలి యాత్మస్థితిని వివరించెను.

ఆవిర్భూతస్వరూప శబ్దార్థము.

యదస్య పారమార్థికం స్వరూపం పరం బ్రహ్మ తద్రూపతయైనం జీవం వ్యాచష్టే న జైవేన రూపేణ. యత్తత్పరం జ్యోతిరుప సంపత్తవ్యం శ్రుతం తత్పరం బ్రహ్మ తచ్చాపహతపాప్మత్వాది ధర్మకం తదేవ జీవస్య పారమార్థికం స్వరూపం 'తత్త్వమసీ' త్యాదిశాస్త్రేభ్యో నేతరదుపాధికల్పితం యావదేవ హి స్థాణావివ పురుషబుద్ధిం ద్వైతలక్షణామవిద్యాం నివర్తయన్కూటస్థనిత్య దృక్స్వరూపమాత్మానమహం బ్రహ్మాస్మీతి న ప్రతిపద్యతే తావజ్జీవస్య జీవత్వం యదా తు దేహేంద్రియమనో బుద్ధిసంఘా

---

చివరకు "అవిద్యచే దేహతాదాత్మ్యము నొందినజీవుడు ప్రతి బుద్ధుడైనతరువాత సంప్రసాదస్థితిని జేరి యీ శరీరమును వదలి దేహాదులకంటె విలక్షణమగు స్వస్వరూపమును బొందును" (8-12-2) అని జీవునియొక్క పరమార్థస్వరూప మగు పరబ్రహ్మరూపమునె చెప్పెనుగాని జైవరూపమును జెప్పియుండలేదు. పొందదగినదిగా శ్రుతియందు వినబడుచున్న పరంజ్యోతిఃస్వరూపము పరబ్రహ్మమగుచున్నది. అట్టి రూపము అపహతపాప్మత్వము మొదలగు ధర్మములు గలది. అదియే జీవునియొక్క పారమార్థికస్వరూపమని "తత్త్వమసి" (ఛాం 6-8-7) "ఆ బ్రహ్మమే నీవగుచున్నావు" అను మొదలగు వాక్యములు పలుకుచున్నవి. ఉపాధికృతమగు మఱియే యితర రూపము జీవునియొక్క పరమార్థస్వరూపము గానే రదు. స్థాణువును జూచి పురుషుడని భ్రమచెందినట్లే ద్వైతమె స్వరూపముగా గలిగిన యవిద్య తొలగిపోయి నిత్యజ్ఞాన స్వరూపమగు బ్రహ్మము నే నగుచున్నా నని ఎంతవఱకు మను

తాదుత్థాపయ చ్ఛ్రుత్యా ప్రతిబోధ్యతే. నాసి త్వం దేహేంద్రియ మనోబుద్ధిసంఘాతో నాపి సంసారీ కింతర్హి తద్యత్సత్సత్యం స ఆత్మా చైతన్యమాత్రస్వరూపస్తత్త్వమసీతి. తదా కూటస్థ నిత్య దృక్స్వరూపమాత్మానం ప్రతిబుధ్యాస్మాచ్ఛరీరాద్యభిమానాత్స ముత్తిష్ఠన్ స ఏవ కూటస్థనిత్యదృక్స్వరూప ఆత్మాభవతి 'స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' (ముం3-2-9) త్యాదిశ్రుతిభ్యః. తదేవ చాస్య పారమార్థికం స్వరూపం యేన శరీరాత్సముత్థాయ స్వేన రూపేణాభినిష్పద్యతే.

---

జుకు తెలిసికొనఁడో యంతవఱకు జీవునికి జీవత్వముండును. ఎప్పుడు దేహేంద్రియమనోబుద్ధిసంఘాతమునుండి పైకిలేచి "నీవు దేహేంద్రియమనోబుద్ధిసంఘాతస్వరూపుడవు కావు. నీవు సంసారివి కావు, చైతన్యమాత్రస్వరూపము, సత్యము నగునాత్మవు నీవగుచున్నావను" శ్రుతిభోధను గ్రహించునో, యప్పుడు నిత్యజ్ఞానస్వరూపుడగు కూటస్థుని దెలిసికొని, యీ శరీరాద్యభిమానమునుండి పైకిలేచినవాడై యాజీవుడే కూటస్థనిత్యజ్ఞానస్వరూపుడగు నాత్మ యగుచున్నాడు. పర బ్రహ్మనెవడు తెలిసికొనుచున్నాడో యాతడు పరబ్రహ్మమె యగుచున్నాడని ముండకశ్రుతి (3-2-9) చెప్పుచున్నది. అదియె జీవుని పారమార్థికస్వరూపము. పారమార్థిక స్వరూపు డగుటచేత సంపాప్రసాదుడగు జీవుడే శరీరమునుంచి లేచి స్వ స్వరూపమున గాన్పించుచున్నాడు. (ఛాం. 8-12-2)

పూ. పక్షీ: కథం పునస్స్వం రూపం స్వేనైవ చ రూపేణ నిష్పద్యత ఇతి సంభవతి కూటస్థనిత్యస్య? సువర్ణాదీనాం తు ద్రవ్యాన్తరసంపర్కాదభిభూతస్వరూపాణామనభివ్యక్తా సాధారణవిశేషాణాం క్షారప్రక్షేపాదిభిశ్శోధ్యమానానాం స్వరూపేణాభినిష్పత్తిస్స్యాత్తథా నక్షత్రాదీనామహన్యభిభూతప్రకాశానామభిభావకవియోగే రాత్రౌ స్వరూపేణాభినిష్పత్తిస్స్యాత్. న తు తథాత్మచైతన్యజ్యోతిషో నిత్యస్య కేనచిదభిభవస్సంభవతి అసంసర్గిత్వాద్వ్యోమ్న ఇవ, దృష్టవిరోధాచ్చ. దృష్టిశ్రుతిమతివిజ్ఞాతయో హి జీవస్య

---

పూ. పక్షి: పరబ్రహ్మము కూటస్థనిత్యము. [కనుక నేమియు మార్పు లేనివాడు.] అట్టిస్థితిలో నతని స్వరూపమును తాను తిరిగిపొందుచున్నాడని యెట్లువచియింపగలము? ఇతరద్రవ్య సంపర్కముచేత సువర్ణాదుల నిజస్వరూపము మరుగుపడినపుడు, వానివాని ప్రత్యేకగుణవిశేషములు కాన్పింపవు. ఉప్పు మొదలగువానిచే వానిని శోధించినపుడు వానివాని స్వస్వరూపము తిరిగి లభించును. అదేతీరున పగటియందు సూర్యకాంతిచే నభిభూతమగుచున్న నక్షత్రకాంతి రాత్రులయందద్దాని యభిభవకారణమగు సూర్యకాంతి కాన్పింపనందున స్వస్వరూపమున తిరిగి కాన్పించుచున్నది. కాని ఆత్మచైతన్య ప్రకాశము నిత్యము, ఆకాశమువలె నసంస్పృష్టము. దానిని గప్పిపుచ్చగలది మఱియెద్దియును లేదు. మఱియు నిట్లనుట ప్రత్యక్షానుభవమునకు విరుద్ధమగుచున్నది. దర్శనము శ్రవణము మతి విజ్ఞానము మొదలగునవి జీవునియొక్క స్వరూపము. ఇట్టిస్వరూపము శరీరమునుండి లేచిపోనపుడుగూడ జీవునియం

స్వరూపం, తచ్చ శరీరాదసముత్థితస్యాపి జీవస్య సదా నిష్పన్న మేవ దృశ్యతే. సర్వో హి జీవః పశ్యన్ శృణ్వన్మన్వానో విజానన్స్వ వ్యవహరతి అన్యథా వ్యవహారానుపపత్తిః. తచ్చేచ్ఛరీరాత్సముత్థితస్య నిష్పద్యేత ప్రాక్సముత్థానాద్దృష్టో వ్యవహారో విరుధ్యేత. అతః కిమాత్మకమిదం శరీరాత్సముత్థానం కిమాత్మికా చ స్వరూపేణాభినిష్పత్తిరితి.

సిద్ధాంతీ : అత్రోచ్యతే—ప్రాగ్వివేకవిజ్ఞానోత్పత్తేః శరీరేంద్రియమనోబుద్ధివిషయవేదనోపాధిభిరవివిక్తమివ జీవస్య దృష్ట్యాది

---

దెల్లపుడు గాన్పించుచున్నది. జీవులందఱును జూచుచు, శ్రవణము చేయుచు, మననము చేయుచు, దెలిసికొనుచు వ్యవహరించుచున్నారు. అట్లుకానిచో వ్యవహారమున కవకాశము లేదు. శరీరమునుండి యుత్థానము చేసినతరువాత నే జీవునికిట్టి వ్యవహారము లభించునంటిరేని, సముత్థానమునకు పూర్వమున్న వ్యవహారమంతయు విరుద్ధముగ గాన్పించును. కనుక మీరు చెప్పుశరీరసముత్థానమన నెట్టిది? స్వస్వరూపమున గాన్పించుట యన నేమి?

సిద్ధాంతి : జీవుడు[స్వయముగా శుద్ధ జ్యోతిఃస్వరూపము] స్వభావముచే సర్లిప్తమగు జీవుని స్వరూపము విజ్ఞానము కలుగకపూర్వము శరీరము యింద్రియములు మనస్సు బుద్ధి వీనికి విషయములగు హర్షశోకాదులు మొదలగు నుపాధులచే నావరింపబడి వానినుండి ప్రత్యేకింపబడుటలేదు. ఆతని జ్యోతిఃస్వరూపము దృష్టి మొదలగు రూపమగు చున్నది. శుద్ధమగు

జ్యోతిస్స్వరూపం భవతి. యథా శుద్ధస్య స్ఫటికస్య స్వాచ్ఛ్యం శౌక్ల్యం చ స్వరూపం ప్రాగ్వివేకగ్రహణాద్రక్తనీలాద్యుపాధిభిర వివిక్తమివ భవతి, ప్రమాణజనితవివేకగ్రహణాత్తు పరాచీనస్ఫటికస్వాచ్ఛ్యేన శౌక్ల్యేన చ స్వేన రూపేణాభినిష్పద్యత ఇత్యుచ్యతే, ప్రాగపి తథైవ సత్. తథా దేహాద్యుపాధ్యవివిక్తస్యైవ సతో జీవస్య శ్రుతికృతం వివేకజ్ఞానం శరీరాత్సముత్థానం వివేకజ్ఞానఫలం స్వరూపేణాభినిష్పత్తిః కేవలాత్మస్వరూపావగతిః. తథా వివేకావివేకమాత్రేణైవాత్మనోఽశరీరత్వం సశరీరత్వం

---

స్ఫటికముయొక్క స్వాచ్ఛ్యము శ్వేతమునగు స్వరూపము వివేకమునకుపూర్వము ఉపాధిభూతమగు రక్తనీలాదివర్ణముల చేత ప్రత్యేకింపబడకుండ కాన్పించుచున్నది. ఉపాధివర్ణముల నుండి ప్రమాణజన్యజ్ఞానముచే వివేకించినపుడు స్ఫటికము తన పురాతనమగు స్వాచ్ఛ్యము శ్వేతమునగు స్వస్వరూపము బొందుచున్నదియని చెప్పుచున్నాము. కాని నిజమగు స్వస్వరూపము సంతకుపూర్వమే యది పొందియున్నది. అట్లే తీరున సదారిపుడగు జీవునికి శ్రుతిబోధితమైన దేహాద్యుపాధివివేకవిజ్ఞానమే శరీరమునుండి సముత్థాన మనబడుచున్నది, స్వస్వరూపము బొందుటయనగా తాను కేవలాత్మస్వరూప మని దెలిసికొనుటయే వివేకవిజ్ఞానఫల మగుచున్నది. ఇట్టి వివేకమును బట్టి ఆత్మకు శరీరము లేమియు అవివేకమును

స్వస్వరూపమున కర్థము.

చ మంత్రవర్ణాత్ "అశరీరం శరీరేష్వి"తి.(కా 1-2.22) "శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యత" (గీ 13-31)ఇతి చ సశరీరత్వాశరీత్వ విశేషాభావస్మరణాత్. తస్మాద్వివేకవిజ్ఞానాభావాదనావిర్భూతస్వరూపస్సన్వివేకజ్ఞానాదావిర్భూతస్వరూప ఇత్యుచ్యతే, న త్వన్యాదృశావావిర్భావానావిర్భావౌ స్వరూపస్య సంభవతస్స్వరూపత్వాదేవ. ఏవం మిథ్యాజ్ఞానకృత ఏవ జీవపరమేశ్వరయోర్భేదో న వస్తుకృతః వ్యోమవదసంగత్వావిశేషాత్.

---

బట్టి శరీరమునికియు సంభవించుచున్నది. ఆతడు శరీరములయందుండినను శరీరములేనివాడు (కాఠ 1-2-22) "శరీరగతుడైనను ఆత్మ కర్తగాడు. సంస్పృష్టుడుగాడు" (గీత 13-31) అను ప్రమాణములు ఆత్మకు సశరీరత్వ అశరీరత్వ విశేషముల లేమిని ప్రదర్శించుచున్నవి. అందువలన నుపాధి వివేకవిజ్ఞానము లేమింజేసి యతని స్వరూప మావిర్భూతము కాలేదనియు నట్టివిజ్ఞానము గలిగినపు డతని స్వరూప మావిర్భూత మైనదనియు జెప్పబడుచున్నది. మరియొకవిధమగు నావిర్భూతానావిర్భూతములు స్వస్వరూపమునకు సంభవములు కావు. స్వరూపస్వభావ మెల్లపు డొకటి యగుటయె ఇందుకు గారణము. [ఆవిర్భూతానావిర్భూతములు స్వభావముచే మార్పుచెందని స్వరూపమునందు బుద్ధిచే కల్పితములుగాని స్వయముగా గలిగినవి కావు]. ఇట్లు జీవపరమేశ్వరులకు భేదము మిథ్యాజ్ఞానము కల్పితముగాని, స్వయముగ స్వరూపమునందు యథార్థముగ లేదు. ఆకాశమువలె యథార్థముచే దేనిచేతనది సంస్పృష్టము గాదు,

కుతశ్చైతదేవం ప్రతిపత్తవ్యం? యతః 'య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత' ఇత్యుపదిశ్య 'ఏతదమృతమభయమేతద్బ్రహ్మే'త్యుపదిశతి. యోఽక్షిణి ప్రసిద్ధో ద్రష్టా ద్రష్టృత్వేన విభావ్యతే సోఽమృతాభయలక్షణాద్బ్రహ్మణోఽన్యశ్చేత్స్యాత్, తతోఽమృతాభయబ్రహ్మసామానాధికరణ్యం న స్యాత్. నాపి ప్రతిచ్ఛాయాత్మాఽయమక్షిలక్షితో నిర్దిశ్యతే, ప్రజాపతేర్మృషావా

---

ఈయర్థకల్పన మెట్లు తెలియుచున్నదనిన, చక్షుస్సునందు కాన్పించుచున్న పురుషుని అనఁగా జీవుని బ్రస్తావించుచు నతఁడు అమృతుఁడు, అభయుఁడు, ఆతఁడే బ్రహ్మమని ప్రజాపతి యింద్రున కుపదేశించెను. (ఛాం 8–7–2) చక్షుఃస్థానమునందుండి సుప్రసిద్ధముగ దర్శనక్రియ నాచరించుచున్నవాఁడు అమృతత్వము అభయత్వము లక్షణముగాఁగల బ్రహ్మముకంటె భిన్నుఁడే యయినచో నతనికిని పైలక్షణములుగల బ్రహ్మమునకును సామానాధికరణ్యము కుదరదు. [వీరిద్దఱి నతఁడే బ్రహ్మయని సమానప్రతిపత్తిలో జెప్ప శక్యముకాదు.] చక్షుఃస్థానమునందుండి దర్శనక్రియ చేయుచున్న పురుషుఁడు ప్రతిఫలనాత్మకమగు ఛాయాపురుషుఁడని ప్రజాపతి చెప్పియుండఁడు. అప్పుడత డబద్ధమాడినవాఁడగును. [ఇంద్రవైరోచనులిద్దఱుఁగూడ నపహతపాప్మగు నాత్మను దెలిసికొని కృతకృత్యతను సర్వకామావాప్తిని బొందఁగోరి ప్రజాపతియొద్దకు జనిరి. అట్టివారికి ననాత్మభూతమగు ఛాయాపురుషుని నుపదేశించినచో నతఁడు మృషావాదియే

దిత్వప్రసంగాత్. తథా ద్వితీయేऽపి పర్యాయే 'య ఏష స్వప్నే మహీయమానశ్చరతీ'తి న ప్రథమపర్యాయనిర్దిష్టాదక్షిపురుషాద్ద్వితీయస్య నిర్దిష్టః 'ఏతం త్వేవ తే భూయోऽనువ్యాఖ్యాస్యామీ'త్యుపక్రమాత్. కిం చాహమద్య స్వప్నే హస్తినమద్రాక్షం నేదానీం తం పశ్యామీతి దృష్టమేవ ప్రతిబుద్ధః ప్రత్యాచష్టే, ద్రష్టారం తు తమేవ ప్రత్యభిజానాతి య ఏవాహం స్వప్నమద్రాక్షం స ఏవాహం జాగరితం పశ్యామీతి. తథా తృతీయేऽపి పర్యాయే 'నహి ఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి

---

యగును]. స్వప్నమునందు సుఖముగా చరించు పురుషుని గూర్చి రెండవపర్యాయము ప్రస్తావించినపుడుగూడ (ఛాం 8-10-1) ప్రథమపర్యాయము నిర్దేశించిన యక్షిస్థానమునందున్న ద్రష్టకంటె నన్యుని యాతడు నిర్దేశించియుండలేదు. ఈతనిగూర్చియే [అనగా చక్షుఃస్థానమునందున్న ద్రష్టను గూర్చియె] నీకు అనగా నిందునకు వివరించెదనని తన యుపదేశము నాయన యుపక్రమించెను. స్వప్నమునందు నేనే గజమును చూచితినో దానిని నేనిపుడు చూచుటలేదని స్వప్నదృశ్యమును మాత్రము నిరసించుచున్నాడు. స్వప్నమునందు గజమును జూచిన నేనే మేల్కాంచి చూచుచున్నానని స్వప్నజాగరితములయందు దానొక్కడే వ్యవహరించుచున్నట్లు గుర్తించుచున్నాడు. "సుషుప్తియందిది నేననిగాని యీభూతములివియనిగాని" గుర్తించలేకున్నాడని తృతీయపర్యాయము జేసిన యుపదేశమునందుఁగూడ సుషుప్త్య

నో ఏవేమాని భూతానీ'తి సుషుప్తావస్థాయాం విశేషవిజ్ఞానాభావ మేవ దర్శయతి. న విజ్ఞాతారం ప్రతిషేధతి. యత్తు తత్ర 'వినాశ మేవాపీతో భవతీ'తి తదపి విశేషవిజ్ఞానవినాశాభిప్రాయమేవ న విజ్ఞాతృవినాశాభిప్రాయమ్ 'న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాదితి (బృ 4-3-30) శ్రుత్యంతరాత్. తథా చతుర్థేఽపి పర్యాయె 'ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి నో ఏవాన్యత్రైతస్మా' దిత్యుపక్రమ్య 'మఘవన్మర్త్యం వా ఇదం శరీర' మిత్యాదినా ప్రపంచేన శరీరాద్యుపాధిసంబంధ ప్రత్యాఖ్యా నేన సంప్రసాదశబ్దోదితం జీవం 'స్వేన రూపేణాభినిష్పద్యత'

---

వస్థయందు విశేషవిజ్ఞానముయొక్క లేమినిమాత్రము ప్రదర్శించెనుగాని [అవస్థాత్రియమునందు వ్యవహరించుచున్న] విజ్ఞాతయగు తనను నిషేధించుకొనియుండలేదు. (ఛాం 8-11-1) "సుషుప్తియందు వినాశనమును బొందుచున్నా" డనువాక్యము విశేషవిజ్ఞానవినాశమును బోధించుచున్నది గాని, విజ్ఞాతృవినాశమును దెలియజేయుటలేదు. "విజ్ఞాతయొక్క విజ్ఞానమునకు విపరిలోపము గలుగదు. అది యవినాశి" యని (బృ 4-3-30) మఱియొక శ్రుతి పల్కుచున్నది. "ఈతనినిగూర్చియె తిరిగి నీకు తెలియజెప్పుచున్నాను. మఱియొకదానిని చెప్పను." అని నాల్గవపర్యాయ

శరీరసముత్థాన అర్థము.

ముపక్రమించి 'ఈ శరీరము నశ్వరము" అని శరీరాద్యుపాధిసంబంధమును విస్తారముగ ద్రోసి పుచ్చెను. సంప్రసాదశబ్దముచే జెప్పబడుచున్న జీవుడు స్వీయమగు రూపమును బొందుచున్నాడని యతని

ఇతి బ్రహ్మస్వరూపాపన్నం దర్శయన్ న పరస్మాద్బ్రహ్మణోఽమృతాభయస్వరూపాదన్యం జీవం దర్శయతి.

కేచిత్తు పరమాత్మవివక్షాయాం 'ఏతం త్వేవ తే' ఇతి జీవాకర్షణమన్యాయ్యం మన్యమానా ఏతమేవ వాక్యోపక్రమసూచితమపహతపాప్మత్వాదిగుణకమాత్మానం తే భూయోఽనువ్యాఖ్యాస్యామీతి కల్పయంతి.

తేషామేతమితి సన్నిహితావలంబినీ సర్వనామశ్రుతిర్విప్రకృష్యేత, భూయశ్శ్రుతిశ్చోపరుధ్యేత, పర్యాయాంతరాభిహితస్య

---

బ్రహ్మస్వరూపప్రాప్తిని జూపి, యమృతాభయరూపమగు పరబ్రహ్మముకంటె జీవుడన్యుడుగాడని తెలియజెప్పెను.

ఇచట కొందఱు "ఇతనిని నీకు చెప్పెదునని" నాల్గవ పర్యాయము చేయబడిన యుపక్రమములోని "ఇతనిని"యను సర్వనామశబ్దమును జీవపరముగ గ్రహించుట యన్యాయమనిదలంచి అపహతపాప్మత్వాదిగుణములు గల యాత్మపరముగ నర్థకల్పనముచేసి "ఆత్మనుగూర్చి నీకు దెలియజెప్పెదనని యాయుపక్రమణవాక్యమున కర్థమును జెప్పిరి. [నాల్గవ పర్యాయముచేసిన యుపక్రమణవాక్య మంతకుబూర్వము చేసిన యుపక్రమణవాక్యముల మూడింటి విషయమగు, జీవునికి సంబంధింపదని వారి తాత్పర్యము.]

"ఈతనిని" యనునది సర్వనామము. ఆ పదము సన్నిహితముగా నున్న దానిని దెలియజేయును గాని దూరముగానున్న దానిని దెలియజేయదు. వీరి యర్థకల్పనము దూరముగానున్న దానికి సంబంధించి "తిరిగి చెప్పెదును" అను వాక్యమునకును

తస్య పర్యాయాంతరేణానభిధీయమానత్వాత్. 'ఏతం త్వేవ త' ఇతి చ ప్రతిజ్ఞాయ ప్రాక్చతుర్థాత్పర్యాయాదన్యమన్యం వ్యాచక్షాణస్య ప్రజాపతేః ప్రతారకత్వం ప్రసజ్యేత. తస్మాదవిద్యాప్రత్యుపస్థాపితమపారమార్థికం జైవం రూపం కర్తృత్వభోక్తృత్వ రాగద్వేషాది దోషకలుషితమనేకానర్థయోగి తద్విలయనేన తద్విపరీతమపహతపాప్మత్వాదిగుణకం పారమేశ్వరం స్వరూపం విద్యయా ప్రతిపాద్యతే సర్పాదివిలయనేనేవ రజ్జ్వాదీన్.

---

విరుద్ధమగును. పూర్వము చెప్పినది [వీరి వాదముప్రకారము] తిరిగి చెప్పబడుటలేదు. [మొదటి మూడుపర్యాయములు] జీవునిగూర్చి తెలియజెప్పెను. ఆత్మనుగూర్చి చెప్పలేదు. [నాల్గవపర్యాయ మాత్మను గూర్చియె చెప్పదలచినచో తిరిగి యనుమాట కర్థసమన్వయము కానేరదు.] "దీనిని నేను వివరించెదనని వాగ్దానముచేసి మొదటి మూడుపర్యాయములు వేఱువేఱు విషయములనుగూర్చి చెప్పినచో, ప్రజాపతి మోసగాడగును. అందువలన నవిద్యచే గల్పింపబడినట్టియు, పరమార్థము కానట్టియు కర్త భోక్త రాగము, ద్వేషము మొదలగు దోషములచే కలుషితము, అనేకానర్థములతో గూడినట్టియు జీవరూపమును శోధించుకొని యందుకు విపరీతము, అపహతపాప్మత్వాది గుణములు గలదియునగు పరమేశ్వరస్వరూపమును బొందుచున్నాడు. సర్పభ్రాంతి పోయినపుడు రజ్జుపుమాత్రము లభించు చున్నది.

అపరేతు వాదినః పారమార్థికమేవ జైవం రూపమితి మన్యంతే. అస్మదీయాశ్చ కేచిత్. తేషాం సర్వేషా మాత్మైకత్వ సమ్యగ్దర్శనప్రతిపక్షభూతానాం ప్రతిషేధాయేదం శారీరక మారబ్ధమ్. ఏక ఏవ పరమేశ్వరః కూటస్థనిత్యో విజ్ఞాన ధాతురవిద్యయా మాయయా మాయావివదనేకధా విభావ్యతే నాన్యో విజ్ఞానధాతురస్తీతి. యత్త్విదం పరమేశ్వరవాక్యే జీవ మాశంక్య ప్రతిషేధతి సూత్రకారః— నాసంభవాదిత్యాదినా.

---

మఱికొందఱును, అస్మదీయులగు తదితరులును జీవ రూపము పరమార్థమని తలంచుచున్నారు. ఆత్మైకత్వదర్శన మునకు బ్రతిపక్షులగు వీరలందఱికి జ్ఞానోప దేశము చేయుటకే యీ శారీరకమీమాంసా శాస్త్ర మారంభింపబడినది. పరమేశ్వరు డొక్కడు, అగసాలిదిమ్మెవలె నిత్యుడు; విజ్ఞానఘనుడు [అనగా విజ్ఞానస్వరూపముగాని విజ్ఞానము గుణముగా గలవాడు కాడు.] మాయాసంబంధమగు నవిద్యచే నైంద్రజాలికునివలె ననేకవిధముల నభివ్యక్తమగువాడు, అతనికంటె విజ్ఞానఘన మెద్దియును లేదు. [అవిద్యకును మాయకును భేదము లేదు. లోకమునం దనుభూతములగు నావరణవిక్షేపశబ్దముల పురస్క రించుకొని యవిద్యాశబ్దము వాడబడుచున్నది] ఇట్టి పరమేశ్వర ప్రతిపాదకమగు ప్రకరణమున జీవుడనువా డున్నాడని శంకించి "నాసంభవాత్" (బ్ర. సూ 1–3–18)అని అతని ప్రత్యేకతను నిషేధించుటయందు సూత్రకారుల యభిప్రాయ మేమన!

జీవరూపము పరమార్థము కాదు.

(౧. ౩. ౧౮,) తత్రాయమభిప్రాయః. నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావే కూటస్థనిత్యే ఏకస్మిన్నసంగే పరమాత్మని తద్విపరీతం జైవం రూపం వ్యోమ్నీవ తలమలినాది పరికల్పితమ్. తదాత్మైకత్వప్రతిపాదనపరవాక్యైర్న్యాయోపేతైర్ద్వైతవాదప్రతిషేధైశ్చాపనేష్యామీతి పరమాత్మనో జీవాదన్యత్వం ద్రఢయతి. జీవస్య తు న పరస్మాదన్యత్వం ప్రతిపిపాదయిషతి కిం త్వనువదత్యేవావిద్యాకల్పితం లోకప్రసిద్ధం జీవభేదమ్. ఏవం హి స్వాభావిక

---

నిత్యము, శుద్ధము, బుద్ధము స్వభావముగాగలిగి కూటస్థనిత్యము, అసంగము ఏకమునగు పరమాత్మయం దాకాశమునమాలిన్యమును, వివిధరూపములను గల్పించినట్లు, విరుద్ధమగు జీవరూపము కల్పింపబడుచున్నది. జీవబ్రహ్మల నైక్యమును దెలుపునవియు, సహేతుకములయినవియు, ద్వైతవాదమును నిరసించునవియునగు వేదాంతవాక్యములచే జీవబ్రహ్మలు భిన్నములను నపోహను దొలగించుటకై [అనగా పరమాత్మ సంసారి కాడని స్థిరము చేయుటకై] మున్ముందు జీవుడు బ్రహ్మకంటె నన్యుడని సూత్రకారులు దృఢము చేసిరి. [అట్లు చేయనిచో జీవపరమాత్మలొకరైనను జీవునికి సంసారిత్వము దొలగనేరదు] కాని జీవుడు పరమాత్మకంటె నన్యుడని వారుపపాదించుటలేదు. [అనగా పరమాత్మ నవస్థాభేదమును బట్టి జీవునికంటె భిన్నమని చెప్పినను జీవుడు పరమాత్మకంటె భిన్నమని చెప్పియుండలేదు. పరమాత్మ జీవుడు కాడనియు జీవుడు పరమాత్మకంటె భిన్నము కాదనియు భావము.] మరియు నవిద్యాకల్పితము, లోకప్రసిద్ధమునగు జీవాత్మభేదమును

కర్తృత్వ భోక్తృత్వానువాదేన ప్రవృత్తాః కర్మవిధయో న విరుధ్యంత ఇతి మన్యతే, ప్రతిపాద్యం తు శాస్త్రార్థమాత్మైకత్వమేవ దర్శయతి—'శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవ' (సూ 1-1-30) ఇత్యాదినా, వర్ణితశ్చాస్మాభిర్విద్వదవిద్వద్భేదేన కర్మవిధివిరోధ పరిహారః.

---

పురస్కరించుకొని పల్కుచున్నారు. ఇట్లు చేయుటయందు సూత్రకారుల యభిప్రాయమేమన, స్వభావసిద్ధమగు కర్తృత్వ భోక్తృత్వములను బురస్కరించుకొని ప్రవృత్తములైన కర్మ బోధకములగు విధివాక్యములు విరుద్ధములు కానేరవని తలంచు చున్నారు. [స్వర్గాదిఫలములు స్వభావసిద్ధమగు కామనచే కలుగుచున్నవి. అట్టికామనల ననుభవించు మార్గముల మాత్రము "స్వర్గకామో యజేత" మొదలగు విధివాక్యములు బోధించుచున్నవి. విధివాక్యములు కామనను కలుగజేయవు.] ఆత్మయొక్క యేకత్వమును చెప్పుటయందుమాత్రమే శాస్త్ర తాత్పర్యమని "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్". (బ్ర. సూ. 1-1-30) అను మొదలగు సూత్రములయందు వ్యక్తపఱచిరి. కర్మబోధకములగు విధివాక్యములు జ్ఞాన్యజ్ఞాని భేదము ననుసరించుటచే నవి జ్ఞానకాండమున కవిరుద్ధములని యింతకుబూర్వమే పరిహరింపబడినది. 19

అ॥ అపహతపాప్మత్వాదిగుణములు బ్రహ్మమునకుమాత్రి ముండుటచేతను అవి జీవునికి సంభవమగుటచేతను జీవుడు దహరముకానేరడని యింతవఱకు నిరూపింపబడినది. కాని

## అన్యార్థశ్చ పరామర్శః (సూ. 20)

అథ యోఽయం దహరవాక్యశేషే జీవపరామర్శో దర్శితః— 'అథ య ఏష సంప్రసాద' (ఛాం 8-3-4) ఇత్యాదిస్న దహరే పరమేశ్వరే వ్యాఖ్యాయమానే న జీవోపాసనోపదేశో నాపి ప్రకృతవిశేషోపదేశ ఇత్యనర్థకత్వం ప్రాప్నోతీత్య త.

---

ప్రజాపతి సంప్రసాదుడగు జీవు డీశరీరమునుండి లేచిపోవు చున్నాడని చేసిన జీవపరామర్శకు (ఛాం 8–3–4) సమాధాన మేమి యని కలిగిన యాశంకకు తరువాతసూత్రమున సమాధానము చెప్పుచున్నారు.

పరామర్శః = ఛాందోగ్యము 8–3–1 వాక్యమునందు చేయబడిన జీవపరామర్శ అన్యార్థః చ = వేఱగునర్థముగలది.

పూ. పక్షి : ఛాందోగ్యము 8–1–1 వాక్యమునం దారంభింపబడిన దహరాకాశవివరణాంతమున,సంప్రసాదుడగు నే జీవుడు గలడో" (ఛాం. 8–3–4) యని వినవచ్చుచున్న జీవుడు దహరరూపమగు పరమేశ్వరుడని వ్యాఖ్యానముచేసి యుంటిరి. ఆవాక్యశేషమునందు జీవోపాసనముగాని ప్రకృతి విశేషోపదేశము గానికానరాకున్నది.[జీవపరామర్శ మాత్రము చేయబడుచున్నది]. కనుక నట్టి జీవపరామర్శ కనర్థకత్వము సంప్రాప్తమగుచున్నది అనియాక్షేపణ :

ఆహ — అన్యార్థః అయం జీవపరామర్శః న జీవస్వరూప పర్యవసాయీ. కిం తర్హి పరమేశ్వరస్వరూపపర్యవసాయీ, కథమ్? సంప్రసాదశబ్దోదితో జీవో జాగరితవ్యవహారే దేహేంద్రియపంజరాధ్యక్షో భూత్వా తద్వాసనానిర్మితాంశ్చ స్వప్నాన్నాడీచరోఽనుభూయ శ్రాంతశ్శరణం ప్రేప్సురుభయరూపాదపి శరీరాభిమానాత్సముత్థాయ సుషుప్తావస్థాయాం పరంజ్యోతిరాకాశ శబ్దితం పరం బ్రహ్మోపసంపద్య విశేషవిజ్ఞానవత్త్వం చ పరిత్యజ్య స్వేన రూపేణాభినిష్పద్యతే. యదస్యోపసంపత్తవ్యం

---

సిద్ధాంతి: అందువలన నిట్లు చెప్పబడుచున్నది. ఛాం. 8-3-4 వాక్యమునందు చేయబడిన యీ జీవపరామర్శకు వేరొక యర్థము కలదు. జీవస్వరూపమును తెలియచెప్పుటయందా వాక్యమునకు దాత్పర్యము లేదు. పరమేశ్వరస్వరూపవివరణము నందే దానితాత్పర్యము. అది యెట్లన! సంప్రసాదశబ్దముచే బలుకరింప బడిన జీవుడు జాగరితమునందు దేహేంద్రియములను పంజరమున కధ్యక్షుడై నాడీసంచారవశమున జాగరితసంస్కారములవలన నిర్మింపబడిన స్వప్నముల ననుభవించుచున్నాడు. అందుచే డస్సినవాడై శరణ్యమును బొందగోరి జాగరితస్వప్న సంబంధములగు శరీరాభిమానములను వదలి వానినుండి పైకిలేచి సుషుప్త్యవస్థయందు వాక్యారంభమున నాకాశశబ్దముచే బరామర్శింప బడిన పరజ్యోతిస్స్వరూపమగు బ్రహ్మమును బొందుచున్నాడు, మఱియు విశేష విజ్ఞాముము అనగా తనకంటె భిన్నమగు నితరవస్తుజ్ఞానమును బరిత్యజించి, స్వస్వరూపమును బొందుచున్నాడు, జీవునిచే

పరంజ్యోతిః, యేన స్వరూపేణాయమభినిష్పద్యతే స ఏష ఆత్మాపహతపాప్మత్వాదిగుణ ఉపాస్య ఇత్యేవమర్థోఽయం జీవ పరామర్శః పరమేశ్వరవాదినోఽప్యుపపద్యతే.

## అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్. (సూ. 21)

యదప్యుక్తం 'దహరోఽస్మిన్నంతరాకాశ' ఇత్యాకాశస్యాల్పత్వం శ్రూయమాణం పరమేశ్వరే నోపపద్యతే, జీవస్య

---

బొందతగిన యేపరంజ్యోతిః స్వరూపము గలదో యే నిజ స్వరూపమును తాను పొందుచున్నాడో యాతడే యపహత పాప్మత్వాదిగుణములుగల యాత్మ, అట్టి ఆత్మ యుపాస్యు డగుచున్నాడు. ఈ యర్థమున జీవపరామర్శ చేయబడు చున్నదియనుట పరమేశ్వరవాదులకు గూడ నంగీకార్యమగు చున్నది. [ఉపాధిగతుడగు జీవునకు బ్రహ్మభావము నుప దేశింపవలసియున్నది. జీవపరామర్శ చేయక యిది సాధ్యము కాదు. కనుక జాగ్రదాది యవస్థాత్రయమునందు గూడ నతని పరామర్శ చేయబడినది. అందుచేత జీవభావవినాశము పారమార్థికమగు నతని బ్రహ్మభావమునుగూడ బ్రదర్శింప బడినది అని తాత్పర్యము] 20

"యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం" అను అల్పశ్రుతేః = అల్పత్వమును జెప్పు శ్రుతివలన దహరము బ్రహ్మము ఇతిచేత్ = కాదంటివేని తత్ ఉక్తం = అల్పపరి మాణ ముపాసనార్థమని యావిషయ మింతకుపూర్వమే 1-2-7 సూత్రమున సమాధానము చెప్పబడినది.

పూ. పక్షి : హృదయపుండరీకమునందున్న "యల్పమగు

త్వారాగ్రోపమితస్యాల్పత్వముపకల్పత ఇతి తస్య పరిహారో వక్తవ్యః,

ఉక్తోహ్యస్య పరిహారః పరమేశ్వరేఽపేక్షికమల్పత్వమ వకల్పత ఇతి *'అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చే' (సూ 1-2-7) త్యత్ర స ఏవ పరిహారోఽనుసంధాతవ్య ఇతి సూచయతి. శ్రుత్యైవ చేదమల్పత్వం ప్రత్యుక్తం ప్రసిద్ధేనాకాశేనోపమిమానయా 'యావాన్వా అయమాకాశస్తావానేషోఽంతర్హృదయ ఆకాశ' ఇతి. ఇతి పంచమాధికరణమ్.

---

నాకాశమును" అనుచోట వినబడుచున్న యాకాశముయొక్కయల్పత్వము పరమేశ్వరునియందు సంభవింపదు. జీవుడు ములుగఱ్ఱచివర భాగమునకు పోల్చబడినవాడుగనుక నతని కల్పత్వము నాపాదింపవచ్చును అనిపూర్వపక్షము మిగిలియున్నది. దానికి పరిహారము చెప్పవలసియున్నది.

సిద్ధాంతి: బ్ర. 1-2-7 సూత్రమునం దాపేక్షికమగు నల్పత్వము పరమేశ్వరునియం దారోపింపబడుచున్నది యని సమాధానము చెప్పబడినది. ఆసమాధానమే యిచటగూడ ననుసంధానము చేసికొనదగియున్నది యని పైసూత్రము సూచించుచున్నది. ప్రసిద్ధమగు భూతాకాశమెంతదియో హృదయాంతర్గతమగు నాకాశముగూడ నంతదియెయని శ్రుతియే యద్దాని యల్పత్వమునకు ప్రతివచనము చెప్పినది. 21

* అధికరణసంక్షేపార్థము: విషయవాక్యమునందలియాకాశ శబ్దము భూతాకాశమునందు రూఢిపదము; భూతాకాశ

దహరాకాశము లుపాసనము కొఱకు జెప్పబడుచున్నవి. లేక యాపదము జీవపరము కావచ్చును. శరీర మతడార్జించుకొనిన పురము. అతనికి నుపాధి యగు మనస్సునకు హృదయము స్థానమగుటచే నతడు హృదయమునందున్నట్లుదాహరింపబడిన దహరాకాశ మల్పమగుటచే బ్రహ్మపురము కానేరదు అనిపూర్వపక్షము. ఆకాశము పరబ్రహ్మపరమని సిద్ధాంతము. ఆకాశశబ్దము భూతాకాశపరమైనచో రెంటికిని ఉపమానోపమేయభావము చెప్పవీలు లేదు. ద్యావాపృథువులు దహరాకాశమున నుండ శక్యముకాదు. ఆత్మత్వాపహతపాప్మత్వాదిగుణములు భూతాకాశమునకు చెప్పవీలులేదు. ఆ శబ్దము జీవపరము గూడగాదు. బ్రహ్మమునకుగూడ నీజీవునితో సంబంధముగలదు, బ్రహ్మోపలబ్ధికి హృదయము స్థానమగుచున్నది. ఆతడు శరీరమునందు సన్నిహితుడుగా నున్నాడు. దహరాకాశవిజ్ఞానముచే ననంతఫలమును శ్రుతి చెప్పుచున్నది. దహరాకాశవాక్యశేషము ప్రతిదినము జీవులు బ్రహ్మమునుగూర్చి పోవుచున్నట్లుచెప్పుచున్నది. దహరాకాశమును బురస్కరించుకొని ఈయాత్మ సర్వలోకములను ధరించుచున్న ట్లుదాహరింపబడినది. ఇట్టి ధారణబోధకములగు నితరవాక్యములయందు బరబ్రహ్మమే ధారణకర్తయని స్పష్టముగ జెప్పబడినది. ఆకాశశబ్దము పరమేశ్వరునియందు సుప్రసిద్ధముగ శ్రుతులయందు బ్రయోగింపబడుచున్నది. జీవునియందు బ్రయోగమద్దానికి గాన్పింపదు. భూతాకాశోపమానముచే నీయర్థము దృఢమగుచున్నది.

## (6) అనుకృత్యధికరణమ్ (సూ 22-23).

సంప్రసాదుడగు జీవుడు శరీరమునుండి లేచి స్వీయమగురూప మునుబొందుచున్నాడని ప్రకృతవాక్య శేషమునందువినవచ్చుట చేత దహరశబ్దము జీవపరము కాదు. జీవు డుపాధిచే పరి చ్ఛిన్నుడు. ఆతని. నాకాశమునకు బోల్ప వీలులేదు. అపహత పాప్మత్వాదు లతనికి సంభవములుకావు. ప్రజాపతి యింద్రు నికి నాలుగుపర్యాయములు చేసినయుపదేశమునందు జీవుని యొక్క జాగ్రదాద్యవస్థాత్రయమునందలి స్వరూపమును తెలియబఱచి బ్రహ్మమే జీవునియొక్క పరమార్థస్వరూపమని తెలియజెప్పెను. జీవుడు శరీరోపాధిగతు డగుచుండగా నజ్ఞాన ముచే స్వస్వరూపమును దెలియలేకున్నాడు. జ్ఞానముకలిగి శరీరము వదలిపోయినపుడు స్వస్వరూపమునే పొందుచున్నాడు. ఇదియే సముత్థానము. చక్షుస్సునందు గాన్పించుచున్న పురుషు డమృతుడు అభయుడు, అతడే బ్రహ్మమను వాక్యముచే నీయర్థ ముపపన్నమగుచున్నది. జీవుడు సంప్రసాదముతరువాత బొందు స్వస్వరూపమే బ్రహ్మస్వరూపమని చెప్పుటకు వాక్యశేషమున జీవపరామర్శ చేయబడినది. దహరమున కల్పత్వమాపేక్షికము. ఇట్టియల్పత్వమును శ్రుతియె తరువాత ద్రోసివుచ్చుచున్నది.

### (6) అనుకృత్యధికరణమ్

అ॥ ఛాందోగ్యము 8-3-4 వాక్యమునందు సంప్ర సాదావస్థను జెందిన జీవు డీశరీరమునుండి లేచి పరమాత్మలక్షణ

మగు విజ్ఞప్తిభావమును బొంది స్వస్వరూపమున నుండు నని చెప్ప బడినది. 'పరమాత్మలక్షణమగు విజ్ఞప్తిభావమును బొందును' అను వాక్యార్థవిచారణాసందర్భమున "తచ్ఛుభ్రం జ్యోతిషాంజ్యోతిః" అను వాక్యమునందలి జ్యోతిఃశబ్దార్థ విచారణగూడ బ్రసక్తమగుచున్నది. ఈసందర్భమున బై వాక్యముల యర్థవిచారణకు సాధకమగు "న తత్ర సూర్యో భాతి" మొదలగు వాక్యార్థము విచారించవలసివచ్చినది. అందు కొఱకు దరువాతప్రకరణ మారంభింపబడుచున్నది.

విషయవాక్యము : న తత్ర సూర్యో భాతి న చంద్రతారకే
నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః?
తమేవభాంతమనుభాతిసర్వం తస్య భాసా
సర్వమిదం విభాతి" (ముండ 2-2-10)

సంశయము : ఇచట జెప్పబడు తేజోవిశేషము అలౌకిక గుమనొక తేజోవస్తువా లేక పరబ్రహ్మమా?

పూర్వపక్షము : అలౌకికమగు నొక తేజోవస్తువు.

సిద్ధాంతము : పరబ్రహ్మము

అవలోకనము చేయతగిన శ్రుతివాక్యములు; ముండక 2-2-10. 2-2-5. 2-2-9. ఛాందోగ్యము 3-14-2. బృ 4-4-16. భగవద్గీత-15-6-12.

తస్య = ఆ పరమాత్మయొక్క కాంతిని అనుకృతేః = సూర్యాదులనుసరించి ప్రకాశించుచుండుటచేతను పరమాత్మయె విషయవాక్యమునందు చెప్పబడుచున్నాడు.

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతీ'తి (ముం2-2-10) సమామనంతి.

యత్రి యం భాంతమనుభాతి సర్వం యస్య చ భాసా సర్వమిదం విభాతి స కిం తేజోధాతుః కశ్చిత్? ఉత ప్రాజ్ఞ ఆత్మేతి విచికిత్సాయాం.

పూ పక్షీ. తేజోధాతురితి తావత్ప్రాప్తం, కుతః? తేజోధాతూనామేవ సూర్యాదీనాం భానప్రతిషేధాత్. తేజస్స్వభావకం హి చంద్ర తారకాది తేజస్స్వభావక ఏవ సూర్యే భాసమానేఽహని న భాసత

---

"అతనియందు సూర్యుడు చంద్రతారకలు, మెరుపులు ప్రకాశింపవు. ఇక నగ్నినిగూర్చి చెప్పవలసినది యేమియున్నది. ప్రకాశించుచున్న యాతని ననుసరించి యిదియంతయు బ్రకాశించుచున్నది. అతని కాంతిచేతనే యిదియంతయు బ్రకాశించుచున్నది." ఈవిధముగ ముండకశ్రుతి (2-2-10) వినవచ్చుచున్నది. [ఇచట ప్రకాశింప వనగా బ్రకాశింపజేయ లేవని యర్థము] ప్రకాశించుచున్న యెవ్వని ననుసరించి యిది యంతయు బ్రకాశించుచున్నదో, యెవ్వని కాంతిచే నిది యంతయు బ్రకాశించుచున్నదో యాత డలౌకికమగు నొక తేజస్సా ప్రాజ్ఞుడగు నాత్మయగుచున్నాడా ?(అని సంశయము)

పూ. పక్షి : అలౌకికమగు నొక తేజస్సుని సంప్రాప్తమగుచున్నది. ఏలనన! ఆవాక్యమునందు సూర్యుడు మొదలగు తేజోధాతువులు ప్రకాశింపవని నిషేధింపబడినది. చంద్రుడు తారకలు మొదలగునవి తేజఃస్వభావములు గలిగినవి. అయి

ఇతి ప్రసిద్ధం, తథా సహ సూర్యేణ సర్వమిదం చంద్రతారకాది యస్మిన్న భాసతే సోఽపి తేజస్స్వభావక ఏవ కశ్చిదిత్యవ గమ్యతే. అనుభానమపి తేజస్స్వభావక ఏవోపపద్యతే సమానస్వభావకేష్వనుకారదర్శనాత్, గచ్ఛంతమనుగచ్ఛతీతివత్, తస్మాత్తేజో ధాతుః కశ్చిత్.

సిద్ధాంతీ. ఇత్యేవం ప్రాప్తే బ్రూమః—ప్రాజ్ఞ ఏవాయమాత్మా భవితుమర్హతి.కస్మాత్ ? అనుకృతేః, అనుకరణమనుకృతిః, యదే

---

నను, తేజఃస్వభావముఁగల సూర్యుఁడు పగటికాలమందు ప్రకాశించుచుండఁగా, నవి భాసింపకుండుట లోకప్రసిద్ధము. అవిధముననే సూర్యుఁడు, చంద్రుఁడు తారకలు మొదలగునవి యన్నియును దేనియందు ప్రకాశింప నేరవో యదియు నొక తేజోవిశేషమని తెలియదగును. (2) తేజోవంతమైన పదార్థమున్నపుడే దాని ననుసరించి మఱియొకవస్తువు ప్రకాశించును. (3) సమానస్వభావములుగల వస్తువులున్నపుడే యనుకరణము కాన్పించుచున్నది. ఒకఁడు పోవుచుండగా వానిననుకరించి మఱియొకఁడు పోవును. అందువలన నొక తేజోవిశేష మిచట జెప్పఁబడుచున్నది.

సిద్ధాంతి : ఇట్లు పూర్వపక్షమురాగా సమాధానము చెప్పుచున్నాము. స్వప్రకాశస్వరూపుఁడగు నాత్మయె యిచట నుదాహరింపఁబడుచున్నాఁడు. అనుకరణమువలన (అనుకరణమనగాఁ ననుసరించి చేయుటయని యర్థము.) ప్రకాశించుచున్న యతని ననుసరించి సర్వము ప్రకాశించుచున్నది యని

ఆత్మను గ్రహించినపుడే యనుభానముసంభవము

తత్ 'తమేవ భాంత మనుభాతి సర్వ'మిత్యనుభానం తత్ప్రాజ్ఞ పరిగ్రహేఽవకల్పతే. 'భారూపస్సత్యసంకల్ప' (ఛాం 3-14-2) ఇతి హి ప్రాజ్ఞమాత్మానమామనంతి, న తు తేజోధాతుం కంచిత్సూర్యాదయోఽనుభాంతీతి ప్రసిద్ధమ్. సమత్వాచ్చ తేజోధాతూనాం న తేజోధాతుమన్యం ప్రత్యపేక్షన్తే యం భాంతమనుభాయుః. న హి ప్రదీపః ప్రదీపాంతరమనుభాతి. యదప్యుక్తం సమాన స్వభావకేష్వనుకారో దృశ్యత ఇతి నాయమేకాంతో నియమః. భిన్నస్వభావకేష్వపీహ్యనుకారో దృశ్యతే, సుతప్తోఽయః పిండోఽగ్న్యనుకృతిరగ్నిం దహంతమనుదహతి, భౌమం వా

---

తెలియవచ్చుచున్న యనుభానము స్వయంప్రకాశస్వరూపుడగు నాత్మను గ్రహించినపుడే సంభవించును, "ప్రకాశస్వరూపుడు సత్యసంకల్పుడు" (ఛాం 3-14-2) అనువాక్యము ఆత్మ స్వప్రకాశస్వరూపమని పలుకుచున్నది. సూర్యుడు మొదలగునవి మఱియొక తేజోవిశేషము ననుసరించి ప్రకాశించుచున్నట్లు ప్రసిద్ధిలేదు. తేజోవస్తువు లన్నింటియొక్క స్వభావమొకటియే గనుక ప్రకాశించుటకొరకు తేజోవస్తువు మఱియొక తేజఃపదార్థము నపేక్షింపదు. ఒకదీపము మరియొక దీపము నపేక్షింపదు. (2) సమాన స్వభావముగలవానికే యనుకరణ ముండునను పూర్వపక్షివాక్యము యెల్లపుడును నియతము కాదు. విభిన్నస్వభావములుగల వానియందుగూడ ననుకరణము కాన్పించుచున్నది. ఎఱ్ఱగా కాలిన యినుపగుండు అగ్నిననుకరించుచు నగ్ని దహించుచుండ నదియు దహించును.

రజో వాయుం వహంతమనువహతీతి. అనుకృతేరిత్యనుధాన మసూసుచత్. తస్య చేతి చతుర్థపాదమస్య శ్లోకస్య సూచయతి 'తస్య భాసా సర్వమిదం విభాతీ'తి చ తద్ధేతుకం భానం సూర్యా దేరుచ్యమానం ప్రాజ్ఞమాత్మానం గమయతి 'తం దేవా జ్యోతిషాం జ్యోతి రాయుర్హోపాసతేఽమృత'మితి (బృ 4-4-16) హి ప్రాజ్ఞ మాత్మానమామనంతి. తేజోఽన్తరేణ తు సూర్యాదితేజో విభాతీత్య ప్రసిద్ధం విరుద్ధం చ, తేజోఽన్తరేణ తేజోఽన్తరస్య ప్రతిఘాత దర్శనాత్. అథవా న సూర్యాదీనామేవ శ్లోకపఠితానామిదం

---

వీచుచున్న వాయువు ననుసరించి భూపరాగముగూడ వీచును. సూత్రమునందలి యనుకృతియనుపదము అనుసరించి ప్రకా శించుటను సూచించుచున్నది. తస్య అనుపదము తస్య భాసా సర్వమిదం విభాతి" యనుదానిని సూచించుచున్నది. సూర్యాదులు ప్రకాశించుటకు గారణమై స్వప్రకాశస్వరూప మగు నాత్మను తెలియజేయుచున్నది. "దేవతలతనిని జ్యోతి స్సులకు జ్యోతిస్సుగను అమృతస్వరూపముగ నుపాసించు చున్నారని" బృహదారణ్యకశ్రుతి (4-4-16) యందు స్వప్రకాశస్వరూపుడగు నాత్మ పలుకరింపబడుచున్నాడు. మఱి యొక తేజస్సుచేత సూర్యతేజస్సు ప్రకాశించుచున్నదని ప్రసిద్ధిలేదు. విరుద్ధముగూడ నగుచున్నది. ఒక తేజస్సు మఱి యొక తేజస్సునకు విఘాతహేతువగును. అట్లుకానిచో, సర్వవస్తుభాన హేతుత్వము 'న తత్ర సూర్యోభాతి'యను శ్లోకము నందుదాహరింపబడిన సూర్యచంద్రాదులయందు

తద్ధేతుకం విభానముచ్యతే, కింతర్హి సర్వమిదమిత్యవిశేషశ్రుతేః సర్వస్యైవాస్య నామరూపక్రియాకారకఫలజాతస్య యాభివ్యక్తిస్సా బ్రహ్మజ్యోతిస్సత్తానిమిత్తా. యథా సూర్యాదిజ్యోతిస్సత్తానిమిత్తా సర్వరూపజాతస్యాభివ్యక్తిస్తద్వత్. 'న తత్ర సూర్యో భాతీ'తి చ తత్రశబ్దమాహరన్ ప్రకృతగ్రహణం దర్శయతి—ప్రకృతం చ బ్రహ్మ 'యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమోత' (ముం2-2-5) మిత్యాదినా. అనంతరం చ 'హిరణ్మయే పరే కోశే విరజం

---

మాత్రమన్వయింపదు. మఱి దేనియం దన్వయించుననన, "ఇది యంతయు" నని దేనిని బ్రత్యేకింపక సామాన్యముగ చెప్పిన శ్రుతివలన నామము రూపము క్రియ, కారకము మొదలగువాని ఫలజాతమగు నీ ప్రపంచమంతయు నే జ్యోతిఃప్రకాశముచే నభివ్యక్తమగుచున్నదో యాజ్యోతిస్సు బ్రహ్మజ్యోతిస్సగుచున్నది యని తెలియుచున్నది. సూర్యజ్యోతిస్సనునది యొకటి యుండుటవలననే సమస్తమగు రూపజాత మభివ్యక్తమగుచున్నది. అటులనే యిచటగూడ.

ఖండకంతము బ్రహ్మము విషయము.

"అచట సూర్యుడు భాసింపడు" అనువాక్యము నందలి యచట యను శబ్దము విషయవాక్యము కనుపడుచున్న ముండకము ద్వితీయఖండకంతకును ప్రకృతమగు విషయమును గ్రహింపనగునని చూపుచున్నది. "దేనియందు ద్యులోకము, పృథివి యన్తరిక్షము, పడుగుపేకవలె నిమిడియున్నవో" (ము 2-2-5) యను వాక్యముచే బ్రహ్మము ఖండకు ప్రకృతవిషయమని తెలియుచున్నది. "హిరణ్మయమగు నుత్కృష్ట కోశమునందు, రాగ

బ్రహ్మనిష్కలమ్, తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదు'రితి కథం తజ్జ్యోతిషాంజ్యోతిరిత్యత ఇదముత్థితం 'న తత్ర సూర్యో భాతీ'తి.

యదప్యుక్తం సూర్యాదీనాం తేజసాం భానప్రతిషేధ స్తేజోధాతావేవాన్యస్మిన్నవకల్పతే సూర్య ఇవేతరేషామితి, తత్ర తు స ఏవ తేజోధాతురన్యో న సంభవతీత్యుపపాదితం. బ్రహ్మణ్యపి చైషాం భానప్రతిషేధోఽవకల్పతే, యతో యదుపలభ్యతే తత్సర్వం బ్రహ్మణైవ జ్యోతిషోపలభ్యతే, బ్రహ్మ

---

రహితము నిరంశమునగు బ్రహ్మము కలదు. ఆ బ్రహ్మము శుభ్రము, జ్యోతిస్సులకు జ్యోతిస్సు. ఆత్మవిదులు దెలిసికొనునది యదియె" (ముం 2-2-9) యని తరువాత వాక్యముకలదు. ఆ బ్రహ్మపదార్థము జ్యోతిస్సులకు జ్యోతిస్సెట్లగుచున్నది యని ప్రశ్న రాగా "నచట సూర్యుడు ప్రకాశింపడు" అని సమాధానము చెప్పబడుచున్నది.

బ్రహ్మ తేజస్సునుబట్టి యితర తేజస్సులు నిషేధింపబడుచున్నది.

మఱియొక తేజోవస్తువున్నపుడే తేజోవంతములగు సూర్యాదులభానము ప్రతిషేధించ దగును. సూర్యుడు ప్రకాశించుచున్నపుడే చంద్రతారకల భానము నిషేధింపదగుననిపూర్వపక్షియాక్షేపణకు సమాధానమిట్లు చెప్పనగును. బ్రహ్మమే యా తేజోధాతువనియు మఱియొకటి యేదియు లేదనియు జెప్పియుంటిమి. బ్రహ్మభానమగుచుండగా, సూర్యాదిభానప్రతిషేధము సంభవమగుచున్నది. ఏలనన! ఏది ఏది తెలియబడుచున్నదో యదియంతయు బ్రహ్మప్రకా

తు నాన్యేన జ్యోతిషోపలభ్యతే, స్వయంజ్యోతిస్స్వరూపత్వాత్. యేన సూర్యాదయ స్తస్మిన్భాయుః. బ్రహ్మ హ్యన్యద్వ్యనక్తి న తు బ్రహ్మాన్యేన వ్యజ్యతే 'ఆత్మనైవాయం జ్యోతిషాస్తే, (బృ 4-3-6) 'అగృహ్యో నహి గృహ్యత' (బృ 4-2-4) ఇత్యాది శ్రుతిభ్యః.

## అపి చ స్మర్యతే (సూ 23)

అపి చేదం రూపం ప్రాజ్ఞస్యైవాత్మనస్స్మర్యతే భగవద్గీతాసు—"న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,

---

శముచేతనే లభించుచున్నది. బ్రహ్మమన్నచో స్వయంప్రకాశ స్వరూపమగుటచే మరియొకజ్యోతిస్సుచే నుపలభ్యము కానేరదు. ఇట్లు జెప్పుటచేత సూర్యాదులుగూడ బ్రహ్మకాంతిచే భాసించుచున్నారు. బ్రహ్మము మఱియొకదానిని బ్రకాశింపజేయునుగాని మఱియొకదానిచే బ్రకాశింపబడ లేదు. "ఆత్మజ్యోతిస్సుచేతనే మనుజుడున్నాడు," (బృ 4-3-6) "అతనిని గ్రహింప శక్యముకాదుగనుక నతడగ్రాహ్యుడగుచున్నాడు" (బృ 4-2-4) అను మొదలగు శ్రుతివాక్యము లిచటబ్రమాణములు. 22

ఈయర్థమును గీతావాక్యముచే బలపరుచుచున్నారు.

అపి చ = మరియు నీయర్థమే స్మర్యతే = స్మృతియగు గీతయందు స్మరింపబడుచున్నది.

మఱియు స్వయంప్రకాశమగు నాత్మ సూర్యాదులచే భాసింపబడ నేరదను విషయము భగవద్గీతలయందు స్మరియింప

యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమే" (గీ 15-6) తి, "యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్, యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామక" (గీ 15-12) మితి చ. ఇతి షష్ఠాధికరణమ్.

---

గీతావాక్యము

బడుచున్నది. "సూర్యుడుగాని చంద్రుడుగాని, అగ్నిగాని యాబ్రహ్మమును భాసింపజేయలేవు. ఎచటికి పోయి తిరిగి వెనుకకు రాదో అది నా యుత్కృష్టమగు స్థానము. ఆదిత్యునియందు గల యే తేజస్సు సమస్తజగత్తును భాసింపజేయుచున్నదో, చంద్రునియందును, అగ్నియందును యే తేజస్సు కలదో ఆ తేజస్సు అంతయు నా తేజస్సని తెలిసికొనుము, (గీ 15-6-12) అని గీత పలుకుచున్నది. [ఈ రెండింటిలో మొదటిశ్లోకము "న తత్ర సూర్యో భాతి" యనుశ్రుతి వాక్యార్థమును, రెండవ శ్లోకము "తస్య భాసా సర్వమిదం విభాతి" యను శ్రుతివాక్యార్థము ననుసరించుచున్నవి.]

అధికరణసంక్షేపార్థము: విషయవాక్యమునం దుదాహరింపబడిన తేజోవిశేష మేదోయొక తేజఃపదార్థము. ఒక తేజస్సు ననుసరించి తదితరములు ప్రకాశించును. సమానస్వభావులకే యనుకరణము. ఇది పూర్వపక్షము. ఏదోయొక తేజోవస్తువు ప్రకాశించుచున్నపుడే సూర్యాదు లద్దాని ననుసరించి ప్రకాశించును. బ్రహ్మమె యా తేజోవస్తువని సిద్ధాంతము. ఒక తేజోవిశేషము మరియొక తేజోవిశేషమును ప్రకాశింపజేయలేదు. అట్లుచేయుటవిరుద్ధము. ఖండకు ప్రకృతవిషయమగు పరబ్రహ్మము నే 'తత్ర' అచట యనుశబ్దము సూచించుచున్నది. అదియె

యీప్రపంచమునంతయు భాసింపచేయుచున్నట్లు తరువాత శ్రుతివాక్యముచేతను గీతావాక్యములచేతను తెలియుచున్నది. 23

## (7) ప్రమితాధికరణమ్

అ॥ పూర్వాధికరణవిషయవాక్యమునందు పరమాత్మ సర్వావభాసకమనుటచే నాతని జ్యోతిఃస్వరూప ముపపాదింపబడినది. ఈయర్థమునే "జ్యోతిషాం జ్యోతిః" జ్యోతిస్సులన్నిటికినతడు జ్యోతిస్సని బృహదారణ్యకవాక్యము (4-4-16) బలపఱచుచున్నది. "అంగుష్టమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః" (కాఠక 2-4-13) అంగుష్ఠమాత్రుడగు నీపురుషుడు ధూమముచే గప్పబడని జ్యోతిస్సును బోలియున్నాడు" అను వాక్యమునందు జ్యోతిస్సుతో బోల్పబడిన పురుషుడు జ్యోతిః స్వరూపునికంటె భిన్నముకావలెనుగదా యనుశంక కలుగుచున్నది. ఈశంకను నివారించుటకుత్తరాధికరణ మారంభింపబడుచున్నది.

విషయవాక్యము : "అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి" (కాఠ 2-4-12)

సంశయము : అంగుష్ఠమాత్రపురుషుడు జీవుడా లేక పరమాత్మయా ?

పూర్వపక్షము : జీవుడని.

## శబ్దాదేవ ప్రమితః (సూ 24.)

'అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతీ'తి శ్రూయతే, తథా 'అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకం ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వ ఏతద్వై త'దితి (కా2-4-13) చ. తత్ర యోఽయమంగుష్ఠమాత్రః పురుషశ్శ్రూయతే స కిం విజ్ఞానాత్మా? కిం వా పరమాత్మేతి సంశయః.

---

సిద్ధాంతము : పరమాత్మయని.

అవలోకనీయశ్రుతివాక్యములు కాఠ 2-4-12, 2-4-13. భారతం 3-197-17, కాఠకం 1-2-14, 2-3-17.

విషయవాక్యమునందలి యంగుష్ఠమాత్రపురుషుడు "ఈశానో భూతభవ్యస్య" అనుశ్రుతియందలిశబ్దాత్ ఏవ = ఈశానశబ్దమువలన ప్రమితః = పరమాత్మయని నిశ్చయింపబడుచున్నాడు.

"శరీరమధ్యమునందంగుష్ఠమాత్రపరిమాణముగలపురుషుడున్నాడు" యని కాఠకశ్రుతి (2-4-12) వినవచ్చుచున్నది. అంగుష్ఠమాత్రుడగు పురుషుడు ధూమములేని జ్యోతిస్సువలెనున్నాడు. అతడు భూతభవ్యములకు ప్రభువు. అతడు నేటికిని రేపటికిని యొకడే యగుచున్నాడు. అతడే నీవు తెలియగోరిన పరబ్రహ్మమని". తరువాత వాక్యము (2-4-13) వినవచ్చుచున్నది. [ఈవిధముగ నచికేతసునకు యముడుపదేశించెను]

ఈవాక్యములయందంగుష్ఠమాత్రుడుగ వినవచ్చుచున్న పురుషుడు విజ్ఞానాత్మయా లేక పరమాత్మయాయనిసంశయము.

పూ. పక్షి. తత్రి పరిమాణోపదేశాత్తావద్విజ్ఞానాత్మేతి తావ త్ప్రాప్తం. న హ్యనంతాయామవిస్తారస్య పరమాత్మనోఽంగుష్ఠ పరిమాణత్వముపదిశ్యేత. విజ్ఞానాత్మ పస్తూపాధిమత్త్వాత్సంభవతి కయాచిత్కల్పనయాంగుష్ఠమాత్రిత్వమ్. స్మృతేశ్చ—"అథ సత్యవతః కాయాత్పాశబద్ధం వశంగతం అఙ్గుష్ఠమాత్రిం పురుషం నిశ్చకర్ష యమో బలా" దితి. (మ. భా. 3-297-18) న హి పరమేశ్వరో బలాద్యమేన నిష్కృష్టుం శక్యః, తేన తత్రి సంసార్యంగుష్ఠమాత్రో నిశ్చితః స ఏవేహాపి.

---

పూ. పక్షి. ఈవాక్యములయం దఙ్గుష్ఠమాత్రపరిమాణ ముపదేశింపబడుటచేనాపురుషుడు విజ్ఞానాత్మయగుచున్నాడు. అనంతమగువిస్తృతిగల పరమాత్మ కంగుష్ఠపరిమాణత్వ ముపపన్నము కాదు. జీవుడు శరీరమను నుపాధిచే పరిచ్ఛిన్నుడగుటవలన నంగుష్ఠమాత్రిత్వ మతనికి నేదోవిధముగ గల్పింప శక్యము. "పాశబద్ధుడై తనవంశగతుడైన యంగుష్ఠమాత్రిపురుషుని యముడు సత్యవంతుని శరీరమునుండి బలవంతముగ నాకర్షించెను" (మ. భారతం 3-297-17) అనుశ్లోకము గలదు. పరమేశ్వరుడు బలవంతముగ యమునిచే నాకర్షింపబడ శక్యమగువాడుకాడు. కనుక నీశ్లోకమునం దుదాహరింపబడిన యంగుష్ఠమాత్రిడగు పురుషుడు సంసారియగు జీవుడని నిశ్చయింపబడుచున్నాడు. అతడే యిచటగూడ చెప్పబడుచున్నాడు. ఇట్టిపూర్వపక్షమునకు సమాధానమును జెప్పుచున్నాము.

సిద్ధాంతీ. ఇత్యేవం ప్రాప్తే బ్రూమః.—పరమాత్మైవాయమంగుష్ఠమాత్రపరిమితః పురుషో భవితుమర్హతి. కస్మాత్? శబ్దాత్ 'ఈశానో భూతభవ్యస్యే'తి. న హ్యన్యః పరమేశ్వరాద్భూతభవ్యస్య నిరంకుశమీశితా. 'ఏతద్వై త'దితి చ ప్రకృతం పృష్టమిహానుసందధాతి. ఏతద్వై తద్యత్పృష్టం బ్రహ్మేత్యర్థః. పృష్టం చేహ బ్రహ్మ—'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వదే' (క 1-2-14) తి. శబ్దాదేవేతి అభిధానశ్రుతేరేవేశాన ఇతి పరమేశ్వరోఽవగమ్యత ఇత్యర్థః.

---

సిద్ధాంతి : విషయవాక్యమునం దుదాహరింపబడిన యంగుష్ఠమాత్రపురుషుడు పరమాత్మ యగుటకు దగును. ఏలనన ! "ఈశానః భూతభవ్యస్య" అను ఉత్తరార్థమున వినబడుచున్న యీశానశబ్దమువలన [అనగా భూతమునకు భవిష్యత్తునకు గూడ ప్రభువని యర్థము] పరమేశ్వరునికంటె నన్యుడెవడును భూత భవ్యమునకు నిరంకుశుడగు ప్రభువు కానేరడు. "ఇదియే నీ వడిగిన బ్రహ్మము" అని నచికేతసుని ప్రశ్నకు బ్రకృతమగు పరబ్రహ్మము నిచట యను సంధానము చేయబడుచున్నది. నచికేతసుడు బ్రహ్మమును గూర్చి యడిగెను. ధర్మము కంటెను నధర్మముకంటెను భిన్నము, కృతము, అకృతము కంటెను భిన్నము, భూతముకంటెను భవిష్యత్తుకంటెను భిన్నమయిన దానిని నీవు దేనినెరుగుదువో దానిని నాకు జెప్పుము" (కా 1-2-24) అని నచికేతసుడు యమునడిగెను. "ఈశానుడు" అని ప్రత్యేకించి శ్రుతిచే జేర్కొనబడిన శబ్దముచేతనే యంగుష్ఠమాత్రపురుషుడు పరమేశ్వరుడని యర్థము.

అ॥ కథం పునస్సర్వగతస్య పరమాత్మనః పరిమాణోపదేశ ఇతి అత్ర బ్రూమః.—

## హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్ (సూ25)

సర్వగతస్యాపి పరమాత్మనో హృదయేఽవస్థానమపేక్ష్యాంగుష్ఠమాత్రత్వమిదముచ్యతే, అకాశస్యేవ వంశపర్వాపేక్షమరత్నిమాత్రత్వం. న హ్యంజసాతిమాత్రస్య పరమాత్మనోఽంగుష్ఠమాత్రత్వముపపద్యతే. న చాన్యః పరమాత్మన ఇహ గ్రహణమర్హతి ఈశానశబ్దాదిభ్య ఇత్యుక్తం.

---

అ॥ సర్వగతుడగు పరమాత్మ కంగుష్ఠపరిమాణ మెట్లు నిర్దేశింపబడుచున్నది అనుప్రశ్నకు సమాధానము జెప్పుచున్నాము.

హృది అపేక్షయా = ఉపాసనము కొరకు హృదయమునందున్నట్లు భావింపబడుటవలన దానినిబట్టి యంగుష్ఠపరిమాణ ముపదేశింపబడినది. ఉపాసనజ్ఞానకాండలు రెండింటికిని మనుష్య అధికారాత్ = శక్తి అర్థిత్వాదులు గలవాడగుటవలన మనుజుడే యధికారి యగుటవలన.

పరమాత్మ సర్వగతుడైనను, హృదయమునందాతని యునికి నపేక్షించి ప్రకృతవాక్యమునం దంగుష్ఠమాత్రత్వ ముపదేశింపబడినది. ఆకాశము సర్వగతమైనను బొంగుయొక్క కణుపు నపేక్షించి మూరెడుపరిమాణము గలిగియున్నట్లు చెప్పబడుచున్నది. సమస్తపరిమాణముల నతిక్రమించు పరమాత్మకు సాక్షాత్తుగ నంగుష్ఠమాత్రత్వము నాపాదింప శక్యముకాదు. ఈశానాదిశబ్దబలముచే ప్రకృతమున బరమాత్మకంటె నన్యుని యిచట గ్రహింపశక్యముగాదనియు నిరూపింపబడినది.

నను ప్రతిప్రాణిభేదం హృదయానామనవస్థితత్వాత్తద పేక్షమప్యంగుష్ఠమాత్రత్వం నోపపద్యత ఇత్యత ఉత్తరముచ్యతే— మనుష్యాధికారత్వాదితి. శాస్త్రం హ్యవిశేషప్రవృత్తమపి మనుష్యానేవాధికరోతి శక్తత్వాదర్థిత్వాదపర్యుదస్తత్వాదుపనయనాదిశాస్త్రాచ్చేతి. వర్ణితమేతదధికారలక్షణే. మనుష్యాణాం చ నియతపరిమాణః కాయః, ఔచిత్యేన నియతపరిమాణమేవ చైషామంగుష్ఠమాత్రం హృదయమ్. అతో మనుష్యాధికారత్వాచ్ఛాస్త్రస్య

---

పూ. పక్షి : ప్రతిమనుజునియొక్క హృదయ పరిమాణము మాఱుచుండుటచేత నట్టిహృదయపరిమాణము నపేక్షించి యంగుష్ఠపరిమాణము నాపాదించుటకు వీలులేదు.

సిద్ధాంతి : ఇట్టియాక్షేపణమునకు సమాధానము చెప్పుదుము. శాస్త్రము మనుష్యుల నుద్దేశించుటవలన, నది సర్వభేదశూన్యమైనను, త్రైవర్ణికుల నుద్దేశించియే ప్రవర్తించుచున్నది. వారలు శాస్త్రాచరణసమర్థులు. శాస్త్రోక్తఫలములను కోరుచున్నారు. వారలనుగూర్చి ప్రతిషేధము లేదు. వారికి నుపనయనాద్యర్హత గలదు. ఈ విషయము జైమిని పూర్వమీమాంసాశాస్త్రమున (6–1) వివరింప బడినది. సామాన్యముగ మానుషశరీరమునకు నియమిత పరిమాణము గలదు. కనుక వారి హృదయముగూడ నంగుష్ఠమాత్రపరిమాణము నియతముగ గలిగియుండుట యుచితమే. అందువలన

మనుష్యహృదయావస్థానాపేక్షమంగుష్ఠమాత్రత్వముపపన్నం పరమాత్మనః.

యదప్యుక్తం పరిమాణోపదేశాత్ స్మృతేశ్చ సంసార్యేవాయమంగుష్ఠమాత్రః ప్రత్యేతవ్య ఇతి.

తత్రప్యుచ్యతే—'స ఆత్మా తత్త్వమసీ' త్యాదివత్సంసారిణ ఏవ సతోఽంగుష్ఠమాత్రస్య బ్రహ్మత్వమిదముపదిశ్యత ఇతి. ద్విరూపాహి వేదాంతవాక్యానాం ప్రవృత్తిః, క్వచిత్పరమాత్మస్వరూపనిరూపణపరా క్వచిద్విజ్ఞానాత్మనః పరమాత్మైకతోపదేశపరా. తదత్ర విజ్ఞానాత్మనః పరమాత్మనైకత్వముపదిశ్యతే

---

శాస్త్రము మనుష్యుని ఉద్దేశించుటవలన హృదయమునం దతడుండుటచేత బరమాత్మ కంగుష్టమాత్ర పరిమాణ మారోపింపబడుచున్నది.

పూ, పక్షి : ప్రకృతవాక్యనందీ పరిమాణ ముపదేశింప బడుటచేతను, స్మృతిబలముచేతను సంసారియగు జీవుడే యంగుష్టమాత్రునిగ గ్రహింపదగును.

సిద్ధాంతి : "ఆతడే యాత్మ", "ఆ యాత్మయే నీవగుచున్నావు" ( ఛాందో 6–8–1 ) ఈ మొదలగు వాక్యములవలె నంగుష్ఠమాత్రుడగు జీవుడే బ్రహ్మమని యుందేశింపబడుచున్నది. వేదాంత వాక్యములు రెండువిధములుగ ప్రవర్తించుచున్నవి. ఒక్కపుడు పరమాత్మస్వరూపనిరూపణమును చేయును. మఱియొకపుడు జీవబ్రహ్మల కేకత్వము నుపదేశించును. ప్రకృతవాక్యము జీవుని పరమాత్మైక్యము నుపదేశించుచున్నవి. కాని యేవస్తువుయొక్కయు పరిమాణము నుప

నాంగుష్ఠమాత్రత్వం కస్యచిత్. ఎతమేవార్థం పరేణ స్పష్టీకరిష్యతి 'అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముంజాదివేషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్రమమృత' మితి. (కా 2-6-17)

---

దేశింప దలపలేదు. ఈయర్థమునే పరమపురుషు డంగుష్ఠ మాత్రుడు, సర్వాన్తర్యామి హృదయకమలమునందు సన్నిహితముగా నున్నవాడు, అతనిని పరిమాణరహితమైన జ్ఞానముచే గడ్డినుండి కాడనువలె దేహమునుండి వివేచనచేసి వేఱుపఱుపవలెను. అట్లు చేయగలవా డమృతత్వమును బొందును. ఇది నిశ్చయము (కఠ 2-3-17) అను తరువాత వాక్యము స్ఫుటము చేయుచున్నది. 25.

అధికరణ సంక్షేపార్థము: విషయవాక్యమునం దుదాహరింపబడిన యంగుష్ఠమాత్రపురుషుడు జీవుడని పూర్వపక్షము. అంగుష్ఠమాత్రపరిమాణము జీవునికి దగునుగాని యనంత విస్తృతిగల దేవునికి దగదు. ఈపురుషుడు పరమాత్మయని సిద్ధాంతము. అత డీశానుడని వర్ణింపబడుచున్నాడు. బ్రహ్మ ప్రకరణములో నీవాక్యము కాన్పించుచున్నది. శాస్త్రము నకధికారియగు మనుజుని హృదయపరిమాణమునుబట్టి యాతనికిగూడ పరిమాణము కల్పింపబడినది. అంగుష్ఠపరిమాణము గల జీవుడు పరమాత్మకంటె భిన్నుడు కాడని భావము. 25.

# (8) దేవతాధికరణమ్ (సూ 26-33)

---

## (8) దేవతాధికరణము

అ॥ పూర్వాధికరణమున శాస్త్రమంతయు మనుష్యుని యుద్దేశించి ప్రవర్తించిన దనుటవలన, తదితరములగు దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారములేదా యనునాశంక కలుగుచున్నది. ఈశంకకు సమాధానముగ నుత్తరాధికరణ మారంభమగుచున్నది.

విషయవాక్యము : "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్" [బృహదారణ్యకం]

సంశయము : దేవతలకు బ్రహ్మవిద్యాధికారము కలదా లేదా యని సందేహము.

పూర్వపక్షము : లేదు.

సిద్ధాంతి : కలదు.

తత్ ఉపరి అపి = మనుజులకుపైన స్వర్గలోకమునందుండు దేవాదులకుగూడ బ్రహ్మజ్ఞానాధికారము కలదని బాదరాయణః = బాదరాయణుడు తలంచుచున్నాడు ఏలన, వారలకుగూడ బ్రహ్మలోక కామన ముముక్షుత్వము మొదలగునవి యుండుటచే సంభవాత్ = బ్రహ్మజ్ఞానాధికారము సంభవమగుటవలన.

## తదుపర్యపి బాదరాయణః సంభవాత్ (సూ 26.)

అంగుష్ఠమాత్రశ్రుతిర్మనుష్యహృదయాపేక్షయా మనుష్యాధికారత్వాచ్ఛాస్త్రస్యేత్యుక్తం, తత్ప్రసంగాదిదముచ్యతే. బాఢం మనుష్యానధికరోతి శాస్త్రం, న తు మనుష్యానేవేతీహ బ్రహ్మజ్ఞానే నియమోఽస్తి తేషాం మనుష్యాణాముపరిష్టాద్యే దేవాదయస్తానప్యధికరోతి శాస్త్రమితి బాదరాయణ ఆచార్యో మన్యతే, కస్మాత్? సంభవాత్. సంభవతి హి తేషామర్థిత్వాది అధికారకారణం. తత్రార్థిత్వం తావన్మోక్షవిషయం దేవాదీనామపి సంభవతి వికార

---

మనుష్యులకు శాస్త్రమునం దధికారముండుటవలన మానుష హృదయ పరిమాణమునుబట్టి, యంగుష్ఠమాత్రశ్రుతి ప్రవర్తించిన ట్లుదాహరింపబడినది. అందుచే నీవిచారణ ప్రసక్తమగుచున్నది. నిజమే! మనుజులగూర్చి శాస్త్రము ప్రవర్తించినది. బ్రహ్మజ్ఞానమునుగూర్చి మనుజు డొక్కడే యధికారియను నియమములేదు. వారలపైనన్న దేవతలనుగూర్చిగూడ శాస్త్రము ప్రసక్తమగుచున్నట్లు బాదరాయణాచార్యుడు తలంచుచున్నాడు. ఏలనన! సంభవమగుట వలన. వారలకు గూడ శాస్త్రాధికారకారణమగు బ్రహ్మలోకకామన సంభవించుచున్నది. వారల యైశ్వర్యము తద్విషయములు గూడ వికారము చెందునవిగనుక నిత్యముకావు. ఇట్టి విచారణచే మోక్షవిషయమగు కామన వారలకుగూడ

దేవతలనుగూడ బ్రహ్మజ్ఞానాధికారము కలదు.

విషయవిభూత్యనిత్యత్వాలోచనాదినిమిత్తం. తథా సామర్థ్యమపి తేషాం సంభవతి. మంత్రార్థవాదేతిహాసపురాణలోకేభ్యో విగ్రహవత్త్వాద్యవగమాత్, న చ తేషాం కశ్చిత్ప్రతిషేధోఽస్తి. న చోపనయనాదిశాస్త్రైణైషామధికారో నివర్త్యతే. ఉపనయనస్య వేదాధ్యయనార్థత్వాత్, తేషాంచ స్వయం ప్రతిభాతవేదత్వాత్. అపి చైషాం విద్యాగ్రహణార్థం బ్రహ్మచర్యాదీన్దర్శయతి— 'ఏకశతం హవై వర్షాణి మఘవా ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస, (ఛాం 8-11-3) 'భృగుర్వై వారుణిః పితరముపససార అధీహి

---

సంభవించును. మంత్రములు, అర్థవాదములు [అనగా దేవతాస్తోత్రపరములగు వేదవాక్యములు] ఇతిహాసములు, పురాణములు లోకానుభవము—వీని యన్నిటివలన వారలకు శరీరములున్నట్లు కాన్పించుచున్నది. కనుక వారికి మోక్షవిషయికసామర్థ్యము గలదు. వారలకు మోక్షాధికారము ప్రతిషేధింపబడలేదు. ఉపనయనశాస్త్రము వారల కన్వయింపదు గనుక మోక్షాధికారము వారలకు లేదనవీలులేదు. వేదాధ్యయనాధికార ముపనయనప్రయోజనము. దేవతల కధ్యయనములేకనే వేదములు వారలకు స్వయముగా భానమగుచున్నవి. ఇంద్రుడు ప్రజాపతి యొద్ద నొకశతవర్షములు బ్రహ్మచర్యముననుండెను. ( ఛాం 8-11-3 ) "తండ్రీ! నాకు బ్రహ్మము నుపదేశింపుడని భృగువు తండ్రికడ చేరెను" ( తై 3-1 ) యీమొదలగు వాక్యములు విద్యాగ్రహణము నిమిత్తము దేవతలకు బ్రహ్మచర్యము విధింపబడుచున్నట్లు కనపడుచున్నవి. అయినను దేవతలకు కర్మాచరణాధికా

భగవో బ్రహ్మే'త్యాది. (తై 3-1) యదపి కర్మస్వనధికార కారణముక్తం 'న దేవానాం దేవతాంతరాభావాత్' ఇతి 'న ఋషి ణామృష్యంతరాభావా'దితి, న తద్విద్యాస్వస్తి. న హీంద్రాదీనాం విద్యాస్వధిక్రియమాణానామింద్రాద్యుద్దేశేన కించిత్కృత్యమస్తి, న చ భృగ్వాదీనాం భృగ్వాదిసగోత్రతయా. తస్మాద్దేవాదీనామపి విద్యాస్వధికారః కేన వార్యతే? దేవాద్యధికారేఽప్యంగుష్ఠమాత్ర శ్రుతిః స్వాంగుష్ఠాపేక్షయా న విరుధ్యతే.

---

రము లేమికి కారణము చూపబడుచున్నది. దేవతలకు మఱి యొక దేవతలు లేరు. ఋషులకు మరియొక ఋషులు లేరు. దేవతైకప్రధానములగు [యాగాదికర్మలయం దింద్రాది దేవ తలాహ్వానము చేయబడుచున్నారు. ఇంద్రాది దేవతలే యా గాదులచేసిన వారలాహ్వానముచేయదగ్గ యితర దేవతలెవ్వ రును లేరు. మనుజులు చేయుకర్మలయందు ఋషులుందురు. వారు చేయుకర్మలయందుండు వారెవరును లేరు. కనుక దేవ తలకు ఋషులకు గర్మాధికారము లేదు]. ఇట్టికారణము బ్రహ్మ జ్ఞానమువిషయమై లేదు. ఇంద్రాదులు విద్యాభ్యాసము చేయుచుండగా నింద్రాదులనుగూర్చి చేయవలసిన క్రియా కలాపమేమియు లేదు. భృగ్వాదిఋషులు సగోత్రీకులనుగూర్చి చేయుకర్మ యేమియు లేదు. కనుక కర్మసంభవము కాదుకాని దేవతలకుగూడ బ్రహ్మజ్ఞానమునం దధికారమును నివారింప నేరికిని శక్యముకాదు. వారివారి యంగుష్ఠపరిమాణాపే క్షచే నంగుష్ఠమాత్రశ్రుతి దేవతలకుగూడ సమన్వయమగు చున్నది.

# విరోధం కర్మణీతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్
(సూ 27.)

పూ. పక్షి : స్యాదేతద్యది విగ్రహవత్త్వాద్యభ్యుపగమేన దేవాదీనాంవిద్యాస్వధికారో వర్ణ్యేత విగ్రహవత్త్వాదృత్విగాదివదింద్రాదీనామపి స్వరూపసన్నిధానేన కర్మాంగభావోఽభ్యుపగమ్యేత, తథా చ విరోధః కర్మణి స్యాత్. న హీంద్రాదీనాం స్వరూపసన్నిధానేన

---

అ॥ దేవతలకు శరీరమున్నటుల పూర్వసూత్రమునందుదాహరింపబడినది. ఆ పక్షమున సంభవించుచున్న పూర్వపక్షమునందులకు సమాధానమును దనువాతసూత్రమునజూపుచున్నారు.

ఒకేసమయమునం దనేకయజమానులచే నాచరింపబడు కర్మణి = సోమాదియాగ కర్మలయం దిందుృడొక డన్నిస్థలములయందు నుండలేడుగనుక విరోధః ఇతిచేత్ = కర్మాచరణవిరోధమందు రేని న = అది సరికాదు. అనేకప్రతిపత్తేః = దేవతల కనేకరూపధారణాసంభవము దర్శనాత్ = పురాణాదులయందు గాన్పించుటవలన.

పూ. పక్షి : దేవతలకు బ్రహ్మజ్ఞానాధికారముండుగాక. ప్రత్యేకశరీరము లున్నంట్లంగీకరించి వారలకు జ్ఞానాధికారము వర్ణింపబడినది. వారలు విగ్రహములు గలవారయినచో, నితరఋత్విక్కులవలెనే. వారుగూడ స్వరూపసాన్నిధ్యమువలన కర్మలకంగములగుచున్నారని యంగీకరింపవలయును. అప్పుడు కర్మలయందు విరోధము సంభవించును. ఇంద్రాదులకు స్వరూప సాన్నిధ్యముగాని యాగములయం

యాగాంగభావో దృశ్యతే, న సంభవతి. బహుషు యాగేషు యుగపదేకస్యేంద్రస్య స్వరూపసన్నిధానానుపపత్తేరితి చేత్, 1

సిద్ధాంతీ. నాయమస్తి విరోధః. కస్మాత్ ? అనేకప్రతిపత్తేః. ఏకస్యాపి దేవతాత్మనో యుగపదనేకస్వరూపప్రతిపత్తిస్సంభవతి. కథమేతదవగమ్యతే? దర్శనాత్. తథా హి—'కతి దేవా' ఇత్యుపక్రమ్య 'త్రయశ్చ త్రీచ శతా త్రయశ్చ త్రీచ సహస్రేతి' నిరుచ్య 'కతమేత' ఇత్యస్యాం పృచ్ఛాయాం 'మహిమాన ఏవైషామేతే త్రయస్త్రింశత్త్వేవ దేవతా' (బృ 3-9-1-2) ఇతి బ్రువంతీ శ్రుతి

---

దంగభావముగాని యనుభవములో గానరాదు. అట్లు సంభవముకాదు. అనేకయాగములయం దొక్కమాఱుగ నొక్క ఇంద్రుడు స్వరూపధారియై సంభవింపనేరడు.

సిద్ధాంతి : మీరు చెప్పు విరోధము లేదు. ఏలనన ! బహురూపములు సంభవమగుటవలన. దేవత ఒకరైనను నొకమాఱుగ ననేకస్వరూపప్రాప్తి సంభవించుచున్నది. ఇది యెట్లు తెలియుచున్నది ? అనగా అనుభవమునందు గాన్పించుచున్నది. దేవత లెంతమంది? యనుశాకల్యప్రశ్నముతో బృహదారణ్యకశ్రుతి(3–9–1–2)ప్రారంభించి 3303 దేవతలు గలరని నిరూపించి వారెవరని తిరుగ వేయబడిన ప్రశ్నకు నిజముగా ముప్పది మూడు దేవతలు మాత్రము గలరనియు 3303 స్వరూపములు వారల మహిమలనియు జెప్పుచున్నది. శ్రుతియే యీవిధముగ నొక్క దేవతయె యనేకరూపముల బొందవచ్చునని చూపుచున్నది. ఈ

దేవతలకు బహురూపధారణ సామర్థ్యము గలదు.

రేకైకస్య దేవతాత్మనో యుగపదనేకరూపతాం దర్శయతి. తథా త్రియస్త్రింశతోఽపి షడాద్యంతర్భావక్రమేణ 'కతమ ఏకో దేవ ఇతి ప్రాణ' ఇతి ప్రాణైకరూపతాం దేవానాం దర్శయంతీ తస్యైవైకస్య ప్రాణస్య యుగపదనేకరూపతాం దర్శయతి. తథా స్మృతిరపి—"ఆత్మనాం వై సహస్రాణి బహూని భరతర్షభ, కుర్యాద్యోగీ బలం ప్రాప్య తైశ్చ సర్వైర్మహీం చరేత్. ప్రాప్నుయాద్విషయాన్ కైశ్చిత్కైశ్చిదుగ్రం తపశ్చరేత్, సంక్షిపేచ్చ పునస్తాని సూర్యో రశ్మిగణానివే" త్యేవంజాతీయకా ప్రాప్తాణి

---

ముప్పది మూడు దేవతలు అయిదారు దేవతలరూపమే యని చెప్పి చివరకు ప్రాణమొక్కటియే దేవతయనియు, దేవతలందఱొక ప్రాణముయొక్క రూపమనియు బోధించినది. ఈవిధముగా ప్రాణమొక్కటియుగ ననేకరూపముల గాన్పించునట్లు శ్రుతి ప్రదర్శించుచున్నది. ఈవివరణము శాకల్యయాజ్ఞవల్క్య సంవాదమున గాన్పించుచున్నది."యోగి తన మహిమచే ననేకరూపముల కాన్పింపవచ్చును. ఆరూపములతో లోకమున సంచరింపవచ్చును. కొన్నిశరీరములతో విషయములను బొందవచ్చును. [శ్రీశంకరభగవత్పాదులు పరకాయప్రవేశముచేసి కామశాస్త్రరహస్యములను గ్రహించినట్లు చరిత్ర కలదు.] కొన్ని శరీరములతో నుగ్రమగు తపము నాచరింపవచ్చును. సూర్యుడు తనకిరణముల నుపసంహరించుకొనినట్లు తనశరీరములన్నిటిని యుపసంహరించుకొనవచ్చును అని భారతము పలుకుచున్నది. [యోగు లణిమాద్యైశ్వర్యసిద్ధులు గలిగి యుండుట సుప్రసిద్ధము] ఈమొదలగు వాక్యములవలన యోగులణిమాద్యై

మాద్యైశ్వర్యాణాం యోగినామపి యుగపదనేకశరీరయోగం దర్శయతి. కిము వక్తవ్యమాజానసిద్ధానాం దేవానాం? అనేకరూపప్రతిపత్తిసంభవాచ్చైకైకా దేవతా బహుభీ రూపైరాత్మానం ప్రవిభజ్య బహుషు యాగేషు యుగపదంగభావం గచ్ఛతీతి పరైశ్చ న దృశ్యతేఽన్తర్ధానాదిశక్తియోగాదిత్యుపపద్యతే.

అనేకప్రతిపత్తేర్దర్శనాదిత్యస్యాపరా వ్యాఖ్యా. విగ్రహవతామపి కర్మాంగబావచోదనాస్వనేకప్రతిపత్తిర్దృశ్యతే. క్వచిదేకోఽపి విగ్రహవాననేకత్ర యుగపదంగభావం న గచ్ఛతి యథా

---

శ్వర్యముల బొంది యొక్కమాఱుగ ననేకశరీరసంబంధములను గలిగిన వారగుచున్నారు. ఇట్లుండ జన్మము చేతనే దేవత్వము నొందినవారినిగూర్చి చెప్పవలసినదేమి యున్నది. అనేకరూపములు వారికి సంభవమగుటచే నొక్కొక్క దేవత తన ననేక రూపములుగ జేసికొని యనేక యాగములు యందొక్కమాఱుగ నంగభావమును బొందుననుటలో విచిత్రము లేదు. అంతర్ధానాదిక్రియలు గలవారవగుటంచేసి యితరులకు గాన్పింపరు.

అనేక ప్రతిపత్తేర్దర్శనాత్ అనుసూత్రముయొక్క యుత్తరార్థము మఱియొకవిధముగగూడ వ్యాఖ్యానింపదగును. శరీరధారులగు వారుగూడ ననేకములగు కార్యములకంగభావమును బొందుటకాన్పించుచున్నది. [ఒకడే యనేక కర్మలయందు సంభవించుట యంగభావమందురు]. ఒకానొక్కడొకడైన నొక్కమారుగ నంగభావమును బొందడు. ఒకే బ్రాహ్మణు

దేవతలకు శరీరముండుట విరోధము లేదు.

బహుభిర్భోజయద్భిరైకో బ్రాహ్మణో యుగపద్భోజ్యతే. క్వచిచ్చైకోఽపి విగ్రహవాననేకత్ర యుగపదంగభావం గచ్ఛతి. యథా బహుభిర్నమస్కుర్వాణైరేకో బ్రాహ్మణో యుగపన్నమస్క్రియతే. తద్వదిహోద్దేశపరిత్యాగాత్మకత్వాద్యాగస్య విగ్రహవతీమప్యేకాం దేవతాముద్దిశ్య బహవస్స్వం స్వం ద్రవ్యం యుగపత్పరిత్యక్ష్యంతీతి విగ్రహవత్త్వేఽపి దేవాదీనాం న కించిత్కర్మణి విరుధ్యతే.

---

డొక్కమారుగ ననేకగృహముల భోజనము చేయలేడు. ఒకపుడొక్కడైనను నట్టియంగభావమును బొందును. ఒక్కమాఱు ననేకులచే నమస్కరింపబడుచున్నాడు. అదే విధముగ నిచటగూడ గ్రహింపనగు, అంగమునందొక దేవత నుద్దేశించి ద్రవ్యపరిత్యాగము చేయబడుచున్నది. శరీరము గలిగియున్నను నొకే దేవత నుద్దేశించి యనేకమంది యజమాను లొక్కకాలమునందే తమతమ ద్రవ్యములను బరిత్యజించుచున్నారుగనుక దేవతలకు శరీరమున్నను గర్మలయందు విరోధము నేమియు లేదు. 27

అ॥ దేవతలు శరీరములు కలిగియుండుట కర్మల కవిరోధ మగుగాక; వేదమునకు విరోధమగుచున్నది యనుమతి యొక పూర్వపక్షమునకు తరువాత సూత్రమున సమాధానము చెప్పబడుచున్నది.

## శబ్ద ఇతి చే న్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్ (సూ. 28)

పూ.పక్షి: మా నామవిగ్రహవత్త్వే దేవాదీనామభ్యుపగమ్యమానే కర్మణి కశ్చిద్విరోధః ప్రసంజి, శబ్దేతు విరోధః ప్రసజ్యేత. కథం ? ఔత్పత్తికం హి శబ్దస్యార్థేన సంబంధమాశ్రిత్యానపేక్ష

---

దేవతలకు శరీరము లున్నచో శబ్దే = నిత్యమగు వేదమువిషయమై విరోధము సంభవించును, ఇతిచేత్ = అనినచో న = అది సరికాదు. ఏలనన! అతః = వేదము వలననే ప్రభవాత్ — దేవతాది బ్రపంచమంతయు బుట్టుట వలన ప్రత్యక్ష అనుమానాభ్యాం = ఆట్లుశ్రుతిస్మృతుల యందు దెలియుటవలన.

పూ.పక్షి: దేవతలకువిగ్రహము గలదని యంగీకరించినకర్మలకు విరుద్ధము లేకుండుగాక! వేదమునకు విరుద్ధము కలుగుచున్నది. ఎట్లన! శబ్దమునకును దానియర్థమునకు గల సంబంధము నిత్యము. ఆసంబంధముమతియొకదానిన పేక్షింపదు.అందు వలన వేదముయొక్క ప్రామాణ్యము స్థిరపఱుపబడినది. దేవతలకు విగ్రహవత్త్వమంగీకరింపబడినచో బ్రభావము గలవారలగుటచే నొక్కమాఱుగ ననేక కర్మలయందు హోమముసేయబడు హవిస్సును గ్రహించెదరు గాక. అయినను శరీరములు కలిగియుండుటచే మనవలెనే వారలుగూడ జననమరణములు గలిగినవారగుదురు. శబ్దము

దేవతాశరీర మనిత్యమగుటచే ఆశరీర బోధకమగు వేద మనిత్యము

త్వాదితి వేదస్య ప్రామాణ్యం స్థాపితం. ఇదానీం తు విగ్రహవతీ దేవతాభ్యుపగమ్యమానా యద్యప్యైశ్వర్యయోగాద్యుగపదనేకకర్మ సంబంధినీ హవీంషి భుంజీత. తథాపి విగ్రహయోగాదస్మదాదివజ్జననమరణవతి నేతి నిత్యస్య శబ్దస్యానిత్యేనార్థేన అనిత్యసంబంధే ప్రవిలీయమానే యద్వైదికే శబ్దే ప్రామాణ్యం స్థితం తస్య విరోధస్స్యాదితి చేత్

సిద్ధాంతీ: నాయమప్యస్తి విరోధః. కస్మాత్? అతః ప్రభవాత్. అత ఏవ హి వైదికాచ్ఛబ్దాద్దేవాదికం జగత్ప్రభవతి.

---

నిత్యము. దానికిని దాని యర్థమునకును నిత్యసంబంధము తెలియుచున్నది. అందువలన శబ్దరూపమగు వేదమునందు ప్రామాణ్యము సిద్ధించుచున్నది. అట్టిశబ్దమునకు దేవతలయొక్క విగ్రహవత్త్వము విరుద్ధము కాగలదు. [అనగా ప్రతిశబ్దమునకర్థము గలదు, శబ్దము నిత్యము గనుక దానియర్థము గూడ నిత్యము కావలయును. ఇంద్రదేవతా యనుశబ్దమునకు శరీరముగల నొకవ్యక్తివిశేష మర్థము. ఇంద్రియనుశబ్దము నిత్యముగనుక దానియర్థమగు వ్యక్తివిశేషముగూడ నిత్యము కావలయును. కాని శరీరములన్నియును మనశరీరములవలెనే నశ్వరములు. కనుక నశ్వరమైనపుడు శబ్దముగూడ నశ్వరము కావలెను. అపుడు శబ్దస్వరూపమగు వేదమంతయు నిత్యము కాకపోవలెను. అటులయిన వేదములు ప్రమాణములు కాకపోవలెను.]

సిద్ధాంతి : ఇట్టి విరోధము లేదు. ఏలనన! వేదము వలన బుట్టుటచేత. వైదికశబ్దము వలననే దేవతలు మొదలగు జగత్తంతయు బుట్టుచున్నది.

పూ. పక్షీ. నను 'జన్మాద్యస్య యత' (తై సూ 1-1-2) ఇత్యత్ర బ్రహ్మప్రభవత్వం జగతోఽవధారితం. కథమిహ శబ్దప్రభవత్వముచ్యతే? అపి చ యది నామ వైదికాచ్ఛబ్దాదస్య ప్రభవోఽభ్యుపగతః కథమేతావతా విరోధశ్శబ్దే పరిహృతః? యావతా వసవో రుద్రా ఆదిత్యా విశ్వేదేవా మరుత ఇత్యేతేఽర్థా అనిత్యా ఏవోత్పత్తిమత్త్వాత్, తదనిత్యత్వే చ తద్వాచినాం వైదికానాం వస్వాదిశబ్దానామనిత్యత్వం కేన వార్యతే? ప్రసిద్ధం హి లోకే దేవదత్తస్య పుత్రే ఉత్పన్నే యజ్ఞదత్త ఇతి తస్య నామ క్రియత ఇతి. తస్మాద్విరోధ ఏవ శబ్ద ఇతి చేత్

---

దేవతలు వేదమువలనబుట్టినను, వేదమనిత్యమగుచున్నది.

పూ. పక్షి : "జన్మాద్యస్యయతః" యను సూత్రమునందు జగత్తు బ్రహ్మవలన బుట్టినది యనిగదా నిశ్చయింపబడినది. ఇచ్చట శబ్దమునుండి బుట్టినది యని యెట్లు జెప్పనగును? వైదికశబ్దము వలననే జగదుత్పత్తి యగుగాక. అంత మాత్రముచే నద్దానికి వైదికశబ్ద వైరుధ్య మెట్లునివారింపనగును. వేదమువలననే వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వేదేవులు, మరుత్తులు మొదలగు ననిత్యార్థములన్నియు నుత్పన్నములగుచున్నవి. ఇట్టి యనిత్యార్థములను దెలియజేయు వస్వాది వైదికశబ్దముల యనిత్యత్వమును వారింప నెవరికి శక్యము. దేవదత్తునికి కుమారుడు జన్మించినపుడే యతనికి యజ్ఞదత్తుడను నామకరణము చేయబడుచున్నది. (కుమారుని పుట్టుక లేనపుడు యజ్ఞదత్తుడను పేరు లేదు. దాని యర్థము లేదు. కనుక శబ్దము, అర్థము గూడ ననిత్యము లగుచున్నవి). కనుక దేవతలయొక్క విగ్రహావత్త్వము శబ్దమునకు విరుద్ధమగుచున్నది.

సిద్ధాంతీ: న, గవాదిశబ్దార్థసంబంధనిత్యత్వదర్శనాత్. నహి గవాదివ్యక్తీనాముత్పత్తిమత్త్వే తదాకృతీనాముత్పత్తిమత్త్వం స్యాత్. ద్రవ్యగుణకర్మణాం హి వ్యక్తయ ఏవోత్పద్యంతే నాకృతయః. ఆకృతిభిశ్చ శబ్దానాం సంబంధో న వ్యక్తిభిః. వ్యక్తీనామానంత్యాత్సంబంధగ్రహణానుపపత్తేః. వ్యక్తిషూత్పద్యమానాస్వప్యాకృతీనాం నిత్యత్వాన్న గవాదిశబ్దేషు కశ్చిద్విరోధో దృశ్యతే. తథా దేవాదివ్యక్తిప్రభవాభ్యుపగమేఽప్యాకృతినిత్యత్వాన్న కశ్చిద్వస్వాదిశబ్దేషు విరోధ ఇతి ద్రష్టవ్యః. ఆకృతివిశేషస్తు దేవాదీనాం మంత్రార్థవాదాదిభ్యో విగ్రహవత్త్వాద్యవగ

---

సిద్ధాంతి : మీవాదము సరికాదు. గోవు అను శబ్దమునకును దాని యర్థమునకును నిత్య సంబంధము కాన్పించుట వలన. గోవులు మొదలగు వ్యక్తుల కుత్పత్తి కాన్పించుచున్నది. కాని వాని జాతికి ఉత్పత్తి లేదు. ద్రవ్యగుణకర్మలను గూర్చి వ్యక్తు లుత్పన్నము లగును గాని జాతు లుత్పన్నములు గావు. శబ్దములకు జాతులతో సంబంధముగాని వ్యక్తులతో సంబంధము లేదు. వ్యక్తు లనంతములు గనుక వానికి శబ్ద సంబంధ మసంభవము. వ్యక్తులుత్పన్నములయినను, జాతులు నిత్యములగుట వలన గవాది శబ్దముల యందెంతమాత్రము విరోధము కాన్పింపదు. ఆ తీరుననే దేవాదివ్యక్తు లుత్పన్నములైన నాయీ జాతులు నిత్యములగుట వలన వస్వాదిశబ్దముల యందు విరోధమేమియు లేదని తెలుసుకొనదగును. మంత్రములు అర్థవాదములు మొదలగువానివలన దేవాదులకు

శబ్దమునకును జాతికిని నిత్య సంబంధము.

మావగన్తవ్యః. స్థానవిశేషసంబంధనిమిత్తాశ్చేంద్రాదిశబ్దాస్సేనాపత్యాదిశబ్దవత్. తతశ్చ యో యస్తత్స్థానమధితిష్ఠతి స స ఇంద్రాదిశబ్దైరభిధీయత ఇతి న దోషో భవతి. న చేదం శబ్దప్రభవత్వం బ్రహ్మప్రభవత్వవదుపాదానకారణత్వాభిప్రాయేణోచ్యతే. కథం తర్హి! స్థితే వాచకాత్మనా నిత్యే శబ్దే నిత్యార్థసంబంధిని శబ్దవ్యవహారయోగ్యార్థవ్యక్తినిష్పత్తిః అతః ప్రభవ ఇత్యుచ్యతే.

---

శరీరములున్నట్లు తెలియుటచే వానికి జాతి విశేషమున్నట్లు తెలియనగును. ఇంద్రాది శబ్దములు సేనాపతి శబ్దముల వలె నధికారస్థానవిషయమునకును(ఆస్థానమునందుండు వ్యక్తివిశేషమునకును) గల సంబంధమును బురస్కరించుకొని యున్నవి. ఆయాస్థానముల యందెవరెవరు యేయేస్థానము నధిష్ఠించి యుందురో వారువారు యింద్రాది శబ్దములచే చెప్పబడుచున్నారు. అందువలన దోషమేమియు లేదు. జగత్తు శబ్దము వలన బుట్టినదనినపుడు బ్రహ్మ ముపాదాన కారణమైనట్లు శబ్దముగూడ జగత్తునకుపాదానకారణమను నభిప్రాయముతో నట్లు జెప్పబడలేదు. శబ్దములు వాచకములు, నిత్యములు, వాని వాని జాతితోనవి నిత్యసంబద్ధములు. అట్టి శబ్దమునకును వ్యవహార యోగ్యమైన జాతికి జెందిన వ్యక్తి నిష్పన్నమగుటచే నావ్యక్తి యాశబ్దమునుంచి బుట్టినట్లు చెప్పబడుచున్నది.

ఇంద్రాదిపదములు అధికారిపరములు.

కథం పునరవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి? ప్రత్యక్షానుమానాభ్యాం. ప్రత్యక్షం హి శ్రుతిః; ప్రామాణ్యం ప్రత్యనపేక్షత్వాత్. అనుమానం స్మృతిః; ప్రామాణ్యం ప్రతి సాపేక్షత్వాత్. తే హి శబ్దపూర్వాం సృష్టిం దర్శయతః. 'ఏత ఇతి వై ప్రజాపతిర్దేవానసృజతాసృగ్రమితి మనుష్యానిందవ ఇతి పితౄంస్తిరః పవిత్రమితి గ్రహానాశవ ఇతి స్తోత్రం విశ్వానీతి శస్త్రమభిసౌభగే

---

వేదముచే జగత్తు బుట్టినదియని యెట్లు తెలియుచున్నది? ప్రత్యక్షము చేతను అనుమానప్రమాణము చేతను జగత్తు శబ్దమునుండి యుత్పన్నమైనట్లు దెలియుచున్నది. శ్రుతియే ప్రత్యక్షప్రమాణము. అయ్యది స్వతఃప్రమాణము. స్మృతి యనుమానప్రమాణము. అద్దాని ప్రామాణ్యము శ్రుతి నాధారము చేసికొనియున్నది. సృష్టికి బూర్వము శబ్దముగలదని యీ రెండు ప్రమాణములు దెలియచేయుచున్నవి. "ప్రజాపతి "ఏతే" వీరు అను సర్వనామశబ్దముచే దేవతలను సృజియించెను. రక్తప్రధానమగు దేహమునందు రమించువారు అను పదములచే మనుజులను సృజియించెను. చంద్రమండలమునందుండువారను పదములచే పితృదేవతలను సృజియించెను. సోమమండలమును దిరస్కరించు పవిత్రవంతులు అను పదముచే గ్రహముల సృజియించెను. గాన రూపములగు స్తోత్రములను ఆశు శబ్దముచే సృజించెను. విశ్వశబ్దముచే శస్త్రములను సృజించెను. అభిసౌభగ యను పదముచే నితరజీవులను

వేదమునుంచి జగత్తు పుట్టినట్లు ప్రత్యక్షానుమాన ప్రమాణములచే దెలియుచున్నది

త్ర్యన్యాః ప్రజాః' ఇతి శ్రుతిః. తథాన్యత్రాపి 'స మనసా వాచం మిథునం సమభవత్' (బృ 1-2-4) ఇత్యాదినా తత్ర తత్ర శబ్దపూర్వికా సృష్టిశ్శ్రావ్యతే, స్మృతిరపి "అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా, ఆదౌ వేదమయీ దివ్యా యతస్సర్వాః ప్రవృత్తయః" ఇతి. ఉత్సర్గోఽప్యయం వాచస్సంప్రదాయప్రవర్తనాత్మకో ద్రష్టవ్యోఽనాదినిధనాయాః అన్యాదృశస్యోత్సర్గస్యాసంభవాత్. తథా "నామరూపే చ భూతానాం కర్మణాం ప్రవర్తనం, వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః" ఇతి "సర్వేషాం

---

సృజించెను" అని ఛాందోగ్యబ్రాహ్మణము చెప్పుచున్నది. ప్రజాపతి తన మనస్సును వాక్కుతో సంయోగింపజేసెను. [అనగా వేదములచే ప్రకాశితమగు సృష్టిని మనస్సుచే నాలోచించెనని తాత్పర్యము]. అని బృహదారణ్యకశ్రుతి (1-2-4) కలదు. ఇట్లచ్చటచ్చట సృష్టికిబూర్వము శబ్దమున్నట్లు శ్రుతులు వినవచ్చుచున్నవి. ఆద్యంతములులేనిది నిత్యము. "వేదాత్మకమగు నొకవాక్కును స్వాయంభువగు బ్రహ్మ బలికెను. ఆవాక్కుచే సమస్తవ్యవహారములు ప్రవృత్తములయినవి." వాక్కును పలికెను అనుపదములకు సంప్రదాయమును బ్రవర్తింపచేయు వాక్కులని యర్థము.

సృష్టికి పూర్వమున్న శబ్దమును స్వాయంభువు వినెను.

ఆద్యంతములు లేనివాక్కును బలుకుటయను పదములకు మఱియొకయర్థమసంభవము. మొదట, వేదశబ్దములనుండియే భూతములయొక్క నామములను రూపములను కర్మలయొక్క ప్రవర్తనమును మహేశ్వరుడు నిర్మించెను"

చ సనామాని కర్మాణి చ పృథక్పృథక్, వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే" (మను1-21) ఇతి చ. అపి చ చికీర్షిత మర్థమనుతిష్ఠన్ తస్య వాచకం శబ్దం పూర్వం స్మృత్వా పశ్చాత్త మర్థమనుతిష్ఠతీతి సర్వేషాం నః ప్రత్యక్షమేతత్.తథా ప్రజాపతేరపి స్రష్టుః సృష్టేః పూర్వం వైదికాశ్శబ్దా మనసి ప్రాదుర్బభూవుః పశ్చాత్తదనుగతానర్థాన్ససర్జేతి గమ్యతే. తథా చ శ్రుతిః 'స భూరితి వ్యాహరత్ స భూమిమసృజత' (తై. బ్రా 2-2-4-2) త్యేవమాదికా భూరాదిశబ్దేభ్య ఏవ మనసి ప్రాదుర్భూతేభ్యో భూరాదీన్లోకాన్సృష్టాన్ దర్శయతి.

---

అని మనుస్మృతి (1-21) చెప్పుచున్నది. వేదశబ్దములనుంచియే యన్నిటియొక్క నామములను, కర్మలను, సంస్థలనుగూడ ప్రారంభమున బ్రత్యేకప్రత్యేకముగ నిర్మించెను, అనికూడ చెప్పబడుచున్నది. మఱియు దాను గోరిన యొకపనికి జేయ బూనుకొనినపు డాపనిని చెప్పు వాగ్రూపమైన శబ్దమును ముందు స్మరించును. తరువాత నాపనిని జేయును. ఈవిష యము మనకందఱకును బ్రత్యక్షమే. అటులనే సృష్టికర్త యగు ప్రజాపతిమనస్సునందు సృష్టికిబూర్వము వైదికశబ్దములు ప్రాదుర్భూతములయ్యెను. తరువాత వానికనురూపములగు నర్థముల నాతడు సృజించెనని తెలియుచున్నది. "భూః అను పదము నుచ్చరించి భూమి నాతడు సృజించెను." అని తైత్తి రీయబ్రాహ్మణము (2-2-4-2) చెప్పుచున్నది. మనస్సునందు ప్రాదుర్భూతములైన భూరాదిశబ్దములవలననే భూరాదిలోక ములను బ్రజాపతి సృష్టించినట్లీమొదలగు వాక్యములు చూపు చున్నవి.

కిమాత్మకం పునశ్శబ్దమభిప్రేత్యేదం శబ్దప్రభవత్వముచ్యతే?

పూ. పక్షీ: స్ఫోటమిత్యాహ. వర్ణపక్షే హి తేషాముత్పన్నప్రధ్వంసిత్వాన్నిత్యేభ్యశ్శబ్దేభ్యో దేవాదివ్యక్తీనాం ప్రభవ ఇత్యనుపపన్నం స్యాత్. ఉత్పన్నప్రధ్వంసినశ్చ వర్ణాః ప్రత్యుచ్చారణమన్యథాన్యథా చ ప్రతీయమానత్వాత్. తథా హ్యదృశ్యమానోఽపి పురుషవిశే

---

శబ్దమునుండి జగత్తు ఉత్పన్నమగుచున్నట్లు చెప్పబడుచున్నదిగదా? అట్టిశబ్దముయొక్క స్వరూపమేమి?

పూ.పక్షి:స్ఫోటమేశబ్దస్వరూపమనిమే మెఱుంగుదుము[వర్ణములచే నభివ్యంగ్యమగు నర్థము నభివ్యక్తము సేయు గవాదిశబ్దములనిత్యములు. అట్టియర్థము నభివ్యక్తముచేయునది స్ఫోటమని వైయ్యాకరణులందురు. ప్రతిపదమునందుగల వివిధవర్ణములకు ప్రత్యేకముగ నొకశక్తికలదనియు, నీశక్తిచే శబ్దముయొక్క యర్థమభివ్యక్తమగుచున్నదనియు వారిమతము.] శబ్దములు వర్ణాత్మకములు. అవి యుచ్చరించిన వెంటనే నశించుచున్నవి. కనుక నిత్యములగు శబ్దములనుండి దేవాదివ్యక్తు లుద్భవించుననుట సంభవముకాదు. వర్ణము లుత్పన్నములగుచున్నవి. ఉచ్చరించు వ్యక్తినిబట్టి మాఱుచున్నవి, [ఒకడు తారస్వరముతో నుచ్చరించును. మఱియొకడు మంద్రస్వరముతో నుచ్చరించును.] అధ్యయనముచేయుచున్న పురుషుడు కాన్పింపకపోయినను, గంఠధ్వనినిబట్టి అధ్య

స్ఫోటవాదము. వైయ్యాకరణ మతము.

షోఽధ్యయనధ్వనిశ్రవణాదేవ విశేషతో నిర్ధార్యతే — దేవదత్తోఽయమధీతే 'యజ్ఞదత్తోఽయమధీత' ఇతి. న చాయం వర్ణవిషయోఽన్యథాత్వప్రత్యయో మిథ్యాజ్ఞానం, బాధకప్రత్యయాభావాత్. న చ వర్ణేభ్యోఽర్థావగతిర్యుక్తా, న హ్యేకైకో వర్ణోఽర్థం ప్రత్యాయయేత్, వ్యభిచారాత్; న చ వర్ణసముదాయప్రత్యయోఽస్తి, క్రమవర్తిత్వాద్వర్ణానాం; పూర్వపూర్వవర్ణానుభవజనితసంస్కారసహితోఽన్త్యో వర్ణోఽర్థం ప్రత్యాయయిష్యతీతి యద్యుచ్యేత, తన్న; సంబంధగ్రహణాపేక్షో హి శబ్దః స్వయం ప్రతీయమానోఽర్థం ప్రత్యాయయేద్ధూమాదివత్; న చ పూర్వపూర్వవర్ణానుభవజనితసంస్కార

---

యనముచేయునది దేవదత్తుఁడో యజ్ఞదత్తుఁడో గుర్తింపగలము, వర్ణములచేగల్గిన భేదజ్ఞానము మిథ్యాజ్ఞానమనవీలులేదు. దానిని బాధించు జ్ఞానము మఱియొకటి యేదియు లేదు. వర్ణములవలన అర్థజ్ఞానము గల్గుచున్నదనుట యుక్తముకాదు. శబ్దమునందలి యొక్కొక పదమర్థమును తెలియజేయలేదు. కేవల మొక్కొక్క వర్ణ మెద్దియు నర్థగ్రాహకమగుచున్నదియని లోకప్రసిద్ధి లేదు. అటులయినచో నితరవర్ణములు నిష్ప్రయోజనములగును. వర్ణములన్నియుగలసి యర్థమును దెలియచేయుచున్నవనిగూడ వీలులేదు. అవి యొకదానితరువాత నొకటి వినవచ్చుచున్నవి. [క్షణికములగుటచే నుత్తరపదము నుచ్చరించునప్పటికి బూర్వవర్ణము నశించును]. పూర్వపూర్వవర్ణము నశించినను నద్దాని వినుటచే గలిగిన సంస్కారముతో గూడిన శబ్దముయొక్క అంతిమవర్ణము అర్థమును బోధించునంటిరేని అదిగూడ సంభవముకాదు. పూర్వపూర్వవర్ణశ్రవణమువలన

సహితస్యాంత్యవర్ణస్య ప్రతీతిరస్తి, అప్రత్యక్షత్వాత్సంస్కారాణాం. కార్యప్రత్యాయితైస్సంస్కారైస్సహితోఽన్త్యో వర్ణోఽర్థం ప్రత్యాయయిష్యతీతి చేన్న, సంస్కారకార్యస్యాపి స్మరణస్య క్రమవర్తిత్వాత్, తస్మాత్స్ఫోటశ్శబ్దః, స చైకైకవర్ణప్రత్యయాహితసంస్కారబీజేఽన్త్యవర్ణప్రత్యయజనితపరిపాకే ప్రత్యయిన్యేకప్రత్యయవిష

---

గలిగిన సంస్కారముతో గూడి శబ్దముయొక్క యంతిమాక్షరముచే శబ్దము తెలియవచ్చినచో, దానివలన నర్థము నూహింపవచ్చును. ధూమమును జూచిన దానిచే నగ్ని యున్నటుల నూహింపవచ్చును. కాని సంస్కారములు ప్రత్యక్షములు గావుగనుక నంత్యవర్ణమున కట్టిశబ్దజ్ఞాపకతా ప్రతీతి లేదు. నిజమే! సంస్కారములు ప్రత్యక్షముగ కానరావు. కాని శబ్దజ్ఞానముచే నర్థజ్ఞానము గలుగుచున్నది. కనుక సంస్కారముల నూహింపవచ్చును. అనుమానప్రమాణముచే నూహింపబడుచున్న సంస్కారములతో కూడుకొని తెలియబడుచున్న యంతిమాక్షరము శబ్దముయొక్క యర్థమును దెలియజేయుచున్నదని యంటిరేని యదియును సరికాదు. ఏలనన! పూర్వాక్షరసంస్కారఫలము శబ్దముయొక్క స్మృతి. సంస్కారములుగూడ ప్రత్యక్షరమునకు సంబంధించి విభిన్నములగుచు నొకదానితరువాత నొకటి సంభవించును. [కనుక నాసంస్కారములుగూడ క్షణికములగుచున్నవి]. అందువలన స్ఫోటమే శబ్దము. అనగా వర్ణములు ప్రత్యేకముగగాని నొకక్రమనిబద్ధమగు సముదాయమైన పదరూపమునగాని యర్థమును బోధింపలేవు. కనుక

యతయా ఝటితి ప్రత్యవభాసతే. న చాయమేకప్రత్యయో వర్ణవిషయా స్మృతిః. వర్ణానామనేకత్వాదేకప్రత్యయవిషయిత్వానుపపత్తేః. తస్య చ ప్రత్యుచ్చారణం ప్రత్యభిజ్ఞాయమానత్వాన్ని

---

నాయాపదములయం దిమిడియున్న వర్ణము లన్నిటివలన నభివ్యక్తమగు స్ఫోటమే యర్థమును బోధింపగలదు. [స్ఫుటతి అస్మాత్ అర్థః—దీనివలన అర్థము స్ఫురించును గనుక నదిస్ఫోటము. లేకస్ఫుట్యతే—వ్యజ్యతే వర్ణైః వర్ణములవలన వ్యక్తమగుటచే స్ఫోటము అనువ్యుత్పత్తులనుబట్టి అర్థబోధకము వ్యంగ్యము నగునది స్ఫోటయని తాత్పర్యము]. పదమునందలి ప్రతివర్ణమును విననపుడొక్కొక్క సంస్కారము బుద్ధియందు గలుగును. ఇట్టిసంస్కారబీజము నాటబడిన బుద్ధియందు శబ్దముయొక్క యంత్యాక్షరశ్రవణముచే గలిగిన జ్ఞానముచే నాబీజము పరిపక్వము చెంది కడపటి సంస్కారమువలన శబ్దము సంపూర్ణముగ ప్రత్యక్షమగును. అనగా నీశబ్ద మిట్టి సంస్కారమునకు విషయమగుచున్నది. ఇట్లు గలుగు నేకరూపమగు స్ఫోటజ్ఞానము శబ్దమునందలి యక్షరములకు సంబంధించు స్మృతిరూపము గాదు. వర్ణము లనేకములుగనుక నేకజ్ఞానమునకు విషయముకానేరవు. [రత్నము యొక్క ప్రతిముఖమును పరీక్షించినపు డొక్కొక జ్ఞానము కలుగును. చివర ముఖములను బరీక్షించినతరువాత, బూర్వముచూచిన ముఖముల సంస్కారముతో నంత్యసంస్కారము గలసి రత్నజ్ఞానము కలుగుచున్నది]. అటులనే శబ్దము

త్యత్వం భేదప్రత్యయస్య వర్ణవిషయత్వాత్. తస్మాన్నిత్యాచ్ఛబ్దాత్స్ఫోటరూపాదభిధాయకాత్ క్రియాకారకఫలలక్షణం జగదభిధేయభూతం ప్రభవతీతి.

సిద్ధాంతీ: వర్ణా ఏవ తు శబ్దా ఇతి భగవానుపవర్షః.

పూ.పక్షీ: ననూత్పన్నప్రధ్వంసిత్వం వర్ణానాముక్తం.

సిద్ధాంతీ: తన్న, త ఏవేతి ప్రత్యభిజ్ఞానాత్.

పూ. పక్షీ: సాదృశ్యాత్ప్రత్యభిజ్ఞానం కేశాదిష్వివేతిచేత్

---

నుచ్చరించినపుడెల్ల నీస్ఫోటజ్ఞానము గుర్తింపబడుచున్నది. కనుక స్ఫోటముగూడ శబ్దమువలెనే నిత్యము. పైనుదహరించిన భేదము వర్ణములనుగూర్చినది. కనుక స్ఫోటరూపమగు శబ్దమువలన సర్వము తెలియుచున్నది. శబ్దముచే తెలియబడు క్రియా, కర్తృ ఫలరూపమగు జగత్తు ఉత్పన్నమగుచున్నది.

సిద్ధాంతి: వర్ణములే శబ్దములని పూజ్యపాదులగు నుపవర్షాచార్యులు పలుకుచున్నారు.

పూ. పక్షి: వర్ణము లుత్పన్నములైన వెంటనే నశించుచున్నవి యని చెప్పితిమి గదా!

సిద్ధాంతి: అది సరికాదు [వానిని తిరిగియుచ్చరించినపుడెల్ల] ఆ వర్ణములే గుర్తింపబడుచున్నవి.

పూ. పక్షి : కేశములవలే సాదృశ్యముచే వర్ణములు గుర్తింపబడుచున్నవి. ఆ వర్ణములే యవికావు. వపనానంతరము తిరిగి పెరుగు వెంట్రుకలు సాదృశ్యముచే గుర్తింపబడుచున్నవి గాని యవే యివి యనుట భ్రాంతిమాత్రము.]

సిద్ధాంతీ: న. ప్రత్యభిజ్ఞానస్య ప్రమాణాంతరేణ బాధానుపపత్తేః

పూ.పక్షీ: ప్రత్యభిజ్ఞానమాకృతినిమిత్తమితిచేత్

సిద్ధాంతీ: న, వ్యక్తిప్రత్యభిజ్ఞానాత్, యది హి ప్రత్యుచ్చారణం గవాదివ్యక్తివదన్యా అన్యా వర్ణవ్యక్తయః ప్రతీయేరంస్తత

---

సిద్ధాంతి : అట్లుకాదు పూర్వ ముచ్చరింపబడిన యక్షరములే యివి యను ప్రత్యభిజ్ఞ సరియయినదియె. అది సరికాదని చెప్పు మఱి యొక ప్రమాణ మెద్దియును లేదు.

పూ. పక్షి : ప్రత్యభిజ్ఞ సాక్షాత్ వర్ణమును బట్టి సంభవించుటలేదు. కాని యావర్ణముయొక్క జాతిని బట్టి సంభవించుచున్నది. [గోవు అను శబ్దము నందలి గౌః యను వర్ణ ముచ్చరించిన వెంటనే నశించినది. తిరిగి గౌః అని యుచ్చరించినపుడు మొదట నుచ్చరించిన పదములోని గో యను వర్ణమును సాక్షాత్తుగ గుర్తించుటలేదు. కాని యీ రెండు వర్ణములు గోవు యను వర్ణ జాతికి జెందినందున గుర్తింపబడు చున్నవి. నీవు త్రాగిన జలమునే నేను త్రాగితిని యని నపుడుభయులు త్రాగిన జలము సాక్షాత్తుగ నొకటికాదు. రెండు నొక జలజాతికి జెందినవి కనుక బ్రత్యభిజ్ఞ వానియందు సరిపోవుచున్నది.]

ఉపవర్షాచార్య మతానుసారము సమాధానము.

సిద్ధాంతి : ఇట్లనుట సరికాదు. సాక్షాత్తుగ నా యక్షరములే గుర్తింపబడుచున్నవి. ఒకేజాతికి జెందిన భిన్నవ్యక్తులగు గోవులు స్ఫురించినట్లు, నుచ్చరించినపుడెల్ల విభిన్నవర్ణ

ఆకృతినిమిత్తం ప్రత్యభిజ్ఞానం స్యాత్. న త్వేతదస్తి. వర్ణ వ్యక్తయ ఏవ హి ప్రత్యుచ్చారణం ప్రత్యభిజ్ఞాయంతే. ద్విర్గో శబ్ద ఉచ్చారిత ఇతి హి ప్రతీయతే న తు ద్వౌ గోశబ్దావితి.

మాధ్యమికః. నను వర్ణా అప్యుచ్చారణభేదేన భిన్నాః ప్రతీయంతే దేవదత్త యజ్ఞదత్తయోరధ్యయనధ్వని శ్రవణాదేవ భేదప్రతీతే రిత్యుక్తం.

సిద్ధాంతీ: అత్రాభిధీయతే. సతి వర్ణవిషయే నిశ్చితే ప్రత్యభిజ్ఞానే సంయోగవిభాగవ్యంగ్యత్వాత్ వర్ణానామభివ్యంజకవైచిత్ర్యనిమి

---

వ్యక్తులు స్ఫురించినయెడల, జాతి ననుసరించి ప్రత్యభిజ్ఞ కలుగవచ్చును. కాని యిచట నట్లు సంభవించుటలేదు. ఉచ్చ రించినపుడెల్ల పూర్వోచ్చారితమైన వర్ణవ్యక్తులే గుర్తింపబడు చున్నవి. గోయను వర్ణమును రెండుపర్యాయము లుచ్చరించి నపుడు ఒకేవర్ణము రెండు పర్యాయము లుచ్చరింపబడినట్లు తలంచుచున్నాముకాని విభిన్నములగు రెండువర్ణము లుచ్చ రింపబడినట్లు తలంచుటలేదు.

మాధ్యమికుడు : వర్ణములుగూడ నుచ్చారణభేదముచే విభిన్నములుగ గాన్పింపవచ్చును. ఒకేమంత్రము నధ్యయ నముచేయు దేవదత్తయజ్ఞదత్తుల కంఠధ్వనిభేదముచే భేదము తెలియవచ్చుచున్నది యని పూర్వవాది చెప్పెనుగదా?

సిద్ధాంతి : ఇందుకిట్లు చెప్పుచున్నాము. నిశ్చయముగ వర్ణములొకటియె. కాని వాని నభివ్యంజనముచేయు తాల్వాది భేదములచేతను వానితో సంబంధించు వాయుసంయోగ భేదముచేత నభివ్యంగములగు వర్ణములయందు వైచిత్ర్యము

త్తోఽయం వర్ణవిషయో విచిత్రః ప్రత్యయో న స్వరూపనిమిత్తః, అపి చ వర్ణవ్యక్తిభేదవాదినాపి ప్రత్యభిజ్ఞానసిద్ధయే వర్ణాకృతయః కల్పయితవ్యాః. తాసు చ పరోపాధికో భేదప్రత్యయ ఇత్యభ్యుపగంతవ్యం. తద్వరం. వర్ణవ్యక్తిష్వేవ పరోపాధికో భేదప్రత్యయః, స్వరూపనిమిత్తం చ ప్రత్యభిజ్ఞానమితి కల్పనాలాఘవం. ఏష ఏవ చ వర్ణవిషయస్య భేదప్రత్యయస్య బాధకః ప్రత్యయో యత్ప్రత్యభిజ్ఞానం కథం హ్యేకస్మిన్కాలే బహూ

---

తెలియవచ్చుచున్నదిగాని వర్ణములయొక్క స్వరూపమును బట్టి యీ భేదము కలుగుటలేదు. మఱియు ప్రత్యుచ్చారణము నందు వర్ణమునకు భేదము గలదని వాదించువారి మతము నందుగూడ వర్ణమును గుర్తించుటకు వర్ణజాతి నొకదానిని గల్పించుట యవసరమగుచున్నది. ఆ జాతులయం దుపాధి భేదముచే భేదజ్ఞానము కలుగుచున్నదనియు వారంగీకరించు చున్నారు. [అనగా ప్రత్యుచ్చారణముచే గకారాది వర్ణ వ్యక్తు లనంతములు; వీనిని గుర్తించుట కొఱకు, జాతులు, ఈజాతులయం దుదాత్తత్వాదులచే కలుగుభేదము లుపాధి కల్పితములనియు నింతదూరము కల్పనము వర్ణభేదవాదుల కవసరమగుచున్నది. ఇంత క్లిష్టకల్పనముకంటే తాల్వాద్యు దాత్తాది ఉపాధిభేదముచేతనే వర్ణవ్యక్తులయందు భేదము కల్గుచున్నదనియు వర్ణముల స్వరూపముచే బ్రత్యభిజ్ఞ కలుగు ననియు జెప్పుట లఘుతరము. వర్ణభేదజ్ఞానమునకు గోఽయంగ కారః యను అభేదజ్ఞానరూపమైన ప్రత్యభిజ్ఞయే బాధకము. వర్ణములను గూర్చినభేదమును గ్రహించుటకు బాధకమగు జ్ఞానమే ప్రత్యభిజ్ఞ యగుచున్నది. ఏకకాలమునం దనేకులచే

నామూచ్చారయతామేక ఏవ సన్ గకారో యుగపదనేకరూప స్స్యాత్ ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ సానునాసికశ్చ నిరను నాసికశ్చేతి ?

అథవా ధ్వనికృతోఽయం భేదప్రత్యయో న వర్ణకృతః. కః పునరయం ధ్వనిర్నామ ? యో దూరాదాకర్ణయతో వర్ణవివేక మప్రతిపద్యమానస్య కర్ణపథమవతరతి, ప్రత్యాసీదతశ్చ పటు మృదుత్వాదిభేదం వర్ణేష్వాసంజయతి. తన్నిబంధనాశ్చోదాత్తా దయో విశేషా న వర్ణస్వరూపనిబంధనాః, వర్ణానాం ప్రత్య.

---

నుచ్చరింపబడు గకార మొక్కటియుగ ఉదాత్తము, అను దాత్తము, స్వరితము, అనునాసికము మొదలగు ననేకరూప ముల బొందుచున్నది. ఇదియెట్లు సాధ్యము? [ఈ భేదము వర్ణమునుబట్టి గలుగుట లేదు. ఉచ్చరించువారి తాల్వాది ఉపాధిభేదమునుబట్టి కలుగుచున్నది.]

అ॥ ఇట్లు పవర్షుని అభిప్రాయము ననుసరించి పూర్వ పక్షసమాధానము చెప్పబడినది. ఇక భాష్యకారులు స్వాభి ప్రాయము ననుసరించి సమాధానము చెప్పుచున్నారు.

సిద్ధాంతి : లేక యీ జ్ఞానభేదము ధ్వనివలన సంభవించు చున్నది. కాని వర్ణమువలన సంభవించుట లేదు. ధ్వని యన నేమి?

భాష్యకార మతము

దూరమునున్నవాని చెవునకు వినబడుచున్నను, వర్ణములను స్పష్టముగ బ్రత్యేకింప నశక్యమై, దగ్గరనున్నవానికి గటువు మృదువు మొదలగు భేదము వర్ణములయందు దెలియుచున్నదో యది ధ్వని. ఉదా త్తాదిభేదములు ధ్వనిననుసరించి సంభవించునుగాని వర్ణస్వరూ

చ్చారణం ప్రత్యభిజ్ఞాయమానత్వాత్. ఏవం చ సతి సాలంబనా ఏవైత ఉదాత్తాదిప్రత్యయా భవిష్యంతి. ఇతరథా హి వర్ణానాం ప్రత్యభిజ్ఞాయమానానాం నిర్భేదత్వాత్సంయోగవిభాగకృతా ఉదాత్తాదిభేదాః కల్పేరన్. సంయోగవిభాగానాం చాప్రత్యక్షత్వాన్న తదాశ్రయా విశేషాః వర్ణేష్వధ్యవసితుం శక్యంత ఇత్యతో నిరాలంబనా ఏవైత ఉదాత్తాది ప్రత్యయాస్స్యుః. అపి చ నైవైతదభినివేష్టవ్యముదాత్తాదిభేదేన వర్ణానాం ప్రత్యభిజ్ఞాయమానానాం భేదో భవేదితి. న హ్యన్యస్య భేదేనాన్యస్యాభిద్యమానస్య

---

పము ననుసరించి సంభవింపదు. ఉచ్చరించినపుడెల్ల వర్ణములు గుర్తింపబడుచున్నవి. ఇట్లగుటచే నుదాత్తాది భేదజ్ఞానము ధ్వని నాలంబనము చేసుకొనియున్నది. [ప్రత్యుచ్చారణము నందు నొకేయక్షరము తెలియుచున్నది. గాని యొకే ధ్వని వినబడుటలేదు. ఒక యక్షరమే యొకపుడుదాత్తముగాను, మఱియొకపు డనుదాత్తముగాను మొదలగు భేదములతో నుచ్చరింపబడుచున్నది. జపించునపుడు వర్ణము లవ్యక్తము లగుచున్నవి.] ఇట్లు కానిచో, వర్ణములను గుర్తించుటయందేమియు భేదము లేకపోవుచుండగా, వాయువుయొక్క సంయోగవియోగ భేదముచే నుదాత్తానుదాత్తాది భేదము కలుగుచున్నట్లొక కల్పన చేయవలసివచ్చును. సంయోగ వియోగము లప్రత్యక్షములు. [అనగా నవి శ్రవణవిషయములు గావు.] ఉదాత్తాది భేదములచే గుర్తింపబడు వర్ణములయందు భేదము గల్గుచున్నదన వీలులేదు. ఒకదాని

ఉదాత్తాది భేదమునకు ధ్వని కారణము

భేదో భవితుమర్హతి. న హి వ్యక్తిభేదేన జాతిం భిన్నాం మన్యంతే. వర్ణేభ్యశ్చార్థ ప్రతీతేస్సంభవాత్స్ఫోటకల్పనానర్థికా.

పూ.పక్షి: న కల్పయామ్యహం స్ఫోటం. ప్రత్యక్షమేవ త్వేనమవగచ్ఛామి, ఏకైకవర్ణగ్రహణాహితసంస్కారాయాం బుద్ధౌ ఝటితి ప్రత్యవభాసనాదితి చేత్.

సిద్ధాంతీ: న, అస్యా అపి బుద్ధేర్వర్ణవిషయత్వాత్, ఏకైకవర్ణగ్రహణోత్తరకాలాహీయమేకా బుద్ధిర్గారితి సమస్తవర్ణ

---

యందు గలభేదము భేదములేని మఱియొకదానియందు భేదమును గల్పింపలేదు. గోవు లనేకము లగుటచే గోజాతి భిన్నమన వీలులేదు. వర్ణములవలననే అర్థజ్ఞానము గలుగుచుండ స్ఫోటమనుదానిని గల్పించుట యనర్థకము.

పూ. పక్షి : మేము లేనిస్ఫోటమును గ్రొత్తగా గల్పించుటలేదు. అది యున్నట్లు ప్రత్యక్షముగ దెలియుచున్నది. ఒక్కొక్క వర్ణమును బ్రత్యేకముగ గ్రహించినపుడు దానిసంస్కారము బుద్ధియందవభాసించుచున్నది.

సిద్ధాంతి: మీరనునది సరికాదు. బుద్ధి వర్ణములను మాత్రమే గ్రహించుచున్నది. ఒక్కొక్కవర్ణమును గ్రహించిన తరువాత కలుగుచున్నజ్ఞానము వర్ణములన్నియు కలిసిన యొక్క శబ్దజ్ఞానమగుచున్నదిగాని మఱియొకదాని జ్ఞానమగుటలేదు. ఇది యెట్లు దెలియుచున్నదనిన, వర్ణము లన్నియు

స్ఫోటప్రత్యక్షముగ తెలియుటలేదు

విషయా నార్థాంతరవిషయా. కథమేతదవగమ్యతే? యతోఽస్యామపి బుద్ధౌ గకారాదయో వర్ణా అనువర్తంతే న తు దకారాదయః, యది హ్యస్యా బుద్ధేర్గకారాదిభ్యోఽర్థాంతరం స్ఫోటో విషయస్స్యాత్ తదా దకారాదయ ఇవ గకారాదయోఽప్యస్యా బుద్ధేర్వ్యావర్తేరన్, న తు తథాస్తి, తస్మాదియమేకబుద్ధిర్వర్ణ విషయైవ స్మృతిః.

మాధ్యమికః: నన్వనేకత్వాద్వర్ణానాం నైకబుద్ధివిషయతోపపద్యత ఇత్యుక్తం.

సిద్ధాంతీ: తత్ప్రతిబ్రూమః—సంభవత్యనేకస్యాప్యేకబుద్ధి

---

గలసిన గోవు అను శబ్దముయొక్క జ్ఞానము గలిగినతరువాత గూడ నందలి గో, వు, అను వర్ణజ్ఞానమే గల్గుచున్నదిగాని యితరవర్ణముల జ్ఞానము కలుగుటలేదు. [శబ్దము విననపుడే యర్థము భానమగునో యదియే ప్రమాణము. గోవు అనునేకపదమును వినినపు డందలి వర్ణములుమాత్రము స్ఫురించుచున్నవిగాని స్ఫోటము స్ఫురించుట లేదు.] శబ్దము విననపుడు వర్ణములకంటె భిన్నమగు స్ఫోట జ్ఞానమే కలుగునెడ నితర వర్ణములవలెనే వినిన శబ్దమునందలి వర్ణములుగూడ గ్రహింపబడకపోవలెను. కాని యట్లు సంభవించుటలేదు. కనుక ప్రబలముగా వినిన వర్ణములయొక్క స్మృతియే చివరకు శబ్దముయొక్క యేక విషయజ్ఞాన మగుచున్నది. వర్ణములనేకములగుటచే నేకబుద్ధివిషయము గానేరవను ప్రతివాది యాక్షేపణకిట్లు సమాధానము చెప్పుచున్నాము. వర్ణములనేకములయినను నేకబుద్ధివిషయములు కాగలవు.

విషయత్వం పఙ్క్తిర్వనం సేనా దశ శతం సహస్రమిత్యాది దర్శనాత్. యా తు గౌరిత్యేకోఽయం శబ్ద ఇతి బుద్ధిః సా బహుష్వేవ వర్ణేష్వేకార్థావచ్ఛేదనిబంధనోపచారికీ వనసేనాదిబుద్ధివదేవ.

పూ.పక్షీ: అత్రాహ—యది వర్ణా ఏవ సామస్త్యేనైకబుద్ధి విషయతామాపద్యమానాః పదం స్యుః. తతో రాజా జారా కపిః పిక ఇత్యాదిషు పదవిశేషప్రతిపత్తిర్నస్యాత్, త ఏవ హి వర్ణా ఇతరత్రేతరత్ర చ ప్రత్యవభాసంత ఇతి.

---

పంక్తి, వనము, సేన, దశ, శత, సహస్రము యీ మొదలగు పదము లనేకవిషయము లగుచున్నను అనేక బుద్ధివిషయములుగ కాన్పించుచున్నవి. [సేన యందనేకభటులున్నను సేనయను సమూహపరమగు నొకబుద్ధి గల్గుచున్నది.] గోవు అనునది యొకేశబ్దమను బుద్ధి కలుగుచున్నది. దానియందనేకవర్ణములున్నను, [ప్రతివర్ణజ్ఞానము కలిగినను] వివిధవర్ణములు గలసి వనము సేన యను పదములవలె నొకే శబ్దజ్ఞానమును గౌణముగ కలుగజేయుచున్నది.

అనేక వర్ణములు క్రమబద్ధములై, ఏకబుద్ధివిషయమగుచున్నది.

పూ.పక్షి. వివిధవర్ణములయొక్క సమూహమే యేకబుద్ధి విషయమై పదమైనచో, జరా, రాజా, కపి, పిక మొదలగు విభిన్నపదముల జ్ఞానము కలుగకబోవును. ఈజంటపదములలో నొకేవర్ణములు బుద్ధికి భాసించుచున్నవని యందును.

సిద్ధాంతీ: అత్ర వదామః—సత్యపి సమస్తవర్ణప్రత్యవమర్శే యథాక్రమానురోధిన్య ఏవ పిపీలికాః పఙ్క్తిబుద్ధిమారోహంతి ఏవం క్రమానురోధిన ఏవ వర్ణాః పదబుద్ధిమారోక్ష్యంతి. తత్ర వర్ణానామవిశేషేఽపి క్రమవిశేషకృతా పదవిశేషప్రతిపత్తిర్న విరుధ్యతే. వృద్ధవ్యవహారే చేమే వర్ణాః క్రమాద్యనుగృహీతా గృహీతార్థవిశేషసంబంధాస్సంతః స్వవ్యవహారేఽప్యేకైకవర్ణ గ్రహణానంతరం సమస్త ప్రత్యవమర్శిన్యాం బుద్ధౌ తాదృశా ఏవ ప్రత్యవభాసమానాస్తం తమర్థమవ్యభిచారేణ ప్రత్యాయయిష్యం

---

సిద్ధాంతి. ఇచట నిట్లనుచున్నాము. వర్ణముయొక్క సమూహము చేతనే పదము తెలియవచ్చుచున్నను, పిపీలికలొక్క దానివెంట నొకటి బోవుచున్నపుడుమాత్రమే పఙ్క్తియను జ్ఞానమేర్పడుచున్నట్లు వర్ణములు క్రమము ననుసరించి యొక దానివెంట నొకటి వినబడినపుడే పదమనుబుద్ధిని గలుగజేయు చున్నది. ఈ జంటపదములయందు వినబడుచున్న వర్ణము లొకటియయినను, వాని క్రమభేదమునుబట్టి పదభేదము గలుగుచున్నదనుట యుక్తివిరుద్ధము కాదు.

ఒకశబ్దములోని వర్ణము లొకక్రమము చేతను సంఖ్య చేతను నిబద్ధములై యట్టిసంబంధము చే నొక యర్థవిశేషము గలవై బుద్ధియందు నొక్కొక వర్ణమును తరువాత వాని సముదాయార్థమును భాసింపజేయుచూ నియమముగ నా యర్థము నే దెలియజేయుచున్నవి. వైయాకరణుల స్ఫోట కారణముకంటె నీకల్పనము సులభతరము. స్ఫోటవాదము

త్రీతి వర్ణవాదినో లఘీయసీ కల్పనా. స్ఫోటవాదినస్తు దృష్టహానిర దృష్టకల్పనా చ. వర్ణాశ్చేమే క్రమేణ గృహ్యమాణాస్స్ఫోటం వ్యంజయంతి,సస్ఫోటోఽర్థం వ్యనక్తీతి గరీయసీ కల్పనా స్యాత్.

అథాపి నామ ప్రత్యుచ్చారణమన్యేఽన్యే వర్ణాః స్యుః తథాపి ప్రత్యభిజ్ఞాలంబనభావేన వర్ణసామాన్యానామవశ్యాభ్యుపగమ్యత్వాత్ యా వర్ణేష్వర్థప్రతిపాదనప్రక్రియా రచితా సా సామాన్యేషు సంచారయితవ్యా, తతశ్చ నిత్యేభ్యశ్శబ్దేభ్యో దేవాది వ్యక్తీనాం ప్రభవ ఇత్యవిరుద్ధమ్.

---

నందు ప్రత్యక్షముగ గాన్పించుచున్నదానిని నిరాకరించుచున్నారు. కాన్పింపనిదానిని గల్పించుచున్నారు. ఒక క్రమముచే గ్రహింపబడు వర్ణములు స్ఫోటము నభివ్యక్తముచేయునని యు నాస్ఫోట మర్థము నభివ్యక్తము చేయునను కల్పన బరువగుచున్నది.

ఒకవేళ ఉచ్చరించినప్పుడెల్లను దెలియబడు వర్ణములు విభిన్నము లగుగాక! అయినను. ప్రత్యేకవర్ణముల ప్రత్యభిజ్ఞకొఱకు వర్ణజాతుల నంగీకరింపవలసివచ్చును. వర్ణములే యర్థమును బ్రతిపాదించునని మేము చెప్పిన విధానము జాతియందు జెప్పవలసివచ్చును. అందువలన శబ్దములు నిత్యములు, వానివలన దేవాదివ్యక్తు లుత్పన్నము లగుట విరుద్ధము కాదు.

## అత ఏవ చ నిత్యత్వమ్ (సూ 29.)

కర్తురస్మరణాదితి స్థితే వేదస్య నిత్యత్వే దేవాదివ్యక్తి ప్రభవాభ్యుపగమేన తస్య విరోధమాశంక్య 'అతః ప్రభవా'దితి పరిహృత్యేదానీం తదేవ వేదస్య నిత్యత్వం స్థితం ద్రఢయతి— అత ఏవ చ నిత్యత్వమితి. అత ఏవ చ నియతాకృతేర్దేవాదేర్జగతో వేదశబ్దప్రభవత్వాద్వేదశబ్దనిత్యత్వమపి ప్రత్యేతవ్యం. తథా చ

---

అ॥ అతః ఏవ = దేవతాది ప్రపంచమునకు గారణమగుటవలననే నిత్యత్వం = వేదమునకు నిత్యత్వము సిద్ధమగుచున్నది.

[పూర్వ మీమాంసా శాస్త్రమునందు] కర్త యనువాడొకడు వినబడకుండుట మొదలగు కారణముల చేత వేదములు నిత్యములని సిద్ధముచేయబడినవి. వానివలన దేవాదు లుత్పన్నము లయినట్లు బూర్వసూత్రమున నిశ్చయింపబడినది. కాని పూర్వ మీమాంసా శాస్త్ర సిద్ధాంతమునకు విరుద్ధముగ, దేవాదిప్రభవత్వమును దెలియజేయు శబ్దములుగూడ నుత్పన్నములు కాగూడదాయని శంకించుకొని పూర్వసూత్రమునందలి అతః ప్రభవాత్ = వేదమువలన బుట్టుటచేత నను పదములచే నా యా శంకను నివారించిరి. ఈసూత్రమునం దా వేద

వేదములు నిత్యము

నిత్యత్వము నే, "అందువలననే వేదములు నిత్యములు" అని దృఢముచేయుచున్నారు. దేవతలు మొదలగు నిత్యములగు జాతులతోగూడిన జగత్తు వేదములనుంచి బుట్టుచుండుటచే

మంత్రవర్ణః—'యజ్ఞేన వాచః పదవీయమాయంస్తామన్వవిందన్నృషిషు ప్రవిష్టా' (ఋ. సం 10-713). మితి స్థితామేవ వాచమనువిన్నాం దర్శయతి. వేదవ్యాసశ్చైవమేవ స్మరతి—'యుగాంతేఽంతర్హితాన్వేదాన్సేతిహాసాన్మహర్షయః, లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాస్స్వయంభువే"తి.

---

వేదశబ్దమునకు నిత్యత్వమును గూడ నంగీకరింపవలయును. [జగత్తు అనిత్యవస్తువునుండి కలుగనేరదు. అనిత్యవస్తువు మఱియొక వస్తువునుండి కలుగవలసియున్నది. కనుక జగత్కారణమగు వేదము నిత్యముకావలయును.] "పూర్వ సుకృతముచేత వాక్కుయొక్క స్థానము ననుసరించినవారలై ఋషులందున్నట్లు కనుగొనిరి" యను మంత్రముగూడ పూర్వముపలబ్ధమైన వేదముచే కనిపెట్టినట్లు పల్కుచున్నది. ఇట్లు శబ్దము నిత్యమని చూపుచున్నది. మహర్షులు ముందుగా స్వయంభువుచే ననుజ్ఞాతులై పూర్వయుగాంతమున నంతర్హితములైన వేదములో నితిహాసాదులతోఁగూడ దపస్సుచే బొందిరి" యని వేదవ్యాసుఁడు పలికెను. [ఈమంత్రమునుబట్టి యవాంతరప్రళయమునందుగూడ వేదములు నిత్యములని తెలియుచున్నది.] 29

అ॥ అవాంతరప్రళయమునందు జాతిగూడ ప్రళయము నొందుటవలన శబ్దమునకును అర్థమునకును నిత్యసంబంధము సంభవముగాదను శంక నుత్తరసూత్రము నివారించుచున్నది.

# సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ (సూ 30.)

పూ.పక్షీ: అథాపి స్యాత్, యదిపశ్వాదివ్యక్తివద్దేవాదివ్యక్తయోఽపి సంతత్యైవోత్పద్యేరన్నిరుధ్యేరంశ్చ తతోఽభిధానాభిధేయాభిధాతృ వ్యవహారావిచ్ఛేదాత్ సంబంధనిత్యత్వేన విరోధశ్శబ్దే పరి

---

సమస్తకల్పములయందును ఇంద్రాదిదేవత లందఱికిని సమాన నామ రూపత్వాత్ ఒకటే నామము రూపము లుండుటవలన, ఆవృత్తౌ అపి = నూతనసృష్టియం దింద్రాది దేవతాపరంపర నంగీకరించినను అవిరోధః = వేద మింద్రాది దేవతలనుగూర్చి చెప్పుటయందు విరోధమేమియు లేదు. దర్శనాత్ = శ్రుతివలనను, స్మృతేః చ = స్మృతివలననుగూడ నట్లు గాన్పించుటచేత.

పూ.పక్షి. అయిన నిట్లు జెప్పదగును. అవాంతరప్రళయమునందు పశువ్యక్తులవలె దేవాదివ్యక్తులుగూడ పరంపరగా బుట్టుచు చచ్చుచునుండినచో [నవాంతరప్రళయమున జాతి నష్టముగాక] వ్యక్తులు, పేర్లుపెట్టువారు మొదలగు లోకవ్యవహార మవిచ్ఛిన్నముగ సాగుచుండును. అపుడు వానికిగల సంబంధముగూడ నిత్యముగనుండును. కనుక 27వ సూత్రమున నుదాహరింపబడిన శబ్ద విషయమగు విరోధము పరిహరింపబడును. ఎప్పుడైతే మహాప్రళయమునందు త్రిలోకములుగూడ నామరూపములుపోయి సంపూర్ణముగ లయమునుజెంది తిరిగి క్రొత్తగా

మహాప్రళయము తరువాతగూడ సమాననామ రూపములు కాన్పించుచున్నవి.

హ్రియతే. యదా తు ఖలు సకలం త్రైలోక్యం పరిత్యక్తనామ రూపం నిర్లేపం ప్రలీయతే ప్రభవతి చాభినవమితి శ్రుతిస్మృతి వాదా వదంతి తదాకథమవిరోధ ఇతి.

సిద్ధాంతీ: తత్రేదమభిధీయతే-సమాననామరూపత్వాదితి. తదాపి

---

నామమునకును బుట్టుచున్నవియని శ్రుతిస్మృతులు పలుకు చున్నవో యపుడు విరోధమెట్లు పరిహరింపబడును. నామ ముగల దానికి నవాంతర ప్రలయమునందు విచ్ఛేదములేదు గనుక వానిసంబంధనిత్యత్వమునకు భంగములేదు. అదేతీరున అధ్యాపకుడు, అధ్యేత- వీరలకు విచ్ఛేదములేనపుడు వేదము యొక్క- నిత్యత్వమునకు భంగము లేదు. మహాప్రలయమునందు జగత్తు అత్యంతములేకపోవుచున్నది. అపూర్వముగ మఱియొ కటి బుట్టుచున్నది. అపుడభిధానము అభిధేయముగూడ సంపూ ర్ణముగ నుచ్ఛిన్నములగుచున్నవి. ఆశ్రయములేని సంబం ధముగూడ విచ్ఛిన్నమగును. అధ్యాపకుడు, అధ్యేత- వీరి పరంపరకుగూడ విచ్ఛేదము గలుగుచుండ వేదముగూడ నిరాశ్రయమై విచ్ఛిన్నమగును. అకాలమున బ్రహ్మ శుద్ధ స్వభావుడగుటంజేసి పూర్వవాసన లుండనేరవు. పూర్వ వాసనలన్నియు నంతఃకరణాద్యుపాధికల్పితములు, అంతః కరణవిచ్ఛేదము కలిగినపు డావాసనలుగూడ నిరాశ్రయము లగుచున్నవి].

సిద్ధాంతి : ఇందుకిట్లు సమాధానము చెప్పుచున్నాము. నామరూపములు సమానముగా నుండుటవలన. అపుడుగూడ అభిధానాభిధేయముల కనగా, నామమునకును సంసార

సంసారస్యానాదిత్వం తావదభ్యుపగంతవ్యం. ప్రతిపాదయిష్యతి చాచార్యః సంసారస్యానాదిత్వమ్, ఉపపద్యతే చాప్యుపలభ్యతే చేతి. (సూ 2-1-36) అనాదౌ చ సంసారే యథా స్వాపప్రబోధయోః ప్రళయప్రభవశ్రవణేఽపి పూర్వప్రబోధవదుత్తరప్రబోధేఽపి వ్యవహారాన్న కశ్చిద్విరోధః. ఏవం కల్పాంతరప్రభవప్రలయయోరపీతి ద్రష్టవ్యమ్. స్వాపప్రబోధయోశ్చ ప్రళయప్రభవౌ శ్రూయేతే—'యదా సుప్తస్స్వప్నం న కంచన పశ్యత్యథాస్మి

---

మనాదియని యంగీకరింపవలెను. ముందు రాబోవు 2-1-36 సూత్రమునందు సంసారముయొక్క యనాదిత్వమును సూత్రకారులు వివరింపబోవుచున్నారు. [కనుక] నాది సృష్టియందు నామరూపాది సంకేత మెవరోయొకరు చేయవలెను గదా యనుశంక కవకాశములేదు]. సుషుప్తియందు ప్రలయము జాగ్రదవస్థయందు పూర్వమువలెనే తిరిగి జ్ఞానము కలుగుచున్నట్లు శ్రుతియందు వినబడుచున్నది. అదేవిధముగ సంసార మనాదియగుటంజేసి కల్పాంతర ప్రలయమునందు సర్వము లయమగుటయు తిరిగి సృష్టియందు ప్రబోధము కలిగి వ్యవహారము సంభవించుటయందు విరోధమేమియు లేదని తెలియనగును. "మనుజుడు సుషుప్తియందు స్వప్నమును గాంచడు. ప్రాణముతో నేకీభావమును బొందుచున్నాడు. అపుడు సమస్త నామములలో వాక్కుతనిని జేరును. సమస్తరూపములతో చక్షుస్సతనిని జేరును. సమస్త శబ్దములతో శ్రోత్రమతనిని జేరును. సర్వభావములతో మనస్సతనిని జేరును. ఆతడు నిద్రలేచినపుడు జ్వలించుచున్న,

ప్రాణ ఏవైకధా భవతి తదైనం వాక్సర్వైర్నామభిస్సహాప్యేతి, చక్షుస్సర్వైః రూపైస్సహాప్యేతి, శ్రోత్రం సర్వైశ్శబ్దైస్సహాప్యేతి, మనస్సర్వైర్ధ్యానైస్సహాప్యేతి, స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేర్జ్వలతస్సర్వా దిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్నేవమేవైతస్మాదాత్మనస్సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకా' (కా. 3-3) ఇతి.

పూ.పక్షీ: స్యాదేతత్, స్వాపే పురుషాంతరవ్యవహారావిచ్ఛేదాత్స్వయం చ సుప్తప్రబుద్ధస్య పూర్వప్రబోధవ్యవహారానుసంధానసంభవాదవిరుద్ధమ్. మహాప్రళయే తు సర్వవ్యవహారో

---

యగ్నినుండి యన్నిదిక్కులకు విస్ఫులింగములు బయలుదేరినట్లు ఆత్మనుండి ప్రాణములు బయలుదేరి దేనిస్థానమున కది చేరును. ప్రాణమునుండి దేవతలు, దేవతలనుండి లోకములు బయలుదేరును" అని కౌషీతకీశ్రుతి సుషుప్తి జాగరితముల యందు ప్రళయప్రబోధముల కలుగుచున్నట్లు తెలియచేయుచున్నది. [కౌషి 3-3]

పూ. పక్షి. శ్రుతి అట్లు జెప్పుగాక! ఒకపురుషుడు నిద్రించుచున్నను, ఇతరపురుషుల వ్యవహార మవిచ్ఛిన్నముగ జరుగుచున్నది. నిద్రనుండి లేచినతరువాత తన పూర్వవ్యవహారము ననుసంధానము చేసికొనవచ్చును. కనుకవిరోధమేమియు లేదు, [అనగా] నితరులు జాగరికమునం దుండుటచే వ్యవహారమునకు ప్రళయమునందువలె నత్యంతలోపము లేదుగనుక నిద్రలేచినవాడు పూర్వవ్యవహారమును దిరిగి [గ్రహింపగలడు.] మహాప్రళయమందన్ననో సర్వవ్యవహారోచ్ఛేదము గలుగు

చ్ఛేదాజ్జన్మాంతరవ్యవహారవచ్చ కల్పాంతరవ్యవహారస్యానుసంధాతుమశక్యత్వాద్వైషమ్యమితి.

సిద్ధాంతీ: నైష దోషః, సత్యపి సర్వవ్యవహారోచ్ఛేదిని మహాప్రళయే పరమేశ్వరానుగ్రహాదీశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం కల్పాంతరవ్యవహారానుసంధానోపపత్తేః. యద్యపి ప్రాకృతాః ప్రాణినో న జన్మాంతరవ్యవహారమనుసందధానా దృశ్యంత ఇతి, తథాపి స తత్ప్రాకృతవదీశ్వరాణాం భవితవ్యమ్. యథాహి ప్రాణిత్వావిశేషేఽపి మనుష్యాది స్తంబపర్యంతేషు జ్ఞానైశ్వర్యాది ప్రతిబంధః పరేణ పరేణ భూయాన్భవన్దృశ్యతే. తథా

---

చుండుటవలన జన్మాంతరవ్యవహారమువలె గల్పాంతరవ్యవహారము ననుసంధానము చేయుటకు శక్యము కాదు, గనుక స్వాపప్రబోధములకును గల్పాంతర లయప్రభావములకును వైషమ్యము గలదు.

సిద్ధాంతి: ఇదియొక దోషముకాదు. మహాప్రలయము నందు సర్వవ్యవహారోచ్ఛేదము సంభవించుచున్నను బరమేశ్వరానుగ్రహముచేత హిరణ్యగర్భాదులకుబూర్వవ్యవహారానుసంధానము సంభవమగుచున్నది. ప్రాకృతులగు మనుజులు

ఉత్తరసృష్టి పూర్వసృష్టి ననుసరించుట

పూర్వజన్మవ్యవహారము ననుసంధానము చేసి కొనలేకుందురు గాక! కాని యీశ్వరాదులు ప్రాకృతజనులవంటివారు కారు. ప్రాణి మందరికిని సమానమే. అయినను మనుష్యుడు మొదలు గడ్డిపోచవరకుగల ప్రాణికోటియందు జ్ఞానైశ్వర్యము క్రిందినుండి పైకి యొకటియందుకంటె మఱియొకరియం దెక్కువగ

మనుష్యాదిష్వేవ హిరణ్యగర్భపర్యంతేషు జ్ఞానైశ్వర్యాద్యభివ్యక్తి రపి పరేణ పరేణ భూయసీ భవతీత్యేతచ్ఛ్రుతిస్మృతి వాదేష్వ సకృదేవానుకల్పాదౌ ప్రాదుర్భవతాం పారమైశ్వర్యం శ్రూయ మాణం న శక్యం నాస్తీతి వదితుమ్. తతశ్చాతీతకల్పానుష్ఠిత ప్రకృష్టజ్ఞానకర్మణామీశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం వర్తమాన కల్పాదౌ ప్రాదుర్భవతాం పరమేశ్వరానుగృహీతానాం సుప్తప్రతి బుద్ధవత్కల్పాంతరవ్యవహారానుసంధానోపపత్తిః. తథా చ శ్రుతిః—'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై. తం హ దేవమాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై

---

నభివ్యక్తమగుచున్నది. అదేవిధముగ మనుజుడు మొదలు హిరణ్యగర్భునివరకు జ్ఞానైశ్వర్యము లొకరికంటె మఱియొక రియం దెక్కుడుగ గలుగుచున్నట్లు శ్రుతిస్మృతులు దఱుచుగ దెలియజేయుచున్నవి. ఈవిషయము నెదురుజెప్పుటకు శక్యము కాదు. పూర్వకల్పమునందు ప్రకృష్టమగు జ్ఞానకర్మానుష్ఠాన పరులగు హిరణ్యగర్భాదులు తిరిగి యీకల్పనమునం దుత్ప న్నులగుచుండ పరమేశ్వరానుగ్రహముచే నిద్రబోయి లేచిన వానికివలె బూర్వకల్ప వ్యవహారానుసంధానము సంభవ మగును, "ఎవడు మొదట బ్రహ్మను సృజియించి యాత నికి వేదముల నప్పగించెనో మహావాక్యములచే జనించిన జ్ఞానముచే ప్రకాశించునట్టియు స్వస్వరూపు డగునట్టియు అభయస్వరూపు డైనట్టియు వానిశ్రేయ స్వరూపమును ముముక్షువగు నేను శరణమును బొందుచున్నాను". [శ్వేత

శరణమహం ప్రపద్యే’(శ్వే 6-18)ఇతి. స్మరంతి చ శౌనకాదయః— “మధుచ్ఛందఃప్రభృతిభిఃఋషిభిర్దాశతయ్యో దృష్టా” ఇతి. ప్రతి వేదం చైవమేవ కాండర్ష్యాదయస్మర్యంతే శ్రుతిరప్యృషిజ్ఞాన పూర్వకమేవ మంత్రేణానుష్ఠానం దర్శయతి—‘యో హవా అవిది తార్షేయచ్ఛందో దైవతబ్రాహ్మణేన మంత్రేణ యాజయతి వాధ్యాపయతి వా స్థాణుం చర్ఛతి గర్తం వా ప్రపద్యత’ ఇత్యు పక్రమస్య ‘తస్మాదేతాని మంత్రేమంత్రే విద్యా’దితి. ప్రాణినాం చ సుఖప్రాప్తయే ధర్మో విధీయతే, దుఃఖపరిహారాయ చాధర్మః ప్రతిషిధ్యతే. దృష్టానుశ్రవికసుఖదుఃఖవిషయౌ చ రాగద్వేషౌ

---

6–18] అని శ్రుతి పలుకుచున్నది. మధుచ్ఛందుడు మొదలగు ఋషులు దశమండలములుగల ఋగ్వేదమును గ్రహించిరని శౌనకాదిఋషులు చెప్పిరి. ఈవిధముగనే కాండర్షులు మొద లగువారు తమతమ వేదముల గ్రహించినట్లు తెలియుచున్నది. “ఋషి, ఛందస్సు, దేవబ్రాహ్మణము తెలియక మంత్రముచే యజనము చేయించినను, అధ్యాపనను చేయించినను, నరక కూపమున బడును” అని యుపక్రమించి “అందువలన ప్రతి మంత్రమునకు వీనినన్నిటిని దెలిసికొనవలయు”నను శ్రుతి వాక్యమువలన ఋష్యాదులను దెలిసికొనియే మంత్రాను ష్ఠానమును జేయవలయునని కాన్పించుచున్నది. సుఖప్రాప్తి కొఱకు ప్రాణికోటికి ధర్మము విధింపబడినది. దుఃఖమును దొలగించుటకై యధర్మము నిషేధింపబడినది. అనుభవము వలనగాని శ్రుతివలనగాని తెలియవచ్చుచున్న సుఖదుఃఖ ములే రాగద్వేషవిషయము లగుచున్నవి. తదితరములు

భవతో న విలక్షణవిషయావిత్యతో ధర్మాధర్మఫలభూతోత్తరో త్తరా సృష్టిర్నిష్పద్యమానా పూర్వసృష్టిసదృశ్యేవ నిష్పద్యతే. స్మృతిశ్చ భవతి—"తేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్ట్యాం ప్రతిపేదిరే, తాన్యేవ తే ప్రపద్యంతే సృజ్యమానాః పునఃపునః. హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే, తద్భావితాః ప్రపద్యంతే తస్మాత్తత్తస్య రోచత" ఇతి. ప్రలీయమానమపి చేదం జగచ్ఛక్త్యవశేషమేవ ప్రలీయతే శక్తిమూల

---

వానివిషయములు కావు. కనుక ధర్మాధర్మములకు ఫలభూతమగు నుత్తరసృష్టి పూర్వసృష్టి సదృశమే యగును. ప్రాణిజాతము పూర్వసృష్టియందే యేకర్మల నాచరించెనో పలుమరు సృష్టింపబడినవారే యాయాకర్మఫలముల నే పొందుదురు. [వానిఫలము ననుభవించెదరు] అపాయకరములు నిరపాయములు. మృదులములు, క్రూరములు, ధర్మములు, అధర్మములు, సత్యములు, అనృతములు నగు నీకర్మల సంస్కారములచే సంభావితమై ప్రాణిజాతమంతయు ప్రవర్తించుచున్నది. కనుక నాయాకర్మలాయాప్రాణులకు రుచించును" అని స్మృతి పలుకుచున్నది. ఈజగత్తు లయము బొందుచున్నను దాని శక్తిమాత్రము మిగిలియేయున్నది. అట్టి

జగన్నిర్మాణశక్తి లయము కాదు

శక్తి నాధారము చేసికొనియే తిరి యుత్పన్నమగుచున్నది. అట్టి శక్తియె లేనిచో హఠాత్తుగ జగత్తుత్పన్నము కానేరదు. ఇట్టి శక్తులనేకము లున్నవి యని కల్పింప శక్యముకాదు. భూరాది లోకసంతతులు, దేవపశుమనుష్యాది ప్రాణిజాతము, వర్ణ

మేవ చ ప్రభవతీతరథా ఆకస్మికత్వప్రసంగాత్. న చానేకాకారాః శక్తయశ్శక్యాః కల్పయితుమ్. తతశ్చ విచ్ఛిద్యవిచ్ఛిద్యాప్యుద్భవతాం భూరాదిలోకప్రవాహాణాం – దేవతిర్యఙ్మనుష్యలక్షణానాం చ ప్రాణినికాయప్రవాహాణాం వర్ణాశ్రమధర్మఫలవ్యవస్థానాం చానాదౌ సంసారే నియతత్వమింద్రియవిషయసంబంధనియతత్వవత్ప్రత్యేతవ్యమ్. న హీంద్రియవిషయసంబంధాదేర్వ్యవహారస్య ప్రతిసర్గమన్యథాత్వం షష్ఠేంద్రియవిషయకల్పం శక్యముత్ప్రేక్షితుమ్. అతశ్చ సర్వకల్పానాం తుల్యవ్యవహారత్వాత్కల్పాంతరవ్యవహారానుసంధానక్షమత్వాచ్చేశ్వరాణాం సమాననామరూపా ఏవ ప్రతిసర్గం విశేషాః ప్రాదుర్భవంతి; సమాన

ములు, ఆశ్రమములు, వీని ధర్మములు, ఫలములు వానికిగల వ్యవస్థలు– ఇవిఅన్నియు విచ్ఛేదపరంపరను బొంది దిరిగి బుట్టుచున్నను, ననాదియగు సంసారమునందు ఇంద్రియములకు వానివాని విషయములకునవలె నియతమగు సంబంధము గలిగియున్నవి యని తెలియనగును. ఇంద్రియములకును వానివాని విషయములకును జలసంబంధము ప్రతిసృష్టియందును మారుచున్నవియనిగాని యారవయింద్రియ మొకటి దానికి మఱియొకవిషయము సంభవించుచున్నది యనిగాని తలంప శక్యముకాదు. అందువలన, నన్ని కల్పములయందును వ్యవహార మొకతీరుగానుండుటచేత నాయా కల్పములయందీశ్వరు డొకేవిధమగు వ్యవహారముగలవాడై ప్రతిసృష్టియందును సృష్టివిశేషములు సమానమగు నామరూపములు కలిగి యుత్పన్నములగుచున్నవి. సమాననామరూపముల గలిగి

నామరూపత్వాద్వావృత్తావపి మహాసర్గమహాప్రళయలక్షణాయాం జగతోఽభ్యుపగమ్యమానాయాం న కశ్చిచ్ఛబ్ద ప్రామాణ్యాది విరోధం. సమాననామరూపతాంచ శ్రుతిస్మృతీ దర్శయతః— 'సూర్యాచంద్రమసౌ ధాతాయథాపూర్వమకల్పయత్ దివం చ పృథివీం చాంతరిక్షమథో సువ' రితి. (ఋ. సం. 10-170-3) యథా పూర్వస్మిన్ కల్పే సూర్యాచంద్రమఃప్రభృతిజగత్క్లృప్తం తథాస్మిన్నపి కల్పే పరమేశ్వరోఽకల్పయదిత్యర్థః. తథా 'అగ్నిర్వా అకామయత అన్నాదో దేవానాగ్ స్యామితి స ఏతమగ్నయే కృత్తికాభ్యః పురోడాశమష్టాకపాలం నిరవప' దితి (తై. బ్రా.

---

యుండుటచేతనే పౌనఃపున్యముగ సంభవించుచున్న మహాసర్గ మహాప్రళయములకు జగత్తు లోనగుచుండ, శబ్దప్రామాణ్యమున కిసుమంతయు విరోధము లేదు. [పునఃపునః సృష్టమగు జగత్తు] సమాననామరూపముల కలిగియుండుటను శ్రుతి స్మృతులు చూపుచున్నవి. "బ్రహ్మ సూర్యుని, చంద్రుని, ద్యులోకమును, భూలోకమును, అంతరిక్షమును, స్వర్గలోకమును పూర్వమెట్లు సృజియించెనో" (ఋగ్వే. సం. 10, 190, 3) అని శ్రుతి వినబడుచున్నది. సూర్యచంద్రాదులు మొదలుగాగల జగత్తును పూర్వకల్పమునం దెట్లు సృజియించెనో, పరమేశ్వరు డీకల్పమునందుగూడ నటులనే సృజించెనని యర్థము. దేవతల యన్నమును దాను దినవలెనని కోరి యగ్ని దేవత యెనిమిది ప్రమిదెచిప్పలమీద పురోడాశము నగ్నికిని కృత్తికల నిచ్చెను" అను శ్రుతివాక్యము (తై. బ్రా

3-1-4-1) నక్షత్రేష్టివిధౌ యోఽగ్నిర్నిరవపద్యస్మై వాగ్నయే నిరవపత్తయోస్సమాననామరూపతాం దర్శయతీత్యేవంజాతీయకా శ్రుతిరిహోదాహర్తవ్యా. స్మృతి రపి —"ఋషీణాం నామ ధేయాని యాశ్చ వేదేషు దృష్టయః, శర్వర్యంతే ప్రసూతానాం తాన్యేవైభ్యోఽదదాత్యజః. యథర్తావృతులింగాని నానారూపాణి పర్యయే, దృశ్యంతే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు. యథాభిమానినోఽతీతాస్తుల్యాస్తే సాంప్రతైరిహ, దేవా దేవై రతీతైర్హి రూపైర్నామభిరేవ చే" త్యేవం జాతీయకా ద్రష్టవ్యా.

---

3-1-4-1) నక్షత్రేష్టివిధానమునందు వినబడుచున్నది. ఈ విధానమునందు హోమముచేసిన యగ్నియు నట్టిహోమము నుద్దేశించిన యగ్నియు సమాననామరూపములు గలిగియు న్నట్లు దెలియవచ్చుచున్నది. అటువంటి శ్రుతి యిచట నుదా హరింపదగును. ఈయర్థమును దెలియజేయు స్మృతులుగూడ ననేకములు గలవు = "ఋషుల కేయేనామములు గలవో, వేదములను గ్రహించగలయేయే శక్తులు గలవో, వానిని ప్రలయాంతమున తిరిగి జన్మించినపుడు బ్రహ్మము వారలకిచ్చు చున్నాడు. ఋతుచిహ్నములన్నియు సకాలములో సంభవిం చునట్టులనే ఆయా పదార్థములే ప్రతియుగారంభమునం దును బుట్టుచున్నవి. పూర్వసృష్టియందు యే యే చక్షురాద్య భిమానదేవతలుండిరో వారలు ప్రకృతసృష్టియందుగల అభి మానదేవతలతో సమానరూపములు గలవారగుచున్నారు.30

అ॥ దేవతలకు శరీరములుండుటవలన ఉత్పత్తిప్రల యములు, కర్మ, శబ్దము మొదలగువానినిగూర్చి చూపబడిన

## మధ్వాదిష్వసంభ వాదనధికారం జైమినిః (సూ 31)

పూ. పక్షః : ఇహ దేవాదీనామపి బ్రహ్మవిద్యాయామ_స్త్యధికార ఇతి యత్ప్రతిజ్ఞాతం తత్పర్యావ_ర్త్యతే. దేవాదీనామనధికారం జై_మినిరాచార్యో మన్యతే కస్మాత్ ? మధ్వాదిష్వసంభవాత్.

---

విరోధమునకు సమాధానము చెప్పబడినది. 'తదుపర్యపి' యను 26 వ సూత్రమునందు వారలకు విద్యాధికారము సిద్ధము చేయబడినది. ఈసిద్ధాంతమును జైమిన్యాచార్యు డాక్షేపించుచున్నాడు. అట్టియాక్షేపణసను రాబోవు సూత్రమున ప్రదర్శించుచున్నారు. ఈసూత్రమున తరువాతసూత్రమునను కేవలము పూర్వపక్షము మాత్రము ప్రదర్శింపబడుటచే నవి పూర్వపక్షసూత్రములని తలంపబడుచున్నవి.

మధు ఆదిషు – మధువిద్య మొదలగువానియందు అసంభవాత్ = దేవతల కధికార మసంభవమగుటవలన అనధికారం = బ్రహ్మవిద్యయందుగూడ వారికి అధికారము లేదని జైమనిః = జైమన్యాచార్యుడు తలంచుచున్నాడు.

పూ. పక్షి : దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారము గలదని 26 సూత్రమున చెప్పబడినదానిని ఆక్షేపించుచున్నారు. వారలకట్టి యధికారము లేదని జైమిన్యాచార్యుడు దలంచుచున్నాడు. ఏలనన ! మధువిద్య మొదలగువానియందు వారల కధికార మసంభవమగుట

దేవతాస్వరూపోపాసనయందు దేవతలకధికారము లేదు.

బ్రహ్మవిద్యాధికారాభ్యుపగమే హి విద్యాత్వావిశేషాన్మధ్వాది విద్యాస్వప్యధికారోఽభ్యుపగమ్యేత. న చైవం సంభవతి, కథమ్? 'అసౌ వా ఆదిత్యో దేవమధు' (ఛాం 3-1-1) ఇత్యత్ర మనుష్యా ఆదిత్యం మధ్వధ్యాసేనోపాసీరన్, దేవాదిషు హ్యుపాసకేష్వభ్యుపగమ్యమానేషు ఆదిత్యః కథమన్యమాదిత్యముపాసీత? పునశ్చాదిత్యవ్యపాశ్రయాణి పంచరోహితాదీన్యమృతాన్యుపక్రమ్య 'వసవో రుద్రా ఆదిత్యా మరుతస్సాధ్యాశ్చ పంచదేవగణాః క్రమేణ తత్తదమృతముపజీవంతీ' త్యుపదిశ్య 'స య ఏతదేవమమృతం వేద వసూనామేవైకో భూత్వాఽగ్నినైవ ముఖేనైతదేవామృతం దృష్ట్వా తృప్యతీ' త్యాదినా వస్వాద్యుపజీవ్యాన్యమృ

---

వలన. బ్రహ్మవిద్యయందు వారలకధికార మున్నట్లంగీకరించినచో మధువిద్యగూడ నొకవిద్య యగుటచే దానియందుగూడ వారల కధికార మంగీకరింపవలసివచ్చును. కాని మధువిద్యయందు వారి కధికార మసంభవము. ఎట్లన! "ఈ యాదిత్యుడు దేవతలకు మధువగుచున్నాడు" (చాం 3-1-1) అను వాక్యమునందు మనుజులు ఆదిత్యునియందు మధువు నధ్యాసముచేసి యుపాసించెదరు. దేవతలకుగూడ నిట్టి యుపాసనాధికారము నంగీకరించినచో నాదిత్యుడు మఱి యే యితరాదిత్యునిగూర్చి యుపాసింపగలడు? మఱియు సూర్యునియందున్న రోహితాదిపంచవిధములగు నమృతసంకీర్తనముతో నుపక్రమించి వసువులు రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, సాధ్యులు అను నైదు దేవగణములాయా పంచవిధామృతములమీద జీవించుచున్నటుల నుపదేశించి ఇట్లు దెలిసికొనినవాడు వసువులలో నొకడగుననియు. అగ్నిముఖ

తాని విజానతాం వస్వాదిమహిమప్రాప్తిం దర్శయతి. వస్వాదయస్తు కానన్యాన్వస్వాదీనమృతోపజీవినో విజానీయుః ? కం వాన్యం వస్వాదిమహిమానం ప్రాప్నుయుః ? తథా—'అగ్నిః పాదో వాయుః పాద ఆదిత్యః పాదో దిశః పాదో (ఛాం. 3-18-2) వాయుర్వావ సంవర్గ ఆదిత్యో బ్రహ్మేత్యాదేశ' (ఛాం, 3-11-1) ఇత్యాదిషు దేవతాత్మోపాసనేషు న తేషామేవ దేవతాత్మనామధికారస్సంభవతి. 'తథేమావేవ గౌతమభరద్వాజా వయం వై గౌతమో౽యమేవ భరద్వాజ' (ఛాం. 2-2-4) ఇత్యాదిష్వృషిసంబంధేషూపాసనేషు న తేషామేవర్షీణామధికారస్సంభవతి.

---

మున జూచి తృప్తిని చెందుననియు శ్రుతి పలుకుచున్నది. దీనివలన వస్వాదులు జీవించు నమృతము తెలిసికొనినవాడు వస్వాదుల మహిమను బొందునని శ్రుతి చూపుచున్నది. వస్వాదులు అమృతమునందు జీవించు మఱియే యితరవస్వాదులను దెలిసికొనగలరు? మఱియే యితరవస్వాదుల మహిమను బొందెదరు? అదేవిధముగ "అగ్ని యొకపాదము, వాయువొకపాదము, ఆదిత్యు డొకపాదము, దిక్కు లొకపాదము" (ఛా. 3–18–2) "వాయువు సంవర్గము" (ఛా. 04–3–1) "ఆదిత్యుడు బ్రహ్మము. ఇదియే యుపదేశము" (ఛాం. 8–19–1) ఈమొదలగు దేవతాస్వరూపోపాసనలయందు ఆదేవతలకే యధికారము సంభవింపదు. "ఈ ఋషులిద్దరు గౌతమభారద్వాజులు. కుడిప్రక్కన గౌతముడు; ఎడమ ప్రక్కన భారద్వాజుడు" ఈమొదలగు ఋషిసంబంధములగు నుపాసనలయందు ఆఋషులకే యధికారము సంభవముకాదు.

కుతశ్చ న దేవాదీనామనధికారః?

## జ్యోతిషి భావాచ్చ (సూ 32.)

యదిదం జ్యోతిర్మండలం ద్యుస్థానమహోరాత్రాభ్యాం బంభ్రిమజ్జగదవభాసయతి తస్మిన్నాదిత్యాదయో దేవతావచనాశ్శబ్దాః ప్రయుజ్యంతే లోకప్రసిద్ధేర్వాక్యశేషప్రసిద్ధేశ్చ. న చ జ్యోతిర్మండలస్య హృదయాదినా విగ్రహేణ చేతనతయాఽర్థిత్వాదినా చ యోగోఽవగంతుం శక్యతే, మృదాదివదచేతనత్వావగమాత్, ఏతేనాగ్న్యాదయో వ్యాఖ్యాతాః.

---

మఱి యేకారణమువలన దేవతలకు విద్యాధికారము లేదనిన

జ్యోతిషి = అచేతనమగు జ్యోతిర్మండలమునందు భావాత్ చ = దేవతాశబ్దము ప్రయోగింపబడుటవలనగూడ.

ఆకాశమునందుండి యహోరాత్రములు చక్రాకారమున దిరుగుచు జగత్తును బ్రకాశింపజేయు జ్యోతిర్మండలమునుగూర్చి యాదిత్యాదు మొదలగు దేవతాబోధకములగు శబ్దములు ప్రయోగింపబడుచున్నవి. ఈవిషయము లోకప్రసిద్ధమగుటయేగాక మధువిద్యావాక్యమునందు గాన్పించుచున్నది. జ్యోతిర్మండలమునకు హృదయాదివిశిష్టమైన శరీరముగాని, చేతనసహజమగు కోర్కెలుగాని యుండుటెట్లు సాధ్యమో తెలియరాకున్నది. ఆమండలములు మృత్తువలె నచేతన

దేవతాశబ్దము అచేతనమగు జ్యోతిర్మండలమున ప్రయోగింప బడుచున్నది

సిద్ధాంతీ : స్యాదేతత్, మంత్రార్థవాదేతిహాసపురాణలోకేభ్యో దేవాదీనాం విగ్రహవత్త్వాద్యవగమాదయమదోష ఇతి చేత్.

పూ. పక్షి: నేత్యుచ్యతే, నహి తావల్లోకో నామ కించిత్స్వతంత్రం ప్రమాణమస్తి, ప్రత్యక్షాదిభ్య ఏవావ్యభిచరితవిషయేభ్యః ప్రమాణేభ్యః ప్రసిద్ధ ఏవార్థో లోకాత్ప్రసిద్ధ ఇత్యుచ్యతే, న చాత్ర ప్రత్యక్షాదీనామన్యతమం ప్రమాణమస్తి, ఇతిహాసపురాణమపి

---

ములు. ఈకారణముచేతనే యగ్ని [వాయు భూమి] మొదలగువానికిగూడ నట్లే చెప్పనగును.

సిద్ధాంతి : మీరు చెప్పునది కావచ్చుగాక! కాని, మంత్రములు, అర్థవాదములు, ఇతిహాసములు, పురాణములు, లోకవాడుకలు - వీనియన్నిటివలనను దేవతలకు విగ్రహములున్నట్లు తెలియవచ్చుచున్నది. [యమునిదండహస్తునిగాను ఇంద్రుని వజ్రహస్తునిగాను వరుణుని పాశహస్తునిగాను వ్రాయుచున్నారు కనుక] వారలకు విగ్రహములు గలవనుటలో దోషమేలేదు.

దేవతలకు శరీరమున్నట్లు ప్రమాణము కానరాదు

పూ. పక్షి. ఈవాదము సరికాదు. లోకమను నొక ప్రత్యేక స్వతంత్ర ప్రమాణములేదు. [ప్రత్యక్షఅనుమాన శబ్ద, ఉపమాన అర్థవాద ఆర్థాపత్తులను నాఱు ప్రమాణములు మాత్రముగలవు] ప్రత్యక్షాది ప్రమాణములచేత ప్రసిద్ధమైన విషయమే లోకప్రసిద్ధినిగాంచుచున్నది. ప్రత్యక్షాది ప్రమాణములలో నేదియును ప్రకృత

పౌరుషేయత్వాత్ప్రమాణాంతరమూలతామాకాంక్షతి. అర్థవాదా అపి విధినైకవాక్యత్వాత్ స్తుత్యర్థాస్సంతో న పార్థగర్థ్యేన దేవాదీనాం విగ్రహాదిసద్భావే కారణభావం ప్రతిపద్యంతే. మంత్రా అపి శ్రుత్యాదివినియుక్తాః ప్రయోగసమవాయినోఽభిధానార్థా న

---

మున నుపయోగింపదు. [చక్షురాదిజ్ఞానేన్ద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షప్రమాణము. వంటయింటిలో నిత్యము చూచుచున్న పొగ మొదలగు నొకసుప్రసిద్ధమైన చిహ్నముచే గలుగు బుద్ధి రూపమైన యూహావలన గలుగు జ్ఞానమనుమానము. వేదములు శబ్దప్రమాణములు. ఒకవస్తువును మఱియొక వస్తువుతో బోల్చి తెలియజెప్పునది ఉపమానము. స్తోత్రపరము లర్థవాదములు. విద్యమానస్థితిని బట్టి సమన్వయముచేసి చెప్పునది యర్థాపత్తి. శబ్దము అర్థవాదలు దక్క మిగిలిన వన్నియు బురుషబుద్ధికృతములు] ఇతిహాసములుగూడ పురుషకృతములు గనుక మఱియొకప్రమాణము నవి యాధారము చేసికొనుచున్నవి. అర్థవాదలు, విధివాక్యములచే బోధింప బడువిషయమును స్తోత్రము చేయుచు వానితో నేకవాక్యతను గలిగియున్నవి. దృష్టములు ఉద్దిష్టములునగు దేవతలకు శరీరములు గలవని యవి ప్రత్యేకముగ జెప్పలేవు. కనుక వానివిషయమైయవి కారణము కానేరవు. మంత్రముల ప్రయోజనము శ్రుతిచే దెలియుచున్నది. ప్రయోగములేక వానిప్రయోజనము లేదు. హోమాది క్రియలయందు మాత్రమవి వినియోగించుచున్నవి. అదృష్టములగు విషయమునుగూర్చి యవి

కస్యచిదర్థస్య ప్రమాణమిత్యాచక్షతే. తస్మాదభావో దేవాదీనా మధికారస్య.

## భావం తు బాదరాయణో౽స్తి హి. (సూ 33.)

సిద్ధాంతీ: తుశబ్దః పూర్వపక్షం వ్యావర్తయతి. బాదరాయణస్త్వాచార్యో భావమధికారస్య దేవాదీనామపి మన్యతే. యద్యపి మధ్వాదివిద్యాసు దేవతాదివ్యామిశ్రాస్వసంభవో౽ధికారస్య తథాప్యస్తి హి శుద్ధాయాం బ్రహ్మవిద్యాయాం సంభవః, అర్థిత్వ

---

ప్రమాణములు గానేరవని మీరే చెప్పుచున్నారు. అందువలన దేవాదులకు విద్యాధికారము లేదు. 32

అ॥ ఇట్లు పై రెండు పూర్వపక్షసూత్రములచే ప్రతిపాదింపబడిన యాక్షేపణకు రాబోవు సూత్రమున సమాధానము చెప్పుచున్నారు. ఇది సిద్ధాంతసూత్రము.

తు: కాని, దేవతలకు బ్రహ్మవిద్యాధికారము భావం ఉండుటను బాదరాయణః = బాదరాయణుడు తలంచుచున్నాడు. ఏలనన! అస్తి హి=అందుకు ప్రమాణములుగలవుగదా!

సిద్ధాంతి: సూత్రమునందు 'తు' శబ్దముచే పూరపక్షమును ద్రోసిపుచ్చుచున్నారు. బాదరాయణాచార్యుడన్నినో దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారము గలదని దలంచుచున్నాడు, వారలకే సంబంధించి యుండుటవలన మధువిద్య మొదలగువానియందు దేవ

దేవతలకు బ్రహ్మవిద్యాధికారము ప్రమాణసహితము

సామర్థ్యాప్రతిషేధాద్యపేక్షత్వాదధికారస్య. న చ క్వచిదసంభవ ఇత్యేతావతా యత్ర సంభవ స్తత్రాప్యధికారోఽపోద్యేత, మను ష్యాణామపి న సర్వేషాం బ్రాహ్మణాదీనాం సర్వేషు రాజసూ యాదిష్వధికారస్సంభవతి. తత్ర యో న్యాయస్సోఽత్రాపి భవి ష్యతి. బ్రహ్మవిద్యాం చ ప్రకృత్య భవతి లింగదర్శనం శ్రౌతం దేవాద్యధికారస్య సూచకం 'తద్యోయో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణా' (ఛాం. 1-4-10) మితి, 'తే హోచు ర్హంత తమాత్మానమన్విచ్ఛామో యమాత్మాన

---

తల కధికారము లేకపోవుగాక! శుద్ధమగు బ్రహ్మవిద్యయందు వారలకధికారము సంభవమగుచున్నది. బ్రహ్మవిద్యకు, గోర్కెలు సామర్థ్యము, నిషేధము లేకపోవుట — ఈ మొద లగునవి బ్రహ్మవిద్యాధికారమున కవసరము. ఒకానొక విషయమున నధికారములేనందున సంభవమైన విషయమున దాని నిరసించుట యుక్తముకాదు. మనుజులలోఁగూడ బ్రా హ్మణుల కన్నింటి యందధికారములేదు. రాజసూయా దులు వారలకుగాదు. [కాని బృహస్పతిసవనమునం దధికా రముగలదు,] మనుష్యులగూర్చి వర్తిలు న్యాయమే దేవతల నుగూర్చిగూడ వర్తిలును" బ్రహ్మవిద్యయందు దేవతల కధి కారమున్నట్లు సూచించు శ్రుతిప్రమాణములుగలవు. దేవ తలలో నెవరెవరు బ్రహ్మమును దెలిసికొనిరో వారాబ్రహ్మ మైరి. అటులనే ఋషులు మనుష్యులుగూడ నైరి. (బృ 1-4-10) "దేనిని యన్వేషణము చేయుటచే సమస్త లోకములను సమస్తకామములను బొందుదుమో యట్టియాత్మ

మన్విష్య సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామా' నితి, 'ఇంద్రో హ వై దేవానామభిప్రవవ్రాజ విరోచనోఽసురాణా' (ఛాం. 8-72) మిత్యాది చ. స్మార్తమపి చ గంధర్వయాజ్ఞ వల్క్యసంవాదాది

యదప్యుక్తం జ్యోతిషి భావాచ్చేతి, అత్ర బ్రూమః — జ్యోతిరాదివిషయా అప్యాదిత్యాదయో దేవతావచనాశ్శబ్దాశ్చేత నావంతమైశ్వర్యాద్యుపేతం తం తం దేవాత్మానం సమర్పయంతి, మంత్రార్థవాదాదిషు తథా వ్యవహారాత్. అస్తి హ్యైశ్వర్యయోగా

---

నన్వేషించెదముగాక యని దేవతలనిరి." "ఇట్లుచెప్ప దేవతలలో నిందుడును, అసురులలో విరోచనుడును ప్రజాపతి దగ్గఱకు బోయిరి." (ఛాం 8-7-2) ఈమొదలగు శ్రుతివాక్యములు గలవు. గంధర్వయాజ్ఞవల్క్యసంవాదము మొదలగునవి మోక్షధర్మములందు కాన్పించుచున్నవి. [ఈశ్రుతి స్మృతి ప్రమాణములు దేవతల యొక్క బ్రహ్మవిద్యాధికారసూచకము లగుచున్నవి.]

దేవాదిశబ్దములు జ్యోతిర్మండలములయందు ప్రయోగింపబడుచున్నవి యను పూర్వపక్షమున కిట్లు చెప్పెదుము,

జ్యోతిర్మండమునందలి యధిష్ఠానదేవతా పదముఆదిత్యశబ్దము.

దేవతలనుగూర్చి బోధించు నాదిత్యాది శబ్దములు జ్యోతిర్విషయములైనను చేతనము, ఐశ్వర్యాది సముపేతనమునగు యాయా యధిష్ఠానదేవతను బోధించుచున్నవి. మంత్రములయందును అర్థవాదలయం దాపదములా యర్థమున వాడబడుచున్నవి. ఐశ్వర్యము గల

ర్దేవతానాం జ్యోతిరాద్యాత్మభిశ్చావస్థాతుం యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యమ్. తథా హి శ్రూయతే సుబ్రహ్మణ్యార్థవాదే—'మేధాతిథేర్మేషే'తి 'మేధాతిథిం హ కాణ్వాయనం ఇంద్రో మేషో భూత్వా జహారే'తి. స్మర్యతే చ—"ఆదిత్యః పురుషో భూత్వా కుంతీముపజగామ హే"తి. మృదాదిష్వపి చేతనాధిష్ఠాతారోఽభ్యుపగమ్యంతే 'మృదబ్రవీదాపోఽబ్రువ'న్నిత్యాదిదర్శనాత్. జ్యోతిరాదేస్తు భూతధాతోరాదిత్యాదిష్వప్యచేతనత్వమభ్యుపగమ్యతే, చేతనాస్త్వధిష్ఠాతారో దేవతాత్మానో మంత్రార్థవాదాదిషు వ్యవహారాదిత్యుక్తం.

---

వారగుటవలన దేవతలు జ్యోతిస్స్వరూపములను బొంది యథేష్టముగ నానాశరీరముల బొందుటకు సమర్థులు. "ఇంద్రుడు మేషస్వరూపమును బొంది కాణ్వపుత్రుడగు మేధాతిథిని దీసికొని బోయెనని సుబ్రహ్మణ్యార్థవాదమునందు వినబడుచున్నది. "ఆదిత్యుడు పురుషుడై కుంతిదగ్గరకు బోయెనని" స్మృతి వినబడుచున్నది. భూమిమొదలగు జడములయందుగూడ చేతనములగు నధిష్ఠానదేవతలున్నట్లంగీకరింపబడవలెను. "మృత్తు పలికెను. జలములు పలికెను" మొదలగు ప్రయోగములు కాన్పించుచున్నవి. పంచభూతమయములగు నాదిత్యాది జ్యోతిర్మండలములు చేతనములని యంగీకరింపబడుచున్నది. కాని చేతనవంతములగు దేవతలు వాని నధిష్ఠించియున్నట్లు మంత్రార్థవాదములువలన దెలియుచున్నది.

యదప్యుక్తం మంత్రార్థవాదయోరన్యార్థత్వాన్న దేవతావిగ్రహాదిప్రకాశనసామర్థ్యమితి, అత్ర బ్రూమః.—ప్రత్యయాప్రత్యయౌ హి సద్భావాసద్భావయోః కారణం నాన్యార్థత్వమనన్యార్థత్వం వా. తథా హ్యన్యార్థమపి ప్రస్థితః పథి పతితం తృణపర్ణాద్యస్తీత్యేవం ప్రతిపద్యతే.

పూ.పక్షి : అత్రాహ విషమ ఉపన్యాసః తత్ర హి తృణపర్ణాది

---

మంత్రార్థవాదములు క్రియాప్రయోగ విషయము లగుటచే దేవతల విగ్రహవత్త్వమునుగూర్చి చెప్పలేవను పూర్వపక్షమునకిట్లు జెప్పెదము. ఏప్రమాణముచే దేనియం దబాధితమైన భావము గలుగునో యాప్రమాణమువలన నాభావము సిద్ధించును. ఆభావము బాధితమైనపు డది సిద్ధింపదు. అట్లు సిద్ధించిన భావము మఱియొకవిషయమును గూర్చి ప్రసక్తమగుచున్నదా లేక స్వవిషయమునుగూర్చి ప్రసక్తమగుచున్నదా యనునది ప్రకృతమున విషయము కాదు. [మంత్రములకు వినియోగము మఱియొకచోట గలుగవచ్చునుగాక. వానికి స్వతఃసిద్ధముగాగల యర్థ మబాధితమైనపుడవి యాయర్థమునుగూర్చి ప్రమాణములే యగుచున్నవి.] కార్యాంతరమున మార్గమున బోవుచున్న బాటసారి త్రోవలోనున్న తృణపర్ణాదికమును జూచి యవి యున్నవియనియె నిశ్చయించును.

పూ.పక్షి : ఇచట పూర్వపక్షి యిట్లాక్షేపించుచున్నాడు. మీరు చెప్పు నుదాహరణము విషమమైనది. మార్గమున తృణపర్ణాదికము ప్రత్యక్షముగ గాన్పించుచున్నది.

విషయం ప్రత్యక్షం ప్రవృత్తమస్తి యేన తదస్తిత్వం ప్రతిపద్యతే. అత్ర పునర్విధ్యుద్దేశైకవాక్యభావేన స్తుత్యర్థేఽర్థవాదేన పార్థగర్థ్యేన వృత్తాంతవిషయా ప్రవృత్తిశ్శక్యాధ్యవసాయయితుం. నహి మహావాక్యేఽర్థప్రత్యాయకేఽవాంతరవాక్యస్య పృథక్ప్రత్యాయకత్వమస్తి, యథా 'న సురాం పిబే'దితి నఞ్వతి వాక్యే పదత్రయసంబంధాత్సురాపానప్రతిషేధ ఏవైకోఽర్థో గమ్యతే; న పునస్సురాం పిబే'దితి పదద్వయసంబంధాత్సురాపానవిధిరపీతి.

సిద్ధాంతీ: అత్రోచ్యతే—విషమ ఉపన్యాసః, యుక్తం యత్సురా

---

అందువలన దానియస్తిత్వము నిశ్చయింప శక్యమగుచున్నది.

మంత్రములు స్వార్థపరములు

మంత్రవిషయమన్ననో, యేదోయొక విధివాక్యముతో నేకవాక్యతను బొంది యర్థవాదములు విధ్యర్థమునకు స్తుతిపరము లగుచున్నవి. అవి యొకప్రత్యేకమగు నర్థమునుగాని విషయమునుగాని బోధించుటకు ప్రవర్తించినవని నిశ్చయించుటకు శక్యము కాదు. ఒక పెద్దవాక్యముయొక్క యర్థమును వివరించు నవాంతరవాక్యమునకు ప్రత్యేకార్థబోధకత్వసామర్థ్యము లేదు. సురను పానము చేయగూడదను వాక్యమునందలి మూడు పదములను జోడించి సురాపానము నిషేధింపబడుచున్నది యని యొక అర్థమును మాత్రము గ్రహించుచున్నాము. చివర రెండుపదములను మాత్రము చేర్చి సురాపానపరముగ గూడ నావాక్యమున కర్థకల్పనము చేయుటలేదు.

సిద్ధాంతి: ఇందు కిట్లు చెప్పుచున్నాము. మీ యుదాహారణము విషమము. సురను పానము చేయగూడదను వాక్య

పానప్రతిషేధే పదాన్వయస్యైకత్వా దవాంతరవాక్యార్థస్యా గ్రహణం, విధ్యుద్దేశార్థవాదయో స్త్వర్థవాదస్థాని పదాని పృథగ న్వయం వృత్తాంతవిషయం ప్రతిపద్యానంతరం కైమర్థక్యవశేన విధిస్తావకత్వం ప్రతిపద్యంతే. యథా హి—'వాయవ్యగ్ శ్వేత మాలభేత భూతికామ' ఇత్యత్ర విధ్యుద్దేశవర్తినాం వాయవ్యాది పదానాం విధినా సంబంధః, నైవం 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా వాయుమేవ స్వేనభాగధేయేనోపధావతి స ఏవైనం భూతిం గమ

---

మేకవాక్యము. అందులోనుండి యవాంతరవాక్యగ్రహణము సాధ్యముకాదు. [సురాపానమును నిషేధించు వాక్యార్థము మీరు చెప్పినరీతిగ నవాంతరవాక్యకల్పనముచే బాధితమగు చున్నది. కనుక విధివాక్యముతో నేకవాక్యత దానికిలేదు. అర్థవాదములన్ననో, విధివాక్యార్థస్తుతిపరములై విధివాక్య ముతో నేకవాక్యతను గల్గియుండును] అర్థవాదవాక్యములోని పదములకు స్వయముగ సమన్వయముగలిగి భూతార్థవిష యము నొకదానిని తెలుపును. తరువాత నీవాక్యమునకు ప్రయోజనమేమి యని ప్రశ్న పుట్టినపు డొకవిధివాక్యార్థ మున కంతకు స్తావకమై సంపూర్ణముగ నుపచరించును. అదియెట్లన! "ఐశ్వర్యకాముడగువాడు వాయుదేవతకు శ్వేత పశువును బలియివ్వవలెను" అను విధివాక్యమునందు గల పదములన్నియు విధివాక్యార్థముతో సంబద్ధములై యున్నవి. "వాయువు త్వరితత్వముగల దేవత. తన భాగధేయముతో వాయుదేవత దగ్గఱకు బోవును. ఆదేవత యీతనిని వర్ధిల్ల జేయును". ఈవాక్య మర్థవాదవాక్యము. ఇందలి పదములకు

యతీ' త్యేషామర్థవాదగతానాం పదానామ్, న హి భవతి వాయుర్వా ఆలభేత క్షేపిష్ఠా దేవతావా ఆలభేతేత్యాది వాయుస్వభావసంకీర్తనేన త్వవాంతరమన్వయం ప్రతిపద్య ఏవం విశిష్టదైవత్యమిదం కర్మేతి విధిం స్తువంతి. తద్యత్ర యోఽవాంతరవాక్యార్థః ప్రమాణాంతరగోచరో భవతి తత్రి తదనువాదేనార్థవాదః ప్రవర్తతే.

---

సాక్షాద్విధివాక్యముతో నర్థసమన్వయపూర్వకమగు సంబంధము లేదు. వాయువును బలి యివ్వవలెననిగాని దుత్రితతమగు దేవతను బలియివ్వవలెననిగాని సమన్వయము విధివాక్యముతో సంబంధింపనేరదు. వాయువుయొక్క త్వరితగమనము నావాక్యము సంకీర్తనము చేయుచు నద్దానియందలి పదములకు పరితేక్యసమన్వయము కాన్పించుచున్నది. కనుక నా వాక్యమునకు స్వీయమగు నర్థము గలదు. విధివాక్యవిషయమగు కర్మ విశిష్టగుణోపేతమగు వాయుదేవతకు సంబంధించినదియని యా దేవతను స్తోత్రిము చేయుచున్నది. అవాంతర వాక్యములగు నీయర్థవాద మింతకుబూర్వము మఱియొక విధముగ దెలిసిన విషయమునే చెప్పినచో నది ప్రమాణాంతరముచే దెలిసినవిషయమున కనువాదమాత్రిమగును. అర్థవాదముయొక్క స్వీయమగు నర్థము పరిమాణాంతరమునకు విరుద్ధమైనచో నది గుణవాదము మాత్రిమగును. "అగ్నిర్హిమస్య భేషజమ్"— [అగ్ని శీతమున కౌషధమను వాక్యార్థము పరిమాణాంతరముచే దెలియుచున్న విషయమును మాత్రి మనువదించుచున్నది. ఇట్టి యర్థవాద లనువాదములనబడును. "ఆదిత్యో యూపః"— ఆదిత్యుడు యూపమనగా

యత్ర ప్రమాణాంతరవిరుద్ధ స్తత్ర గుణవాదేన. యత్ర తు తదుభయం నాస్తి తత్ర కిం ప్రమాణాంతరాభావాద్గుణవాదస్స్యాదాహోస్విత్ప్రమాణాంతరావిరోధాద్విద్యమానార్థవాదః ఇతి ప్రతీతిశరణైర్విద్యమానార్థవాద ఆశ్రయణీయో న గుణానువాదః. ఏతేన మంత్రో వ్యాఖ్యాతః.

అపి చ, విధిభిరేవేంద్రాదిదైవత్యాని హవీంషి చోదయద్భిరపేక్షితమింద్రాదీనాం స్వరూపమ్, నహి స్వరూపరహితా

---

యజ్ఞపశువునుకట్టు స్తంభము అనువాక్యము విరుద్ధార్థకముగ కాన్పించుచున్నది. అందువలన యూప మాదిత్యునివలె బ్రకాశించుచున్నది యని గుణబోధకముగ నర్థకల్పనము చేయబడుచున్నది, ఇట్టి యర్థవాదవాక్యములు గుణవాదమనిపించుకొనును] కాని, యీ రెండులక్షణములు లేక ప్రమాణాంతరము లేకపోవుటచే నీయర్థవాదవాక్యము గుణవాదమగునా లేకప్రమాణాంతరమునకు విరోధములేకుండుటచే ననువాదమగునా యనుసందేహము కలిగినపుడు విచారణాకుశలులగువారు భూతార్థవాదపరముగ గ్రహించగలరు. గుణవాదపరముగ గ్రహింపదగదు. ఈ వ్యాఖ్యానము మంత్రములకు గూడవర్తించును. [అనగా సంవాదవిసంవాదములు లేనపుడు అర్థవాదులకును స్వార్థపరములుగ గ్రహించినట్లుగ మంత్రములనుగూడ స్వార్థపరములుగ గ్రహించవలెనని తాత్పర్యము.]

మఱియు, నింద్రాది దేవతలనుగూర్చి హవిస్సులను బోధించు విధివాక్యము లాయా దేవతల కొకస్వరూపమున్నట్లు

ఇంద్రాదయశ్చేతస్యా రోపయితుం శక్యంతే. న చ చేతస్యనారూఢాయై తస్యై తస్యై దేవతాయై హవిః ప్రదాతుం శక్యతే; శ్రావయతి చ 'యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం ధ్యాయేద్వషట్కరిష్య' న్నితి. (ఐ.బ్రా. 3-8-1) న చ శబ్దమాత్రమర్థస్వరూపం సంభవతి శబ్దార్థయోర్భేదాత్, తత్రి యాదృశం మంత్రార్థవాదయో

---

తెలియజేయుచున్నవి. రూపరహితలగు నింద్రాదిదేవతలు బుద్ధికెక్కలేరు. బుద్ధి నారోహింపని యా యా దేవతలకు హవిస్సు నొసంగుట శక్యముగాదు. "ఏ దేవతకు హవిస్సు నొసంగబడుచున్నదో యా దేవతను వషట్కార కాలమునందు ధ్యానముచేయవలెను" (ఐ. బ్రా. 3-8-1) అని శ్రుతి బలుకుచున్నది. శబ్దమే దేవతాస్వరూపమని తలంప వీలులేదు. శబ్దమునకు దానియర్థమునకును భేదముకలదు. [కనుక మంత్రిభాగమగు నొకశబ్దమే దేవతలు యనవీలులేదు,] మంత్రార్థవాదములచే నింద్రాదిదేవతల స్వరూప మెట్టిదిగా దెలియవచ్చుచున్నదో యట్టిరూపమును శబ్దమును బ్రమాణముగా నంగీకరించువారు నిరసింపతగదు. [మంత్రములయర్థవిచారణ చేసినపుడు ప్రసన్నమగు నొకవిగ్రహమున్నట్లు కాన్పించుచున్నది.]

విధివాక్యములు దేవతలశరీరత్వమును చూపుచున్నవి

ఇతిహాసపురాణములు మంత్రార్థవాదముల నాధారము చేసికొని బుట్టుటచే నవియు దెలియజేసిన మార్గమున దేవతల విగ్రహవత్త్వమును, విస్తరించుటకు సమ

పురాణేతిహాసములు ప్రమాణము

రింద్రాదీనాం స్వరూప మవగతం న తత్రాన్యపరం శబ్దప్రమాణకేన ప్రత్యాఖ్యాతుం యుక్తం. ఇతిహాసపురాణమపి వ్యాఖ్యాతేన మార్గేణ సంభవన్మంత్రార్థవాదమూలకత్వాత్ప్రభవతి దేవతావిగ్రహాది ప్రపంచయితుమ్. ప్రత్యక్షాదిమూలమపి. సంభవతి. భవతి హ్యస్మాకమప్రత్యక్షమపి చిరంతనానాం ప్రత్యక్షమ్. తథా చ వ్యాసాదయో దేవాదిభిః ప్రత్యక్షం వ్యవహరంతీతి స్మర్యతే. యస్తు బ్రూయాదిదానీంతనానామివ పూర్వేషామపి నాస్తి దేవాదిభిర్వ్యవహర్తుం సామర్థ్యమితి స జగద్వైచిత్ర్యం ప్రతిషేధేత్. ఇదానీమివ చ నాన్యదాపి సార్వభౌమః క్షత్రియోఽస్తీతి బ్రూయాత్, తతశ్చ రాజసూయాదిచోదనా ఉపరుంధ్యాత్, ఇదానీ

---

రములగుచున్నవి. అట్టి యితిహాస పురాణములవలనగూడ దేవతలకు విగ్రహవత్త్వమును సాధించుటకు శక్యమగుచున్నది. ఇంతియకాక పురాణేతిహాసములు ప్రత్యక్షాదిప్రమాణముల నాధారము చేసికొనియున్నవి, నేడు మన కప్రత్యక్షములగు విషయములుగూడ పురాతనులకు ప్రత్యక్షమై యుండవచ్చును. అందువలననే వ్యాసాదిమహాయోగుల కింద్రాది దేవతలతో ముఖాముఖి వ్యవహారమున్నట్లు స్మృతులు బల్కుచున్నవి. అధునాతనులకువలెనే పురాతనులకుగూడ దేవతలతో బ్రత్యక్షముగ వ్యవహరింపగల సామర్థ్యము లేదని యనువారు జగద్వైచిత్ర్యమును గ్రహింప లేనివారలగుదురు. ఇప్పటివలెనే పూర్వముగూడ సార్వభౌముడగు క్షత్రియుడు లేడని చెప్పవలసివచ్చును. అందువలన రాజసూయాది విధి చోదితయాగాదులు నిరర్థకములు కావలసివచ్చును. ఈకాల

మివ చ కాలాంతరేఽప్యవ్యవస్థితప్రాయాన్వర్ణాశ్రమధర్మాన్ప్రతిజానీయాత్ తతశ్చ వ్యవస్థావిధాయి శాస్త్రమనర్థకం కుర్యాత్. తస్మాద్ధర్మోత్కర్షవశాచ్చిరంతనా దేవాదిభిః ప్రత్యక్షం వ్యవజహ్రురితి శ్లిష్యతే. అపి చ స్మరంతి——"స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగ" (యో.సూ. 2-44) ఇత్యాది. యోగోఽప్యణిమాద్యైశ్వర్యప్రాప్తిఫలకస్స్మర్యమాణో న శక్యతే సాహసమాత్రేణ ప్రత్యాఖ్యాతుమ్. శ్రుతిశ్చ యోగమహాత్మ్యం ప్రఖ్యాపయతి—'పృథ్వ్యప్తేజోఽనిలఖే సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే,

---

మునందువలెనే బూర్వకాలమునందు గూడ వర్ణాశ్రమధర్మము లవ్యవస్థితప్రాయములని చెప్పవలసివచ్చును. అందువలన నిట్టివ్యవస్థలను విధించిన శాస్త్రమనర్థకమగును, కనుక చిరంతనులగువారి సామర్థ్యాతిశయముచే దేవతలతో బ్రత్యక్షముగ వ్యవహరించినారనుట యనవద్యము. "స్వాధ్యాయముచే నిష్టదేవతాసమాగమము సిద్ధించునని యోగసూత్రములు (2–44) చెప్పుచున్నవి. యోగమువలన నణిమాద్యైశ్వర్యములు లభించుచున్నట్లు స్మృతులు బోధించుచున్నవి. వీనినొక్కమాటుగ ద్రోసిపుచ్చుట సాహసమాత్రము. యోగియొక్క పాదతలము మొదలు జానుప్రదేశమువఱకు బృథివిని, జానుప్రదేశమునుండి నాభిప్రదేశమువఱకు జలములను, నాభిప్రదేశము మొదలు కంఠప్రదేశమువఱకు తేజస్సును, కంఠప్రదేశమునుండి శిరోజరోమకూపములవరకు వాయువును, అచటనుండి బ్రహ్మరంధ్రమువరకు నాకాశమును వశీకృతము చేసికొని యణిమాదియోగసిద్ధులు ప్రవృత్తము

న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీర' మితి. (శ్వే. 2-12) ఋషీణామపి మంత్రబ్రాహ్మణ దర్శినాం సామర్థ్యం నాస్మదీయేన సామర్థ్యేనోపమాతుం యుక్తం, తస్మాత్సమూలమితిహాసపురాణమ్. లోకప్రసిద్ధిరపి న సతి సంభవే నిరాలంబనాధ్యవసాతుం యుక్తా. తస్మాదుపపన్నో మంత్రాదిభ్యో దేవాదీనాం విగ్రహవత్త్వాద్యవగమః. తతశ్చార్థిత్వాదిసంభవాదుపపన్నో దేవాదీనామపి బ్రహ్మవిద్యాయామధికారః, క్రమముక్తిదర్శనాన్యప్యేవమేవోపపద్యంతే.

---

లయినపుడు యోగముచే నభివ్యక్తమైన తేజోమయశరీరమును బొందిన యోగికి రోగముకాని జరామరణములుగాని యుండనేరవని శ్రుతి (శ్వేత. 2-12) యందు గాన్పించుచున్నది. మంత్రబ్రాహ్మణద్రష్టలగు మహాత్ముల సామర్థ్యము నస్మదాదుల సామర్థ్యముతో బోల్చుట యుక్తముకాదు. అందువలన నితిహాసపురాణములు శ్రుతిప్రమాణమూలకములగుచున్నవి. లోకప్రసిద్ధిగూడ నిరాధారమని త్రోసిపుచ్చుటకు సాధ్యముకాదు. అందువలన దేవతలకు శరీరములు గలవని మంత్రార్థవాదములవలన గ్రహించుట సమంజసమే యగుచున్నది. వారలకు మోక్షమునందు కోరిక సామర్థ్యము మొదలగునవిగూడ నున్నట్లు వానివలననే దెలియుచున్నది. అందువలన బ్రహ్మవిద్యాధికారముగూడ వారికి యున్నదని ఫలితార్థము లభించుచున్నది. వారలకు విగ్రహములున్నపుడే క్రమముక్తిగూడ సంభవమగును. [శరీరములులేనిచో

శాస్త్రార్థోపసంహారము

బ్రహ్మవిద్యాధికారము లేదు. అదిలేనిచో జ్ఞానము లేదు. జ్ఞానము లేక బ్రహ్మత్వప్రాప్తిలేదు. (బ్రహ్మజ్ఞానసాధనమగు నుపాసన మంతకంటె సాధ్యము కాదు.]

అధికరణ సంక్షేపార్థము: మనుష్యులకువలెనే దేవతలకు గూడ శరీరముగలదు. మోక్షమునందు కోరిక సామర్థ్యము కూడ వారలయందు గాన్పించుచున్నది. ఇంద్రాదిదేవతలకు వేదములు స్వయముగ భానమగుచున్నవి. ఇంద్రుడు ప్రజాపతి దగ్గఱ నూటనాలుగు సంవత్సరములు శిశ్రూష చేసి బ్రహ్మోపదేశమును బొందెను. వారి శరీరపరిమాణానుసారముగ వారి హార్దాకాశపరిమాణము నిశ్చితమగుచున్నది. వారలు బహురూపులగుటచే నొక్కమాఱుగ ననేకస్థలముల నుండ శక్యమగుచున్నది. వేదశబ్దముచేత దేవతలకు విగ్రహముగలదని దెలియుచున్నది. శబ్దమునకును, అర్థమునకును గలసంబంధము నిత్యము. వైదికశబ్దార్థమగు శరీర మనిత్యము గనుక శబ్దముగూడ ననిత్యమని చెప్పవీలులేదు. అనగా వేదములు నిత్యములు గావు. దేవతలకు విగ్రహవత్త్వముగూడ సంభవముకాదు. ఇట్టి పూర్వపక్షము సరియయినదికాదు. వ్యక్తులు అనంతములు,శరీరవంతములు. వానిశరీరములు నశ్వరములు కాని యా వ్యక్తులకు సంబంధించిన జాతి నిత్యము. గోవ్యక్తి నిత్యము కాకపోయినను గోజాతి నిత్యము. అటులనే దేవతాజాతి నిత్యము. ఇంద్రాదిశబ్దములు స్థానవిశేషమును దెలుపునుగాని వ్యక్తులను దెలుపనేరవు. ప్రజాపతి శబ్దముచే

సమస్తజగత్తును సృజియించెను. శబ్దముచేతనే వానికి నామరూపములు కల్పించెను. కనుక వేదములు నిత్యములు. ప్రలయమునందు శబ్దము సంపూర్ణముగ ప్రలయము నొందదు. ప్రలయమునకు బూర్వమునందున్న నామరూపములే తరువాత సృష్టియందుగూడ నున్నవి. పూర్వాపరసృష్టు లన్నివిధముల నొకతీరుగ నున్నవి, జగత్తు లయమైనను, దానిని నుత్పాదనము చేయుశక్తిమాత్రము లయముగాకుండును. మంత్రములు, అర్థవాదములు, ఇతిహాసపురాణములు – ఇవి యన్నియును దేవతలకు శరీరము లున్నట్లు పలుకుచున్నవి. దేవతల కుపాసనాదులయందును కర్మలయందు నధికారము లేకపోయినను, బ్రహ్మవిద్యయందుగలదు. ఇంద్రాదులు కోరిన శరీరముల నొక్కమారుగ బొందసమర్థులు. కనుక దేవతలకు శరీరములుండుట దేనికిని విరుద్ధముకాదు.

శబ్దము స్ఫోటస్వరూపమని వైయ్యాకరణమతము. గోవుయనుపదమునందలి ప్రత్యక్షరమును వినినంతనే యాధ్వని నశించును. వర్ణములు బుట్టుచు మార్పుచెందును. కాని ప్రత్యక్షరమునం దొకశక్తిగలదు. శబ్దము నశించినను ఆశక్తిచే నర్థమభివ్యక్తమగును. అర్థమును స్ఫురింప జేయుశక్తి స్ఫోటము. ప్రత్యక్షరమర్థమును తెలియచేయలేదు. వినిన వెంటనే అక్షరధ్వని నశించుటవలన అక్షరముల సముదాయముగూడ నర్థబోధకము గానేరదు. అక్షరములవలెనే వాని సంస్కారముగూడ వెంటనే నశించును. సంస్కారము శ్రుతి

గోచరముకాదు గనుక నది అర్థస్ఫోరకముకాదు. వర్ణములనేకములు. ఏకవస్తుజ్ఞానమునకు కారణముకావు. శబ్దమునందలి ప్రత్యక్షరమును వినినపుడు గలుగు సంస్కారబీజము అంతిమాక్షర సంస్కారబీజముచే పరిపక్వమై కడపటి సంస్కారమువలన సంపూర్ణవస్తుజ్ఞానము గల్గును.

వర్ణములే శబ్దములని యుపవర్షాచార్యునిమతము. పలుమఱు వినినను ఆవర్ణములనే గుర్తించుదుముగాని మఱియొక వర్ణమును గుర్తించుటలేదు. వర్ణములు తాల్వాది అభివ్యంజక స్థలభేదముచే భిన్నముగా కాన్పించుచున్నవి కాని స్వయముగావానియందు భేదములేదు.

వర్ణభేదజ్ఞానము ధ్వనివలన గలుగుచున్నది యని సిద్ధాంతి మతము. వర్ణములయందలి యుదాత్తాదిభేదము ధ్వనివలనగలుగును. ప్రత్యుచ్చారణమునందొకే యక్షరము వినుచున్నాముగాని ధ్వనిమాత్రము మారుచున్నది. ప్రతి వర్ణమును గ్రహించిన తరువాత కలుగుజ్ఞానము వర్ణముల న్నియుగలసిన యొకశబ్దజ్ఞానమగుచున్నది. శబ్దము వినినపుడందలి వర్ణములు స్ఫురించుచున్నవి గాని స్ఫోటము స్ఫురించుటలేదు. స్ఫోటమే జ్ఞానకారణమైన వర్ణజ్ఞానము కలుగక పోవలెను. వర్ణములనేకము లయిననేక బుద్ధివిషయము కాగలవు. వర్ణములచేతనే అర్థప్రతీతి గలుగుచుండ స్ఫోటమును కల్పించుట నిరర్థకము. వర్ణము లొకక్రమమున వినవచ్చుచు శబ్దార్థజ్ఞానమును కలుగచేయుచున్నవి. అందువలననే శబ్ద

ములు నిత్యములు. కల్పాంతమునందు వ్యక్తులు నశించినను వానిజాతి నశించుటలేదు. నామరూపములు కల్పములన్నిటికిని సమానముగ నున్నవి. కనుక శబ్దార్థసంబంధము నిత్యము. దేవతలకు మధువిద్యల కధికారము లేకున్నను బ్రహ్మవిద్యాధికారము గలదు. మనుజులకువలెనే వారలకుగూడ నర్థిత్వము, కామన మొదలగు నధికారములుగలవు. వారలకు శరీరములు గూడ నున్నట్లు ప్రమాణములుగలవు.

## (9) అపశూద్రాధికరణము

అ॥ ప్రమితాధికరణమునందు సామాన్యముగ మనుజులకు బ్రహ్మవిద్యాధికారమున్నట్లు జెప్పబడినది. దేవతాధికరణమునందు దేవతల కట్టియధికారము సిద్ధముచేయబడినది. మనుష్యులకని సామాన్యముగ జెప్పబడుటవలన శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము గలదాలేదాయను శంక కలుగుచున్నది. ఇట్టిశంకకు సమాధానముగ నీయధికరణమారంభింప బడుచున్నది.

విషయవాక్యము : "అహ హారే త్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు" (ఛా 4-2-3)

విషయము : శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము కలదా? లేదా?

పూర్వపక్షము : కలదు.

సిద్ధాంతము : లేదు.

## శుగస్య తదనాదర శ్రవణాత్తదాద్రవణాత్ సూచ్యతే హి (సూ. 34)

ఆలోచనము చేయవలసినప్రమాణములు. ఛాందోగ్యము 4 వ అధ్యాయము 1–4 ఖండలు.

[ఈవాక్యమును రైక్కుడను నొకఋషి యన్నదానాదిగుణోపేతుడగు జానశ్రుతియను నొక రాజునుగూర్చి బల్కెను, జానశ్రుతిసుగుణములకు సంతసించిన ఋషిగణ మాతనికి నుపకారము చేయదలచి యాతడు వేసవిసమయమున తనప్రాసాదోపరిభాగమున బరుండియున్నసమయమున, హంసలరూపమున నాతనిప్రసాదమున వ్రాలి యాతని వినికిడిలోపల నతనిగుణముల ప్రశంసించెను. అందులోనొక హంస, బ్రహ్మజ్ఞానములేని యాతనిసుగుణములు నిరర్థకములనియు, శకటము చిహ్నముగాగల రైక్కుడనుమహర్షి బ్రహ్మిష్ఠుడగుటజేసి యతనితేజస్సు దురతిక్రమమనియు బలికెను. ఈ సంభాషణనువిని జానశ్రుతి దుఃఖితుడై కొన్ని గోవులు హారము మొదలగునవి తీసికొని బ్రహ్మవిద్యనుగోరి రైక్కుని దగ్గఱకుబోయెను. ఛాందోగ్యము 4-1. లోని యీకథ నిచట ననుసంధానము చేసికొనవలెను.]

అస్య = ఈజానశ్రుతికిని తత్ అనాదరశ్రవణాత్ = హంసలు అనాదరణచేసిన వచనమును వినుటవలన శుక్ = దుఃఖము కలిగెను. తత్ ఆద్రవణాత్ = ఆశ్శోకమువలన జానశ్రుతి రైక్కునసమీపమునకు వచ్చుటవలన లేక శోకము

యథా మనుష్యాధికారనియమమపోద్య దేవాదీనామపి విద్యాస్వధికార ఉక్తస్తథైవ ద్విజాత్యధికారనియమాపవాదేన శూద్రస్యాప్యధికారస్స్యాదిత్యేతామాశంకాం నివర్తయితుమిదమధికరణ మారభ్యతే,

పూ.పక్షీ: తత్ర శూద్రస్యాప్యధికారస్స్యాదితి తావత్ప్రాప్తమ్, అర్థిత్వసామర్థ్యయోస్సంభవాత్ 'తస్మాచ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః' (తై. సం. 7-1-116) ఇతివచ్ఛూద్రో విద్యాయామనవ

---

పొర్లి వచ్చుటవలన, సూచ్యతే = జానశ్రుతి దుఃఖము సూచింపబడుచున్నది.

అ॥ పూర్వాధికరణమునందు మనుజులకుమాత్రము బ్రహ్మవిద్యాధికారము కలదను వాదమును ద్రోసిబుచ్చి దేవతలకు గూడ నట్టియధికారము గలదనిచూపబడినది. కేవలము ద్విజులకుమాత్రమట్టి యధికారములేదు. శూద్రులకుగూడ గలదను నీశంకను దొలగించుటకై యీయధికరణ మారంభింపబడుచున్నది.

శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము గలదా!

పూ.పక్షి: శూద్రునికిగూడ బ్రహ్మవిద్యాధికారము గలదని పూర్వపక్షము గలుగుచున్నది. (1) ఆతనికి [బ్రహ్మవిద్యయందు] కోరికయు. [దానిసంపాదించు] సామర్థ్యముగూడ సంభవములు. "అందువలన శూద్రుడు యజ్ఞమున కనర్హుడు" (తై. సం) శూద్రునికి యజ్ఞాధికారము త్రోసిబుచ్చినట్లు 'ఆతడు బ్రహ్మవిద్యకధికారిగాడన్న' నిషేధము శాస్త్రమునందే

క్లృప్త ఇతి నిషేధాశ్రవణాత్. యచ్చ కర్మస్వనధికారకారణం శూద్రస్యానగ్నిత్వం న తద్విద్యాస్వధికారస్యాపవాదకం. న హ్యాహవనీయాదిరహితేన విద్యా వేదితుం న శక్యతే, భవతి చ శ్రౌతం లింగం శూద్రాధికారస్యోపోద్బలకం, సంవర్గవిద్యాయాం హి జానశ్రుతిం పౌత్రాయణం శుశ్రూషుం శూద్రశబ్దేన పరామృశతి 'అహ హారే త్వా శూద్ర తవైవ సహ గోభిరస్త్వి'తి. (ఛాం, 4-2-3) విదురప్రభృతయశ్చ శూద్రయోనిప్రభవా అపి విశిష్టవిజ్ఞానసంపన్నాస్స్మర్యంతే, తస్మాదధిక్రియతే శూద్రో విద్యాస్వితి.

---

వినబడుటలేదు. (2) శూద్రునికి అగ్నిహోత్రాధికారములేదు గనుక కర్మలయందధికారము లేకపోవుచున్నది. కర్మలయందధికారములేకపోవుట బ్రహ్మవిద్యాధికారమును తోసిపుచ్చదు. ఆహావనీయము లేనివాడు బ్రహ్మవిద్యను గ్రహింప సమర్థుడుగాడనవీలులేదు. (3) శూద్రునికిబ్రహ్మవిద్యాధికారము గలదను నూహాను బలపఱచు సూచన శ్రుతియందు కాన వచ్చుచున్నది. ఓయిశూద్ర! హారము, గోవులుగూడ నీవే యుంచుకొనుము" (ఛాం 4-2-3) అని బ్రహ్మవిద్యను దెలిసికొనుటకు తనదగ్గిఱకు వచ్చిన పుత్రాయణకుమారుడగు జానశ్రుతిని రైక్కుడనుబ్రహ్మజ్ఞాని 'శూద్ర' యనిపిలచెను. (4) శూద్రజన్మమునెత్తిన విదురాదులు అశేషవిజ్ఞానసంపన్నులుగ స్మృతులయందు వర్ణింపబడినారు. అందువలన శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము కలదు.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తేబ్రూమః — న శూద్రస్యాధికారో వేదాధ్యయనాభావాత్. అధీతవేదో హి విదితవేదార్థో వేదార్థేష్వధిక్రియతే, న చ శూద్రస్య వేదాధ్యయనమస్తి, ఉపనయనపూర్వకత్వాద్వేదాధ్యయనస్య, ఉపనయనస్య చ వర్ణత్రయవిషయత్వాత్. య త్త్వర్థిత్వం న తదసతి సామర్థ్యేఽధికారకారణం భవతి. సామర్థ్యమపి న లౌకికం కేవలమధికారకారణం భవతి శాస్త్రీయేఽర్థే శాస్త్రీయస్య సామర్థ్యస్యాపేక్షితత్వాత్. శాస్త్రీయస్య చ సామర్థ్యస్యాధ్యయననిరాకరణేన నిరాకృతత్వాత్. యచ్చేదం 'శూద్రో

---

సిద్ధాంతి: శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదు. ఆతనికి వేదాధ్యయనము లేకపోవుటవలన! వేదమును జదివి దాని

శూద్రశబ్దము దుఃఖబోధకము.

యర్థమును గ్రహించినవానికే వేదబోధితవిషయముల యందధికారము గలదు. కాని శూద్రునికి వేదాధ్యయనములేదు. వేదాధ్యయము చేయువానికి ముందుగా నుపనయనము కావలయును. ఉపనయనము మొదటి మూడువర్ణములవారికే విధింపబడినది. (1) సామర్థ్యములేనపు డర్థిత్వమున్నను యధికారకారణము కానేరదు. లౌకికసామర్థ్యము బ్రహ్మవిద్యాధికారకారణము కానేరదు. విషయము శాస్త్రీయము. కనుక శాస్త్రీయమగు సామర్థ్యము కావలసియున్నది. [అనగా విధ్యుక్తముగ జేయబడిన వేదాధ్యయనమువలన గలిగినజ్ఞానము వేదార్థవిషయములయందు గావలసిన శాస్త్రీయసామర్థ్యము,] శూద్రునికి వేదాధ్యయనము నిరాకరింపబడినది గనుక శాస్త్రీయ సామర్థ్యము నిరాకరింపబడుచున్నది. [ఇందువలన అర్థిత్వము

యజ్ఞేఽనవక్లృప్త' ఇతి, తన్న్యాయపూర్వకత్వాద్విద్యాయామప్య నవక్లృప్తత్వం ద్యోతయతి, న్యాయస్య సాధారణత్వాత్.

యత్పునస్సంవర్గవిద్యాయాం శూద్రశబ్దశ్రవణం లింగం మన్యసే, న తల్లింగం; న్యాయాభావాత్. న్యాయోక్తే హి లింగ దర్శనం ద్యోతకం భవతి, న చాత్ర న్యాయోఽస్తి. కామం చాయం శూద్రశబ్దస్సంవర్గవిద్యాయామేకైకస్యాం శూద్రమధి కుర్యాత్తద్విషయత్వాన్న సర్వాసు విద్యాసు, అర్థవాదస్థత్వాన్నతు క్వచిదప్యయం శూద్రమధికర్తుముత్సహతే. శక్యతే చాయం

---

కూడ నిరాకరింపబడుచున్నది.] (2) శూద్రుడు యజ్ఞమున కధికారిగాఁడనుటచే నీన్యాయము బ్రహ్మవిద్యకుగూడ నధి కారికాడని స్ఫురింపచేయుచున్నది. [ఆహవనీయూదులెటుల వేదవిషయములో బ్రహ్మవిద్యగూడనటులనె వేదవిషయము వేదాధ్యయనాధికారము లేనివానికి అగ్నిహోత్రాధికారము లేనట్లె విద్యాధికారముగూడ లేదు.] వేదాధ్యయనన్యాయము రెండింటికిని సమానమే.

మరియు సంవర్గవిద్యయందు వినబడుచున్న శూద్ర శబ్దము శూద్రునికి విద్యాధికారసూచకమని మీరు తలంచు చున్నారు. ఆ శబ్ద మట్టిసూచకముగాదు. అందుకు దగిన కారణములు లేవు. [అతనిక అర్థిత్వముగాని సామర్థ్యముగాని లేదని పైనజూపబడినది] ఆశబ్దము యుక్తిసమర్థితమైనపుడు విద్యాధికారసూచకమగును. కాని యట్టికారణములు కాన రావు. సంవర్గవిద్యయం దీశూద్రశబ్దము వినబడుచుండుట చేత నొకవేళ నావిద్యయందాతనికధికారము నాపాదింప

శూద్రశబ్దోఽధికృతవిషయే యోజయితుమ్. కథమిత్యుచ్యతే— "కము వర ఏనమేతత్సంతం సయుగ్వానమివ రైక్వమాత్థే"(ఛాం. 4-1-3) త్యస్మాద్ధంసవాక్యాదాత్మనోఽనాదరం శ్రుతవతో జానశ్రుతేః పౌత్రాయణస్య శుగుత్పేదేతామృషిరైక్వశూద్రశబ్దేనానేన సూచయాంబభూవాత్మనః పరోక్షజ్ఞానస్య ఖ్యాపనాయేతి గమ్యతే, జాతిశూద్రస్యానధికారాత్.

---

వచ్చును. అంతమాత్రముచే సర్వవిద్యలయందతనికధికారమున్నదని వాదింపవీలులేదు. [కాని నిజముగా శూద్రశబ్దమిచట నధికారమును బోధించుటలేదు. శూద్రశబ్దము వినబడుచున్న "అహ హారేత్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు" అనువాక్యము భూతార్థవాదవాక్యము. విద్యావిధివాక్యముతో నీవాక్యము సంబంధించియున్న ననామర్థ్యాది పూర్వోక్త కారణములచేత] శూద్రునికి విద్యాధికారమున్నట్లు జెప్పలేదు. [అట్లు చెప్పినచో వేదాధ్యయనబోధకములగు నితరశ్రుతివాక్యములకు విరోధము సంప్రాప్తమగును] [ఈ విషయము 36 వ సూత్రమునందు వివరింపబడినది]. శూద్రశబ్దమును బ్రకరణానుకూలముగ నర్థసమన్వయము చేయదగును. ఎట్లన! జానశ్రుతిని దెలిసియుండియు శకటోపేతుడగు రైక్వునిగూర్చి పల్కినరీతిగ బలుకనెట్లు శక్యము?" అను ననాదరణమగు హంసవాక్యమునువిని పౌత్రాయణుడగు జానశ్రుతికి దుఃఖము కలిగెను. రైక్వుడు తన పరోక్షవిషయజ్ఞానస్థాపనకొఱకు శూద్రశబ్దమును బ్రయోగించెను. శూద్రవంశమున బుట్టినవాడు సంవర్గవిద్యకధికారి గాడుగావున నీయర్థకల్పన మంగీకార్యమగుచున్నది.

పూ.పక్షీ: కథం పునశ్శూద్రశబ్దేన శుగుత్పన్నా సూచ్యత ఇతి,

సిద్ధాంతీ: ఉచ్యతే, తదాద్రవణాచ్ఛుచమభిదుద్రావ, శుచావాభిదుద్రువే, శుచావా రైక్వమభిదుద్రావేతి శూద్రః; అవయవార్థసంభవాద్రూఢ్యర్థస్య చాసంభవాత్: దృశ్యతే చాయమర్థో౽స్యామాఖ్యాయికాయామ్.

## క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్

(సూ 35.)

---

పూ. పక్షి: జానశ్రుతికి గలిగిన దుఃఖము శూద్రశబ్దముచే నెట్లు సూచింపబడును?

సిద్ధాంతి : సమాధానమును చెప్పుచున్నాము. శోకము పొరలిపోవుట వలన జానశ్రుతి శోకమును బొందెను. లేక శోక మాతని నావేశించెను; లేక శోకావిష్టుడై రైక్వునిదగ్గర కాతడు పరుగిడెను. ఇట్లు శూద్రశబ్దమున కేయర్థమునైనను జెప్పవచ్చును. రూఢ్యర్థమును గ్రహించుటకు సంభవము కాదు గనుక వ్యుత్పత్త్యర్థమునే గ్రహించవలయును. ఈ యర్థము జానశ్రుతి యాఖ్యాయికనుబట్టి దెలియుచున్నది. 34

అ॥ శూద్రశబ్దమునకు రూఢ్యర్థమును గ్రహించుట కెటుల సంభవముకాదో రాబోవుసూత్రమున వివరించుచున్నారు.

ఉత్తరత్ర = రాబోవు వాక్యమునందు జానశ్రుతి చైత్రరథేన=క్షత్రియుడగు చైత్రరథునితోగూడ జెప్పబడి

ఇతశ్చ న జాతిశూద్రో జానశ్రుతిః, యత్కారణం ప్రకరణనిరూపణేన క్షత్రియత్వమస్యోత్తరత్ర చైత్రరథేనాభిప్రతారిణా క్షత్రియేణ సమభివ్యాహారాల్లింగాద్గమ్యతే, ఉత్తరత్రహి సంవర్గవిద్యావాక్యశేషే చైత్రరథిరభిప్రతారీ క్షత్రియస్సంకీర్త్యతే. 'అథ హ శౌనకం చ కాపేయమభిప్రతారిణం చ కాక్షసేనిం సూదేన పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే' (ఛాం. 4-3-5) ఇతి. చైత్రరథిత్వం చాభిప్రతారిణః కాపేయయోగాదవగంతవ్యమ్.

---

నాడు. లింగాత్ = ఆ సూచనవలన క్షత్రియగ తేః=జానశ్రుతి గూడ క్షత్రియుడని నిశ్చయింపబడుటవలన॥

ఈ కారణమువలనగూడ జానశ్రుతి జాతిశూద్రుడుగా నేరడు. క్షత్రియవంశజుడగు నభిప్రతారియను పేరుగల చిత్రరథ కుమారునితో గూడ నతడు సంకీర్తనము చేయబడుచున్నాడు. 'శౌనకుడగు కాపేయునికిని అభిప్రతారియగు కాక్షసేనికిని వంటవాడు వడ్డించుచుండగా వారలనొక బహ్మచారి యాచించెను" (ఛాం. 4-3-5) అని సంవర్గవిద్యావివరణము తరువాత వాక్యశేషమునందు చైత్రరథియగు నభిప్రతారి ప్రస్తావింపబడినాడు. కాపేయునితో సమానముగ బలుకరింప బడుటవలన నభిప్రతారి చిత్రరథ వంశీయుడని యూహింపతగియున్నది. 'కాపేయులు చిత్రరథునిచే యాగము చేయించిరి.' అను శ్రుతివాక్యముచేత చిత్రరథునికిని కాపేయులుకును సంబంధము తెలియుచున్నది.

జానశ్రుతి క్షత్రియుడుగ కాన్పించుచున్నాడు.

కాపేయయోగో హి చైత్రరథస్యావగతః. 'ఏతేన వై చైత్రరథం కాపేయా అయాజయన్ని'తి. సమానాన్వయయాజినాం చ ప్రాయేణ సమానాన్వయా యాజకా భవంతి. 'తస్మాచ్చైత్రరథిర్నామైకః క్షత్రపతిరజాయత' ఇతి చ క్షత్రజాతిత్వావగమాత్ క్షత్రియత్వమస్యావగంతవ్యమ్. తేన క్షత్రియేణాభిప్రతారిణా సహ సమానాయాం సంవర్గవిద్యాయాం సంకీర్తనం జానశ్రుతేరపి క్షత్రియత్వం సూచయతి. సమానానామేవ హి ప్రాయేణ సమభివ్యాహారా భవంతి. క్షత్తృప్రేషణాద్యైశ్వర్యయోగాచ్చ జానశ్రుతేః క్షత్రియత్వావగతిః. అతో న శూద్రస్యాధికారః.

---

సామాన్యముగ నొకవంశములోని యజమానులందరు నొక వంశీయులనే యాజకులుగ గ్రహించెదరు. "చిత్రరథునివలన చైత్రరథియను నొక క్షత్రియుడు జనించెను" అనువాక్యముచే చిత్రరథుడు క్షత్రియుడని దెలియుచున్నది క్షత్రియుఁడగు నభిప్రతారితో గూడ జానశ్రుతినిగూడ నొకసంవర్గవిద్యయందు శ్రుతి సంకీర్తనము చేయుటవలన నాతడు క్షత్రియుడని సూచింపబడుచున్నది. సామాన్యముగ సమానులగు వారలనే కలిపి పలుకరించుట సంభవించును. మఱియు ద్వారపాలకుని బంపుట మొదలగు రాజచిహ్నముచేతనుగూడ జానశ్రుతి క్షత్రియుడని దెలియుచున్నది. అందువలన బ్రహ్మవిద్యయందు శూద్రునికి అధికారము లేదు. 35

## సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ (సూ 36)

ఇతశ్చ న శూద్రస్యాధికారో యద్విద్యాప్రదేశేషూపనయనాదయస్సంస్కారాః పరామృశ్యంతే— 'తం హోపనిన్యే. (శ.బ్రా. 11-5-3-13) అధీహి భగవ ఇతి హోపససాద (ఛాం. 7-1-1) బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణా

---

బ్రహ్మక్షత్రియ వైశ్యులకు మాత్రమే సంస్కార పరామర్శాత్ = సంస్కార ముదాహరింపబడుటవలన శూద్రులకు తత్ అభావ అభిలాపాత్ చ = అది లేనట్లు పేర్కొన బడుట చేతను.

[భర్తృసేవావ్యగ్రురాలగు జబాలయను నామె భర్త యొక్క గోత్రనామముల నెఱుంగకయే సత్యకాముడను నొకకుమారునిగని యాతనిని యుపనయనార్థము గౌతముడను గురువునొద్దకంపెను. తన యథార్థజన్మోదంతమును గురువునకెఱిగింప సత్యకామునికి శూద్రత్వములేదని నిశ్చయించి గురువాతనికి యుపనయనము చేయననుగ్రహించెను. ఛాం 4.4 ఖండము నిచటచూడదగును.]

ద్విజులకుసంస్కారము శూద్రునికితదభావము చెప్పబడుచున్నది.

చెప్పబోవు కారణముచేతగూడ శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదు. "అతనికి యుపనయనము చేసిరి" (శ. బ్రా. 11-5-3-13) "హేభగవన్! నాకు బ్రహ్మవిద్య నుపదేశింపుము" (ఛాం 7-1-1) "బ్రహ్మపరులు, బ్రహ్మనిష్ఠులనగు వారు బ్రహ్మము నన్వేషింపగోరి పిప్పలాదుడు

ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగ వంతం పిప్పలాదముపసన్నా' (ప్ర, 1-1) ఇతి చ 'తాన్ హానుప నీయైవే' త్యపి ప్రదర్శితైవోపనయనప్రాప్తిర్భవతి. శూద్రస్య చ సంస్కారాభావోఽభిలప్యతే, 'శూద్రశ్చతుర్థో వర్ణ ఏకజాతి' (మను. 10-4) రిత్యేకజాతిత్వస్మరణేన "న శూద్రే పాతకం కిం చిన్న చ సంస్కారమర్హతీ" (మ 10-12-6) త్యాదిభిశ్చ.

---

తమ కావిషయమునంతయు నెఱుంగజెప్పగలడని తలంచి సమిత్పాణులై యీతనికడకేగిరి" (ప్రశ్న 1-1-) ఈ మొద లగు బ్రహ్మవిద్యా ప్రస్తావనస్థలములం దుపనయనాది సంస్కారములు పరామర్శచేయబడుచున్నవి. "వారల కుపన యనములేకయే బ్రహవిద్యనుపదేశించెను" అను (ఛాం5. 11-7) వాక్య ముపనయనము సామాన్యశాస్త్రమైనట్లు బ్రదర్శించు చున్నది. [కారణాంతరముచే నదికొందరికి లుప్తమగుట విశేషశాస్త్రము. బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ద్విజన్ములు.] "నాల్గవ వర్ణమగు శూద్రజాతి ఏకజన్మ" (10-4) ఈ వచనము చేత శూద్రుని కుపనయనసంస్కారము లేకుండుట మనుస్మృతి యందు స్మరింపబడుచున్నది. "శూద్రునికి బాతకములేదు ఆతడు సంస్కారమునకర్హుడుగాడ" (మను 10-12-6) నియు వచనము కానవచ్చుచున్నది. [భక్ష్యాభక్షణ నిమిత్తమగునది పాతకము.]

## తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః (సూ 37)

ఇతశ్చ న శూద్రస్యాధికారో యత్సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే జాబాలం గౌతమ ఉపనేతుమనుశాసితుం చ ప్రవవృతే 'నైతదబ్రాహ్మణో వివక్తుమర్హతి సమిధం సోమ్యాహరోప త్వా నేష్యే న సత్యాదగా' (ఛాం. 4-4-3) ఇతి శ్రుతిలింగాత్.

---

తత్ అభావ నిర్ధారణే = సత్యకామునికి శూద్రత్వము లేదని నిశ్చయమగుచుండగా, ప్రవృత్తేః చ = గౌతముడాతనికి బ్రహ్మవిద్యోపదేశముచేయ బ్రవర్తించుటవలనను గూడ.

ఈకారణముచేతగూడ శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదు. సత్యకాముడు సత్యము చెప్పుటచేత శూద్రత్వమాతనికి లేదని నిశ్చయింప బడినదగుచుండగా నతనికి యుపనయనముచేసి బ్రహ్మోపదేశమును జేయుటకు గౌతముడు ప్రవర్తించెను. "బ్రాహ్మణుడుగానివాడిట్లు పలుకనేరడు. కావున నోయిప్రియదర్శన! నీవుపోయి సమిధలను దెమ్ము. నీ కుపనయనమును గావించెదను. నీవు సత్యమార్గమునుంచిదొలగలేద"(ఛాం4.4.5)ను శ్రుతివాక్యమిచట శూద్రునికి ఉపనయనము లేదని సూచించుచున్నది.

సత్యకాముడు శూద్రుడు కాడని నిశ్చయించి సంస్కారము చేయ బడినది.

శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ (సూ 38)

ఇతశ్చ న శూద్రస్యాధికారో యదస్య స్మృతేశ్శ్రవణాధ్యయనార్థప్రతిషేధో వేదాధ్యయనప్రతిషేధః తదర్థజ్ఞానానుష్ఠానయోశ్చ ప్రతిషేధ శ్శూద్రస్య స్మర్యతే. శ్రవణప్రతిషేధస్తావత్—'అథ హాస్య వేదముపశృణ్వతస్త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతిపూరణ' మితి 'పద్యుహవా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్ర స్తస్మాచ్ఛూద్రసమీపే నాధ్యేతవ్య' మితి చ. అత ఏవాధ్యయనప్రతిషేధో యస్య హి సమీపేఽపి నాధ్యేతవ్యం భవతి స కథం శ్రుతిమధీ

---

శూద్రునికి శ్రవణ అధ్యయన అర్థ ప్రతిషేధాత్ = వేదమును వినుట, అధ్యయనము చేయుట అర్థమును గ్రహించుటయు ప్రతిషేధము చేయబడుటవలనను, స్మృతేఃచ=స్మృతుల వలనగూడ.

ఈకారణముచేతగూడ శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదు. ఆతనికి వేదాధ్యయనశ్రవణార్థజ్ఞానానుష్ఠానములు స్మృతిచే నిషేధింపబడుచున్నవి. "వేదము నధ్యయనము చేయుచుండగా వినిన శూద్రుని కర్ణములయందు గరిగిన సీసము లక్కయు పోయవలయునని శ్రవణనిషేధము కాన్పించుచున్నది. 'శూద్రుడు పాదయుక్తమగు స్మశానమువంటివాడు కనుక శూద్రసమీపమునందు వేదాధ్యయనము నిషేధింప బడుచున్నది, ఎవ్వని సమీపమునం దధ్యయనము నిషేధింపబడుచున్నదో యాతడు వినగూడని నధ్యయనమెట్లు జేయగలడు? వేదమునుచ్చరించిన జిహ్వాఛేదమును

శూద్రునికి వేదాధ్యయనాదులునిషేధింపబడినవి.

యాత "భవతి చోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేద" ఇతి. అత ఏవ చార్థాదర్థజ్ఞానానుష్ఠానయోః ప్రతిషేధో భవతి "న శూద్రాయ మతిం దద్యా" దితి 'ద్విజాతీనామధ్యయనమిజ్యాదాన' మితి చ

యేషాం పునః పూర్వకృతసంస్కారవశాద్విదుర ధర్మవ్యాధప్రభృతీనాం జ్ఞానోత్పత్తిస్తేషాం న శక్యతే ఫలప్రాప్తిః ప్రతిబద్ధుం, జ్ఞానస్యైకాంతికఫలత్వాత్. "శ్రావయేచ్చతురో వర్ణా" నితి చేతిహాసపురాణాధిగమే చాతుర్వర్ణ్యాధికారస్మరణాత్. వేదపూర్వకస్తు నాస్త్యధికారశ్శూద్రాణామితి స్థితమ్. ఇతి నవ మాధికరణమ్.

---

వేదమును ధారణము చేసిన శరీరచ్ఛేదమును జేయవలయునని వినబడుచున్నది. అందువలననే "శూద్రునికి వేదార్థజ్ఞానమునూ గలుగజేయరాదని" వేదముయొక్క యర్థజ్ఞానము ననుష్ఠానముగూడ నిషేధింపబడుచున్నవి, వేదాధ్యయనము, యజ్ఞము,నిత్యదానము ద్విజాతులకనిగూడ గాన్పించుచున్నది.

పూర్వజన్మకృతసంస్కారవశముచేత జ్ఞానముదయించు విదురధర్మవ్యాధాదుల [కీజన్మమునందు లభించు] ఫలప్రాప్తిని నిషేధించుటకు శక్యముకాదు. జ్ఞానము నియతముగ ఫలమునిచ్చును. "చాతుర్వర్ణ్యము వారికి శ్రవణము చేయింపవలయున" నుటచే వారలకు బురాణేతిహాసములు దెలిసికొనుట కధికారము స్మరింపబడుచున్నది. శూద్రులకు వేదాధ్యయనపూర్వకమగు నధికారముమాత్రము లేదనుట నిశ్చితవిషయము.

అధికరణార్థ సంక్షేపము: శూద్రునికి అర్థిత్వసామర్థ్యములు గలవు. బ్రహ్మవిద్యను నిషేధించు ప్రమాణములు కానరాకున్నవి. కర్మాధికారము లేకున్నను విద్యాధికారముండవచ్చును. విద్యోపదేశమునకై వచ్చిన జానశ్రుతిని రైక్కుడు శూద్రుడనిపిలచి సంవర్గవిద్యనుపదేశించెను. కనుక శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము కలదని పూర్వపక్షము. సిద్ధాంతము — శూద్రునికుపనయనాధికారము లేదు. అందువలన వేదాధికారములేదు. సామర్థ్యము శాస్త్రసిద్ధము కావలయుగాని లౌకికము కానేరదు. ఏదోయొక విద్యయందధికారమున్నంతమాత్రముచేత నన్నివిద్యలయందు నధికారముకలదనిచెప్పవీలులేదు, సంవర్గవిద్యయందలి శూద్రశబ్దమునకు దుఃఖావిష్టుడని యర్థముకాని జాతిశూద్రుడర్థము కాదు. జానశ్రుతి క్షత్రియుడగు చైత్రరథునితో సహపాఠముచే క్షత్రియుడని నిశ్చయింపదగును. బ్రాహ్మణాది మూడువర్ణముల కుపనయనాది సంస్కారములు విధింపబడుచున్నవి. చతుర్థవర్ణము వారికి నిషేధింపబడుచున్నవి. సత్యకాముడు శూద్రుడు కాడని నిశ్చయించియే గౌతముడాతని కుపనయనము సేయదొడంగెను. శూద్రులకు వేదాధ్యయన శ్రవణార్థజ్ఞానానుష్ఠానములు నిషేధింపబడుచున్నవి. కనుక వారికి బ్రహ్మవిద్యాధికారము లేదు.

# (10) కంపనాధికరణమ్ (సూ 39.)

## (10) కంపనాధికరణము

అ॥ గడిచిన యధికరణత్రయమునందు ప్రాసంగికముగ సంప్రాప్తమైన బ్రహ్మవిద్యాధికార ప్రకరణము సమాప్తమైనది. 'శబ్దాదేవ ప్రమితః' 24 సూత్రము నందంగుష్ఠమాత్రశబ్దముచేత జీవబ్రహ్మలకభేదమును జెప్పదలచి జీవు డను వాదము చేయబడినాడు. అదేతీరున "యదిదంకిచ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్" (కా 2-3-2) అను కాఠకవాక్యమునందలి ప్రాణశబ్దము ముఖ్యప్రాణము ననువదించుచున్నది యని చెప్పవీలులేదు. స్పష్టముగ కాన్పించుచున్న యనేక సూచనలకు విరుద్ధముగ శూద్రశబ్దమునకు ముఖ్యార్థము చెప్పశక్యముకానట్లే పై ప్రాణశ్రుతికి వాయుసహితజగత్కంపనము, భయహేతుత్వము అమృతత్వసాధనత్వము మొదలగులింగములకు విరుద్ధమగుటవలన ముఖ్యార్థత్యాగము చేయదగునని తరువాత అధికరణము ప్రవర్తించుచున్నది. ప్రాణాధికరణమునందు (బ్ర. సూ. 1-1-23) స్పష్టముగనర్థావబోధకములగు లింగములు కాన్పించుటచే ప్రాణశబ్దము బ్రహ్మపరముగ వ్యాఖ్యానము చేయబడినది. ప్రకృతవిషయవాక్యమునందు కాన్పించు ప్రాణశబ్దము పంచవిధాత్మకమగు వాయువునందు రూఢిగ ప్రసిద్ధము. కాని యిచటవిన బహు లింగములు బ్రహ్మమునుగూడ సూచించుచున్నవి. కనుక నీ యధికరణ మవశ్యమగుచున్నది. ఇచట బహులింగ

# కంపనాత్ (సూ 39.)

అవసితః ప్రాసంగికోఽధికారవిచారః, ప్రకృతామేవ

---

బలముచే ముఖ్యార్థమును బరిత్యజించి యౌగికార్థమును గ్రహించి వాక్యార్థసమన్వయము చేయబడుచున్నది.

విషయవాక్యము : యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతమ్ మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవంతి"— (కా.2-3-2).

విషయము : ఇచటనున్న ప్రాణశబ్దమున కర్థమేమి? పంచవిధమగు ప్రాణమా? లేక బ్రహ్మమా?

పూర్వపక్షము : పంచవిధమగుప్రాణము.

సిద్ధాంతము : పరబ్రహ్మము.

అవలోకనము చేయవలపిన గ్రంథభాగములు = కాఠకము 2-3 ఖండఅంతయు, 2-2-5 1-2-14 బృహదారణ్యము 4-4-18 3-4 శ్వేతాశ్వతరము— 6-15 తైత్తిరీయము, 2-8-2)

విషయవాక్యమునందలి ప్రాణశబ్దము బ్రహ్మపరము. ఏలనన! సమస్తప్రపంచ మాతని యాజ్ఞచే కంపించుటవలన!

ప్రసంగవశమున సంప్రాప్తమైన బ్రహ్మవిద్యాధికార విచారము పూర్తిఅయినది. [నిర్విశేషబ్రహ్మప్రచురము లగు వాక్యముల యర్థవిచారణముకొఱకు బ్రవృత్తమైన

ఇదానీం వాక్యార్థవిచారణాం ప్రవర్తయిష్యామః, యదిదం కిం చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతం, మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవంతీ'తి (కా. 2-6-2) ఏతద్వాక్యం 'ఏజృ కంపనే' ఇతి ధాత్వర్థానుగమాల్లక్షితమ్. అస్మిన్ వాక్యే సర్వమిదం జగత్ప్రాణాశ్రయం స్పందతే. మహచ్చ కించిద్భయకారణం వజ్రశబ్దితముద్యతం 'తద్విజ్ఞానాచ్చామృతత్వప్రాప్తి'రితి శ్రూయతే. తత్ర కోఽసౌ ప్రాణః కిం చ తద్భయానకం వజ్రమిత్యప్రతిపత్తేర్విచారే క్రియమాణే

---

తృతీయపాదమునకు] ప్రకృతమైన వాక్యార్థవిచారణము నారంభించెదముగాక! జగత్తనుదంతయు ప్రాణమునుండి నిఃసృతమై దానియందు జలించుచున్నది. ప్రాణము మహాభయకారణము. ఎత్తబడిన వజ్రాయుధమువంటిది. ఈవిషయమును దెలిసికొనినవా రమృతత్వమును బొందుదురు” అని కాఠకశ్రుతి (2-3-2) వినబడుచున్నది. విషయవాక్యమునందు వినబడుచున్న ఏజతి యను క్రియ సూత్రమునందలి కంపనశబ్దముతో సమానార్థకము-అందువలన నీవాక్యమిచట విషయవాక్యముగ నుదాహరింపబడుచున్నది. జగత్తంతయు ప్రాణమునాశ్రయించినదై కంపించుచున్నది. ఎత్తబడిన వజ్రమనిపిలువబడుచున్న యొకవస్తువు మహాభయకారణమని పిలువబడుచున్నది. అద్దాని దెలిసికొనుటచే నభయప్రాప్తియు బేర్కొనఁబడుచున్నది. ఇట్టిప్రాణ మెవరు? వజ్రమను నీభయకారణమగు వస్తువేది? ఈవిషయములు స్పష్టముగ దెలియుటలేదు గనుక విచారణ చేయవలసివచ్చినది.

పూ.పక్షి: ప్రాప్తం తావత్ప్రసిద్ధేః పంచవృత్తిర్వాయుః ప్రాణ ఇతి, ప్రసిద్ధేరేవ చాశనిర్వజ్రం స్యాత్, వాయోశ్చేదం మాహాత్మ్యం సంకీర్త్యతే. కథమ్? సర్వమిదం జగత్పంచవృత్తౌ వాయౌ ప్రాణశబ్దితే ప్రతిష్ఠాయైజతి, వాయునిమిత్తమేవ చ మహద్భయానకం వజ్రముద్యమ్యతే. వాయౌ హి పర్జన్యభావేన వివర్తమానే విద్యుత్స్తనయిత్నువృష్ట్యశనయో వివర్తంత ఇత్యాచక్షతే. వాయువిజ్ఞానాదేవ చేదమమృతత్వమ్. తథాహి శ్రుత్యంతరం 'వాయురేవ వ్యష్టిర్వాయుస్సమష్టిరప పునర్మృత్యుం జయతి య ఏవం వేదే'తి, తస్మాద్వాయురయమిహ ప్రతిపత్తవ్య ఇత్యేతి

---

పూ.పక్షి:పంచవిధాత్మకమగు వాయువే ప్రాణమని ప్రసిద్ధిచే దెలియుచున్నది, ప్రసిద్ధిచేతనే పిడుగు వజ్రాయుధమనియు దెలియుచున్నది. ఈవాక్యమంతయు వాయువుయొక్క మాహాత్మ్యమును సంకీర్తనము చేయుచున్నది. అది ఎట్లన! (1) ఈ జగత్తంతయుప్రాణమని పిలువబడుపంచవిధాత్మకమగు వాయుయువునందు ప్రతిష్ఠితమై కంపించుచున్నది. (2)వాయునిమిత్తముగానే భయంకరమగు వజ్రాయుధ మెత్తబడుచున్నది. వాయువు పర్జన్యరూపమున మాఱినపుడు, మెరుపులు ఉరుములు, వర్షము పిడుగులు కాన్పించుచున్నవియని చెప్పుదురు. (3) అట్టి వాయువిజ్ఞానముచేతనే యమృతత్వప్రాప్తి గల్గుచున్నది. వాయువే సమస్తము. సమస్తము వాయువే. ఇట్లు దెలిసికొనినవాడు మృత్యువును జయించును" (భృ 3-3-2) అనిగదా! శ్రుతి పల్కుచున్నది. అందువలన ప్రకృతమున ప్రాణశబ్దముచే వాయువును గ్రహించవలయును.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః.—బ్రహ్మైవేదమిహ ప్రతిపత్తవ్యమ్, కుతః ? పూర్వోత్తరాలోచనాత్, పూర్వోత్తరయోర్హి గ్రంథభాగయోర్బ్రహ్మైవ నిర్దిశ్యమానముపలభామహే, ఇహైవ కథమకస్మాదంతరాలే వాయుం నిర్దిశ్యమానం ప్రతిపద్యేమహి ? పూర్వత్ర తావత్ 'తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే, తస్మింల్లోకాశ్శ్రితాస్సర్వే తదు నాత్యేతి కశ్చనే'తి. (కా 2-6-1) బ్రహ్మ నిర్దిష్టం తదేవేహాపి సన్నిధానాజ్జగత్సర్వం ప్రాణ ఏజతీతి చ లోకాశ్రయత్వప్రత్యభిజ్ఞానాన్నిర్దిష్టమితి

---

సిద్ధాంతి: ఇటుల సంప్రాప్తమైన పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాము. ఇచట ప్రాణశబ్దముచే బ్రహ్మమునే గ్రహింపవలయును. ఏలనన్న పూర్వోత్తరముల నాలోచించుటవలన!

ఇచట ప్రాణ శబ్దము బ్రహ్మపరము

(1) ప్రకృతవాక్యమునకు బూర్వమునను ఉత్తరమునను గల గ్రంథమునందు బ్రహ్మ నిర్దేశింపబడుచున్నది. అకస్మాత్తుగ మధ్యగ్రంథమున వాయువునెట్లు నిర్దేశింపదగును. "ఆబ్రహ్మ మమృతస్వరూపము, దానియందు లోకములన్నియు నాధారపడియున్నవి. ఏవియు దానినతిక్రమింపజాలవు." (కా 2-3-1) యని పూర్వవాక్యమున బ్రహ్మము నిర్దేశింపబడినది. ప్రకృతవాక్య మద్దాని తరువాత సన్నిధానముగా నుండుటచేతను, జగత్తంతయు ప్రాణమునందే కంపించుచున్నది యనువాక్యమునందు సర్వలోకాశ్రయమను బ్రహ్మలక్షణము కాన్పించుటచేతను

గమ్యతే. ప్రాణశబ్దోప్యయం పరమాత్మన్యేవ ప్రయుక్తః. 'ప్రాణస్య ప్రాణ' (బృ. 4-4-18) మితి దర్శనాత్, ఏజయితృత్వమపీదం పరమాత్మన ఏవోపపద్యతే న వాయుమాత్రస్య, తథా చోక్తం 'న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతావుపాశ్రితా' వితి. (కా, 2-5-3) ఉత్తరత్రాపి 'భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః' (కా 2-6-3) ఇతి. బ్రహ్మైవ నిర్దేక్ష్యతే న వాయుః, సవాయుకస్య జగతో

---

ఆ బ్రహ్మమే యిచట నిర్దేశింపబడుచున్నట్లు దెలియగలదు. పరబ్రహ్మము "ప్రాణమునకు బ్రాణము" (భృ 4-4-18) అనువాక్యమునందు ప్రాణశబ్దము పరమాత్మపరముగ వాడబడుచున్నటుల గాన్పించుచున్నది, (2) సర్వజగత్కంపన కారణత్వము బ్రహ్మమునందు సంభవించునుగాని వాయువునందు సంభవముకాదు. "మర్త్యుడెవడును ప్రాణముచేత గాని యపానముచేతగాని జీవింపడు. ఈరెండు వాయువులు దేని నాశ్రయించి యున్నవో దానివలన మనము జీవించుచున్నాము. (కా 2-2-5). అని శ్రుతి వినబడుచున్నది. "ఈబ్రహ్మముయొక్క భయముచేతనే యగ్ని దహించుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు. వాయువు ఇంద్రుడు, మృత్యుదేవత స్వస్వవ్యాపారనిర్వహణమునం దప్రమత్తులై ప్రవర్తించుచున్నారు. (కా 2-3-3) అని తరువాతవాక్యమునందు బ్రహ్మము నిర్దేశింపబడుచున్నదిగాని వాయువుగాదు.

భయహేతుత్వాభిధానా త్తదేవేహాపి సన్నిధానాన్మహద్భయం వజ్ర ముద్యతమితి చ భయహేతుత్వాభిధానా త్తదేవేహాపి సన్నిధానా న్మహద్భయం వజ్రముద్యతమితి చ భయహేతుత్వ ప్రత్యభి జ్ఞానాన్నిర్దిష్ట మితి గమ్యతే. వజ్రశబ్దోఽప్యయం భయహేతుత్వ సామాన్యాత్ప్రయుక్తః, యథాహి వజ్రముద్యంతం మమైవ శిరసి నిపతేద్యద్యహమస్య శాసనం న కుర్యామిత్యనేన భయేన జనో నియమేన రాజాదిశాసనే ప్రవర్తతే. ఏవమిదమగ్నివాయుసూర్యా దికం జగదస్మాదేవ బ్రహ్మణో బిభ్యన్నియమేన స్వవ్యాపారే ప్రవర్తత ఇతి భయానకం వజ్రోపమితం బ్రహ్మ. తథా చ బ్రహ్మవిషయం శ్రుత్యంతరం 'భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి

---

ఆతడు వాయువుతోగూడ గలిసియున్న జగత్తునకు భయహే తువని చెప్పబడుచున్నాడు. కనుక సాన్నిధ్యముచేతను, "ఎత్తబడిన వజ్రాయుధమువలె" అనువాక్యమునందు భయ కారణత్వమను బ్రహ్మలక్షణము కాన్పించుటచేతను ప్రకృత వాక్యము బ్రహ్మమును నిర్దేశించుచున్నట్లు నిశ్చయించుచు న్నాము. (3) వజ్రశబ్దమిచట భయసామాన్యమును దెలిజేయు చున్నది. "ఈతనియాజ్ఞను నేను నేరవేర్చనియెడల నాత డెత్తుకొనియున్న ఖడ్గము నాశిరస్సునబడునను భయముచే నియమముగ జనులు రాజాజ్ఞను నిర్వర్తించుచున్నారు. ఆవిధముగనే యగ్నిసూర్యవాయ్వాదులతోగూడినయీజగత్తు బ్రహ్మవలన భయమునొంది నియమముగ స్వవ్యాపారమున బ్రవర్తించుచున్నది. ఇట్లు భయకారణమగు బ్రహ్మము వజ్రా యుధముతో బోల్చబడుచున్నది. "ఈతని భయమువలన

సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ (తై. 8-1) ఇత్యమృతత్వ ఫలశ్రవణాదపి బ్రహ్మైవేదమితి గమ్యతే. బ్రహ్మజ్ఞానాద్ధ్యమృతత్వప్రాప్తిః 'తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ' (శ్వే. 6-25) తి మంత్రవర్ణాత్. యత్తు వాయువిజ్ఞానాత్క్వచిదమృతత్వమభిహితం తదాపేక్షికం. తత్రైవ ప్రకరణాంతరకరణేన పరమాత్మానమభిధాయ 'అతోఽన్యదార్త' (శ్వే. 3-4) మితి వాయ్వాదేరార్తత్వాభిధానాత్. ప్రకరణాదప్యత్ర పరమాత్మనిశ్చయః. 'అన్యత్ర

---

వాయువు వీచుచున్నది; సూర్యు డుదయించుచున్నాడు; అగ్ని, యింద్రుడు, మృత్యువుగూడ నీతనిభయముచేతనే తమతమపనులను నిర్వర్తించుచున్నారని" (తై 2-8-2) శ్రుత్యంతరము చెప్పచున్నది. అమృతము ఫలముగా వినబడుచుండుటచేతగూడ బ్రహ్మమే ప్రకృతమని దెలియుచున్నది. బ్రహ్మజ్ఞానమువలన నమృతప్రాప్తి కలుగునని "యీతనిని దెలిసికొని మృత్యువును దాటిపోవుచున్నాడు (మోక్షమునకు మఱియొక మార్గములేదు" (శ్వేత 6-15) అను శ్రుతివలన దెలియుచున్నది. వాయువిజ్ఞానముచే నమృతత్వప్రాప్తికలుగునని చెప్పబడిన యమృత్వ మాపేక్షికము. ఆ వాక్యమునందే ప్రకరణాంతరమున బ్రహ్మము "ఈబ్రహ్మముకంటె వేఱయినదంతయు, నశ్వరము" అని (బృ 3-4) వాయ్వాదుల న్యూనత్వ ముదాహరింపబడినది. ప్రకృత ప్రకరణవిషయమునుబట్టిగూడ బ్రహ్మమే చెప్పబడుచున్నట్లు నిశ్చయింప

ధర్మాదన్యత్రా స్మాత్కృతాకృతాత్. అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వదే'తి (కా. 1-2-14) పరమాత్మనః పృష్టత్వాత్.

---

వలయును. "శాస్త్రీయమగు ధర్మానుష్ఠానము, దానిఫలము దానిసాధనములకంటె భిన్నము, శాస్త్రవిహితధర్మము ననుష్ఠింపకపోవుటచే గలుగుపాపముకంటె భిన్నము, కార్యకారణముకంటె భిన్నము, కాలత్రయాబాధితము, వ్యవహారగోచరము కానిది యేదికలదో దానిని నీవెఱుంగుదువుగావున నద్దాని నాకుంజెప్పుమని" (కా 1-2-14) నచికేతసుడు యముని బ్రార్థించెను. ఇట్లు ప్రకరణ మంతయు బ్రహ్మవిషయమే యగుచున్నది.

<u>అధికరణ సంక్షేపార్థము</u> : కాఠకము 2-3-2 వాక్యమునందు గాన్పించుచున్న ప్రాణశబ్దము బహ్మపరము. అచట వినబడు కంపనము, ఎత్తబడిన వజ్రాయుధమువలె భయానకత్వము, అమృతప్రాప్తిహేతుత్వము మొదలగునవి బ్రహ్మలక్షణములుగాని వాయులక్షణములుగావు. ప్రాణశబ్దము బ్రహ్మమునందుగూడ వాడబడుచున్నది. "ప్రకరణమంతయు బ్రహ్మప్రకరణము.

# (11) జ్యోతిరధికరణమ్ (సూ 11)

## (11) జ్యోతిరధికరణము

అ॥ పూర్వాధికరణవిషయవాక్యమునందు వినబడు చున్న విశేషణములు పంచవిధవాయువునందు వర్తింపనేరవు గనుక ప్రాణశబ్దము బ్రహ్మపరముగ గ్రహింపబడినది. "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుప సంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" (ఛాం 8-12-3) అను వాక్యమునందు వినబడు జ్యోతిఃశబ్దమునకు బ్రహ్మమె యర్థము కావలయునను లింగములు లేవుగనుక నాశబ్దమునకు ముఖ్యార్థమేల గ్రహింపగూడదని శంక రాగా నావాక్యార్థ విచారణకొరకీయధికరణ మారంభమగుచున్నది.

విషయవాక్యము: "ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే" (ఛాం8-12-3) ఈవాక్యము ప్రజాపతి యింద్రునకు జేసిన యుపదేశము లోనిది.

సంశయము : ఇచట వినబడు జ్యోతిఃశబ్దమున కర్థమేమి? సూర్యాచంద్రమసాదిజ్యోతిస్సులా? లేక బ్రహ్మతేజస్సా?

పూర్వపక్షము : సూర్యాదితేజస్సు.

సిద్ధాంతము : బ్రహ్మతేజస్సు.

## జ్యోతిర్దర్శనాత్ (సూ 40)

"ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛాం. 8-12-3) ఇతి శ్రూయతే.

తత్ర సంశయ్యతే కిం జ్యోతిశ్శబ్దం చక్షుర్విషయం తమోఽపహం తేజః కిం వా పరం బ్రహ్మేతి.

---

అవలోకనీయగ్రంథ భాగము=ఛాందోగ్యము 8-6-5 8-7-1 8-9-3 8-12-1, బ్ర॥ సూ 1-1-24-25. 2-3-18.

విషయవాక్యమునందు వినుపించుచున్న జ్యోతిః = జ్యోతిశ్శబ్దమునకు బరబ్రహ్మ మర్థముకాని సూర్యాదిజ్యోతిస్సుగాదు. జ్యోతిఃశబ్దమునకు దర్శనాత్ = బ్రహ్మపరముగ బ్రయోగము కాన్పించుటవలన.

అవిద్యచే దేహతాదాత్మ్యమును బొందిన జీవుడు బ్రతిబుద్ధుడైనతరువాత సంప్రసాదస్థితి జేరి యీ శరీరమును వదలి దేహాదులకంటె విలక్షణమగు స్వస్వరూపమును బొందును" (ఛాం 8-12-3) అని శ్రుతి పల్కుచున్నది. [స్వప్నజాగరితములయందలి విషయేన్ద్రియసంయోగముచే సహజముగ గలుగు కాలుష్యమును వదలి ప్రసన్నముగ నుండు నవస్థ సంప్రసాదమనబడును]. ఇచట జ్యోతిఃశబ్దము చక్షురింద్రియమునకు విషయమగు చీకటిని బోగొట్టు సూర్యతేజస్సును జెప్పుచున్నదా ? లేక పరబ్రహ్మమును జెప్పుచున్నదా ? యనిసంశయింపబడుచున్నది. [గుహాధికరణమున

పూ.పక్షీ: కిం తావత్ప్రాప్తం? ప్రసిద్ధమేవ తేజో జ్యోతిశ్శబ్ద మితి. కుతః? తత్ర జ్యోతిశ్శబ్దస్య రూఢత్వాత్. (సూ. 1-1-14) 'జ్యోతిశ్చరణాభిధానా' దిత్యత్ర హి ప్రకరణాజ్జ్యోతిశ్శబ్దస్స్వార్థం పరిత్యజ్య బ్రహ్మణి వర్తతే. న చేహ తద్వత్కించిత్స్వార్థపరిత్యాగే కారణం దృశ్యతే. తథా చ నాడీఖండే—'అథ యత్రైత దస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభిరూర్ధ్వమాక్రమత' (ఛాం. 8-6-5) ఇతి ముముక్షోరాదిత్యప్రాప్తిరభిహితా. తస్మాత్ప్రసిద్ధమేవ తేజో జ్యోతిశ్శబ్దవాచ్యమితి.

---

జ్యోతిఃశబ్దము బ్రహ్మపరముగ నంగీకరింపబడినది. (1-3-18 సూత్రము చూడవలయును) అంగీకరింపబడిన విషయము నీసూత్రమున నిశ్చితార్థము చేయుటకీసంశయ ముపపాదింపబడుచున్నది].

పూ. పక్షి: లోకప్రసిద్ధమగు సూర్య తేజస్సును జ్యోతిః శబ్దము తెలియజేయుచున్నది. ఏలనన! సూర్యకాంతి యాశబ్దమునకు రూఢ్యర్థము "జ్యోతిశ్చరణాభిధానాత్" (బ్ర. సూ 1-1-24)అను సూత్రమునందు బ్రకరణముచే జ్యోతిఃశబ్దము నకుస్వార్థమును బరిత్యజించి బ్రహ్మపరముగ నర్థకల్పనము చేయబడినది. (1-1-25) సూత్రమునందు బ్రహ్మపరామర్శక వాక్యములుండుటచే స్వార్థమును విడనాడి బ్రహ్మపరముగ జ్యోతిఃశబ్దమున కర్థము చెప్పబడినది] ప్రకృతమున స్వార్థపరిత్యాగమున కట్టికారణములేమియు కానవచ్చుటలేదు. మనుజుడీ శరీరమును బరిత్యజించి బోవునపుడీకాంతికిరణముల చేతనే యూర్ధ్వలోకమునకు బోవును" అని నాడీఖండము

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః—పరమేవ బ్రహ్మ జ్యోతిశ్శబ్దం, కస్మాత్? దర్శనాత్. తస్య హీహ ప్రకరణే వక్తవ్యత్వేనానువృత్తిర్దృశ్యతే. 'య ఆత్మాపహతపాప్మా' (ఛాం. 8-7-1) త్యపహతపాప్మత్వాదిగుణకస్యాత్మనః ప్రకరణాదావన్వేష్టవ్యత్వేన విజిజ్ఞాసితవ్యత్వేన చ ప్రతిజ్ఞానాత్ 'ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి' (ఛాం. 8-9-3) ఇతి చానుసంధానాత్ 'అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః' (ఛాం.8-12-1)

---

(ఛాం 8-6-5) పలుకుచున్నది.) (3) ఈవాక్యముచేత మోక్షమును గోరువారాదిత్యలోకమునకు బోవుదురని దెలియుచున్నది. అందువలన జ్యోతిశ్శబ్దము ప్రసిద్ధమగు సూర్యకాంతినే తెలియజేయుచున్నది.

సిద్ధాంతి: ఇట్లుసంప్రాప్తమైన పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాము. జ్యోతిశ్శబ్దము పరబ్రహ్మమును దెలియజేయుచున్నది. ఏలనన! అటుల కాన్పించుటవలన! (1) ప్రకృతప్రకరణమంతయు బ్రహ్మనుగూర్చియె పలుకుచున్నటుల గాన్పించుచున్నది. "ఆత్మ పాపములు లేనివాడ" [ఛాం. 8-7-1]ను ప్రకరణాదిమవాక్యమునం దాత్మయొక్కయపహతపాప్మత్వము ప్రదర్శింపబడినది. మరియునట్టి బ్రహ్మమన్వేష్టవ్యము విజిజ్ఞాసితవ్యము నగుచున్నది యని తెలియజేయబడినది. "ఈ బ్రహ్మమునుగూర్చియే నీకు దెలియజెప్పుదును" [ఛాం. 8-9-3] అని తిరిగి [ఛాందోగ్యము 8 అధ్యాయము ప్రథమాదిషష్ఠాంత ఖండములయందు బ్రహ్మస్వరూప

జ్యోతిశ్శబ్దముకాన్పించు ప్రకరణము బ్రహ్మ విషయము.

ఇతి చాశరీరతాయై జ్యోతిస్సంపత్తేరస్యాభిధానాద్బ్రహ్మభావాచ్చా న్యతాశరీరతానుపపత్తేః. 'పరంజ్యోతిస్స ఉత్తమః పురుషః' (ఛాం. 8-12-3) ఇతి చ విశేషణాత్. యత్తూక్తం ముముక్షో రాదిత్యప్రాప్తిరభిహితేతి, నాసావాత్యంతికో మోక్షో గత్యు త్క్రాంతిసంబంధాత్, న హ్యాత్యంతికే మోక్షే గత్యుత్క్రాంతీ స్త ఇతి వక్ష్యామః. ఇతి ఏకాదశాధికరణమ్.

---

నిరూపణము చేయబడినది. [ఇట్టిబ్రహ్మను దెలిసికొనుట కింద్ర వైరోచనలిద్దఱును ప్రజాపతికడకేగిరి. వారలకు స్థూలముగ బ్రహ్మమునుగూర్చి యింద్రుడు చెప్పెను. ఇంద్రునికి తృప్తి కానందున పలుమారాయనను బ్రశ్నింప చివరకు మొదట తాను బోధించిన బ్రహ్మము ననుసరించియె సంపూర్ణముగ బోధించెను. ఈవిషయవాక్యమే 8-3-4 వాక్యమున గాన్పించు చున్నది. ఈవాక్యమునే తిరిగి యెత్తుకొని ప్రజాపతి యింద్రు నికి 8-3 ఖండమున దిరుగబోధించెను.] అతనికిశరీరసంబంధము వీడిపోయినప్పుడు సుఖదుఃఖ సంస్పర్శలేదని '[ఛాం, 8-12-1] తరువాత గ్రంథమున జ్యోతిఃసంపత్తి గలుగుటచే నశరీర త్వము సంప్రాప్తమగునట్లు బోధింపబడుచున్నది. బ్రహ్మభా వములేక యశరీరత్వము సంభవముకాదు. పరంజ్యోతిః, ఉత్తమపురుషుడను [ఛాం 8-12-3] విశేషణములు వినవచ్చు చున్నవి. (1) మోక్షమును గోరినవానికాదిత్యలోకప్రాప్తి గలుగుననువాక్యమాత్యంతికమగు మోక్షమును దెలియజేయు టలేదు. (2) ఆవాక్యమునందొకస్థలమునుండి మఱియొకస్థల మునకు గమనము ప్రాణోత్క్రమణము వినబడుచున్నది.

# (12) అర్థాన్తరత్వాదివ్యపదేశాధికరణమ్

## (12) అర్థాన్తరత్వాధికరణమ్

ఆత్యంతికమగు మోక్షమునందు స్థలాంతరగమనము, ప్రాణోత్క్రమణము సంభవముకాదని జెప్పుచున్నాము. బ్రహ్మస్వస్వరూపసాక్షాత్కారమే మోక్షము. జీవన్ముక్తునికి ప్రాణోత్క్రమణము లేదు.

అధికరణార్థసంక్షేపము : విషయవాక్యమునందలి జ్యోతిః శబ్దము బ్రహ్మపరముగాని సూర్యతేజఃపరముగాదు, ఈశబ్దము కాన్పించు ప్రకరణమంతయు బ్రహ్మబోధకముగ గాన్పించుచున్నది. 40.

అ॥పూర్వాధికరణవిషయవాక్యము వినబడుచున్న ఛాందోగ్యాష్టమాధ్యాయ ముపక్రమోపసంహారములయందు బ్రహ్మస్వరూపము నిరూపింపబడినది. అందువలన బ్రకరణమధ్యమున వినబడుచున్న జ్యోతిఃశబ్దమునకు స్వార్థపరిత్యాగము చేసి ప్రకరణానురోధముగ నర్థకల్పనము చేయబడినది. "అతీరున నే "ఆకాశో వై నామరూపయోర్నిర్వహితా" (ఛాం 8–14–1) యను తరువాత వాక్యమునందు వినబడు బ్రహ్మశబ్దమునకుపక్రమశబ్దన్యాయానుసారముగ స్వార్థమును బరిత్యజించి యాకాశమర్థము చెప్పగూడదా యనుశంక యీయధికరణమున విచారింపబడుచున్నది.

## ఆకాశోఽర్థాంతరత్వాదివ్యపదేశాత్ (సూ 41)

'ఆకాశో హ వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మే'తి (ఛాం. 8-14-1) శ్రూయతే. తత్కిమాకాశశబ్దం పరం బ్రహ్మ కిం వా ప్రసిద్ధమేవ భూతాకాశమితి విచారే.

---

విషయవాక్యము : "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" (ఛాం 8-14-1)

సంశయము : ఇచట వినబడు ఆకాశశబ్దము భూతాకాశపరమా? బ్రహ్మపరమా?

పూర్వపక్షము : భూతాకాశపరము

సిద్ధాంతము : బ్రహ్మపరము

అవలోకనీయములగు శ్రుతివాక్యములు ఛాందోగ్యము 8-14-1, 6-3-2.

విషయవాక్యమునం దుదాహరింపబడిన ఆకాశః = ఆకాశశబ్దము బ్రహ్మపరము. ఏలనన! అర్థాంతరత్వ ఆది వ్యపదేశాత్ = నామరూపములకంటె భిన్నముగ నుపదేశింపబడుటవలన.

"ఆకాశమని పిలువబడువాడు నామరూపములునన్నిటి నభివ్యక్తము చేయుచున్నాడు. దేనియందు నామరూపములు గలవో యది బ్రహ్మము. అది అమృతము. అదియె ఆత్మ అని (ఛాం 8-14-1) ఛాందోగ్యశ్రుతి వినబడుచున్నది. ఇచట

పూ.పక్షీ: భూతపరిగ్రహో యుక్తః, ఆకాశశబ్దస్య తస్మిన్ రూఢత్వాత్, నామరూపనిర్వహణస్య చావకాశదానద్వారేణ తస్మిన్యోజయితుం శక్యత్వాత్. స్రష్టృత్వాదేశ్చ స్పష్టస్య బ్రహ్మలింగస్యాశ్రవణాత్ ఇతి.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్త ఇదమభిధీయతే. పరమేవ బ్రహ్మేహాకాశశబ్దం భవితుమర్హతి, కస్మాత్, అర్థాంతరత్వాదివ్యప

---

వినవచ్చుచున్న యాకాశశబ్దము పరబ్రహ్మపరమా లేక ప్రసిద్ధమగు భూతాకాశపరమా? యనివిచారణ చేయబడుచున్నది.

పూ.పక్షి: భూతాకాశమునుగ్రహించుట యుక్తము.(1) ఆకాశశబ్దముభూతాకాశమునందురూఢము.[ఆకాశమునమస్త పదార్థములకు నవకాశమిచ్చును. నామమన శబ్దము. రూపమన శబ్దముయొక్క అర్థము.] ఈనామరూపములు రెండింటికి నాకాశమవకాశము నిచ్చుచున్నది. కనుక నామరూపనిర్వహణ మాకాశమునకు గల్పించుటశక్యము (2) బ్రహ్మముయొక్క స్పష్టలింగములగు స్రష్టృత్వాదు లీప్రకరణమున గానరావు. "అస్య లోకస్య కాగతిరిత్యాకాశ ఇతి" (ఛాం 1–9–1) యను వాక్యమునందు (బ్ర. సూ॥ 1–1–22) స్పష్టముగ బ్రహ్మలింగములు కాన్పించుటవలన నావాక్యమునందలి యాకాశబ్దమునకు బ్రహ్మమర్థము చెప్పబడినది. అట్టి స్పష్టబ్రహ్మలింగము లిచట గానరావు.

సిద్ధాంతి: ఇట్లుజేయబడిన పూర్వపక్షమునకు సమాధానము చెప్పబడుచున్నది. ఇచట నుదాహరించబడిన యాకాశము

దేశాత్, 'తే యదంతరా తద్బ్రహ్మే'తి హి నామరూపాభ్యా మర్థాంతరభూతమాకాశం వ్యపదిశతి. న చ బ్రహ్మణోఽన్యా న్నామరూపాభ్యామర్థాంతరం సంభవతి, సర్వస్య వికారజాతస్య నామరూపాభ్యామేవ వ్యాకృతత్వాత్. నామరూపయోరపి నిర్వ హణం నిరంకుశం న బ్రహ్మణోఽన్యత్ర సంభవతి. 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరణవాణీ'తి (ఛాం. 6-3-2) బ్రహ్మకర్తృత్వశ్రవణాత్.

---

బ్రహ్మమేనామరూప నిర్వహణకర్త. పరబ్రహ్మము కాదగును. ఏలనన మఱి యొకవిషయ ముదాహరింపబడుటవలన. దేనియం దీరెండును గలవో యది బ్రహ్మ మనువాక్యము అకాశము నామరూపములకంటె భిన్నమని చెప్పుచున్నది. నామరూపములకంటె భిన్నమైనది బ్రహ్మముకంటె భిన్నమైన మరియొక్క పదార్థము లేదు. వికారజాతమంతయు [అనగా జగత్తంతయు] నామరూపములచేతనే నభివ్యక్తమటగుయె సృష్టియని పిలువబడుచున్నది] "యీజీవాత్మరూపమున ప్రవే శించి నామరూపముల నభివ్యక్తమయ్యెదను" (ఛాం6-3-2) అను ఛాందోగ్యశ్రుతినిబట్టి నిరంకుశమగు నామరూపనిర్వ హణము బ్రహ్మముకంటె మఱియొకరికి శక్యముకాదు, నామ రూపములన్నియు బ్రహ్మచే సృష్టింపబడినట్లు పైశ్రుతివాక్యము చెప్పుచున్నది.

పూ.పక్షీ: నను జీవస్యాపి ప్రత్యక్షం నామరూపవిషయం నిర్వో ఢృత్వమస్తి.

సిద్ధాంతీ: బాఢమస్తి. అభేదస్త్వత్ర వివక్షితః. నామరూప నిర్వహణాభిధానాదేవ చ స్రష్టృత్వాది బ్రహ్మలింగమభిహితం భవతి. 'తద్బ్రహ్మ తదమృతం స ఆత్మే'తి (ఛాం. 8-14) చ బ్రహవాదస్య లింగాని. ఆకాశస్తల్లింగా (సూ. 1-1-22) దిత్యస్యైవాయం ప్రపంచః. ఇతి ద్వాదశాధికరణమ్.

---

పూ. పక్షి: జీవుడుగదా నామరూపముల నభివ్యక్తము చేయుచున్నట్లు పై శ్రుతివాక్యము పలుకుచున్నది?

సిద్ధాంతి: (2) నిజమే. జీవునికే నామరూపనిర్వహణము చెప్పబడినది కాని యీవాక్యమునందు జీవాత్మలకభేదము చెప్పబడుచున్నది. నామరూపనిర్వహణము పేర జగత్సర్జనము బ్రహ్మమున కొకలింగముగ నిచట చెప్పబడుచున్నది. "అదియె బ్రహ్మము అదియే అమృతము, అదియె ఆత్మ" (ఛాం. 8–14) అనువాక్యములు బ్రహ్మవాదమునకు లింగములగుచున్నవి. "ఆకాశస్తల్లింగాత్" (బ్ర 1–22) అను సూత్రార్థమునే యీసూత్రము విస్తరించుచున్నది.

<u>అధికరణసంక్షేపార్థము</u>: విషయవాక్యమునందలి యాకాశ శబ్దము బ్రహ్మపరము. నామరూపములకంటె నీయాకాశము భిన్నమని యీవాక్యము చెప్పుచున్నది, ఆకాశము భూతాకాశము కానేరదు. భూతాకాశము నామరూపాత్మకముల జగత్తున జేరినది. భూతాకాశమే యిచట వివక్షితమైనచో

నది నామరూపములకంటె భిన్నమని చెప్పుట సంభవముకాదు. నామరూపవ్యాకరణము బ్రహ్మమునకుదక్క నన్యమునకు శక్యముకాదు. 41

## (13) సుషుప్త్యుత్క్రాంత్యధికరణము

అ॥ పూర్వాధికరణ విషయవాక్యమునందలి యాకాశ శబ్దము నామరూపములకంటె భిన్నమగుటవలన బ్రహ్మపరమని యర్థకల్పనము చేయబడినది. "యోఽయంవిజ్ఞానమయః ప్రాణేషు" అని యుపక్రమింపబడిన (బృ 4-3-7) వాక్యము నందు జీవబ్రహ్మోభయలింగములు కాన్పించుచుండుటచేత నీవాక్యమునం దుదాహరింపబడిన పురుషశబ్దము జీవపరమా బ్రహ్మపరమా యను సందేహము కలుగుచున్నది. అట్టిసందే హనివారణము కొరకుత్తరాధికరణ మారంభింపబడుచున్నది.

విషయవాక్యము : "కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞాన మయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః" (బృ 4-3-7)

సంశయము : ఇచట నుదాహరింపబడిన పురుషుడు జీవుడా లేక పరబ్రహ్మమా ?

పూర్వపక్షము : జీవుడు

సిద్ధాంతము : పరబ్రహ్మము.

అవలోకనీయమగు గ్రంథము=బృహదారణ్యకము 4-3అధ్యాయమంతయు. 4-4-22 వాక్యము.

# సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన (సూ 42)

వ్యపదేశాదిత్యనువర్తతే, బృహదారణ్యకే షష్ఠే ప్రపాఠకే 'కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః' (బృ.4-3-7) ఇత్యుపక్రమ్య భూయా నాత్మవిషయః ప్రపంచః కృతః, తత్కిం సంసారిస్వరూపమాత్రా న్వాఖ్యానపరం వాక్యం? ఉతాసంసారిస్వరూపప్రతిపాదనపరమితి విశయః,

---

విషయవాక్యమునందు ముక్తజీవుడుపదేశింపబడుచు న్నాడు. ఏలనన! సుషుప్త్యుత్క్రాంత్యోః = సుషుప్తి ఉత్క్రాంత్యవస్థలయందు భేదేన = బద్ధజీవుడుముక్తజీవునికంటె భిన్నముగ చెప్పబడుట చేత"

చెప్పబడుటచేత ననుపదము నధ్యాహారముచేసి పై సూత్రమున కర్థము చెప్పవలయును. 'ఈయాత్మయేది? [యని జనకుడడిగినప్రశ్నకు యాజ్ఞవల్క్యుడు సమాధానము చెప్పుచు న్నాడు'.] "విజ్ఞానమయుడు, ఇంద్రియమధ్యగతుడు, స్వయం జ్యోతిః స్వరూపుడు హృదయాన్తస్థమగువాడునగు నీ పురుషుడే యాత్మ" యని ఉపక్రమించి బృహదారణ్యక షష్ఠప్రపాఠకమున నాత్మవిషయకమగు విచారణ యెక్కువగా విస్తరింపబడినది. [విజ్ఞానమన బుద్ధి. బుద్ధిప్రచురమగువాడని విజ్ఞానమయశబ్దార్థము. ఇంద్రియమధ్యగతుడు, హృదయాంతస్థుడనుటచే నింద్రియములకంటెను హృదయముకంటెను భిన్నుడని తాత్పర్యము] ఈ వాక్యము పూర్వముదాహరింపబడిన

పూ.పక్షీ: కిం తావత్ప్రాప్తం? సంసారిస్వరూపమాత్రవిషయమేవేతి. కుతః? ఉపక్రమోపసంహారాభ్యామ్. ఉపక్రమే 'యోఽయం విజ్ఞానమయః ప్రాణే' ష్వితి (బృ. 4-4-42) శారీరలింగాత్, ఉపసంహారే చ 'స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేష్వి'తి తదపరిత్యాగాన్మధ్యేఽపి బుద్ధాంతాద్యవస్థోపన్యాసేన తస్యైవ ప్రపంచనాత్ ఇతి.

సిద్ధాంతీ : ఏవం ప్రాప్తే బ్రూమః. పరమేశ్వరోపదేశపరమేవేదం వాక్యం న శారీరమాత్రాన్వాఖ్యానపరమ్, కస్మాత్? సుషుప్త్యా

---

సంసారియరియగు జీవునికి ననువ్యాఖ్యానరూప మగుచున్నదా లేక సంసారికాని మరియొక స్వరూపమునుపపాదించుచున్నదా యనిసంశయము.

పూ.పక్షి:ఈవాక్యము సంసారిస్వరూపమునుమాత్రముదాహరించుచున్నది. ఏలనన [1] ఉపక్రమోపసంహారము వలన "విజ్ఞానమయుడగు నీతడాత్మ" అను యుపక్రమము జీవుని సూచించుచున్నది "మహాంతము అజమునగు నాయాత్మ యింద్రియుపాధికుడై హృదయమునందున్నాడు" [బృ 4-4-22] అనునుపసంహారవాక్య మాతనిని బరిత్యజించుటలేదు. [2] మధ్యగ్రంథమునందుగూడ జాగ్రత్స్వప్నసుషుప్తుల ప్రస్తావముచేనతనివిషయమే విస్తరింప బడుచున్నది. [కనుక నీవాక్యము జీవునిగూర్చి పలుకుచున్నది.]

సిద్ధాంతి: ఇటుల ఈ పూర్వపక్షము సంప్రాప్తముకాగా సమాధానము చెప్పుచున్నాము. ప్రకృతవాక్యము పరమేశ్వరునిగూర్చి యుపదేశించుచున్నదిగాని జీవునిగూర్చిన యనువ్యాఖ్యానము కాదు. ఏలన సుషుప్త్యుత్క్రమణావస్థలయందు

ప్త్యుత్క్రాంతౌ చ శారీరాద్భేదేన పరమేశ్వరస్య వ్యపదేశాత్. సుషుప్తౌ తావత్ “అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతర' (బృ. 4 3-21) మితి శారీరాద్భేదేన పరమేశ్వరం వ్యపదిశతి. తత్ర పురుషశ్శారీరస్స్యాత్తస్య వేదితృత్వాద్బాహ్యాభ్యంతరవేదనప్రసంగే సతి తత్ప్రతిషేధసంభవాత్. ప్రాజ్ఞః పరమేశ్వరః, సర్వజ్ఞత్వలక్షణయా ప్రజ్ఞయా నిత్యమవియోగాత్ తథోత్క్రాంతావపి 'అయం శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతీ'తి (బృ. 4-3-35) జీవాద్భేదేన

---

పరమేశ్వరుడు జీవునికంటె భిన్నముగ వర్ణింపబడుటవలన. “ఈపురుషుడు ప్రాజ్ఞునిచే నాలింగితుడై బాహ్యాభ్యంతరముల రెంటినెఱుంగలేడు” [బృ 4-3-21] అనువాక్యమున సుషుప్తి

సుషుప్తియందు భేదము

యందు బరమాత్మ జీవునికంటె భిన్నమని చెప్పబడుచున్నది. బాహ్యాభ్యంతరముల తెలిసికొనుటయను లక్షణముచే నిచట పురుషుడు జీవుడగుచున్నాడు. అతని తెలిసికొనువానిగ నుదాహరించెను. బాహ్యాభ్యంతరముల దెలిసికొనుచున్నాడనుటచే తెలిసికొనలేదనియు జెప్పశక్యము. ప్రాజ్ఞుడు పరమేశ్వరు డగుచున్నాడు. ఆతడు ప్రాజ్ఞుడు ప్రజ్ఞగలవాడు ప్రాజ్ఞుడు. సర్వజ్ఞత్వము ప్రజ్ఞాలక్షణము. ఆతనిని లక్షణమెన్నడు నెడబాయదు. “శరీరములోనున్న

ఉత్క్రమణము నందు భేదము.

బురుషు డాత్మచే నధిష్ఠితుడై యూర్ధ్వోచ్ఛ్వాససమయమున శబ్దమునుజేయుచు శరీరమునుండి లేచిపోవును” [బృ 4-3-35] అను

వ్యపదేశాత్పరమేశ్వరం వ్యపదిశతి, తత్రాపి శారీరో జీవస్స్వ
చ్ఛరీరస్వామిత్వాత్, ప్రాజ్ఞస్తు స ఏవ పరమేశ్వరః, తస్మా
త్సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన వ్యపదేశాత్పరమేశ్వర ఏవాత్ర
వివక్షిత ఇతి గమ్యతే. 3

యదుక్తమాద్యంతమధ్యేషు శారీరలింగాత్తత్పరత్వ
మస్యవాక్యస్యేతి, అత్ర బ్రూమః. ఉపక్రమే తావత్ 'యోఽయం
విజ్ఞానమయః ప్రాణే' ష్వితి న సంసారిస్వరూపం వివక్షితమ్,
కింతర్హ్యనూద్య సంసారిస్వరూపం పరేణ బ్రహ్మణాఽస్యైకతాం

---

వాక్యమువలన ప్రాణోత్క్రమణసమయమున జీవుడు పర
మాత్మకంటె భిన్నుడని తెలియవచ్చుచున్నది. ఇచటగూడ
శరీరములోనున్న పురుషుడనుటచేత జీవుడే యవగత మగుచు
న్నాడు. ఆతడు శరీరమున కధిపతి. ప్రాజ్ఞుడన్ననో యతడే
పరమేశ్వరుడు. అందువలన సుషుప్త్యుత్క్రాంత్యవస్థలయందు
భేదము దాహరింపబడుటవలన బ్రకృతవాక్యమున పరమేశ్వరుడే
తెలియవచ్చుచున్నాడు.

ప్రకరణముయొక్క యాదిమధ్యావసానములయందు
జీవసూచకములు కాన్పించుచుండుటచే నీవాక్యము జీవపర
మగుచున్నదను ప్రతివాదమునకీవిధముగ

ఆదిమధ్యావసాన
వాక్యతాత్పర్యము

సమాధానము చెప్పుచున్నాము. [1] "విజ్ఞా
నమయుడగు నీతడు" అను యుపక్రమ
వాక్యము సంసారియగు జీవుని రూపమును జెప్పుటలేదు.
అంతకు బూర్వమే తెలిసియున్న సంసారిస్వరూపమును దిరిగి
చెప్పి యాస్వరూపము బ్రహ్మముకంటె వేరుకాదని మాత్రము

వివక్షతి, యతః 'ధ్యాయతీవ లేలాయతీవే' త్యేవమాద్యుత్తర గ్రంథప్రవృత్తిః సంసారిధర్మనిరాకరణపరా లక్ష్యతే. తథోప సంహారేఽపి యథోపక్రమమేవోపసంహరతి. 'స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేష్వి'తి. యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు సంసారీ లక్ష్యతే సవా ఏష మహానజ ఆత్మా పరమేశ్వర ఏవాస్మాభిః ప్రతిపాదిత ఇత్యర్థః. యస్తు మధ్యే బుద్ధాంతాద్యవస్థోపన్యాసాత్సంసారిస్వరూపవివక్షాం మన్యతే స ప్రాచీమపి దిశం ప్రస్థాపితః ప్రతీచీమపి దిశం ప్రతిష్ఠేత, యతో న బుద్ధాంతాద్యవస్థోపన్యాసేనావస్థావత్త్వం సంసారిత్వం వా వివక్షితం, కింతర్హ్యవస్థారహితత్వమసంసారిత్వం చ వివక్షతి.

---

చూపుచున్నది. "ధ్యానము చేయుచున్నట్లు చలించునట్లు కాన్పించుచున్నది." యనుతరువాత, వాక్యమునందు జీవధర్మములు త్రోసిపుచ్చబడుచున్నవి. అదేవిధముగ "నాతడు మహాంతము అజము నగుఆత్మ ఇంద్రియములయందు విజ్ఞానమయస్వరూపమున నున్నాడు" అనునుపసంహార వాక్యముగూడ జీవలక్షణములను త్రోసిబుచ్చి పరమాత్మతో నైక్యమును దెలియజేయుచున్నది. విజ్ఞానమయుడై యింద్రియములయందు సంసారిగా గాన్పించుచున్నవాడు. మహాంతము, అజమునగు పరమేశ్వరుడు ఆత్మయేయగుచున్నట్లు వివరించియుంటిమి. [2] గ్రంథమధ్యమున జాగ్రదాద్యవస్థలు పేర్కొనబడుటచే సంసారిస్వరూపము చెప్పబడుచున్నదియని తలంచువాడుతూర్పుదిక్కునుగూర్చి బయలుదేరి యేకకాలమునపశ్చిమ దిక్కునకుగూడ బోవ ప్రయత్నించినవాడగును. జాగ్రదాద్యవస్థల నుదాహరించినపుడు అవస్థలనుగాని సంసారిత్వమునుగాని

కథమేతదవగమ్యతే ? యత్ 'అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీ'తి పదేపదే పృచ్ఛతి 'యచ్చానన్వాగత స్తేన భవతి అసంగో హ్యయం పురుష' (బృ. 4-13-14-15) ఇతి పదే పదే ప్రతివ్యక్తి. 'అనన్వాగతం పుణ్యేనానన్వాగతం పాపేన తీర్ణో హి తదా సర్వాన్శోకాన్ హృదయస్య భవతీ'తి (బృ. 4-3-22) చ తస్మాదసంసారిస్వరూపప్రతిపాదనపరమేవైతద్వాక్యమిత్యవ గంతవ్యమ్.

## పత్యాదిశబ్దేభ్యః (సూ 43)

---

చెప్పుటయందు శ్రుతికి దాత్పర్యములేదు. అవస్థారాహిత్య మును సంసారరాహిత్యమును మాత్రమె చెప్పుచున్నది. ఈవిషయ మెటులదెలియుచున్నదనిన "విమోక్షమునుగూర్చి నాకు దెలియజేయుడని" పలుమారు జనకుడు యాజ్ఞవల్క్యుని గోరెను. "పూర్వసంబంధము లతని వెంట నంటిరావు. ఈపురుషు డసంగు" డని [బృ 4-3-14-15] యాజ్ఞవల్క్యుడు ప్రతిప ర్యాయము ప్రతివచనమును జెప్పెను. "ఈస్వరూపము పుణ్యా పాపములచే నసంస్పృష్టము హృదయదుఃఖములకన్నిటికి నతి డతీతుడు" [బృ 4-3-22] అనియు శ్రుతిపలుకుచున్నది. కనుక బ్రకృతవాక్యము జీవస్వరూపము నిజముగా జీవస్వరూపము గాదనిమాత్రమే యుపదేశించుచున్నది యని తెలియనగును. 42

పతి ఆది శబ్దేభ్యః = తరువాత వాక్యమునందు [బృ4-4-22] సర్వస్య ఈశానః సర్వస్యాధిపతిః యనుశబ్దము లాతని సర్వాధిపత్యమును దెలియజేయుటవలన

ఇతశ్చాసంసారిస్వరూపప్రతిపాదనపరమేవైతద్వాక్యమిత్యవగంతవ్యమ్. యదస్మిన్వాక్యే పత్యాదిశబ్దా అసంసారిస్వరూపప్రతిపాదనాస్సంసారిస్వరూపప్రతిషేధనాశ్చ భవంతి. ‘స సర్వస్య వశీ సర్వస్యేశానస్సర్వస్యాధిపతి’ రిత్యేవం జాతీయకా అసంసారిస్వభావప్రతిపాదనపరాః. ‘స స సాధునా కర్మణా

---

ఈ కారణమువలనగూడ ప్రకృతవాక్యము జీవుని యొక్క యసంసారిత్వమునే బోధించుచున్నట్లు దెలియనగును

అధిపతిత్యాది శబ్దభావము.

[“సర్వస్యవశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః” అను తరువాత వాక్యమునందు వినవచ్చు నధిపతి మొదలగు శబ్దములు జీవునియొక్క యసంసారిస్వరూపము బోధించుచు సంసారిస్వభావమును నిషేధించుచున్నవి. సర్వము వశమునందు గలవాడు, తానితరులకు పరాధీనుడు కాడు. సర్వమునకు నియంత సర్వమునకు నధిపతి ఈ మొదలగు పదములు అసంసారిస్వభావమును దెలియబఱచుచున్నవి. “సాధుకర్మచే నతడు గొప్పవాడుకాడు, అసాధుకర్మచే నతడు తక్కువవాడు కాడ”ను మొదలగు పదము లాతని సంసారిస్వభావమును నిషేధించుచున్నవి. అందువలన బరమేశ్వరుడు సంసారి కాడని యిచట చెప్పబడినట్లు దెలియనగును.

అధికరణ సంక్షేపార్థము: విషయవాక్య ప్రకరణముయొక్క యాదిమధ్యావసానములయందు జీవుడు దెలియవచ్చుచున్నాడు గనుక నచటవినవచ్చుచున్న పురుషుడు జీవుడని

భూయాన్నో ఏవాసాధునా కనీయాౕ నిత్యేవంజాతీయకాస్సంసారిస్వభావప్రతిషేధనపరా స్తస్మాదసంసారీ పరమేశ్వర ఇహోక్త ఇతి గమ్యతే.

ఇతి శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే గోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీ శంకరభగవత్పాదకృతౌ ప్రథమస్యాధ్యాయస్య తృతీయః పాదః.

---

పూర్వపక్షము. అట్టి పురుషుడు పరమేశ్వరుడని సిద్ధాంతము. సుషుప్త్యుత్క్రాంత్యవస్థలయందు జీవుడుదాహరింపబడుచున్నాడు. ఆతడు బద్ధుడు పురుషడాతనికంటె భిన్నుడు. ప్రాజ్ఞత్వము అనగా సర్వజ్ఞత్వ మాతని లక్షణము. ఇట్టిభేదము ప్రకరణమున దెలియుచున్నది. ప్రకరణోపక్రమోపసంహారములయందు జీవధర్మములు తోసిపుచ్చబడుచున్నవి. మధ్యనుగూడ నవస్థారాహిత్యము సంసారరాహిత్యము వివరింపబడుచున్నవి. 43

ప్రథమాధ్యాయము - తృతీయపాదము

సమాప్తము.



•



బ్రహ్మసూత్ర

# శాంకర మీమాంసాభాష్యమ్

కల్యాణ కౌముదీ సమేతమ్.

ప్రథమాధ్యాయే - చతుర్థః పాదః.



## (1) ఆనుమానాధికరణమ్

అ॥ ప్రథమాధ్యాయ ప్రథమ పాదమునందు స్పష్ట బ్రహ్మ లింగబోధకములగు వాక్యముల యర్థనిర్ణయము చేయబడెను. ద్వితీయపాదమున నస్పష్టములగు నుపాస్యబ్రహ్మలింగముల నుదాహరించు మరికొన్నివాక్యముల యర్థవిచారణ చేయ బడెను. తృతీయపాదమున జ్ఞేయబ్రహ్మపరములగునస్పష్ట లింగముల యర్థము వివరింపబడెను. ద్యుభ్వాద్యాయతనశబ్దా ర్థము మొదటి యధికరణమునందును [సూ 1-7] భూమశబ్దా ర్థము రెండవయధికరణమునందును [సూ 8-9] అక్షరశబ్దార్థ ము మూడవయధికరణమునందు [సూ 10-12] నాల్గవయధిక రణమునందు త్రిమాత్రమగుణోంకారముచే ధ్యానింపదగు పురుషశబ్దార్థము [సూ 13] అయిదవ యధికరణమునందు దహరాకాశశబ్దార్థము [సూ14-21] ఆఱవ అధికరణమునందు

సర్వావిభాసకమగు తేజఃస్వరూపము[సూ 22.23] నేడవయధిక ణమునందగుష్టమాత్రశబ్దార్థము [24—25] విచారింపబడినవి. సప్తమాధికరణమున మనుష్యులకు జ్ఞానాధికారముగలదనుట చేత దేవతలకుగూడ నట్టియధికారము గలదా లేదాయని ప్రాసంగికముగ సంప్రాప్తమైన యాశంక నెనిమిదవ అధికర ణమునందును [సూ 26–33] శూద్రులకట్టి యధికారము గల దాయనుప్రశ్న తొమ్మిదవ యధికరణమునందును[సూ 34.38] జర్చింపబడినవి. ప్రాసంగికముగ సంప్రాప్తమైన విచారణను బూర్తిచేసి తిరిగి యస్పష్టబ్రహ్మలింగ విచారణ యెత్తుకొన బడినది. పదియవయధికరణమున నేజనక్రియావిశిష్టమగుప్రాణ ముయొక్క స్వరూపమును, [సూ. 39–40] బదునొకండవ ప్రకరణమున సంప్రసాదవాక్యగతమగు జ్యోతిఃశబ్దముయొక్క యర్థమును, [సూ.40- ] "ఆకాశోవై నామరూపయోర్నిర్వ హితా" అనువాక్యగతయాకాశశబ్దార్థము పదియురెండవయధి కరణమునందు బృహదారణ్యక షష్ఠప్రపాఠకగతమగు నాత్మ శబ్దార్థము పదమూడవయధికరణమునందును నిర్ధారణచేయ బడినది. ఇకచతుర్థపాదమున సందిగ్ధశబ్దార్థ విచారణము చేయబడుచున్నది,

## అనుమానాధికరణము

ఈక్షత్యధికరణమునందు"సైక్షతబహుస్స్యాంప్రజాయేయ" (బ్రసూ 1-1-5) యనువాక్యమునందు చేతనత్వము చెప్ప బడుటచేతను, ప్రధానము వేదమునందు వినబడకపోవుట

## ఆనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపక విన్యస్తగృహీతేర్దర్శయతి చ (సూ. 1)

---

చేతను బ్రహ్మమును చెప్పుటయందే వేదాంతములకు దాత్పర్యమని గడచినపాదత్రయమునందు నిశ్చయింపబడినది. కాని ప్రధానము వేదాంతములయందు వినబడుటలేదను విషయమును సాంఖ్యు లాక్షేపించుచున్నారు. ఈవిషయము చతుర్థపాదమున విచారింపబడుచున్నది. పూర్వాధికరణము నందు (బ్ర.సూ. 1-3-42) బ్రసిద్ధమగు జీవుని విడనాడి ప్రాజ్ఞత్వాదిలింగములచేత అప్రసిద్ధమగు పరబ్రహ్మము గ్రహింపబడినది. ఆతీరుననే "మహతఃపరమ వ్యక్తమవ్యక్తాత్పురుషః" (కాఠక 1-3-11) యనువాక్యమునందలి అవ్యక్త పద మప్రసిద్ధమగు ప్రధానపరమను పూర్వపక్షవాద మీయధికరణమున విచారింపబడుచున్నది.

విషయము : 'మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః' (కాఠక 1-3-11 )

సంశయము : ఈవాక్యమునందు వినబడు నవ్యక్తశబ్దము ప్రధానపరమా ? లేకశరీరపరమా ?

పూర్వపక్షము : ప్రధానపరము.

సిద్ధాంతము : శరీరపరము.

అవలోకనీయ శ్రుతివాక్యములు. కఠోపనిషత్తు, 1-1-13-20-1-2-4,12,13, 1-3-3 మొదలు 11 వరకు, 15, నచికేతసునికి యముడు చేసిన యుపదేశమంతయు సామాన్యముగను.

విషయవాక్యమునందలి అవ్యక్తశబ్దము ఏకేషాం =

బ్రహ్మజిజ్ఞాసాం ప్రతిజ్ఞాయ బ్రహ్మణో లక్షణముక్తం 'జన్మాద్యస్య యతః' (బ్రా. 1-1-2) ఇతి, తల్లక్షణం ప్రధానస్యాపి సమానమిత్యాశంక్య తదశబ్దత్వేన నిరాకృతమ్ 'ఈక్షతేర్నాశబ్దం' (బ్రా. 1-1-5) మితి, గతిసామాన్యంచ వేదాంతవాక్యానాం బ్రహ్మకారణవాదం ప్రతి విద్యతే న ప్రధానకారణవాదం ప్రతీతి ప్రపంచితం గతేన గ్రంథేన. ఇదం త్విదానీమవశిష్టమాశంక్యతే—

---

సాంఖ్యులయొక్క మతమునందు అనుమానికం అపి = అనుమానప్రమాణముచే నూహింపబడు ప్రధానమగుచున్నది. ఇతి చేత్ = అనియంటి వేని, న = అది సరికాదు. శరీర రూపక విన్యస్త గృహీతేః=శరీరమే రథరూపకాలంకారముచే రథముగ నిరూపింపబడినట్లు దర్శయతి=శ్రుతి ప్రదర్శించుచున్నది.

'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' [బ్ర. సూ. 1-1-1] అను సూత్రమునందు సాధనచతుష్టయసంపత్తి గలవానికి కారణముండుటవలన బ్రహ్మము దెలిసికొనవలయునను కోరికగలుగుచున్నది.యని ప్రతిజ్ఞ చేయబడినది. జన్మాద్యస్యయతః [బ్ర. సూ. 1-1-2]అనుసూత్రమునందు[బ్రహ్మలక్షణ ముదాహరింపబడినది. ఈలక్షణము ప్రధానమునందుగూడ వర్తించునను నాశంక రాగా "ఈక్షతేర్నాశబ్దం" బ్ర. సూ.1-1-5] అనుసూత్రమునందు ప్రధానము వేదాంతములయందు జెప్పఁబడకుండుటచే నాలక్షణముద్దానికి వర్తింపదని నిరాకరింపబడినది. మఱియు బ్రహ్మమె జగత్కారణమని వేదాంతములన్నియు నొక్కతీరుగ బల్కుచున్నవియను విషయము పూర్వగ్రంథమునందు విస్తరింపబడినది. మఱియొక విషయ

యదుక్తం ప్రధానస్యాశబ్దత్వం తదసిద్ధం, కాసుచిచ్ఛాఖాసు ప్రధాన సమర్పణాభాసానాం శబ్దానాం శ్రూయమాణత్వాత్. అతః ప్రధానస్య కారణత్వం వేదసిద్ధమేవ మహద్భిః పరమర్షిభిః కపిల ప్రభృతిభిః పరిగృహీతమితి ప్రసజ్యతే. తద్యావత్తేషాం శబ్దానామన్యపరత్వం న ప్రతిపాద్యతే, తావత్సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమితి ప్రతిపాదితమప్యాకులీభవేత్. అతస్తేషామన్యపరత్వం దర్శయితుం పరస్సందర్భః ప్రవర్తతే.

పూ.పక్షి: ఆనుమానికమపి అనుమాన నిరూపితమపి ప్రధాన

---

మవశిష్టముగానున్నదియని సాంఖ్యులు తిరిగి ప్రశ్నించు చున్నారు. ప్రధానము వేదప్రసిద్ధము గాదను విషయము స్థిరము కాలేదు. ప్రధానము నుపపాదించునట్లు గాన్పించు శబ్దములు కొన్ని శాఖలయందు వినవచ్చుచున్నవి. అందువల ననే ప్రధానముయొక్క జగత్కారణత్వము వేదసిద్ధమని కపిలుడు మొదలగు మహర్షులు విస్తారముగ నంగీకరించు చున్నట్లు బర్యవసానమున దేలుచున్నది. కనుక నాశబ్దములు ప్రధానపరములు కావనియు నన్యపరములనియు స్థిరపఱుప బడనంతవరకు సర్వజ్ఞమగు బ్రహ్మము జగత్కారణమని యింతకుపూర్వము చేయబడిన యుపపాదనమంతయు దారు మాఱుగావలసివచ్చును. ఆకారణమువలన నాశబ్దములు బ్రహ్మపరములని ప్రదర్శించుటకు నుత్తరగ్రంథము ప్రవ ర్తించుచున్నది.

పూ.పక్షి: అనుమానప్రమాణముచే నిరూపితమగు ప్రధానము కొన్ని శాఖలయందు దాహరింపబడుచున్నట్లుగాన్పించుచు

మేకేషాం శాఖినాం శబ్దవదుపలభ్యతే. కాఠకే హి పఠ్యతే— 'మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పర' (1-3-11) ఇతి, తత్ర య ఏవ యన్నామానో యత్క్రమకాశ్చ మహదవ్యక్తపురుషాః స్మృతిప్రసిద్ధాస్త ఏవేహ ప్రత్యభిజ్ఞాయంతే, తత్రావ్యక్తమితి స్మృతిప్రసిద్ధేశ్శబ్దాదిహీనత్వాచ్చ న వ్యక్తమవ్యక్తమితి వ్యుత్పత్తిసంభవాత్స్మృతిప్రసిద్ధం ప్రధానమభిధీయతేఽతస్తస్య శబ్దవత్త్వాదశబ్దత్వమనుపపన్నమ్, తదేవ చ జగతః కారణం, శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధిభ్య ఇతి చేత్.

---

స్నది. అవ్యక్తస్వరూపమగు ప్రకృతి హిరణ్యగర్భునికంటె సూక్ష్మతరము మహత్తరము, పురుషుడు ప్రకృతికంటెను సూక్ష్మతరము మహత్తరమని కాఠకశ్రుతి (1-3-11) విన వచ్చుచున్నది. (2) సాంఖ్యస్మృతిప్రసిద్ధములగు మహత్తు అవ్యక్తము- పురుషుడను మూడుతత్త్వములు స్మృతియందేనామములతో నేవరుసన నుపపాదింపబడినవో యీ నామములతో నావరుసను కాఠకశ్రుతియందుగూడ గుర్తింపబడుచున్నవి. [సాంఖ్యపరిభాషయందు- బుద్ధిని మహత్తనియు ప్రధానము లేక ప్రకృతికి నవ్యక్తమనియు, నాత్మను బురుషుడనియు పేరు] (3) సాంఖ్యస్మృతిప్రసిద్ధము, శబ్ద స్పర్శ రూప రసగంధాది విహీనము. వ్యక్తము కానిది యవ్యక్తమని యాశబ్దమునకు వ్యుత్పత్తి గలుగుచుండుటచేత బ్రధానమవ్యక్తశబ్దబోధితమగుచున్నది. కనుకనది వేద ప్రతిపాదితమగుచున్నది. అటులకాదనుటకు వీలులేదు. శ్రుతి స్మృతి, హేతువాదముల బలముచేత బ్రధానమే జగత్కారణమని మేమందుము.

సిద్ధాంతీ: నైతదేవమ్. న హ్యేతత్కాఠకవాక్యం స్మృతిప్రసిద్ధయోర్మహదవ్యక్తయోరస్తిత్వపరమ్. న హ్యత్ర యాదృశం స్మృతిప్రసిద్ధం స్వతంత్రం కారణం త్రిగుణం ప్రధానం తాదృశం ప్రత్యభిజ్ఞాయతే, శబ్దమాత్రం హ్యత్రావ్యక్తమితి ప్రత్యభిజ్ఞాయతే, స చ శబ్దో న వ్యక్తమవ్యక్తమితి యౌగికత్వాదన్యస్మి

---

సిద్ధాంతి : (1) సాంఖ్యస్మృతిచే నుపపాదింపబడుచున్న మహదవ్యక్తములను బైకాఠకము పలుకుటలేదు. త్రిగుణాత్మకము, స్వతంత్రము జగత్కారణమని యాస్మృతియందు బ్రసిద్ధమని యే ప్రధానము నంగీకరించిరో యా ప్రధానము శ్రుతియందు మాకు గాన్పించుటలేదు. అచట నవ్యక్తమను నొక శబ్దమునుమాత్ర మంగీకరించుచున్నాము. వ్యక్తము కానిది యవ్యక్తమను వ్యుత్పత్త్యర్థముచేత సూక్ష్మము చూచుటకు గానరానిదియు నగు మఱియొక పదార్థమునందు గూడ నాపదమును వాడవచ్చును. ఆపదమా దేనియందును రూఢము కాదు.

అవ్యక్త పదమునకు రూఢ్యర్థము లేదు.

[పంకజమను శబ్దమునకు బురదయందు బుట్టినదియని వ్యుత్పత్త్యర్థము. వ్యుత్పత్తిచే నాశబ్దము నత్తగుల్లయందును దామరపూవునందునుగూడ నన్వయించును. కాని భాషయం దాశబ్దము తామరపూవునందే సుప్రసిద్ధముగ వాడుకచే రూఢియగుచున్నది. వాడుకచే సిద్ధమైన యర్థము రూఢ్యర్థము. ప్రకరణమునుబట్టి రూఢ్యర్థ మన్వయింపనప్పుడు వ్యుత్పత్త్యర్థమును గ్రహింతుము. దీనినే యౌగికార్థమని గూడ

న్నపి సూక్ష్మే దుర్లక్ష్యే చ ప్రయుజ్యతే, న చాయం కస్మింశ్చి ద్రూఢః. యా తు ప్రధానవాదినాం రూఢిస్సా తేషామేవ పారిభాషికీ సతీ న వేదార్థనిరూపణే కారణభావం ప్రతిపద్యతే. నచ క్రమమాత్రసామాన్యాత్సమానార్థప్రతిపత్తిర్భవత్యసతి తద్రూపప్రత్యభిజ్ఞానే. న హ్యశ్వస్థానే గాం పశ్యన్నశ్వోఽయమిత్యమూఢోఽధ్యవస్యతి. ప్రకరణనిరూపణాయాం చాత్ర న పరపరికల్పితం ప్రధానం ప్రతీయతే, శరీరరూపకవిన్యస్తగృహీతేః, శరీరం హ్యత్ర రథరూపకవిన్యస్తమవ్యక్తశబ్దేన పరిగృహ్యతే. కుతః, ప్రకరణాత్పరిశేషాచ్చ. తథా హ్యనంతరాతీతో గ్రంథ

---

నందురు.] ప్రధానవాదు లాపదమును ప్రధానమునందు రూఢిగ గ్రహించుచున్నారు. అది వారలకు బారిభాషిక పదము.అంతమాత్రముచే నది వేదమునందువినవచ్చు నవ్యక్త పదమున కర్థమును నిరూపించుటకు గారణము కానేరదు. (2) వేదమునందు వినవచ్చుచున్న పదక్రమమె సాంఖ్యస్మృతి యందు వినవచ్చుచున్నంతమాత్రముచేత నొకేయర్థమును నిరూపింపగల కారణములు లేనపు డాపదము లుభయస్థలముల సమానార్థకములు గా నేరవు. అశ్వముండుచోట గోవునుజూచి యిది అశ్వమని మూఢుడుకానివాడెవ్వడును దలంపడు (4) ప్రకరణసందర్భమునుబట్టి నిశ్చయించినపుడు సాంఖ్యపరికల్పితమగుప్రధానము తెలియవచ్చుట లేదు. రథరూపకముచే నీప్రకరణమున నవ్యక్త

అవ్యక్తశబ్దము శరీరపదము.

శబ్దముచే శరీరము పరిగ్రహింపబడుచున్నది. ఏలనన! ప్రకరణ బలముచేతను.శరీరము దక్క-మఱియొకటిమిగిలియుండకుండుట

ఆత్మశరీరాదీనాం రథిరథాదిరూపకక్లృప్తిం దర్శయతి. "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు. బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ. ఇంద్రియాణి హయానాహుర్విషయాం స్తేషు గోచరాన్. ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (31-3-3, 4) ఇతి. తైశ్చేంద్రియాదిభిరసంయతై స్సంసారమధిగచ్ఛతి. సంయతైస్త్వధ్వనః పారం తద్విష్ణోః పరమం పదమాప్నోతీతి దర్శయిత్వా కిం తదధ్వనః పారం విష్ణోః పరమం పదమిత్యస్యామాకాంక్షాయాం తేభ్య ఏవ ప్రకృతేభ్య ఇంద్రియాదిభ్యః పరత్వేన పరమాత్మానమధ్వనః పారం

---

చేతను. ప్రకృతవాక్యమునకు సన్నిహితపూర్వమునందున్న గ్రంథమునందు ఆత్మ, శరీరము మొదలగునవి, రథికుడు, రథము మొదలగువానితోఁ బోల్పబడుచున్నవి. "ఆత్మ రథికుడనియు, శరీరము రథమనియు, బుద్ధి సారథియనియు, మనస్సు పగ్గపుత్రాడనియు, ఇంద్రియములు గుఱ్ఱములనియు, విషయములు వాని గమనమార్గములనియు దెలిసికొనుము. ఆత్మ ఇంద్రియములతోను, మనస్సుతోడను కలసి భోక్తయగుచున్నాడని పెద్దలనుచున్నారు" (కాఠ 1-3-3,4) అని సన్నిహితపూర్వవాక్యముగలదు. తరువాత నింద్రియాదుల నియమనము చేసికొనలేనివాడు సంసారమును బొందుననియు, నియమనము చేసినవాడు జీవయాత్రయొక్క నద్దరియగు విష్ణుపదమునుబొందుననియు ప్రదర్శించినది. ఆవిష్ణుపదమెద్దియని శంక రాగా, ప్రకృతములగు నింద్రియములకంటె భిన్నమగు నదగా సంసారేతరమగు స్థానమే పరమగు విష్ణుపదమని "ఇంద్రియ

తద్విష్ణోః పరమం పదం దర్శయతి "ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, మనసస్తు పరాబుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః. మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః, పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతి" (31-3-10, 11) రితి. తత్రి యం ఏవేంద్రియాదయః పూర్వస్యాం రథరూపక కల్పనాయామశ్వాదిభావేన ప్రకృతాస్త ఏవేహ పరిగృహ్యంతే. ప్రకృతహానాప్రకృత ప్రక్రియాపరిహారాయ. తత్రేంద్రియమనో బుద్ధయస్తావత్పూర్వత్రేహ చ సమానశబ్దా ఏవ, అర్థాస్తు యే

---

ములు, ఆకాశాదిపంచభూతములు, మనస్సు, బుద్ధి హిరణ్యగర్భుడు—ఇవి పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము సూక్ష్మతరము, మహత్తరము, అటులనే పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము ప్రత్యగాత్మభూతము నగుచున్నది. అవ్యక్త స్వరూపమగు ప్రకృతి హిరణ్యగర్భుని కంటెను సూక్ష్మతరము, మహత్తరము, పురుషుడు ప్రత్యగాత్మభూతుడు. పురుషునికంటె సూక్ష్మతరము, మహత్తరమునగు మఱియొకటియేదియు లేదు. సూక్ష్మత్వ మహత్వముల ప్రత్యగాత్మత్వముల కతడే పరమావధి." యని శంకను వివరించుచున్నది. పూర్వము రథరూపకమున నశ్వాదిభావనచే నుదాహరింపబడిన యింద్రియాదులే ప్రకృతమునగూడ గ్రహింపబడుచున్నవి. అట్లుగానిచో బ్రకృతమును బరిత్యజించుటయు, నప్రకృతమును బరిగ్రహించుటయు సంభవించును. ఇంద్రియమనోబుద్ధిశబ్దము లుభయస్థలముల యందును సమానములే యగుచున్నవి. రెండవవాక్యమునందుదాహరింపబడిన యర్థములే. మొదటివాక్యమునందు బేర్కొన

శబ్దాదయో విషయా ఇంద్రియహయగోచరత్వేన నిర్దిష్టాస్తేషాం చేంద్రియేభ్యః పరత్వం 'ఇంద్రియాణాం చ గ్రహత్వం విషయాణామతిగ్రహత్వ' మితి (బృ. 3-2) శ్రుతిప్రసిద్ధేః. విషయేభ్యశ్చ మనసః పరత్వం, మనోమూలత్వా ద్విషయేంద్రియవ్యవహారస్య, మనసస్తు పరా బుద్ధిః, బుద్ధిం హ్యారుహ్య భోగ్యజాతం భోక్తారముపసర్పతి, బుద్ధేరాత్మా మహాన్పరో యస్సః 'ఆత్మానం రథినం విద్ధీ'తి రథిత్వేనోపక్షిప్తః, కుతః ఆత్మశబ్దాత్, భోక్తుశ్చ భోగోపకరణాత్పరత్వోపపత్తేః. మహత్త్వం చాస్య స్వామిత్వా

---

పడిన శబ్దాదివిషయములు. అవియె యింద్రియములను హయములకు గోచరములగు రథమార్గములని నిర్దిష్టములగుచున్నవి. విషయములు వానిగ్రహించు నింద్రియములకంటె భిన్నములని "ఇంద్రియములు గ్రహించునవి. విషయములు వానికతిగ్రహములు, అనగా వానికంటె నెక్కువఅయినవి"(బృ3-2)అని శ్రుతిచెప్పుచున్నది. విషయేన్ద్రియసంబంధము,మనస్సు నాధారము చేసికొనియుండుటచేత, మనస్సు విషయములకంటె నెక్కువది. భోగ్యజాతమంతయు బుద్ధిద్వారా భోక్తయగు నాత్మ నందుకొనుటచేత బుద్ధి మనస్సుకంటె పెద్దది.ఆత్మ రథికుడుగ వర్ణింపబడుటవలన ఆత్మ బుద్ధికంటె నెక్కువ. "ఆత్మను రథికునిగ దెలిసికొనవలయు" ననువాక్యమునం దుదాహరింపబడిన యాత్మయే యిచటగూడ నుదాహరింపబడుచున్నాడు. భోక్త భోగ్యజాతముకంటె నెక్కువయగుచున్నాడు. సర్వమునకు స్వామియగుటచే నతడు మహాంతమనియు బిలువబడుచున్నాడు.

దుపపన్నమ్. అథ వా "మనో మహాన్మతిర్బ్రహ్మా పూర్బుద్ధిః ఖ్యాతిరీశ్వరః, ప్రజ్ఞా సంవిచ్చితిశ్చైవ స్మృతిశ్చ పరిపఠ్యతే" ఇతి స్మృతేః 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' (శ్వే. 6-18) ఇతి చ శ్రుతేః. యా ప్రథమజస్య హిరణ్యగర్భస్య బుద్ధిస్సా సర్వాసాం బుద్ధీనాం పరమా ప్రతిష్ఠా సేహ మహానాత్మేత్యుచ్యతే. సా చ పూర్వత్ర బుద్ధిగ్రహణేనైవ గృహీతా సతీ హిరుగిహోపదిశ్యతే, తస్యా

లేక ! "హిరణ్యగర్భుని సంకల్పవికల్పాత్మకమగు మనస్సు మహాంతము; ఆత్మ మననాత్మకము; భోగ్యజాతమున కాటపట్టు బుద్ధి; స్వరూపనిరూపణము ఈశ్వరుడు; ప్రకృష్టమగుజ్ఞానము సదసద్విచారణశక్తి; చైతన్యప్రధానము స్మృతి, అని విద్వాంసులు ప్రసిద్ధముగ తలంచుచున్నారు" అని స్మృతి చెప్పుచున్నది. "హిరణ్యగర్భుడు ముందుగ చతుర్ముఖబ్రహ్మను సృజియించి యాతనికి వేదము నిచ్చెను" (శ్వేత 6-18) అని శ్రుతి వినవచ్చుచున్నది. ఈశ్రుతులవలన హిరణ్యగర్భునిబుద్ధి సమష్టిస్వరూపమై వ్యష్టిరూపములగు వ్యక్తిగతబుద్ధులకంటె నుత్కృష్టమైనదని స్పష్టమగుచున్నది. పూర్వము బుద్ధిశబ్దముచేత చెప్పబడిన ప్రజ్ఞయే యిచటతిరిగి హిరణ్యగర్భుని బుద్ధిగ నుపపాదింపబడుచున్నది. హిరణ్యగర్భబుద్ధియె యిచట ప్రత్యేకముగ చెప్పబడుచున్నది. అది మనబుద్ధులకంటె నుత్కృష్టమగుచున్నది. హిరణ్యగర్భబుద్ధిపక్షమున, రథకల్పనయందు రథికునిగ వర్ణింపబడిన యాత్మ పరమాత్మయని గ్రహింపవలయును.

అపి అస్మదీయాభ్యాం బుద్ధిభ్యాం పరత్వోపపత్తేః. ఏతస్మింస్తు పక్షే పరమాత్మవిషయేణైవ పరేణ పురుషగ్రహణేన రథిన ఆత్మనో గ్రహణం ద్రష్టవ్యం, పరమార్థతస్తు పరమాత్మవిజ్ఞానాత్మనో

---

యథార్థమున, పరమాత్మ జీవాత్మలకు భేదములేదు ఈవిధముగ సమన్వయముచేయగ శరీరమొకటిమాత్రము మిగులుచున్నది.

[రథరూపకము కాఠకము 3–3–4 వాక్యములయందును, విష్ణుపదము 9–10–11 వాక్యములలో నుదాహరింపబడినది. ఈరెండు వాక్యసముదాయములచే నిరూపింపబడిన విషయములును విమర్శించినచో శరీరము రథముగా వర్ణింపబడినట్లు అర్థము పర్యవసన్నమగున్నదియని పై భాష్యతాత్పర్యము. భాష్యార్థము దిగువకోష్ఠమున వివరింపబడుచున్నది.

| రథకల్పనవివరణము | విష్ణుపదవివరణము |
|---|---|
| ఆత్మ – రథీ | ఇంద్రియముల కంటె – అర్థములు, |
| శరీరము – రథము | అర్థములకంటె – మనస్సు, |
| బుద్ధి -- సారథి | మనస్సుకంటె – బుద్ధి. |
| మనస్సు -- ప్రగ్రహము | బుద్ధికంటె -- మహత్తు, |
| ఇంద్రియములు -- హయములు | మహత్తుకంటె -- అవ్యక్తము, |
| విషయములు -- హయమార్గము | అవ్యక్తముకంటె--పురుషు డుత్కృష్టము, పురుషునికంటె నుత్కృష్టము లేదు. |

ఉభయస్థలములయందు, బుద్ధి మనస్సు, ఇంద్రియ విషయములు, ఆత్మ సమానముగానున్నవి. శరీరము మొదటిభాగమునందు, అవ్యక్తము రెండవభాగమునందును మిగిలియున్నవి. కనుక శరీరమవ్యక్తము కావలసివచ్చును.]

ర్భేదాభావాత్. తదేవం శరీరమేవైకం పరిశిష్యతే. తేష్వితరాణీంద్రియాదీని ప్రకృతాన్యేవ పరమపదదిదర్శయిషయా సమను క్రామన్పరిశిష్యమాణేనేహానేనావ్యక్తశబ్దేన పరిశిష్యమాణం ప్రకృతం శరీరం దర్శయతీతి గమ్యతే. శరీరేంద్రియ మనోబుద్ధి విషయవేదనాసంయుక్తస్య హ్యవిద్యావతో భోక్తుశ్శరీరాదీనాం రథాదిరూపకకల్పనయా సంసారమోక్షగతినిరూపణేన ప్రత్యగాత్మ బ్రహ్మావగతిరిహ వివక్షితా, తథా చ 'ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభి'రితి. (క. 1-3-12) వైష్ణవస్య పరమపదస్య దురవగమత్వముక్త్వా తదవగమార్థం యోగం దర్శయతి 'యచ్ఛేద్వా

---

పరమపదమును ప్రదర్శింపదలచి ప్రకృతములగు నింద్రియాదుల నుదాహరించి యవ్యక్తపదముచేత మిగిలిన శరీరమును జూపుచున్నట్లు దెలియుచున్నది. శరీరేంద్రియమనోబుద్ధి విషయజ్ఞానములతో గూడుకొని అవిద్యచే భోక్తయగుచున్న యాత్మకు శరీరాదిరథకల్పనముచే సంసారముపోయి మోక్షము లభించుమార్గమును నిరూపణచేసి జీవబ్రహ్మల యభేదజ్ఞానమును శ్రుతి యుపదేశించుచున్నది. "ఆత్మ సర్వభూతములయందు నిగూఢముగనున్నది. బాహ్యామునకు బ్రకాశింపదు. ఏకాగ్ర్యము సూక్ష్మము నగుబుద్ధి సాహాయ్యముచే సూక్ష్మదర్శనకుశలులగు బండితులచే నతడవలోకింపబడుచున్నాడు" "[కాఠ 1-3-12] అని విష్ణుపదము యొక్క దురవగాహత్వ ముదాహరింపబడినది. అట్టిపరమపదమును బొందుటకు" పండితుడైనవాడు వాగాదిసకలేన్ద్రియ

జ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని, జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మనీ'తి. (క. 1-3-13) ఏతదుక్తం భవతి– వాచం మనసి సంయచ్ఛేత్. వాగాదిబాహ్యేంద్రియవ్యాపారముత్సృజ్య మనోమాత్రేణావతిష్ఠేత. మనోఽపి విషయవికల్పాభిముఖం వికల్పదోషదర్శనేన జ్ఞానశబ్దోదితాయాం బుద్ధావధ్యవసాయస్వభావాయాం ధారయేత్. తామపి బుద్ధిం మహత్యాత్మని భోక్తర్యగ్ర్యాయాం వా బుద్ధ్యా సూక్ష్మతాపాదనేన నియచ్ఛేన్మహాంతం త్వాత్మానం శాంత ఆత్మని ప్రకరణవతి పరస్మిన్పురుషే పరస్యాం కాష్ఠాయాం ప్రతిష్ఠాపయేదితి చ. తదేవం

---

వ్యాపారమును మనస్సునం దుపసంహరింపవలయును, ఆమనస్సును ప్రకాశస్వరూపమగు బుద్ధ్యాత్మయందు నియమింపవలయును, అట్టిబుద్ధిని ప్రథమజుడగు హిరణ్యగర్భుని యందు నియమించవలెను. ఆ హిరణ్యగర్భబుద్ధిని సర్వవికారశూన్యమగు ముఖ్యాత్మయందు నిలుపవలెను."(కాఠ 1–3–13) అని మార్గమునుబోధించినది, దీనిఫలితర్థమేమన! మనస్సును వాక్కునందు నియమనము చేయవలెను. వాగాది బాహ్యేంద్రియవ్యాపారమును పరిత్యజించి కేవలమనోమాత్రుడై యుండవలయును. మనస్సుగూడ విషయముల గుణదోషములను విమర్శించి వానియందు దోషములు కాన్పించుటచేత జ్ఞానశబ్దముచే బిలువబడు నిశ్చయాత్మకమగు బుద్ధియందు నిలుచును. ఆబుద్ధిని భోక్త్రాత్మయగు జీవాత్మయందు నియమనము చేయవలెను. జీవాత్మను శాంతము, ప్రకరణవిషయము పరాకాష్ఠయునగు పరమపురుషునియందు నియమనము చేయ

పూర్వాపరాలోచనాయాం నాస్త్యత్ర పరపరికల్పితస్య ప్రధానస్యావకాశః.

## సూక్ష్మం తు తదర్హత్వాత్ (సూ 2)

ఉక్తమేతత్ప్రకరణపరిశేషాభ్యాం శరీరమవ్యక్తశబ్దం న ప్రధానమితి, ఇదమిదానీమాశంక్యతే.

పూ.పక్షీ: కథమవ్యక్తశబ్దార్హత్వం శరీరస్య, యావతా స్థూలత్వాత్స్పష్టతరమిదం శరీరం వ్యక్తశబ్దార్హమస్పష్టవచనస్త్వవ్యక్తశబ్ద ఇతి.

---

వలెను. ఈవిధముగ పూర్వాపరసందర్భములు పర్యాలోచన చేయగా సాంఖ్యకల్పితమగు ప్రధానమున కెంతమాత్ర మవకాశము లేదు,

అవ్యక్తశబ్దముచేత సూక్ష్మం తు=లింగశరీరము చెప్పబడుచున్నది. తత్ అర్హత్వాత్=ఆ యర్థమున కది తగియుండుటవలన.

ప్రకరణమునందు మిగిలియుండుటచేతను, ప్రకరణ విషయబలముచేతను అవ్యక్తశబ్దమునకు శరీరమర్థముగావి ప్రధాన మర్థముగాదు. కాని యిపుడీ యాశంక చేయబడుచున్నది.

పూ. పక్షి : అవ్యక్త శబ్దముచే శరీరము నెట్లు చెప్పనగును. శరీరము స్థూలము, స్పష్టముగ కాన్పించుచున్నది. కనుక నది వ్యక్తమని చెప్పతగును. అవ్యక్తశబ్ద మస్పష్టమగు దానిని చెప్పును.

సిద్ధాంతీ: అత ఉత్తరముచ్యతే—సూక్ష్మం త్విహ కారణాత్మనా శరీరం వివక్ష్యతే, సూక్ష్మస్యావ్యక్తశబ్దార్హత్వాత్. యద్యపి స్థూలమిదం శరీరం న స్వయమవ్యక్తశబ్దమర్హతి, తథాపి తస్య త్వారంభకం భూతసూక్ష్మమవ్యక్తశబ్దమర్హతి, ప్రకృతిశబ్దశ్చ

---

సిద్ధాంతి: అందువలనసమాధానము చెప్పుచున్నాము. కారణ స్వరూపమగు సూక్ష్మశరీర మిచట పలుకరింపబడుచున్నది. సూక్ష్మ మవ్యక్తశబ్దముచే చెప్పతగదు. అయినను స్థూలశరీరమునకు కారణమై నట్టియు అపంచీకృతమై నట్టియు భూతపంచక మవ్యక్తశబ్ద వాచ్యమగుచున్నది, [అపంచీకృతములగు పృధివ్యాదిపంచ భూతముల ప్రత్యేకసత్వాంశలవలన జ్ఞానేంద్రియపంచకము, రాజసాంశములచేత కర్మేంద్రియ పంచకము గలుగుచున్నవి. వానియొక్క సమష్టిసత్వాంశములవలన అంతఃకరణము, సమష్టిరజోంశమువలన ప్రాణపంచకము కలుగుచున్నవి. అంతఃకరణము కర్మజ్ఞానప్రాణపంచకములచే సూక్ష్మశరీరము కలుగుచున్నది దానివలన స్థూలశరీరము కలుగుచున్నది. మాచేరచింపబడిన ఆంధ్రపంచదశి 54 వ పుటమును చూడవలెను.] కనుక స్థూలశరీరమున కారంభకమగు నపంచీకృత భూతపంచకము నవ్యక్తశబ్దముచే చెప్పనగు.[కార్యకారణములకు భేదములేకుండుటచే] కారణమును బోధించుశబ్దమును కార్యమునం దుపయోగించుట కాన్పించుచున్నది. "గోవులను సోమముతో కలుపుము" అనువాక్యమునందు కార్యమగు గోక్షీరము కారణమగు గోశబ్దముచే చెప్పబడు

సూక్ష్మశరీర ముగ్రహింప తగును.

వికారే దృష్టః యథా 'గోభిశ్శ్రీణీత మత్సర' మితి. తథా శ్రుతిశ్చ 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీ' దితి. (బృ. 1-4-7) ఇదమేవ వ్యాకృతం నామరూపవిభిన్నం జగత్ప్రాగవస్థాయాం పరిత్యక్త వ్యాకృతనామరూపం బీజశక్త్యవస్థమవ్యక్తశబ్దయోగ్యం దర్శయతి.

## తదధీనత్వాదర్థవత్ (సూ 3)

పూ.పక్షి: అత్రాహ — యది జగదిదమనభివ్యక్తనామరూపం బీజాత్మకం ప్రాగవస్థమవ్యక్తశబ్దార్హమభ్యుపగమ్యేత; తదాత్మనా

---

చున్నది. 'వ్యాకృతనామరూపాత్మకమై ప్రత్యక్షముగనున్న నీజగత్తు అవ్యాకృతనామరూపాత్మకమై పరోక్షముగ నుండెనట' [బృ. 1-4-7] అనువాక్యమునందు జగత్తుయొక్క పరోక్షప్రత్యక్షములచే నేకత్వమున ఆ ఈ యనుసబ్దములచేత చెప్పబడుచున్నది. అనగా వ్యాకృతనామరూపముచే విభిన్నముగ కాన్పించుచు ప్రత్యక్షమగు నీ జగత్తుయొక్క నామరూపములు లేని బీజావస్థను అవ్యక్తశబ్దముచే చెప్పతగినట్లు తెలియుచున్నవి. 2

స్థూలశరీరము తత్ అధీనత్వాత్ — సూక్ష్మశరీరాధీనమగుటవలన దానియందు అర్థవత్ = అవ్యక్తశబ్ద మర్థవంతమగుచున్నది.

పూ. పక్షి : ఇచట పూర్వవాది యిట్లనుచున్నాడు: స్థూలశరీర మవ్యక్తశబ్దవాచ్యము కాతగునునుటకై యీ జగత్తు సృష్టికిపూర్వ మనభివ్యక్తనామరూపము బీజాత్మకమునై అవ్యక్తశబ్దముచే పేర్కొనబడదగియున్నదని మీరం

చ శరీరస్యాప్యవ్యక్తశబ్దార్హత్వం ప్రతిజ్ఞాయేత. స ఏవ తర్హి ప్రధానకారణవాద ఏవం సత్యాపద్యేత. అస్యైవ జగతః ప్రాగవస్థాయాః ప్రధానత్వేనాభ్యుపగమాదితి.

సిద్ధాంతీ: అతోఽభిధీయతే—యది వయం స్వతంత్రాం కాంచిత్ప్రాగవస్థాం జగతః కారణత్వేనాభ్యుపగచ్ఛేమ ప్రసంజయేమ తదా ప్రధానకారణవాదమ్. పరమేశ్వరాధీనా త్వియమస్మాభిః ప్రాగవస్థా జగతోఽభ్యుపగమ్యతే న స్వతంత్రా. సా చావశ్యమభ్యుపగంతవ్యా. అర్థవతీ హి సా. న హి తయా వినా పరమేశ్వరస్య స్రష్టృత్వం సిద్ధ్యతి, శక్తిరహితస్య తస్య ప్రవృత్త్యనుపపత్తేః.

---

గీకరించినచో, ననభివ్యక్త స్వరూపమున శరీరముగూడ నవ్యక్తశబ్దముచే చెప్పనొప్పు. ఆపక్షమున మాప్రధానవాదమే సిద్ధమగుచున్నది. సృష్టికి పూర్వావస్థ ప్రధానమనియే మేమంగీకరించుచున్నాము.

సిద్ధాంతి : సృష్టికి పూర్వము జగత్కారణమగు నొక స్వతంత్రావస్థయున్నట్లు మేమంగీకరించినచో, నపుడవశ్యము ప్రధానవాదమును మేమంగీకరించెదముగాక! జగత్తుయొక్క పూర్వావస్థ స్వతంత్రముకాదనియు పరమేశ్వరాధీనమనియు మావాదము.

కారణమగు సూక్ష్మశరీరము గ్రహించుట అర్థవంతము

పరమేశ్వరాధీనమగు నొకయవస్థ సృష్టికిపూర్వ మున్నట్లంగీకరించుట సహేతుకముగ నున్నది. అట్టి యవస్థలేనిచో పరమేశ్వరునికి జగత్స్రష్టృత్వము సిద్ధింపనేరదు. సర్జనసామర్థ్యమే లేనిచో సృష్టియందాతనికి ప్రవృత్తి యసంభవమగును.

ముక్తానాం పునరనుత్పత్తిః, కుతః? విద్యయా తస్యా బీజశక్తేర్దాహాత్. అవిద్యాత్మికా హి సా బీజశక్తిరవ్యక్తశబ్దనిర్దేశ్యా పరమేశ్వరాశ్రయా మాయామయీ మహాసుషుప్తిః, యస్యాం స్వరూపప్రతిబోధరహితాశ్శేరతే సంసారిణో జీవాః తదేతదవ్యక్తం క్వచిదాకాశశబ్ద నిర్దిష్టం 'ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చే'తి (బృ. 3-8-11) శ్రుతేః. క్వచిదక్షరశబ్దోదితం 'అక్షరాత్పరతః పర' ఇతి (ముం. 2-1-2) శ్రుతేః. క్వచిన్మాయేతి సూచితం 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహే

---

అట్టియవస్థ నంగీకరించినపుడే ముక్తులయినవారికి తిరిగి జన్మ కలుగకుండును. [ఈశక్తి మాయాశక్తి.పరమేశ్వరుడు స్వయముగా క్రియారహితుడు అతని నాశ్రయించిన మాయాశక్తి యున్నపుడే జగత్సర్జనము సంభవముగుచున్నది. మాయయన అజ్ఞానము.] జగత్సర్జనకు బీజభూతమగు నవిద్య విద్యచే నశించును. జగత్తునకు బీజభూతమగు నీ మాయాశక్తి అవిద్యాస్వరూపము. అది అవ్యక్తమని నిర్దేశింపబడుచున్నది. పరమేశ్వరు నాశ్రయించియున్నది. కేవలభ్రమాత్మకము. అదియొక మహాసుషుప్త్యవస్థ. జీవులు స్వస్వరూపమును గుర్తెఱుంగక సంసారులై లయకాలమునం దద్దాని జేరుదురు. ఒకానొకప్పు డీయవ్యక్తావస్థ నాకాశమనిగూడ బిలుతురు. "అక్షరునియందు ఆకాశము పడుగుపేకవలె నేయబడియున్నది" యని (బృ 3-8-11) శ్రుతి గలదు. అదియె యొకానొకపు డక్షరమని చెప్పబడుచున్నది. "అక్షరుడగు బరుని కంటె పరుడు" (ముం 2-1-2) అనుశ్రుతి యిందుకు ప్రమాణము. అదియే "ప్రకృతిని మాయగాను, మహేశ్వరుని

శ్వరం మితి (శ్వే. 4-10) మంత్రవర్ణాత్. అవ్యక్తా హి సా మాయా, తత్త్వాన్యత్వనిరూపణస్యాశక్యత్వాత్. తదిదం మహతః పరమవ్యక్తమిత్యుక్తం అవ్యక్తప్రభవత్వాన్మహతః, యదా హైరణ్యగర్భీ బుద్ధిర్మహాన్, యదా తు జీవో మహాంస్తదాప్య వ్యక్తాధీనత్వాజ్జీవభావస్య మహతః పరమవ్యక్తమిత్యుక్తమ్. అవిద్యా హ్యవ్యక్తం, అవిద్యావత్త్వే చ జీవస్య సర్వస్సంవ్యవహారస్సంతతో వర్తతే. తచ్చావ్యక్తగతం మహతః పరత్వ

---

మాయావిగాను దెలిసికొనుము" (శ్వే 4-10) అనుశ్రుతి యందుమాయయని బిలువబడుచున్నది. మాయ అవ్యక్తము. అదియున్నదనిగాని లేదనిగాని చెప్పశక్యముగాదు.

హిరణ్యగర్భబుద్ధి మహచ్ఛబ్దమున కర్థమని చెప్పిన పక్షమున, హిరణ్యగర్భుడు ప్రకృతివలన నుత్పన్నమగుటచేత నాతనికంటె ప్రకృతి సూక్ష్మతరము. మహచ్ఛబ్దమును జీవ పరముగగ్రహించినపుడుగూడ, జీవభావము అవ్యక్తము వలన సంభవించుటవలన, జీవునికంటె నవ్యక్తము పరమని చెప్పవచ్చును. అవిద్యయే అవ్యక్తము. అవిద్యాసంబంధము చేతనే జీవునికి సర్వవ్యవహార మెడతెగకుండ సంభవించుచు న్నది. నిజముగా నవ్యక్తము అనగా నవిద్య హిరణ్యగర్భుని కంటె మహత్తరము, శరీర మవిద్యాకార్య మగుటవలన కారణముయొక్క మహత్త్వము కార్యమున కారోపింపబడు చున్నది. శరీరమువలె నింద్రియములుగూడ నవిద్యాకార్య ములైనను, ఇంద్రియములు ప్రత్యేకముగ స్పష్టముగ చెప్పబడియుండుటచేతను, శరీరముమాత్రము మిగిలియుండుట

మభేదోపచారాత్తద్వికారే శరీరే పరికల్ప్యతే. సత్యపి శరీరవ దింద్రియాదీనాం తద్వికారత్వావిశేషే శరీరస్యైవాభేదోపచారాద వ్యక్తశబ్దత్వేన గ్రహణమింద్రియాదీనాం స్వశబ్దైరేవ గృహీతత్వాత్, పరిశిష్టత్వాచ్చ శరీరస్య.

---

చేతను, అవ్యక్తశబ్దముచే శరీరమిచట గ్రహింపబడుచున్నది. [ఇచట భావమిది. కఠ 1-3-3 వాక్యమునం దుదాహరింపబడిన శరీరమే పరిశిష్టన్యాయముచే 1-3-11 వాక్యమునందలి అవ్యక్తశబ్దకథితమగుచున్నదియనియు, ప్రధానము జగత్కారణము కానేరదనియు వివరింపబడినది. అట్టిజగత్కారణ మీశ్వరాధీనముగాని స్వతంత్రముకాదు. ప్రధానము స్వతంత్రమని ప్రతిపక్షులు వాదించుచున్నారు. అది జగత్కారణము కానేరదు. అట్టి జగత్కారణ మీశ్వరాధీనమని పైకఠశ్రుతి చెప్పుటచేత నీశ్వరుడుగూడ జగత్కారణము కానేరడు. అవ్యక్తమట్టి యీశ్వరాధీనమగు జగత్కారణము. ఇంద్రియాదులుగూడ నవ్యక్తకార్యములగుచుండ, శరీరమొక్కదానినే యేలగ్రహింపవలెనని శంకరాగా, మహచ్ఛబ్దము జీవపరముగాను, హిరణ్యగర్భబుద్ధిగానుగూడ గ్రహింపదగును. వీరుభయులకు నవ్యక్తము కారణమగుచున్నది, అవిద్యయె యవ్యక్తమని పిలువబడుచున్నది. అవిద్యావికారమగు శరీర మవ్యక్తమని పిలువబడుచున్నది. అవ్యక్తమే సృష్టిహేతువగు మాయాశక్తి. పరమేశ్వరు నాశ్రయించియున్న మాయయందు లయకాలమున సర్వజీవులు ప్రవేశించుచున్నారు. విద్యచే వీరలకు ముక్తి సంప్రాప్తమగును].

అన్యే—తు వర్ణయంతి—ద్వివిధం హి శరీరం స్థూలం సూక్ష్మం చ. స్థూలం యదిదముపలభ్యతే. సూక్ష్మం చ యదుత్తరత్ర వక్ష్యతే, 'తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యా' మితి. (బ్ర. 3-1-1) తదుభయమపి శరీరమవిశేషాత్పూర్వం రథత్వేన సంకీర్తితమ్, ఇహ తు సూక్ష్మమవ్యక్తశబ్దేన పరిగృహ్యతే, సూక్ష్మస్యావ్యక్తశబ్దార్హత్వాత్, తదధీనత్వాచ్చ, బంధమోక్షవ్యవహారస్య జీవాత్తస్య పరత్వమ్, యథా అర్థాధీనత్వాదింద్రియవ్యాపారస్యేంద్రియేభ్యః పరత్వమర్థానామితి.

సిద్ధాంతీ: తైస్త్వేతద్వక్తవ్యమవిశేషేణ శరీరద్వయస్య పూర్వత్ర రథత్వేన సంకీర్తితత్వాత్, సమానయోః ప్రకృతత్వపరిశిష్ట

---

కొంతమంది ఇట్లనుచున్నారు. స్థూలము సూక్ష్మమని శరీరము రెండువిధములు, మనకు కాన్పించునది స్థూలము. సూక్ష్మశరీరము 3–1–1 సూత్రమునందు వివరింపబడు చున్నది. ఈ రెండుశరీరములుగూడ పైకఠశ్రుతియందు రథ రూపకల్పనముచే వర్ణింపబడినవి. ప్రకృతమున సూక్ష్మశరీర మవ్యక్తశబ్దముచే చెప్పఁబడుచున్నది. సూక్ష్మ మవ్యక్త మని చెప్పతగును. బంధమోక్షములు సూక్ష్మశరీరాధీనములు, ఇంద్రియవ్యాపారవిషయాధీనమగుట వలన విషయము లింద్రియములకంటె పరములని చెప్పినట్లె జీవునికంటె సూక్ష్మ శరీరము పరమని చెప్పవచ్చును.

సిద్ధాంతి: వీరలోకవిషయమునకు సమాధానము చెప్ప వలసి యున్నారు. స్థూలసూక్ష్మశరీరములు రెండును రథకల్పనచే

త్వయోః కథం సూక్ష్మమేవ శరీరమిహ గృహ్యతే న పునఃస్థూల మపీతి. ఆమ్నాతస్యార్థం ప్రతిపత్తుం ప్రభవామో నామ్నాతం పర్యనుయోక్తుమ్. అమ్నాతం చావ్యక్తపదం సూక్ష్మమేవ ప్రతిపా దయితుం శక్నోతి నేతరద్వ్యక్తత్వాత్తస్యేతి చేన్న—ఏకవాక్యతా ధీనత్వాదర్థప్రతిపత్తేః. న హీమే పూర్వోత్తరే ఆమ్నాతే ఏక వాక్యతామనాపద్య కంచిదర్థం ప్రతిపాదయితః ప్రకృతహానా

---

ఆకాంక్షాపూర్వముగ నర్థసమన్వయము.

పేర్కొనబడి రెండును ప్రకృతవిషయ ములై మిగిలియున్నట్లు వీరు పల్కు చున్నారు. ఆపక్షమున సూక్ష్మశరీరమునే యేల గ్రహించవలెను? రెండింటిని యేల గ్రహింపకూడదు! "శ్రుతిచే నుదాహరింపబడిన విషయమును మేము గ్రహింప గలముగాని పేర్కొనబడనిదానిని మేము తెచ్చిపెట్టలేము. శ్రుతియం దవ్యక్తపదము వినవచ్చుచున్నది. ఆపదముచే సూక్ష్మశరీరమునే గ్రహింపదగును. ఆపదమునకు సూక్ష్మ శరీరమే అర్థము; స్థూలశరీరము వ్యక్తము." అని మీరంటిరేని అదిసరికాదు. వనవచ్చుచున్న వాక్యములనన్నిటినిసమాహారము చేసి అర్థసమన్వయము చేయవలెను. వినవచ్చుచున్న పూర్వో త్తరవాక్యముల రెండిటికి నేకవాక్యత లేనిచో, నారెండింటిలో దేనికిని అర్థములేదు, ప్రకృతమును విడనాడుటయు, అప్రకృత మును గ్రహించుటయు తటస్థించును. [శరీరశబ్దము స్థూల శరీరమునందు రూఢిపదము. అదిప్రకృతము. దాని వదలివేయ వలసివచ్చును. అప్రకృతమగు భూతసూక్ష్మమును గ్రహింప తగదు] ఆకాంక్షాపూర్వకముగనే యేకవాక్యత గలుగ

ప్రకృతప్రక్రియాప్రసంగాత్. సహాకాంక్షమంత్రైకవాక్యతా ప్రతిపత్తిరస్తి. తత్రావిశిష్టాయాం శరీరస్యయస్య గ్రాహ్యత్వా

---

వలెను. [అనగా "ఆత్మానం రథినంవిద్ధి" యను రథకల్పనావాక్యములను (కఠ 1-3-3, 4) "విష్ణోః పరమం పదమ్" అను 1-3-9 వాక్యమును, "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః" (1-3-10,11) పురుషుడే పరమావధి యనిచెప్పువాక్యమును కలిపి యొకే యర్థసమన్వయము చేయవలెను. లేక, ప్రత్యేకప్రత్యేకముగ వానిని గ్రహించినయెడల ప్రకరణ సందర్భము కుదరదు. సుశిక్షితములగు నింద్రియములు వశంగతములగు నశ్వములవలె యజమానిని నివృత్తిమార్గమున నడిపించునని శరీరరథోపమానముచే 3-8 వాక్యములయందు విషయపరిశోచనము చేయబడినది. జ్ఞానియగువాడు తిరిగి జన్మములేనిస్థానమును బొందునని యెనిమిదవవాక్యమునందుదాహరింపబడినది. అట్టి యుత్తమస్థాన మేదియని యాకాంక్ష రాగా నాస్థానము "విష్ణోః పరమం పదమ్" బ్రహ్మపదమని సమాధానము చెప్పబడినది. పైనుదహరింపబడిన నివృత్తి మార్గ మెద్దియని యాకాంక్షరాగా నది 10-11 మంత్రములయందు వివరింపబడినది. ఇట్లా కాంక్షాపూర్వకముగ నీవాక్యముల కర్థసమన్వయము చేసినపుడే వానికన్నిటికి నేకవాక్యత కలుగును. [అనగానొకే విషయమునుగూర్చి చెప్పును.] పూర్వవాక్యమునందుభయశరీరములు రథకల్పనచే నుదాహృతములైన ట్లంగీకరించున్నారు. ఆపక్షమున ఆకాంక్షాపూర్వముగ సిద్ధమగుచున్న సంబంధమును అనగా నుభయ

కాంక్షాయాం యథాకాంక్షం సంబంధేఽనభ్యుపగమ్యమానే ఏక వాక్యతైవ బాధితా భవతి. కుత ఆమ్నాతస్యార్థస్య ప్రతిపత్తిః? నచైవం మంతవ్యం దుశ్శోధత్వాత్సూక్ష్మస్యైవ శరీరస్యేహ గ్రహణం, స్థూలస్య తు దృష్టభీభత్సతయా సుశోధత్వాద్గ్రహణమితి. యతో నైవేహ శోధనం కస్యచిద్వివక్ష్యతే, న హ్యత్ర శోధనవిధాయి కించిదాఖ్యాతమస్తి అనంతరనిర్దిష్టత్వాత్తు కిం 'తద్విష్ణోః పరమం పద' మితి ఇదమిహ వివక్ష్యతే. తథాహీద మస్మాత్పరమిదమస్మాత్పరమిత్యుక్త్వా పురుషాన్న పరం కించి

---

శరీరముల నంగీకరింపనిచో, నేకవాక్యతకు భంగము కలుగును. అప్పుడు శ్రుతివాక్యమున కర్థమెట్లు సంభవింపగలదు? "అట్లు తలంచరాదు; స్థూలశరీరముయొక్క గర్హ్యాత్వము స్పష్టముగ కాన్పించుటచే నద్దానిని యాత్మనుంచి సులభముగా నిష్కర్ష చేయవచ్చును. సూక్ష్మశరీరమన్ననో ఆత్మ కతిసన్నికృష్టమై సూక్ష్మముగ నుండుటచే సులభముగ శోధింప శక్యముకాదు. కనుక సూక్ష్మశరీగమునే యిచట గ్రహింప తగునంటి రేని" శరీరశోధనము ప్రకరణవిషయము కాదు. శోధనను విధించు క్రియాపద మిచట కానరాదు 'విష్ణోః పరమం పదం అని బ్రహ్మపద మనంతరవాక్యమునందు నిర్దేశింపబడు చున్నది. ఆబ్రహ్మపదమే ప్రకృతమున జెప్పదలచిన విషయము. అందుచేత నేగదా, ఇది దీనికంటె బరము, ఇది దీనికంటె బరము అనిచెప్పి "పురుషునికంటె పరమగునది యేదియు లేదని" శ్రుతి చెప్పుచున్నది. ప్రకృత కారకవాక్యము లూహ్యాముగు ప్రధానమును తోసిపుచ్చుచున్నట్లు పక్షాంతర

దిత్యాహ. సర్వథాపి త్వానుమానికనిరాకరణోపపత్తేస్తథానామాస్తు న నః కించిచ్ఛిద్యతే.

## జ్ఞేయత్వావచనాచ్చ (సూ 4.)

జ్ఞేయత్వేన చ సాంఖ్యైః ప్రధానం స్మర్యతే గుణపురుషాంతరజ్ఞానాత్కైవల్యమితి వదద్భిః, నహి గుణస్వరూపమజ్ఞాత్వా గుణేభ్యః పురుషస్యాంతరం శక్యం జ్ఞాతుమితి. క్వచిచ్చ విభూతివిశేషప్రాప్తయే ప్రధానం జ్ఞేయమితి స్మరంతి. న చేదమిహావ్యక్తం జ్ఞేయత్వేనోచ్యతే, పదమాత్రం హ్యవ్యక్తశబ్దో నేహా

---

వాదులు గూడనంగీకరించుచున్నారు. అట్టియర్థకల్పన ముండిన యుండనిండు' మావాదమున కెంతమాత్రము భంగములేదు. 3

అవ్యక్తము జేయత్వ అవచనాత్ చ = జ్ఞేయ వాక్యమునందు ప్రకృతమని చెప్పబడియుండలేదు గనుక అవ్యక్తము ప్రధానము కానేరదు.

ప్రధానము జ్ఞేయమని సాంఖ్యస్మృతి చెప్పుచున్నది. సత్త్వాదిత్రిగుణాత్మకమగు ప్రధానమునకును పురుషునికిని భేదము దెలిసికొనుటచేత కైవల్యము సంప్రాప్తమగుననియు, ప్రధానగుణస్వరూపమును దెలిసికొనక గుణములకును పురుషునికిని గలభేదమును దెలిసికొనుట శక్యముకాదనియు వారి సిద్ధాంతము. మఱియు నణిమాద్యైశ్వర్యవిశేషప్రాప్తికొఱకు గూడ ప్రధానముపాస్యముగ దెలిసికొనదగినదనియు వారి స్మృతి చెప్పుచున్నది. ప్రకృతవాక్యమునం దవ్యక్తము జ్ఞేయముగ చెప్పఁబడలేదు. అవ్యక్తమను శబ్దమునూత్రము

వ్యక్తం జ్ఞాతవ్యముపాసితవ్యం చేతి వాక్యమస్తి. న చానుపదిష్టం పదార్థజ్ఞానం పురుషార్థమితి శక్యం ప్రతిపత్తుమ్, తస్మాదపి నావ్యక్తశబ్దేన ప్రధానమభిధీయతే. అస్మాకం తు రథరూపకక్లృప్తశరీరాద్యనుసరణేన విష్ణోరేవ పరమంపదం దర్శయితుమయముపన్యాస ఇత్యనవద్యమ్.

## వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్ (సూ 5.)

---

వినవచ్చుచున్నది. అవ్యక్తము జ్ఞేయమనిగాని యుపాస్యమనిగాని తెలియజేయు వాక్యము కానరాదు. శాస్త్రముచే జ్ఞేయముగ నుపదిష్టముగాని పదార్థజ్ఞానము పురుషార్థము కానేరదు. ఆకారణముచేతనుగూడ నవ్యక్తశబ్దము ప్రధానమును బోధించుటలేదు. [అవ్యక్తశబ్దబోధితమగు శరీరము జ్ఞేయముగ చెప్పబడకపోయినను.] రథరూపకల్పనచే నుపవర్ణితమైన శరీరము ననుసరించుటమూలకముగ విష్ణుపదమును ప్రదర్శించుటకై చెప్పబడుచున్నాడను మావాదమునందే లోపము లేదు. 4

అ॥ ప్రధానము జ్ఞేయముగ శ్రుతియం దుదాహరింపబడలేదని పై సూత్రమున చేయబడిన యాక్షేపణకు సాంఖ్యసమాధానము అందుకు ప్రతివచనమునుగూడ తరువాత సూత్రమున చెప్పుచున్నారు.

"అశబ్దమస్పర్శం" అనువాక్యము ప్రధానమును వదతి ఇతి చేత్ = చెప్పుచున్నదంటిరేని న = అది సరికాదు. ఆవాక్యమునందు ప్రాజ్ఞః హి = పరమాత్మ నిశ్చయముగ

అత్రాహ సాంఖ్యః — జ్ఞేయత్వావచనాదిత్యసిద్ధం కథం శ్రూయతే హ్యుత్తరత్రావ్యక్తశబ్దోదితస్య ప్రధానస్య జ్ఞేయత్వ వచనం 'అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసం నిత్యమ గంధవచ్చ యత్. అనాద్యనంతం మహతః పరం ధ్రువమ్ నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే' (క. 2-3-15) ఇతి. అత్ర హి యాదృశం శబ్దాదిహీనం ప్రధానం మహతః పరం స్మృతౌ నిరూపితం తాదృశమేవ నిచాయ్యత్వేన నిర్దిష్టం తస్మా త్ప్రధానమేవేదం తదేవావ్యక్తశబ్దనిర్దిష్టమితి.

---

చెప్పబడుచున్నాడు ఏలనన్న ప్రకరణాత్ = ప్రకరణము బ్రహ్మప్రకరణ మగుటవలన.

పూ.పక్షి:[పై సూత్రమునందలి యాక్షేపకు సమాధానముగ] సాంఖ్యు డిట్లనుచున్నాడు. ప్రధానము జ్ఞేయముగ చెప్ప బడలేదను విషయము నిర్ధారితముకాలేదు. ఎట్లన "ఆత్మ శబ్దరహితము. స్పర్శరహితము. గంధరహితము, నిత్యము, అనాది అనంతము, బుద్ధికంటె భిన్నము. అట్టియాత్మ తత్త్వము శాశ్వతమైనదానినిగా నెఱింగినవాడవిద్యా కామకర్మ ఫలమగు మృత్యువునుండి ముక్తుడగును" (కాఠ 1-3-15) అనుశ్రుతియందు శబ్దాదిరహితము హిరణ్యగర్భుని కంటెపరము, అయినప్రధానమే చెప్పబడుచున్నది. సాంఖ్య స్మృతియందేయే గుణములు ప్రధానమునకు చెప్పబడినవో ఆ యాగుణములే యిచట జెప్పబడి అది జ్ఞేయముగ నిర్దిష్ట మగుచున్నది. అందువలన నీవాక్యమునందు ప్రధానమే చెప్పబడుచున్నది. అదియే అవ్యక్తశబ్దముచే చెప్పబడు చున్నది.

సిద్ధాంతీ: అత్ర బ్రూమః— నేహ ప్రధానం నిచాయ్యత్వేన నిర్దిష్టం ప్రాజ్ఞో హీహ పరమాత్మా నిచాయ్యత్వేన నిర్దిష్ట ఇతి గమ్యతే. కుతః, ప్రకరణాత్, ప్రాజ్ఞస్య హి ప్రకరణం వితతం వర్తతే "పురుషాన్న పరం కించి త్సాకాష్ఠా సా పరాగతి"రిత్యాది దర్శనాత్ "ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశత" ఇతి చ దుర్జ్ఞానత్వవచనేన తస్యైవ జ్ఞేయత్వాకాంక్షణాత్ 'యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ' ఇతి చ తజ్జ్ఞానాయైవ రాగాదిసంయమస్య విహి

---

ఇందుల కిటుల సమాధానము చెప్పుచున్నాము. పైవాక్యమునందు ప్రధానము జ్ఞేయముగ నుదాహరింపబడుటలేదు. ప్రాజ్ఞుడగు పరమాత్మ దెలిసికొనదగినవాడుగ నిర్దేశింపబడినటుల తెలియుచున్నది. ఏలనన ప్రకరణమువలన! ప్రకరణము విరివిగ ప్రాజ్ఞప్రకరణముగన్పించుచున్నది. "పురుషుని కంటె సూక్ష్మతరము మహత్తరమునగు మఱియొక వస్తువేదియు లేదు. సూక్ష్మత్వమహత్వముల కతడే పరమావధి" (కం 1-3-11) అనిశ్రుతి నిర్దేశించుచున్నది. "పరమపురుషుడు సమస్తప్రాణబుద్ధులయందు నిగూఢముగ నుండుటచే దెలియబడుటలేదు" (కఠ 1-3-12) అనువాక్య మతనిదుర్జ్ఞేయత్వమును జెప్పుచున్నది. కనుక నతడే జ్ఞేయముగ నాకాంక్షింపబడుచున్నాడు పండితుడైనవాడు వాగాదిసకలేన్ద్రియ వ్యాపారమునుమనస్సునందుపసంహరింపవలయును(కఠ1.3.13) అను వాక్య మాతని జ్ఞానముకొఱకు వాగాదిసంయమనమును

విషయవాక్య ప్రకరణము బ్రహ్మపదము

తత్త్వాన్మృత్యుముఖప్రమోక్షణఫలత్వాచ్చ. న హి ప్రధానమాత్రం నిచాయ్య మృత్యుముఖాత్ప్రముచ్యత ఇతి సాంఖ్యైరిష్యతే. చేతనాత్మవిజ్ఞానాద్ధి మృత్యుముఖాత్ప్రముచ్యత ఇతి తేషామభ్యుపగమః. సర్వేషు చ వేదాంతేషు ప్రాజ్ఞస్యైవాత్మనోఽశబ్దాదిధర్మత్వమభిలప్యతే, తస్మాన్న ప్రధానస్యాత్ర జ్ఞేయత్వమవ్యక్తశబ్దనిర్దిష్టత్వం వా.

## త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ (సూ॰6)

---

విధించుచున్నది. మృత్యుముఖమునుండి తప్పించుకొనుటయే యిట్టిజ్ఞానమునకు ఫలముగ నిరూపింపబడుచున్నది. ప్రధానమును దెలిసికొనినంతమాత్రముచేత మృత్యుముఖమునుండి తప్పించుకొనుట సాధ్యమని సాంఖ్యులుగూడ వాదించుటలేదు; చేతనాత్మవిజ్ఞానముచేతనే మృత్యుముఖమునుండి తప్పించుకొనుట సాధ్యమని వారంగీకరించుచున్నారు. వేదాంతములన్నియు నశబ్దాదిధర్మములు ప్రాజ్ఞుడగు పరమాత్మయందున్నట్లు పలుకుచున్నవి. అందువలన ప్రధానము జ్ఞేయము కాదు. అవ్యక్తశబ్దనిర్దిష్టమును గాదు.

అవ్యక్తశబ్దము ప్రధానపరముకాదనుటకు మరియొక కారణము చెప్పుచున్నారు.

త్రయాణాం ఏవచ = అగ్నిజీవపరమాత్మలగూర్చియె నచికేతసునికి యముడు ఏవం ఉపన్యాసః = అటుల ఉపన్యసించుటయు ప్రశ్నః చ = ఆముగ్గిరిని గూర్చియె నచికేతసుడు యముని నడుగుటయు జరిగినది.

ఇతశ్చ న ప్రధానస్యావ్యక్తశబ్దవాచ్యత్వం జ్ఞేయత్వం వా యస్మాత్త్రయాణామేవ పదార్థానామగ్నిజీవపరమాత్మనామస్మిన్ గ్రంథే కఠవల్లీషు వరప్రదానసామర్థ్యాదవ్యక్తవ్యతయోపన్యాసో దృశ్యతే, తద్విషయ ఏవ చ ప్రశ్నః, నాతోఽన్యస్య ప్రశ్న ఉపన్యాసో వాస్తి. తత్ర తావత్ 'స త్వమగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో ప్రబ్రూహి తం శ్రద్దధానాయ మహ్యం' (క. 1-1-13) మిత్యగ్నివిషయః ప్రశ్నః. 'యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే స్తీత్యేకే నాయమస్తీతి చైకే, ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం

---

ప్రధాన మవ్యక్తశబ్దవాచ్యముకాదనియు, జ్ఞేయము కాదనియు మఱియొకకారణమువలనగూడ తెలియుచున్నది. అగ్నిజీవపరమాత్మలను ముగ్గురినిగూర్చియే కఠవల్లియందు యముడు నచికేతసునకిచ్చిన వరప్రదానబలముచే వివరింపదగిన విషయములుగ కాన్పించుచున్నవి. ఆమూడు విషయములనుగూర్చియె నచికేతసుడు యముని ప్రశ్నించెను. వీనికంటె మరియొక విషయమునుగూర్చి ప్రశ్న కాన్పించుట లేదు. ఆప్రశ్నలలోనున్నవో "స్వర్గప్రాప్తిసాధనమగు నగ్నిచయనమునుగూర్చి నీవు బాగుగాదెలియుదువు. శ్రద్ధావంతుడనగు నాకద్దాని నుపదేశింపుము" (కఠ 1-1-13) అనునది అగ్నినిగూర్చిన ప్రశ్న. "మనుజుడు చనిపోగా నిట్టి విచారణకలుగుచున్నది. దేహేన్ద్రియములకు భిన్నమగు నాత్మయనునది యొకటి గలదని కొందఱు, అట్టిది లేదని మరికొందఱు చెప్ప

నచికేతసుని ప్రశ్నలలోగాని యముని సమాధానములోగాని ప్రధానమునుగూర్చి లేదు.

వరాణామేష వరస్తృతీయః' (క. 1-2-14) ఇతి జీవవిషయః, 'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వదే'తి (క. 1-2-14) పరమాత్మవిషయః ప్రశ్నః. ప్రతివచనమపి 'లోకాదిమగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథా వే (క. 1-1-15) త్యగ్నివిషయమ్. 'హంత త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్, యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ, యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః, స్థాణుమన్యేఽనుసం

---

చున్నారు. నీచే శాసింపబడినవాడనై దీనివిషయమును దెలిసికొనెదను. ఇదియె నేనుగోరు మూడవప్రశ్న" (కఠ 1-1-20) ఇది జీవవిషయమగు ప్రశ్న. "శాస్త్రీయమగు ధర్మానుష్ఠానము, దానిఫలము, దానిసాధనములకంటె భిన్నము శాస్త్రవిహితమగు ధర్మము ననుష్ఠింపకపోవుటచే గల్గు పాపముకంటె భిన్నము, కార్యకారణములకంటె భిన్నము, కాలత్రయాబాధితము, వ్యవహారమున కగోచరము నగునది యేదికలదో దానిని నీవెఱుంగుదువుగాన నద్దాని నాకుం జెప్పవలయును" (కఠ 1-2-14) ఇది పరమాత్మవిషయప్రశ్నము. "సమస్తలోకములకు నాదియగు నగ్నిచయనమును గూర్చి యెన్నియిష్టకలు కావలయునో యావిధామునంతయు యముడు నచికేతునకు వివరించెను (కఠ 1-1-15) అనునది అగ్నివిషయమగు ప్రతివచనము. "సనాతనము పరమరహస్యమునగు బ్రహ్మమును నీకు జెప్పుచున్నాను. బ్రహ్మజ్ఞానము సర్వసంసారోపరతియు, అది లేకపోవుటచే సంసారసంగతియు ననగా మరణమును గలుగు

యంతి యథాకర్మ యథాశ్రుత' (క. 2-5-6, 7) మితి వ్యవహితం జీవవిషయమ్. 'న జాయతే మ్రియతే వా విపశ్చి' (క. 1-2-18) దిత్యాదిబహుప్రపంచం పరమాత్మవిషయమ్. నైవం ప్రధాన విషయః ప్రశ్నోఽస్తి. అపృష్టత్వాదనుపన్యసనీయత్వం తస్యేతి.

పూ.పక్షీ: అత్రాహ—యోఽయమాత్మవిషయః ప్రశ్నో 'యేయం ప్రేతే విచికిత్సా మనుష్య' ఇతి, కిం స ఏవాయమ్ 'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా' దితి పునరనుకృష్యతే, కిం వా తతోఽన్యోఽయమపూర్వః ప్రశ్నః ఉత్థాప్యత ఇతి. కించాతస్స ఏవాయం

---

చున్నది. ఆవిధానమును నీకు దెలియజెప్పుచున్నాను, వినుము. మూఢులగు గొందఱు శుక్లశోణితసమన్వితులై మాతృగర్భమున బ్రవేశించి శరీరధారులగుచున్నారు. మఱి కొందఱు వారాచరించిన కర్మలకును విజ్ఞానమునకు నను రూపమగు వృక్షాదిస్థావరభావమును బొందుచున్నారు." (కా 2-2-5-6) అనునది దూరముగా జెప్పబడిన జీవవిషయ ప్రతివచనము. "ఆత్మపుట్టదు, చావదు అది లోపింపని చైతన్యము" (కాఠ 1-2-18) అని యాత్మవిషయప్రతివచన మెక్కుడుగ విస్తరింపబడినది. ప్రధానవిషయమై యీవిధ మగు ప్రశ్నలేదు. దానినిగూర్చి యడుగలేదుగనుక ప్రతి వచనముగూడ జెప్పనవకాశములేదు.

పూ. పక్షి : ఇచట పూర్వవాది యిట్లాక్షేపించుచు న్నాడు : "మనుజుడు మరణించినపు డిట్టివిచారణ గలుగు చున్నది" అనుప్రశ్నయు, "ధర్మానుష్ఠానముకంటెను, దాని ఫలముకంటెను, దానిసాధముకంటెను భిన్నము" అను ప్రశ్నయు నొకటియేనా? లేక మఱియొక నూతనప్రశ్న

ప్రశ్నః పునరనుకృష్యత ఇతి యద్యుచ్యేత తదా ద్వయోరాత్మ విషయయోః ప్రశ్నయోరేకతాపత్తేరగ్నివిషయ ఆత్మవిషయశ్చ ద్వావేవ ప్రశ్నావిత్యతో న వక్తవ్యం త్రయాణాం ప్రశ్నోపన్యా సావితి. అథాన్యోఽయమపూర్వః ప్రశ్న ఉత్థాప్యత ఇతి యద్యు చ్యేత తతో యథైవ వరప్రదానవ్యతిరేకేణ ప్రశ్నకల్పనాయామ దోషః, ఏవం ప్రశ్నవ్యతిరేకేణాపి ప్రతిధానోపన్యాసకల్పనాయామ దోషస్స్యాదితి,

---

ముద్ధారము చేయబడినదా? అయిన నేమి? యన, మొదటి ప్రశ్నయే తిరిగి యుద్ధరింపబడినదంటి రేని యీరెండు నొక యాత్మనుగూర్చిన ప్రశ్నలే యగుచున్నవి. అపుడాత్మవిష యమైన యొకప్రశ్న - అగ్నివిషయమైన యొకప్రశ్న - మొత్త ము రెండుప్రశ్నలే యగుచున్నవి. మూడుప్రశ్న లడుగబడి నట్లు జెప్పవీలులేదు. లేక యపూర్వమగు మఱియొకప్రశ్నను నచికేతసు డడిగినాడంటి రేని వరప్రదానమునకు వ్యతిరేకముగ ప్రశ్నలను కల్పించుటయందు దోషములేనట్లే వరప్రదాన వ్యతిరేకముగ ప్రధానమునుగూర్చి ప్రతివచనమును యముడు చెప్పినాడనుటయందు దోషమేమియులేదు. [యముడు నచి కేతసునికి మూడువరములనిచ్చెను. అందులో మొదటివరము నచికేతసుడు తండ్రిని గూర్చియడిగెను. అగ్నిజీవాత్మప్రశ్న లతోగలసి నాల్గుప్రశ్నలగుచున్నవి. వరములుమూడు. ఇటు లాత డడిగిన ప్రశ్నలు వరప్రదానమునకు వ్యతిరేకమగు చున్నవి.]

సిద్ధాంతీ: అత్రోచ్యతే. నైవం వయమిహ వరప్రదానవ్యతిరేకేణ ప్రశ్నం కంచిత్కల్పయామః, వాక్యోపక్రమసామర్థ్యాత్. వర ప్రదానోపక్రమా హి మృత్యునచికేతస్సంవాదరూపా వాక్యప్రవృత్తి రాసమాప్తేః కఠవల్లీనాం లక్ష్యతే. మృత్యుః కిల నచికేతసే పిత్రా ప్రహితాయ త్రీన్వరాన్ప్రదదౌ, నచికేతాః కిల తేషాం ప్రథమేన వరేణ పితుస్సౌమనస్యం వవ్రే, ద్వితీయేనాగ్నివిద్యాం, తృతీయే నాత్మవిద్యాం, 'యేయంప్రేత' ఇతి 'వరాణామేషవరస్తృతీయః' (క. 1-1-10) ఇతి లింగాత్. తత్ర యద్యన్యత్ర ధర్మాదిత్యన్యోఽ యమపూర్వః ప్రశ్న ఉత్థాప్యేత తతో వరప్రదానవ్యతిరేకేణాపి ప్రశ్నకల్పనాద్వాక్యం బాధ్యేత.

---

సిద్ధాంతి : ఉపక్రమవాక్యమునుబట్టి వరప్రదానమునకు భిన్నముగ మేము ప్రశ్నలను కల్పించుటలేదు. కఠవల్లియందు యమనచికేతస సంవాదము వరప్రదానముతో నారంభమై యావిషయముతోనే యుపసంహరింపబడుచున్నది. యము డన్నన్నో తండ్రిచే బంపబడిన నచికేతసునకు మూడువరముల నిచ్చెను. నచికేతసు డామూడువరములలో మొదటిదానిచే దండ్రియొక్క సౌమనస్యమును గోరెను. రెండవదానిచే నగ్ని విద్యను, మూడవదానిచే నాత్మవిద్యను, గోరెను. "మనుజుడు చనిపోయినపుడు" అనునీప్రశ్న మూడింటిలో తృతీయప్రశ్న (కఠ 1-1-10) యని శ్రుతి సూచించుచున్నది. "ధర్మానుష్ఠా నము" అనుప్రశ్న మఱియొకప్రశ్నగా గ్రహించినచో వర ప్రదానమునకు భిన్నముగ బ్రశ్నకల్పన చేయబడుటచే ప్రశ్న ప్రతివచనక్రమమునకు భంగముకలుగును.

పూ.పక్షీ: నను ప్రష్టవ్యభేదాదపూర్వోఽయం ప్రశ్నో భవితుమర్హతి, పూర్వో హి ప్రశ్నో జీవవిషయః. యేయం ప్రేతే విచికిత్సామనుష్యేఽస్తి నాస్తీతి విచికిత్సాభిధానాత్. జీవశ్చ ధర్మాదిగోచరత్వాన్నాన్యత్ర ధర్మాదితి ప్రశ్నమర్హతి, ప్రాజ్ఞస్తు ధర్మాద్యతీతత్వాదన్యత్ర ధర్మాదితి ప్రశ్నమర్హతీతి. ప్రశ్నచ్ఛాయా చ న సమానా లక్ష్యతే పూర్వస్య ప్రశ్నస్యాస్తిత్వనాస్తిత్వవిషయత్వాదుత్తరస్య ధర్మాద్యతీతవస్తువిషయత్వాచ్చ. తస్మాత్ప్రత్యభిజ్ఞానాభావాత్ప్రశ్నభేదః, న పూర్వస్యైవోత్తరత్రానుకర్షణమితి చేత్.

---

పూ. పక్షి: నచికేతసుడడుగదగిన ప్రశ్నకంటె నీవిషయము క్రొత్తదియగుటవలన నీప్రశ్నగూడ క్రొత్తదియే యగుచున్నది "మనుజుడు మరణించినపుడు ఆత్మయనునది యొకటి యున్నదా లేదా?" యను పూర్వప్రశ్న జీవుడున్నాడా లేడా యనుసంశయమునుగూర్చిన ప్రశ్న. ధర్మాధర్మములు జీవవిషయములు. తిరిగి అతనినిగూర్చి 'ధర్మాత్' అని మఱియొక ప్రశ్న నడుగదగదు. ప్రాజ్ఞుడన్ననో ధర్మాధర్మముల కతీతుడు గనుక నతనినిగూర్చి మఱియొక ప్రశ్ననడుగదగును. (విషయభేదముగాదు) ప్రశ్నల రెండింటికిని సాదృశ్యముగూడ గాన్పించుటలేదు. జీవు డున్నాడా లేడా యనువిషయమును గూర్చి మొదటిప్రశ్న. ధర్మాధర్మములు కతీతుడైనవానిని గూర్చి రెండవప్రశ్న. కనుక రెండవప్రశ్నయందు మొదటి ప్రశ్నవిషయమును గుర్తుపగల చిహ్నములులేవు. గనుక నవి రెండును వేఱువేఱు ప్రశ్నలగుచున్నవి. మొదటిప్రశ్నయే రెండవప్రశ్నవిషయముగ తీసికొనిరాలేదు.

సిద్ధాంతీ: న జీవప్రాజ్ఞయోరేకత్వాభ్యుపగమాత్, భవేత్ప్రష్టవ్య భేదాత్ప్రశ్నభేదో యద్యన్యో జీవః ప్రాజ్ఞాత్స్యాత్, న త్వన్యత్వ మస్తి తత్త్వమసీత్యాది శ్రుత్యంతరేభ్యః ఇహ చ 'అన్యత్ర ధర్మా' దిత్యస్య ప్రశ్నస్య ప్రతివచనం 'న జాయతే మ్రియతేవా విపశ్చి' దితి జన్మమరణప్రతిషేధేన ప్రతిపాద్యమానం శరీర పరమేశ్వరయోరభేదం దర్శయతి. సతి హి ప్రసంగే ప్రతి షేధో భాగీ భవతి. ప్రసంగశ్చ జన్మమరణయోశ్శరీరసంస్పర్శా చ్ఛారీరస్య భవతి న పరమేశ్వరస్య. తథా 'స్వప్నాంతం జాగరి తాంతం చోభౌ యేనానుపశ్యతి, మహాంతం విభుమాత్మానం

---

సిద్ధాంతి : మీ వాదము సరికాదు. జీవునికి నాత్మకు నేకత్వ మంగీకరించుటవలన జీవుడు ఆత్మకంటె వేఱయినచో నడుగ దగిన విషయభేదముచే బ్రశ్నభేదము కలుగవచ్చునుగాక! కాని తత్త్వమసీత్యాది శ్రుతులవలన (ఛాందో 6–5–2) వార లిద్దరికి నన్యత్వము లేదు. "యేయం ప్రేతేవిచికిత్సా" యను ప్రశ్నను "ధర్మా" అనుప్రశ్నకును, "ఆతడు పుట్టడు, చావడు అది లోపింపని చైతన్యము" అని యముడిచ్చిన ప్రతివచనము జన్మమరణరాహిత్యముచే నుపపాదింపబడిన జీవపరమేశ్వరుల యభేదమును చూపుచున్నది. ఏవిషయమైనను ప్రసక్తమైన పుడు దానిని నిషేధించుట యుక్తము. శరీరసంపర్కము నుండు టవలన జీవునికి జననమరణముల ప్రసంగము సంభవముకా నేరదు. "స్వప్నమధ్యమును జాగరితమధ్యమును ఏయాత్మ యను సాధనముచేత లోకము దెలిసికొనుచున్నదో యట్టి యాత్మ మహాంతముగను సర్వవ్యాపిగను జ్ఞానియగువాడు

మత్వా ధీరో న శోచతి' (క.2-4-4) ఇతి స్వప్నజాగరితద్రష్టుర్జీవస్యైవ మహత్త్వవిభుత్వవిశేషణస్య మననేన శోకవిచ్ఛేదం దర్శయన్ ప్రాజ్ఞాదన్యో జీవ ఇతి దర్శయతి. ప్రాజ్ఞవిజ్ఞానాద్ధి శోకవిచ్ఛేద ఇతి వేదాంతసిద్ధాంతః. 'యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ, మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతీ'తి (క. 2-4-10) జీవప్రాజ్ఞభేదదృష్టిమపవదతి, తథా జీవవిషయస్యాస్తిత్వనాస్తిత్వప్రశ్నస్యానంతరమన్యం వరం నచికేతో వృణీష్వేత్యారభ్య మృత్యునా తైస్తైః కామైః ప్రలోభ్యమానోఽపి నచికేతా యదా న చచాల తదైనం మృత్యురభ్యవద

---

భావించి దుఃఖింపడు" (కఠ 2-4-4) అను వాక్యమునందు స్వప్నజాగరితములను జూచుజీవుడు మహత్త్వసర్వవ్యాపిత్వములనుగుణముల నాలోచించుకొనుటచే నతనిశోకము విచ్ఛిన్నమగుననియు బోధించి జీవుడు ప్రాజ్ఞునికంటె నన్యుడుగాడని చూపుచున్నది. ప్రాజ్ఞుని విజ్ఞానముచేతనే శోకవిచ్ఛేదము గలుగుచున్నది యని వేదాంతసిద్ధాంతము. "ఈలోకమున నేదిగలదో యదియె పరమున గలదు. పరమున నేదిగలదో యదియె యీలోకమునగూడ గలదు. ఎవడిచట నానాత్వమునుజూచునో యాతడు మరణపరంపరను బొందును" (కఠ 2-4-10) అనువాక్యము జీవప్రాజ్ఞుల భేదమును నిందించుచున్నది. మఱియు జీవుడున్నాడా? లేడా? యనుప్రశ్నతరువాత, ఓయి నచికేతస! మఱియొక వరమును గోరుకొనుము" అని ప్రారంభించి యనేకవిధములగు కోర్కెలతో యమునిచే బ్రలోభింపబడినను నచికేతసుడు చలింపనందున యముడాతనికి నభ్యు

నిశ్శ్రేయసవిభాగప్రదర్శనేన విద్యాఽవిద్యావిభాగప్రదర్శనేన చ 'విద్యాభీప్సినం నచికేతసం మన్యే న త్వా కామా బహవోఽలో లుపంతే' (క. 1-2-4) ఇతి ప్రశస్య ప్రశ్నమపి తదీయం ప్రశంసన్న్యదువాచ 'తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పురాణం, అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి' (క. 1-2-12) ఇతి. తేనాపి జీవప్రాజ్ఞయోరభేద ఏవేహ వివక్షిత ఇతి గమ్యతే యత్ప్రశ్ననిమిత్తాం చ ప్రశంసాం మహతీం మృత్యోః ప్రత్యపద్యత. నచికేతా యది తం విహాయ ప్రశంసానంతరమన్యమేవ ప్రశ్నముపక్షిపేత్ అస్థాన

---

దయనిఃశ్రేయసవిభాగమును విద్యా విద్యావిభాగమును జేసి "నీవు విద్యనభీప్సించుచున్నావు. ప్రలోభకరములగు కామములు నిన్ను లోభింపజేయలేవు." (కఠ 1-2-4) అనియాతనిని ప్రశంసించెను. అటుతరువాత "ఆత్మదర్శనము కష్టసాధ్యము, ఆత్మ నిగూఢము, ప్రాకృతవిషయవికారవిజ్ఞానములచే బుద్ధిగుహాయం దతడుగప్పబడియున్నాడు. అనేకానర్థసంకులమగు విషమస్థానమునందున్నవాడు. ఆతడు పురాతనము. మనస్సును విషయములనుండి మఱల్చి ఆతనియందు సమాధానముచేయుటచే లభించును, ధీరుడగువా డిట్టి యాత్మను దెలిసికొని హర్షశోకముల వదలును" (కఠ 1-2-12) అని యుపదేశించెను. ఈవాక్యమునందుగూడ జీవప్రాజ్ఞుల యభేదమే పేర్కొనబడుచున్నట్లు దెలియుచున్నది. నచికేతసుడడిగిన యుత్కృష్టమగు ప్రశ్ననుగూర్చి యముడాతనిని గొనియాడెను.

ఏవ సా సర్వా ప్రశంసా ప్రసారితా స్యాత్, తస్మాత్ 'యేయం ప్రేత' ఇత్యస్యైవ ప్రశ్నస్యైతదనుకర్షణం 'అన్యత్ర ధర్మా'దితి.

యత్తు ప్రశ్నచ్ఛాయా వైలక్షణ్యముక్తం తదదూషణమ్, తదీయస్యైవ విశేషస్య పునః పృచ్ఛ్యమానత్వాత్. పూర్వత్ర హి దేహాదివ్యతిరిక్తస్యాత్మనోఽస్తిత్వం పృష్టం. ఉత్తరత్ర తు తస్యైవాసంసారిత్వం పృచ్ఛ్యత ఇతి యావద్ధ్యవిద్యా న నివర్తతే తావద్ధర్మాదిగోచరత్వం జీవస్య జీవత్వం చ న నివర్తతే, తన్నివర్తనేన తు ప్రాజ్ఞ ఏవ తత్త్వమసీతి శ్రుత్యా ప్రత్యాయ్యతే.

---

అటుతరువాత నాతడా ప్రశ్నను వదలి ప్రశ్నాంతరము నడిగినచో నాతని యముడు నిరరకముగ ప్రశంసించినవాడగును. అందువలన "యేయం ప్రేతే" అను ప్రశ్నయే "అన్యత్ర ధర్మాత్" అను ప్రశ్నరూపమున తిరిగి యడుగబడినది.

ఈ రెండుప్రశ్నలు విలక్షణముగానున్నవను యాక్షేపణ దుష్టము. మొదటిప్రశ్నయందలి విశేషమే రెండవప్రశ్నయందు నడుగబడినది. "యేయం ప్రేతే విచికిత్సా" యను ప్రశ్నయందు దేహాదివ్యతిరిక్తమగు నాత్మయొక్క యస్తిత్వమునుగూర్చి యడుగబడెను. 'ధర్మాదధర్మాత్' అను ప్రశ్నయందట్టి యాత్మయొక్క అసంసారిత్వమునుగూర్చి యడుగబడెను. కనుక నవిద్యానాశనముకానంతవఱకు జీవుని ధర్మాధర్మసంస్పృష్టత్వము జీవభావము తొలగవు. అవితొలగినపుడు 'తత్త్వమసి' యను శ్రుతిచేత జీవుడే ప్రాజ్ఞుడను జ్ఞానము

న చావిద్యావత్త్వే తదపగమే చ వస్తునః కశ్చిద్విశేషోఽస్తి, యథా కశ్చిత్సంతమసే పతితాం కాంచిద్రజ్జుమహిం మన్యమానో భీతో వేపమానః పలాయతే. తం చాపరో బ్రూయాత్ మాభైషీ ర్నాయమహీ రజ్జురేవేతి, స చ తదుపశ్రుత్యాహికృతం భయము త్సృజేద్వేపథుం పలాయనం చ, న చాహిబుద్ధికాలే తదపగమ కాలే చ వస్తునః కశ్చిద్విశేషస్స్యాత్, తథైవైతదపి ద్రష్టవ్యమ్ తతశ్చ 'న జాయతే మ్రియతే' వేత్యేవమాద్యపి భవతి అస్తిత్వ నాస్తిత్వప్రశ్నస్య ప్రతివచనమ్. సూత్రం త్వవిద్యాకల్పితజీవ ప్రాజ్ఞభేదాపేక్షయా యోజయితవ్యమ్. ఏకత్వేఽపి హ్యాత్మవిష

---

కలుగును. అవిద్యావస్థయందును నదితొలగిన తరువాతను గూడ బరమార్థవస్తువం దేమియు విశేషము లేదు. చీకటియందు బడియున్న త్రాటినిజూచి సర్పమని భయభ్రాంతుడై వణకుచు పరుగులిడుచున్నవాని నన్యుడు చూచి "ఓయి! భయపడకుము ఇది సర్పముకాదు. త్రాడు" అనిపలుకును, ఆపుడా మాటను విని సర్పభ్రాంతిచే గలిగిన భయమును గంపమును పలాయ నముగూడ వదలివేయును గాని సర్పభ్రాంతి కాలమునందుగాని యట్టిభ్రాంతి వదలిపోయిన తరువాతగాని త్రాటియం దేమియు విశేషము లేదు. అదేప్రకారమిచట గూడ తెలియవలెను. అందువలన "పుట్టుక లేదు చావు లేదు" అను మొదలగునది యంతయు నాత్మయొక్క ఆస్తిత్వప్రశ్నకు బ్రతివచనమే యగుచున్నది. ప్రకృతసూత్రముగూడ జీవప్రాజ్ఞులకు గల యవిద్యాకల్పితమగు భేదమున కనుకూలముగ గ్రహింపవల యును. [అనగా నవిద్యాకల్పితములగు జీవపరమాత్మల భేద

యస్య ప్రశ్నస్యప్రాయణావస్థాయాం దేహవ్యతిరిక్తాస్తిత్వమాత్ర విచికిత్సనాత్ కర్తృత్వాదిసంసారస్వభావానపోహనాచ్చ పూర్వస్య పర్యాయస్య జీవవిషయత్వముత్ప్రేక్ష్యతే, ఉత్తరస్య తు ధర్మాద్యత్యయసంకీర్తనాత్ప్రాజ్ఞవిషయత్వమితి. తతశ్చ యుక్తాగ్నిజీవపరమాత్మకల్పనా. ప్రధానకల్పనాయాం తు న వరప్రదానం న ప్రశ్నో న ప్రతివచనమితి వైషమ్యం స్యాత్.

## మహద్వచ్చ (సూ 7.)

---

మును భావించి నచికేతసుడు వారలనుగూర్చి ప్రత్యేకప్రశ్నలను వేసెను] ఆత్మవిషయికమగు ప్రశ్నయొకటియే యయినను మరణకాలమునందు దేహమును వదలివేసినను కర్తృత్వాదిసంసార స్వభావము తొలగిపోనందున జీవునిగూర్చిన సందేహముండియే యున్నది. కనుక మొదటిప్రశ్నము జీవునిగూర్చినట్లు గ్రహింపబడుచున్నది. ధర్మాదుల నతిక్రమించిన విషయమునుగూర్చి యడుగబడుటచే రెండవప్రశ్న యాత్మవిషయముగ గ్రహింపబడుచున్నది. అందువలన సూత్రమునందు అగ్నిజీవ పరమాత్మల ముగ్గురినిగూర్చియె ప్రశ్నప్రతివచనముల గ్రహించుటయుక్తము. ప్రధానమును కల్పించుటకు అందువిషయమైన వరప్రదానములేదు, ప్రశ్న లేదు, ప్రతివచనములేదు, కనుకనద్దాని గ్రహించినవిషమావస్థసంభవించును. 6

సాంఖ్యపరిభాషయందు మహచ్ఛబ్దము జీవపరమైనట్లు వేదాంతములయం దవ్యక్తశబ్దము శరీరపరమగుచున్నది.

యథా మహచ్ఛబ్దస్సాంఖ్యైస్సత్తామాత్రేఽపి ప్రథమజే ప్రయుక్తో న తమేవ వైదికేఽపి ప్రయోగేఽభిధత్తే 'బుద్ధేరాత్మా మహాన్పరః, (క. 9-3-10) మహాంతం విభుమాత్మానం. (క. 1-2-22) వేదాహమేతం పురుషం మహాంత' (శ్వే. 3 8) మిత్యేవమాదావాత్మశబ్దప్రయోగాదిభ్యో హేతుభ్యః, తథావ్యక్తశబ్దోఽపి న వైదికే ప్రయోగే ప్రధానమభిధాతుమర్హతి. అతశ్చ నాస్త్యానుమానికస్య స్మార్తస్య శబ్దవత్త్వమ్. ఇతి ప్రథమాధికరణమ్.

---

వేదాంతములయందు మహచ్ఛబ్దమువలె అవ్యక్తశబ్దము వాడబడుటలేదు.

మహచ్ఛబ్దము సాంఖ్యపరిభాషయందు సత్తామాత్రమగు ప్రథమజునియందు బ్రయోగింపబడుచున్నది. సత్త్వప్రధానమగు ప్రకృతియొక్క యాద్యపరిణామము అనగా నిర్వికల్పకబుద్ధి ప్రథమజమని సాంఖ్యమతసంమతము. పురుషులపేక్షించుఫలమునకిట్టిబుద్ధికారణమగుటచేత నది సత్ అని బిలువబడుచున్నది. ప్రత్యక్షముగాక కార్యానుమేయగుటచే సత్తామాత్రమని చెప్పబడుచున్నది. మహచ్ఛబ్దమునకుబుద్ధియని పర్యవసానము] కాని వేదాంతములయందాపదమాయర్థమున బ్రయోగింపబడుటలేదు. "బుద్ధికంటెనాత్మ మహాంతము, సూక్ష్మతరము" [కఠ 13–10] "మహాంతము సర్వవ్యాపియునగు నాత్మ" (కా 1–2–22) "మహాంతమగు నాపురుషుని నేనెఱుగుదును" (శ్వేత 3–8) ఈమొదలగు స్థలములందు మహచ్ఛబ్ద మాత్మయందు బ్రయోగింపబడుచున్నది, ఆరీతిగ నవ్యక్తశబ్దము

వేదాంతములయందు ప్రధానపరముగ వాడబడుటలేదు. కనుక ప్రధాన మూహింపదగినది, కాని వేదమునందు చెప్ప బడుటలేదు.

అధికరణ సంక్షేపార్థము : విషయవాక్యమునందుదాహ రింపబడిన యవ్యక్తశబ్దము ప్రధానపరము (1) ప్రధానము కొన్నిశాఖలయందుదాహరింప బడుచున్నది. (2) సాంఖ్య స్మృతియందు వినబడుచున్నక్రమమున మహత్తు అవ్యక్తము, పురుషుడు కాఠకశ్రుతియందు వినబడుచున్నారు.(3)అవ్యక్తశబ్ద వ్యుత్పత్త్యర్థముచేగూడ ప్రధానమే తోచుచున్నది. ఇది పూర్వపక్షవాదము. ప్రధానము జగత్తునకు స్వతంత్రకారణ మనిసాంఖ్యులవాదము. వేదాంతులజగత్కారణము స్వతంత్రము కాదు. ప్రధానము సాంఖ్యులకు రూఢిపదము వేదాంతుల యవ్యక్తపదము దేనియందును రూఢికాదు. పదముల క్రమ మాత్రముచేత నర్థనిశ్చయము చేయవీలుకాదు. (కాఠక శ్రుతి 1–2–3, 1–3–11 వాక్యములయందు పరిశిష్టన్యాయ ముచే నవ్యక్తశబ్దము శరీరమును దెలియజేయుచున్నది.ఇచట జెప్పబడుశరీరము స్థూలశరీరము కాని సూక్ష్మశరీరముకాదు. సృష్టికిబూర్వావస్థస్వతంత్రముకాదు,అదిపరమేశ్వరాధీనమగు మాయయని పిలువ బడుచున్నది. మాయాశక్తిలేక సృష్టిజరు గనేరదు. మాయాశక్తి యవిద్యాస్వరూపము. శరీర మవి ద్యాకార్యము. గౌణముగ కార్యరూపమగు శరీరము అవ్యక్త మని పిలువ బడుచున్నవి. అవ్యక్తము జ్ఞేయమని శ్రుతి చెప్పు టలేదు. సాంఖ్యుల మతమున ప్రధానము జ్ఞేయము ప్రధాన

మును తెలియచేయుడని నచికేతసుడు యముని గోరలేదు. కోరని విషయమును యముడు తెలియజెప్పుట యసంభవము. ప్రకరణమంతయు బ్రహ్మప్రకరణమని యుపక్రమోపసంహార ములచే దెలియుచున్నది. (కఠ 1-1-20, 1-2-13 వాక్యముల యం దాత్మయొక్కడే ప్రశ్నింప బడుచున్నాడు, జైవభావము ననుసరించి మొదటిప్రశ్నయు నాత్మభావమునుబట్టి రెండవ ప్రశ్నయు నడుగబడుచున్నది. జీవబ్రహ్మల కభేదము. సాంఖ్య పరిభాషయందు మహచ్ఛబ్దము జీవపరమైనట్లు వేదాంతముల యందవ్యక్తశబ్దము శరీరపరము.

## (2) చమసాధికరణము

అ॥ పూర్వాధికరణ విషయవాక్యమునందు వినవచ్చు చున్న యవ్యక్తశబ్దము ప్రధానసూచకము కాకపోవుగాక! "అజామేకాం లోహితకృష్ణవర్ణాం" అనువాక్యమునందు అజాశబ్దము ప్రధానపరమగుచున్నది. యని సాంఖ్యుడు చేసిన యాశంక ప్రకృతాధికరణమున విచారింపబడుచున్నది.

విషయవాక్యము : అజామేకాం లోహితకృష్ణవర్ణాం బహ్వీః ప్రజాః సృజమానాః (శ్వే 4-5) అను వాక్యమునందలి అజాపదము.

విశయము : అజాశబ్దము ప్రధానపరమా బ్రహ్మ పరమా ?

## చమసవదవిశేషాత్ (సూ 8.)

పూ. పక్షీ: పునరపి ప్రధానవాదీ అశబ్దత్వం ప్రధానస్యాసిద్ధ మిత్యాహ, కస్మాత్ ? మంత్రవర్ణాత్. 'అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాస్సృజమానాం సరూపాః అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్య' (శ్వే. 4-5) ఇతి. అత్ర హి మంత్రే లోహితశుక్ల కృష్ణశబ్దై రజస్సత్త్వతమాంస్యభిధీయంతే. లోహితం రజః రంజ

---

పూర్వపక్షము : ప్రధానపరము.

సిద్ధాంతము : బ్రహ్మపరము.

అవలోకనచేయదగిన శ్రుతులు. శ్వేత 4-5, ఛాందోగ్య 6-4-1 శ్వేత 1-1, 4-10-1॥, ఛాందోగ్యము 3-1 బృహదారణ్యకము. 5-8, 8-2-9.

విషయవాక్యమునందలి అజాశబ్దమునకు చమసవత్ = చమసశబ్దమువలె అవిశేషాత్.ప్రత్యేకమగు నర్థములేకపోవుట వలన ఆశబ్దము ప్రధానపరము కానేరదు.

పూ.పక్షి:తిరిగి ప్రధానవాది ప్రధానమున కశబ్దత్వము నిరూపితము కాలేదని వాదంచుచున్నాడు. ఏలనన! "రక్త శ్వేత కృష్ణవర్ణములుగలఅజ మొకటికలదుఅదితనతోసమానరూపము గల బహుసంతానమును కనెను. అజ మొకటి దానిని ప్రేమించి దానివద్దబరుండును. మఱియొకటి దానితో భోగించి వదలి వేయుచున్నది" (శ్వేత 4-5) అను మంత్రమునందలి లోహిత శుక్ల కృష్ణ శబ్దములచే రజః సత్వతమోగుణము లుదాహరిం

నాత్మకత్వాత్, శుక్లం సత్త్వం ప్రకాశాత్మకత్వాత్, కృష్ణం తమః ఆవరణాత్మకత్వాత్, తేషాం సామ్యావస్థావయవధర్మైర్వ్యప దిశ్యతే లోహితశుక్లకృష్ణేతి. న జాయత ఇతి చాజా స్యాత్, 'మూలప్రకృతిరవికృతి' రిత్యభ్యుపగమాత్. నన్వజాశబ్దశ్ఛాగాయాం రూఢః. బాఢమ్. సాతు రూఢిరిహ నాశ్రయితుం శక్యా, విద్యాప్రకరణాత్, సా చ బహ్వీః ప్రజాస్త్రైగుణ్యాన్వితా జనయతి. తాం ప్రకృతిం అజో హ్యేకః పురుషః జుషమాణః ప్రీయమాణః సేవమానో వాఽనుశేతే, తామేవావిద్యయాత్మత్వే

---

బడుచున్నవి. రంజింపజేయునది గనుక లోహితవర్ణము రజోగుణము. ప్రకాశింపజేయునది గనుక శుక్లవర్ణము సత్త్వగుణము ఆవరించి కప్పివేయునదిగనుక కృష్ణవర్ణము తమోగుణము. ఈమూడుగుణములు ననభివ్యక్తమగు సామ్యావస్థయందు వానియవయవధర్మములగు లోహితశుక్లకృష్ణవర్ణములచే జెప్పబడుచున్నది. పుట్టనిదిగనుక అజయనబడుచున్నది. ప్రధానము మూలప్రకృతియనియు దానివలన సర్వము పుట్టుచున్నదనియు నది దేనివలనబుట్టదనియు సాంఖ్యులంగీకరించుచున్నారు. నిజమే! అజశబ్దము ఆడమేకయందు రూఢము, కాని రూఢ్యర్థమిచట గ్రహింపవీలులేదు. ప్రకరణము విద్యాప్రకరణము. ప్రధానము త్రిగుణాత్మకమగు బహుసంతానము నుత్పాదనము చేయుచున్నది. జన్మరహితుడగు నొకపురుషు డాప్రకృతిని ప్రేమించి సేవచేయుచు నామెననుసరించి శయనించును. అనగా నామె నవిద్యచే యాత్మభావముచే బొంది తాను సుఖ

నోపగమ్య సుఖీ దుఃఖీ మూఢోఽహమిత్యవివేకితయా సంసరతి, అన్యః పునః అజః పురుషః ఉత్పన్నవివేకజ్ఞానో విరక్తో జహాతి ఏనాం ప్రకృతిం భుక్తభోగాం కృతభోగాపవర్గాం పరిత్యజతి ముచ్యత ఇత్యర్థః, తస్మాచ్ఛ్రుతిమూలైవ ప్రధానాదికల్పనా కాపిలానామితి.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః—నానేన మంత్రేణ శ్రుతిమూలత్వం సాంఖ్యవాదస్య శక్యమాశ్రయితుమ్. న హ్యయం మంత్రః స్వాతంత్ర్యేణ కంచిదపి వాదం సమర్థయితుముత్సహతే.

---

దుఃఖి, మూఢుడు నని యవివేకముతో సంచరించును. మఱియొకపురుషుడు, జ్ఞానముదయించినవాడై వైరాగ్యమును బొంది, యీమెవలన సుఖమునను భవించియు బరిత్యజించును. ఈశ్రుతివాక్యబలముచే కపిలానుయాయుల ప్రధానాదికల్పనము శ్రుతిసిద్ధము. ["మూలప్రకృతిః ప్రకృతివికృతయః మహదాద్యాః సప్త, షోడశస్తు వికారాః నవికృతిః న ప్రకృతిః పురుషః" అని సాంఖ్యసిద్ధాంతము. అనగా మూలప్రకృతి 1, మహత్తత్త్వము 1, పంచతన్మాత్రలు. 5 అహంకారము పంచభూతములు 5, జ్ఞానేంద్రియములు 5. కర్మేంద్రియములు 5, మనస్సు పురుషుడు మొత్తము 25 తత్త్వములని సాంఖ్యసిద్ధాంతము]

సిద్ధాంతి: ఇట్లుపపాదింపబడిన పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాము. ఈమంత్రముచే సాంఖ్యవాదము శ్రుతిసమ్మతమని చెప్పశక్యముకాదు. ఈ మంత్రము స్వయ

సర్వత్రాపి యయా కయాచిత్కల్పనయాఽజాత్వాదిసంపాదనోపపత్తేస్సాంఖ్యవాద ఏవేహాభిప్రేత ఇతి విశేషావధారణకారణాభావాత్ చమసవత్. యథాహి, 'అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః' (బృ. ౨-2-3) ఇత్యస్మిన్మంత్రే స్వాతంత్ర్యేణాయం నామాసౌ చమసోఽభిప్రేత ఇతి న శక్యతే నియంతుమ్, సర్వత్రాపి యథాకథంచిదర్వాగ్బిలత్వాదికల్పనోపపత్తేః. ఏవమిహాప్యవిశేషోఽజామేకామిత్యస్య మంత్రస్య నాస్మిన్మంత్రే ప్రధానమేవాఽజాభిప్రేతేతి శక్యతే నియతుమ్.

---

అజాశబ్దమునకు ప్రత్యేకార్థము లేదు.

ముగా నేవాదమును సమర్థింపలేదు. ఏదోయొక్క యర్థకల్పనముచే నజాదిశబ్దముల నేవాదమునందైనను సమన్వయము చేయవచ్చును. సాంఖ్యవాదమునే యీ మంత్రము ప్రత్యేకముగ నుదాహరించుచున్నదని వక్కాణించుటకు దగిన విశేషకారణములు కాన్పించుటలేదు. ఈమంత్రము చమసవాక్యమును బోలియున్నది. "అడుగున బెజ్జము, పైకికుండయు గలిగిన యొకచమసము అనగా యాగాదుల నుపయోగించు సోమపానపాత్రము గలదు అను మంత్రము స్వతంత్రముగ నొక ప్రత్యేకపాత్రనుగూర్చి పలుకుచున్నట్లు నిరూపింపశక్యము కాదు. ఏదోవిధముగ నేపాత్రకైన నధోబిలత్వాదిలక్షణముల నాపాదింపశక్యమగుచున్నది. అదేవిధముగ ప్రకృతమంత్రమునందుగూడ విశేషమేమియు లేదు. ఈమంత్రమునందు నజాశబ్దముచే ప్రత్యేకముగ ప్రధాన మభిప్రేతమగుచున్నట్లు నియమము లేదు.

పూ.పక్షి: తత్ర తు 'ఇదం తచ్ఛిర ఏష హ్యర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః' ఇతి వాక్యశేషాచ్చమసవిశేషప్రతిపత్తిర్భవతి, ఇహ పునః కేయమజా ప్రతిపత్తవ్యేతి.

## జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే (సూ 9.)

సిద్ధాంతీ: అత్ర బ్రూమః. పరమేశ్వరాదుత్పన్నా జ్యోతిఃప్రముఖా తేజోఽబన్నలక్షణా చతుర్విధస్య భూతగ్రామస్య ప్రకృతిభూతే

---

పూ. పక్షి : "అధోబిలము, ఊర్ధ్వముఖముగల చమసమున కిదిశిరస్సు "అను తరువాత వాక్యముచే నామంత్రమునందుద్దేశింపబడిన చమస్సును బ్రత్యేకించి చెప్పవచ్చును. కాని ప్రకృతమున వినవచ్చుచున్న అజాశబ్దముచే ప్రత్యేకముగ నేది తెలియవచ్చుచున్నది?"

సిద్ధాంతి : ఇందుకు తరువాతసూత్రముచే సమాధానము చెప్పుచున్నారు.

అజాశబ్దముచే జ్యోతిః ఉపక్రమా తు = తేజస్సుతో నుపక్రమింపబడిన జలములు అన్నములే నిశ్చయముగ చెప్పబడుచున్నవి. ఏకే = కొన్ని శాఖలవారు తథా = ఆవిధముగ అధీయతే హి = పలుకుచున్నారు.

పరమేశ్వరునివలన నుత్పన్నమై తేజస్సుతో నారంభమై అనగా తేజస్సు,జలము. అన్నములే లక్షణముగాగలిగి స్వేదజ జరాయుజ అండజ ఉద్భిజ్జములను నాలుగు భూతసమూహములకు ప్రకృతిభూతమగునది యీ యజమని గ్రహింప

యమజా ప్రతిపత్తవ్యా. తు శబ్దోఽవధారణార్థః. భూతత్రియలక్షణైవేయమజా విజ్ఞేయా న గుణత్రియలక్షణా. కస్మాత్ ? తథా

ప్రకృతమున అజాశబ్దార్థ నిర్ణయము.

తగును. సూత్రమునందలి 'తు' అయితే అను శబ్దము అవధారణయం దుపయోగింపబడుచు న్నది. [అవధారణమన నిశ్చయార్థకము] ఈయజ శబ్దము తేజోబన్నములను భూతత్రయము లక్షణ ముగాగలది కాని గుణత్రయము లక్షణముగా కలదికాదు.ఏల నన! చాందోగ్యోపనిషత్తు తేజోబన్నములు మూడును బరమేశ్వరునివలన నుత్పన్నములైనట్లు నిరూపించి వానికి రోహితాదిరూపములున్నట్లుపలుకుచున్నది[త్రివృత్కృతమగు నగ్నియొక్క రోహితరూపము త్రివృత్కృతముగాని తేజస్సు యొక్క రూపము అగ్నియొక్క కృష్ణరూపము త్రివృత్కృ మగు నన్నరూపము. అని (ఛాం 6–4–1) శ్రుతి పలుకు చున్నది. (తేజస్సు జలములు, అన్నము మొదట బుట్టినవి. వీనిలో ప్రతిభూతము రెండేసిభాగములుగ విభజింపబడినవి. అందులో నొక్కొక్కభాగము తిరిగి రెండేసిచిన్నభాగము లుగ విభజింపబడినవి. ప్రతిభూతముయొక్క పెద్దభాగముతో నితరభూతములయొక్క చిన్నభాగ మొకటి కలుపబడినది. ఇట్లు ప్రతిభూతమునందును స్వీయమగు నొకపెద్దభాగము పరకీయములగు రెండు చిన్నభాగములుగలవు. ఇట్లగ్నియం దొక్క స్వీయమగు నొకపెద్దభాగము. జలముయొక్కయు, అన్నముయొక్కయు నొక్కొక్క చిన్నభాగము మొత్తము మూడుభాగములు గలవు. ఈవిధానమును త్రివృత్కరణమం

హ్యేకే శాఖినస్తేజోఽబన్నానాం పరమేశ్వరాదుత్పత్తిమామ్నాయ తేషామేవ రోహితాదిరూపతామామనంతి. 'యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపమ్ యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యే'తి. తాన్యేవేహ తేజోఽబన్నాని ప్రత్యభిజ్ఞాయంతే, రోహితాదిశబ్దసామాన్యాత్, రోహితాదీనాం చ శబ్దానాం రూపవిశేషేషు ముఖ్యత్వాత్, భాక్తత్వాచ్చ గుణవిషయత్వస్య, అసందిగ్ధేన చ సందిగ్ధస్య నిగమనం న్యాయ్యం మన్యంతే, తథేహాపి

---

దురు. అగ్నిస్వీయభాగముచే తేజోరూపముగను, జలభాగముచే శ్వేతరూపముగను అన్నభాగముచే కృష్ణరూపముగను గాన్పించుచున్నది.] 'అజామేకాం' యనుమంత్రమునందును, 'యదగ్నే' రోహితగ్ం రూపం' అనుమంత్రమునందును రోహితాది మూడుశబ్దములు సమానములగుటవలన అజామంత్రమునందుగూడ తేజోబన్నములే పేర్కొనబడినట్లు గుర్తింపబడుచున్నవి. రోహితాదిశబ్దములు రూపవిశేషములను ముఖ్యముగ తెలియచేయుచున్నవి. సత్వరజస్తమోగుణములయందు గౌణముగ నుపకరించుచున్నవి, అసందిగ్ధములగువానిచే సందిగ్ధములగువాని యర్థనిర్ణయము చేయటన్యాయమని పెద్దలంగీకరించుచున్నారు (ఒకశాఖలోని మంత్రమునకు మఱియొకశాఖలోని పదములచే నర్థకల్పనము చేయుట యుక్తముకాదనినచో 'అజామేకాం' అనుమంత్రము కాన్పించుచున్న శ్వేతాశ్వతరములోనే యిందు కుదాహరణము కాన్పించుచున్నది.) "సృష్టియందు బ్రహ్మకు సహాయమెద్ది"

'బ్రహ్మవాదినో వదంతి కిం కారణం బ్రహ్మే' (శ్వే. 1-1) త్యుపక్రమ్య 'తే ధ్యానయోగానుగతా అపశ్యన్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢా' మితి, (శ్వే. 1-3) పారమేశ్వర్యాశ్చ శక్తే స్సమస్తజగద్విధాయిన్యా వాక్యోపక్రమేఽవగమాత్, వాక్య శేషేపి 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వర' మితి. 'యోయోనిం యోనిమధితిష్ఠ్యత్యేక' ఇతి (శ్వే, 4-10-11) చ తస్యా ఏవాగమాత్, న స్వతంత్రా కాచిత్ప్రకృతిః ప్రధానం నామాజామంత్రేణామ్నాయత ఇతి శక్యతే వక్తుం ప్రకరణాత్తు

యని బ్రహ్మవాదులు విచారింపదొడంగిరి. '(శ్వేత 1-1)ఇట్లు పక్రమించి వారలు ధ్యానయోగము ననుసరించి పరమాత్మను బ్రవేశించి యద్దానితో నైక్యమునొందియున్న సత్వాది గుణసంపన్నయగు మాయాశక్తిని గనుగొనిరి (శ్వేత 1-3) అను వాక్యమున సమస్తజగద్విధానసమర్థయగు పరమేశ్వర సంబధమగు నొకశక్తియున్నట్లు దెలియుచున్నది. ఈవాక్యము ప్రకృతమగు విషయవాక్యమునకు ముందుగా కాన్పించు చున్నది, 'ప్రకృతి మాయయనియు మహేశ్వరుడు మాయావి యనియు దెలిసికొనవలయును' అనియు ఎవ్వడొక్కడే ప్రతి కారణమును నియమనము చేయుచున్నాడో' అనియు (శ్వే 4-10-11) మఱిరెండువాక్యములు తరువాత గాన్పించు చున్నవి. ఈరెండుమంత్రములయందు నామాయాశక్తియె పలుకరింపబడుచున్నది. కాని అజామంత్రము స్వతంత్రమగు ప్రధానకారణము నుదాహరించుచున్నది యని చెప్పనలవి గాదు. ప్రకరణసందర్భముచే నవ్యక్తనామరూపాత్మకమగు

సైవ దైవశక్తిరవ్యాకృతనామరూపా నామరూపయోః ప్రాగవస్థానేనాపి మంత్రేణామ్నాయత ఇత్యుచ్యతే. తస్యాశ్చ స్వవికార విషయేణ త్రైరూప్యముక్తమ్.

---

మాయాశక్తియె నామరూపాత్మకమగు జగత్తునకు బూర్వముండినట్లు మంత్రము పల్కుచున్నది. త్రిగుణము లాపరమేశ్వరశక్తి వికారములగుటచే నాశక్తిగూడ తేజోబన్నాది రూపత్రయము గలిగియున్న ట్లుదాహరింపబడుచున్నది. [ప్రధానము స్వతంత్రము ఈశ్వరాధిష్ఠితముకాదు. మాయ యస్వతంత్రము. ఈశ్వరాధిష్ఠితము అని తాత్పర్యము.]

[అజాశబ్దార్థనిర్వచన చేయుటకు రోహితాదిశబ్దముల యర్థనిర్వచనచేయ నవసరమగుచున్నది. అజాశబ్దము శందిగ్ధార్థము. రోహితాదిశబ్దములు రూపమునందు రూఢ్యర్థకములు. కాని వానిరూఢ్యర్థమా అజామంత్రమున సమన్వయముకాదు. మరియొకయర్థకల్పనమును సూచించు కారణము లామంత్రమున గానరావు. ఈమూడుపదములే 'యదగ్నేః' యనుచాందోగ్యమంత్రమున వినవచ్చుటయెగాక తేజోబన్నములు వానియర్థమని స్పష్టముగ చాందోగ్యమున నిరూపింపబడుచున్నది. ఆయర్థమును గ్రహించి అజపదము తేజోబన్నపరమని నిరూపించుటకు సమానపదములుగల యితరవాక్యమును గ్రహించి సూత్రమును రచియించిరి. ఇట్లుచేయుటలోనసందిగ్ధార్థముచే సందిగ్ధార్థనిరూపణముచేయు న్యాయమును సూత్రకారులు గ్రహించిరి. ఈ న్యాయము

పూ.పక్షీ: కథం పున స్తేజోఽబన్నానాం త్రైరూప్యేణ త్రిరూపాఽజాప్రతిపత్తుం శక్యతే. యావతా నతావ త్తేజోఽబన్నేష్వజాకృతి ర స్తి, న చ తేజోఽబన్నానాం జాతిశ్రవణాదజాతినిమిత్తోఽప్య జాశబ్దస్సంభవతీతిచేత్.

---

నవలంబించియే అజావాక్యము కాన్పించుచున్న శ్వేతాశ్వతర శ్రుతి ఉపక్రమవాక్యమునుబట్టి యజాశబ్దము మాయాపర మని భాష్యకారులు నిరూపించిరి. ఇందువలన నజాశబ్దము స్వాయముగు నర్థమును దెలియచేయగల పదముకాదని పర్య వసన్నమగుచున్నది. ఉభయులకును బ్రత్యేకముగ నజశబ్దా ర్థనిరూపణచేయుటయందు దాత్పర్యములేదు. అట్లుచేయుట అప్రసక్తప్రసక్తమగును. అజాశబ్దము ప్రధానపరము గాదని నిరూపించుటయందే ఉభయులకు తాత్పర్యము, సూత్ర కారుల తాత్పర్యమును పాటించుచు, మార్గాంతరముచే నజా శబ్దమునకు నిశ్చితార్థములేదని భాష్యకారులు నిరూపించిరి. కనుక నుభయులకు విరోధములేదు]. 9

పూ. పక్షి : రక్తాదివర్ణత్రయ మున్నంతమాత్రముచే నజాశబ్దము త్రివర్ణాత్మకమని చెప్పనెట్లుశక్యము? [అజాశబ్ద మునకు రూఢ్యర్థమును గ్రహింపవలెనా? లేకయౌగికార్థమును గ్రహింపవలెనా?] తేజోబన్నములయం దజాకారములేదు గనుక, రూఢ్యర్థము సంభవముకాదు. తేజోబన్నములు మూడు నుత్పన్నములయినట్లు 'యదగ్నే రూపం' అనుశ్రుతి చెప్పుచున్నది. అజాశబ్దమునకు బుట్టనిదేదియో యది యజ

సిద్ధాంతీ: అత ఉత్తరం పఠతి,

## కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః (సూ 10)

సిద్ధాంతీ: నాయమజాకృతినిమిత్తోఽజాశబ్దః, నాపి యౌగికః. కిం తర్హి? కల్పనోపదేశోఽయమజా రూపకక్లృప్తిస్తేజోఽబన్నలక్షణా యాశ్చరాచరయోనేరుపదిశ్యతే. యథా హి లోకే యదృచ్ఛయా

యని యౌగికార్థము. కనుక బుట్టునవియగు తేజోబన్నముల కజాశబ్దమన్వర్థము కానేరదు.

సిద్ధాంతి : ఈయాక్షేపణమున కుత్తరసూత్రము సమాధానము చెప్పుచున్నది.

అజాశ్రుతియందలి యజాశబ్దము అజాకారమును చెప్పుటలేదు. [అజాశబ్దము పశువిశేషమునందు రూఢిపదము. అట్టిపశువు నిచటనాశబ్దము చెప్పుటలేదు.] ఆ శబ్దమునకు వ్యుత్పత్త్యర్థమునుగూడ జెప్పశక్యము కాదు. [అజ అనగా పుట్టుకలేనిదియని వ్యుత్పత్త్యర్థము. ప్రతివాదులు చెప్పు ప్రకృతి త్రిగుణజన్యమని వాదించుచున్నారు. కనుక వ్యుత్పత్త్యర్థముచే నజాశబ్దమునకు ప్రకృతియని వ్యుత్పత్త్యర్థము చెప్ప వీలులేదు.] అట్లయినచో నాశబ్దమున కర్థకల్పన మేలాగుచేయవలెనన! ఉపదేశముకొఱకు తేజోబన్నములకు లౌకికమగు నజాశబ్దముచే సాదృశ్యమాశ్రుతియందు గల్పింపబడినది. చరాచరములకు గారణమగు తేజోబన్నములు అజాకల్పనముచే వివరింపబడుచున్నవి. కొన్నిభాగములకు లోకమునందు

కాచిదజా లోహితశుక్లకృష్ణవర్ణా స్యాత్ బహుబర్కరా సరూప బర్కరా చ. తాం చ కశ్చిదజో జుషమాణోఽనుశయీత, కశ్చిచ్చైనాం భుక్తభోగాం జహ్యాత్. ఏవమియమపి తేజోఽబన్నలక్షణా భూతప్రకృతిస్త్రివర్ణా బహుసరూపం చరాచరలక్షణం వికారజాతం జనయతి, అవిదుషా చ క్షేత్రజ్ఞేనోపభుజ్యతే, విదుషా చ పరిత్యజ్యత ఇతి. న చేదమాశంకితవ్యమేకః క్షేత్రజ్ఞోఽనుశేతేఽన్యో జహాతీతి, అతః క్షేత్రజ్ఞభేదః పారమార్థికః పరేషామిష్టః ప్రాప్నోతీతి. న హీయం క్షేత్రజ్ఞభేదప్రతిపిపాదయిషా కింతు

---

పుట్టుకతోనే రోహితాదివర్ణములు గలవు. వానికి వానినిబోలు సంతానముగూడ గలుగుచున్నది. ఒకదానిని మఱియొకటి ప్రేమించి దానిననుసరించి పరుండవచ్చును. మఱియొకటి యద్దానిననుభవించి వదలివేయ వచ్చును. ఈతీరుగనే తేజోబన్నాత్మకమై

అజాశబ్ద
ముపమానార్థకము.

రక్తశ్వేతపీతములను మూడువర్ణములు గలిగియున్నప్రకృతి గూడ తనకనురూపము, చరాచరస్వరూపమునగు వికారజాతము నుత్పన్నముచేయవచ్చును. అజ్ఞానియగు జీవునిచే నుపభుక్తమగుచున్నది. జ్ఞానిచే బరిత్యజింపబడుచున్నది. జీవుడొకడనుభవించుచున్నాడు, మఱియొకడు పరిత్యజించుచున్నాడనుటచే మతాంతరుల కిష్టమగు జీవానేకత్వము పరమార్థముగ మేమంగీకరించుచున్నామని శంకింపబనిలేదు. అజాశ్రుతి జీవులనానాత్వము నుపపాదింపదలచలేదు. జీవునియొక్క బంధమునుగూర్చి వ్యవస్థచేయగోరుచున్నది. లోకమునందు సుప్రసిద్ధముగనున్న జీవనానాత్వమును బురస్కరించుకొనియిట్టి

బంధమోక్షవ్యవస్థాప్రతిపిపాదయిషైవైషా. ప్రసిద్ధం తు భేద మనూద్య బంధమోక్షవ్యవస్థా ప్రతిపాద్యతే, భేదస్తూపాధినిమిత్తో మిథ్యాజ్ఞానకల్పితో న పారమార్థికః 'ఏకో దేవస్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మే' త్యాదిశ్రుతిభ్యః.

మధ్వాదివద్యథాదిత్యస్యామధునో మధుత్వం (ఛాం. 3-1) వాచశ్చాధేనో ర్ధేనుత్వం (బృ. 5-8) ద్యులోకాదీనాం చాన గ్నీనామగ్నిత్వమి (బృ. 8-2-9) త్యేవం జాతీయకం కల్ప్యతే,

---

బంధమోక్షవ్యవస్థను వివరించుచున్నది. జీవనానాత్వమన్ననో వివిధోపాధులయందాతడు కాన్పించుచుండుట చేతనావిధముగ గాన్పించుచున్నది. కేవలమిథ్యాజ్ఞానమే యిందులకు గారణము, అది పరమార్థముకాదు. "పరమేశ్వరుడొకడే; సమస్త భూతములయందు నిగూఢముగ నున్నవాడు; అతడు సర్వ వ్యాపి, సర్వభూతముల కాత్మస్వరూపుడు" (శ్వేత 6-11) అనిశ్రుతి పలుకుచున్నది.

'మధువునుబోలి' యనుపదముల కర్థమేమన! ఛాందో గ్యము 3-1 వాక్యమున నాదిత్యునియందు మధువులేకున్నను మధుశబ్దముచే వర్ణింపబడుచున్నాడు. [ఈయాదిత్యుడు దేవ తలకు మధువగుచున్నాడు అనువాక్యమునం దాదిత్యునకు మధుత్వ మారోపింపబడుచున్నది] బృహదారణ్యకము 5-8 వాక్యమునందు వాక్కుయందు ధేనుత్వములేకున్నను ధేనుత్వ మారోపింపబడుచున్నది. ద్యులోకములు మొదలగువానియం దగ్నిత్వములేకున్నను వానియందగ్నిత్వమును బృహదారణ్యా

ఏవమిదమనజాయా అజాత్వం కల్ప్యత ఇత్యర్థః, తస్మాదవిరోధ స్తేజోఽబన్నేష్వజాశబ్దప్రయోగస్య—ఇతి ద్వితీయాధికరణమ్.

---

కము 8-2-9 వాక్య మారోపించుచున్నది. ఈవిధముగు కల్పనలకు నిదర్శనము లనేకములు గలవు. ఆవిధముగనే తేజోబన్నములయందజాత్వము లేకపోయినను నుపాసనార్థ మజత్వము శ్రుతియందు గల్పింపబడుచున్నది యని తాత్పర్యము. కనుక తేజోబన్నములయెడ నజాశబ్దమును బ్రయోగించుట విరోధముకాదు.

అధికరణ సంక్షేపార్థము: అజావాక్యమునందు ప్రధానమజాశబ్దముచే నిర్దేశింప బడుటవలన ప్రధానమున కశబ్దత్వము లేదని పూర్వవాదివాదము. అజాలక్షణమగు లోహితశుక్లకృష్ణవర్ణములు రజస్సత్వతమోగుణముల సూచించుచున్నవి యని పూర్వవాదివాదము. అజాశబ్దము వ్యుత్పత్త్యర్థముచేత గూడ ప్రధానమును దెలియ చేయుచున్నదియని వారనుచున్నారు ఇందుకు సిద్ధాంతముల సమాధానమేమన అజావాక్యమునకు బ్రత్యేకమర్థము లేదు. సందర్భానుసారముగ నజాశబ్దమున కర్థకల్పనము చేయవలెను. వాక్య ప్రకరణబలముచే నజాశబ్దము తేజోబన్నపరముగ గ్రహింపవలెను. ప్రకరణమును బట్టి యాశబ్దమునకు రూఢ్యర్థముకాని వ్యుత్పత్త్యర్థముకాని సమన్వయముకానేరదు. ఉపాసనార్థము తేజోబన్నములు త్రివర్ణాత్మకమగు నజమునకు బోల్పబడినవి. 10

# (3) సంఖ్యోపసంగ్రహాధికరణమ్ (సూ 11-13.)

## (3) సంఖ్యోపసంగ్రహాధికరణము

అ॥ అజావాక్యమునందలి యజాశబ్దమునకు ప్రకరణా నురోధముగ రూఢ్యర్థముగాని యౌగికార్థముగాని కుదరక పోవుటవలన నది ప్రధానపరముగా దని త్రోసిపుచ్చుదుముగాక. 'యస్మిన్' పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః (బృ 4-4-17) యనువాక్యమునందు ప్రకరణమునుబట్టి పంచజనశబ్దమును రూఢ్యర్థమగు మనుష్యపరముగ గ్రహింపవీలులేదు. పంచ పంచయని యిరువదియైదుసంఖ్య వినబడుచున్నది. ఆ సంఖ్య సాంఖ్యుల పంచవింశతితత్త్వములను దెలియజేయుచున్నది. గనుక బ్రధానమున కశబ్దత్వము పాటింపనేరదను పూర్వ పక్షమునకు సమాధానపూర్వకముగ సమనంతరాధికరణ మారంభింపబడుచున్నది,

విషయవాక్యము : యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః (బృహదా. 4-4-17)

విశయము : పంచజనశబ్దముచే మూలప్రకృత్యాదులు చెప్పబడుచున్నవా? ప్రాణాదులు చెప్పబడుచున్నవా?

పూర్వపక్షము : మూలప్రకృత్యాదులు చెప్పబడుచున్నవి.

సిద్ధాంతము : ప్రాణాదులు చెప్పబడుచున్నవి.

అవలోకనీయశ్రుతులు బృ 4-4-17. 4-4-16, 4-4-18. ఛాం 3-13-6.

## న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ

(సూ 11.)

పూ.పక్షీ: ఏవం పరిహృతేఽప్యజామంత్రే పునరప్యన్యస్మాన్మంత్రాత్సాంఖ్యః ప్రత్యవతిష్ఠతే 'యస్మిన్పంచపంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః తమేవ మన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోఽమృతః' (బృ. 4-4-15) మితి, అస్మిన్మంత్రే పంచ పంచజనా ఇతి పంచసంఖ్యావిషయాఽపరా పంచసంఖ్యా శ్రూయతే పంచశబ్దద్వయ

---

విషయవాక్యమునందు సంఖ్యా ఉపసంగ్రహాత్=పంచ పంచయను సంఖ్య వినవచ్చుటవలన ఆశబ్దము చేత సాంఖ్యులు పంచవింశతితత్త్వము లుదాహరింపబడుచున్నవంటి రేని, న= అటులగాదు ఏలనన నానాభావాత్ = పంచవింశతి సంఖ్యలు గల వస్తువులనేకము లుండుటవలనను ఆకాశము అతిరేకాత్ చ = పంచవింశతి సంఖ్యలలో చేరకుండుటచేత.

పూ. పక్షి : అజామంత్రి మీావిధముగ బరిహరింపబడినను సాంఖ్యుడు మఱియొక మంత్రిముచే నడ్డముతగులుచున్నాడు. "అయిదేసిసంఖ్యగల నయిదుసముదాయములును ఆకాశము నాత్మయందు బ్రతిష్ఠితము లగుచున్నవి. అట్టి యాత్మ యమృతమని నేనుదలంచుచున్నాను, ఇట్లు దెలిసికొనుటచే నేనమృతుడ నగుదును" (బృ 4-4-15) అను మంత్రిమునందు పంచసంఖ్యలు విషయముగాగల మఱియొక పంచసంఖ్య వినబడుచున్నది. అచట రెండుపంచశబ్దములు

దర్శనాత్, త ఏతే పంచపంచకాః పంచవింశతిస్సంపద్యంతే. తయా చ పంచవింశతిసంఖ్యయా యావంతస్సంఖ్యేయా ఆకాక్ష్యంతే తావంత్యేవ చ తత్త్వాని సాంఖ్యైస్సంఖ్యాయంతే. 'మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త. షోడశకశ్చ వికారో న ప్రకృతిః న వికృతిః పురుష' ఇతి. తయా శ్రుతిప్రసిద్ధయా పంచవింశతి సంఖ్యయా తేషాం స్మృతిప్రసిద్ధానాం పంచవింశతి తత్త్వానాముపసంగ్రహాత్ప్రాప్తం తావచ్ఛ్రుతిమత్త్వమేవ ప్రధానాదీనామ్.

సిద్ధాంతీ: తతో బ్రూమః. న సంఖ్యోపసంగ్రహాదపి ప్రధానాదీనాం శ్రుతిమత్త్వం ప్రత్యాశా కర్తవ్యా, కస్మాత్? నానాభావాత్, నానా హ్యేతాని పంచవింశతిస్తత్త్వాని, నైషాం పంచశః

---

వినబడుచున్నవి. అయిదేసి సంఖ్యలుగల యయిదనుటచే నిరువది యయిదు సంఖ్య లవగతములగుచున్నవి. పంచవింశతి సంఖ్యచే నెన్ని చెప్పబడుచున్నవో యన్నితత్త్వములే సాంఖ్యులచే లెక్కింపబడుచున్నవి. అవియె మూలప్రకృతి మొదలగునవి. శ్రుతిప్రసిద్ధమగు నీపంచవింశతిసంఖ్యచే సాంఖ్యస్మృతి ప్రసిద్ధమగు నిరువది యయిదు తత్త్వములు గ్రహింపబడుచున్నవి. కనుక ప్రధానాదులు శ్రుతిప్రసిద్ధములగుచున్నవి.

సిద్ధాంతి : ఇందులకిట్లు సమాధానము చెప్పుచున్నాము. శ్రుతియందు వినబడుచున్న సంఖ్యను గ్రహించినను ప్రధానాదులు శ్రుతిసిద్ధములని యాశింపతగదు, ఏలనన! సాంఖ్యుల పంచవింశతితత్త్వములు నానావిధములగుటంజేసి, వీరి పంచవింశతితత్త్వము లనేకవిధములు. అయిదేసిగ

పంచశస్సాధారణో ధర్మోऽస్తి, యేన పంచవింశతే రంతరాళేఽ పరాః పంచపంచసంఖ్యా నివిశేరన్, న హ్యేకనిబంధనమంతరేణ నానాభూతేషు ద్విత్వాదికాస్సంఖ్యా నివిశంతే.

పూ.పక్షీ: అథోచ్యేత పంచవింశతిసంఖ్యైవేయమవయవద్వారేణోపలక్ష్యతే. యథా 'పంచసప్త చ వర్షాణి నవవర్ష శతక్రతు' రితి. ద్వాదశవార్షికీమనావృష్టిం కథయంతి తద్వదితి.

సిద్ధాంతీ: తదపి నోపపద్యతే. అయమేవాస్మిన్పక్షే దోషో

---

నొకొక్కగణములో జేర్చగల సాధారణధర్మములు వానికిలేవు, అందువలన నీపంచవింశతితత్త్వముల నయిదేసిగల యయిదు గణములుగ విభజించి చేర్చశక్యముకాదు. విభిన్నములగు ననేకవస్తువుల కొకసమాహారధర్మములేనపుడు రెండేసి గాని మూడేసిగాని చేర్చి యొకగణముగాజేర్చలేము.[ఇద్దరశ్వినీదేవతలు సప్తర్షులు,అష్టవసువులు–ఈవిధముగ ననేకముల నొకగణమునందు జేర్చుటకేదోయొక సాధారణ ధర్మ మవసరము]

పూ. పక్షి : అయిదేసిగల నయిదు సముదాయములనుటచేతనే నిరువదిఅయిదనుసంఖ్య సూచింపబడుచున్నది. ఇందు "ఐదు పంచవర్షములు సప్తవర్షములున్ను వర్షింపలేదు" అని ద్వాదశవర్షపరిమితమగు ననావృష్టి వర్ణింపబడుచున్నది. అటులనే నిచటగూడ [నని పూర్వపక్షులలోనొకరన వచ్చును].

సిద్ధాంతి: ఈసమాధానముగూడ నిలువనేరదు. ఈవాదమునందు ముఖ్యమగు దోషమిది. పంచపంచ అనుశబ్దములకు లక్ష

యల్లక్షణాశ్రియణీయా స్యాత్. పరశ్చాత్రి పంచశబ్దో జనశబ్దేన సమస్తః పంచజనా ఇతి, పారిభాషికస్వరేణైకపదత్వనిశ్చయాత్ ప్రయోగాంతరే చ 'పంచానాం త్వా పంచజనానాం' (తై. 1-6-2-2) మిత్యైకపద్యైకస్వర్యైక విభక్తికత్వావగమాత్, సమస్తత్వాచ్చ న వీప్సా పంచపంచేతి, న చ పంచసంఖ్యాయా ఏకస్యాః పంచ

---

ణార్థముచే పంచవింశతి యర్థము చెప్పవలెను. [ముఖ్యార్థమును గ్రహించిన పంచపంచ అయిదుఅయిదు పదియని యర్థముగలుగును గాని యిరువదియయిదను నర్థముకలుగదు. పంచపంచ అను శబ్దమునకు అయిదింట అయిదు యిరువదిఅయిదు అను ముఖ్యార్థముకుదరనపుడు లక్షణచే నర్థమునుగ్రహించవలెను. [గంగాప్రవాహమునందు గ్రామము అను వాక్యమునకు ముఖ్యార్థ మసంభవముగనుక గంగయొడ్డున గ్రామమని లక్షణార్థము గ్రహింపబడును] మఱియు రెండవ పంచశబ్దము జనశబ్దముతో కలసి పంచజనాః యగుచున్నది. అది స్వరపరిభాషచే నొకపదముగ నిశ్చయింపబడుచున్నది. "పంచానాం త్వా పంచజనానాం" (తైబ్రా 1-6-2-2) అని మఱియొక వాక్యమునందు ఏకపదము ఏకస్వరము ఏకవిభక్తి వినవచ్చుచున్నవి. రెండవ పంచశబ్దము జనశబ్దముతో గలిసియుండుటచేత నొకే పంచసంఖ్య పంచపంచ యని వీప్సగా చెప్పవీలు లేదు. పంచపంచ యని రెండయిదులను చెప్పవీలులేదు. [ఆదరణకొఱకుగాని యుదాత్తతకొఱకుగాని యొకేవిషయమును దిరిగిచెప్పుట వీప్స యనిపించుకొనును. పంచశబ్దము వీప్సగాజెప్పిన నొకే యయిదు తిరిగి చెప్పినట్లగును. వీప్స లేనిచో రెండయిదులు పదియగును. ఒక పంచజనపదమును

సంఖ్యయా ఉపరయా విశేషణం పంచపంచకా ఇతి, ఉపసర్జనస్య విశేషణేనాసంయోగాత్.

పూ.పక్షి: నన్వాపన్నపంచసంఖ్యాకా జనా ఏవ పునః పంచ సంఖ్యయా విశేష్యమాణాః పంచవింశతిః ప్రత్యేష్యంతే. యథా పంచ పంచపూల్య ఇతి పంచవింశతిః పూలాః ప్రతీయంతే తద్వత్.

---

సమాసముగా జెప్పక పంచ, జన యని విడి పదములుగా గ్రిహించిన, పంచ పంచ, జన యని యేర్పడుచున్నది. ఆ పక్షమున ] ఒక పంచశబ్దము రెండవ పంచశబ్దమునకు విశేషణముగగాని రెండుపంచశబ్దములు ప్రత్యేకముగ జనశబ్దమునకు విశేషణముగగాని, గ్రహింపవీలులేదు. పంచశబ్దములు రెండును విశేషణములగుటచే నొకవిశేషణము మఱియొక విశేషణముతో నన్వయింపదు. విశేషణము కానపుడు విశేష్యముతో నన్వయించును. విశేషణములగు రెండుపంచశబ్దములు విశేష్యముతో నన్వయించినపుడు పదియనియర్థము సిద్ధమగునుగాని యిరువదిఅయిదను నర్థముసంభవముకాదు.

పూ. పక్షి: పంచజనశబ్దముచే నయిదుగురు జనులు గలయొక సమూహమని యర్థము. మొదటిపంచజనశబ్దముచే నట్టియయిదేసిజనులు గలసమూహము లయిదని యర్థము. అపుడిరువదియయిదను నర్థము వచ్చుచున్నది. అయిదేసి పదార్థములుగల కట్టలయిదను ప్రియోగమునం దిరువయయిదను నర్థము ప్రితీతమగుచున్నది. అటులనే యిచటగూడ.

సిద్ధాంతీ: నేతి బ్రూమః, యుక్తం యత్పంచపూల్యేష్వత్ర సమాహారాభిప్రాయత్వాత్ప్రతీతి సత్యాం భేదాకాంక్షాయాం పంచ పంచ పూల్య ఇతి విశేషణం, ఇహ తు పంచజనా ఇత్యాదిక ఏవ భేదోపాదానాత్ప్రతీత్యసత్యాం భేదాకాంక్షాయాం న పంచ పంచజనా ఇతి విశేషణం భవేత్, భవదపీదం విశేషణం పంచసంఖ్యయా ఏవ భవేత్. తత్ర చోక్తో దోషః, తస్మాత్పంచపంచజనా ఇతి న పంచవింశతితత్త్వాభిప్రాయం.

---

సిద్ధాంతి : అట్లు వీలు లేదనుచున్నాము. [పైయుదాహరణ మిచట విషమమగుచున్నది] అయిదుపదార్థములు గలకట్ట యనినపుడీయయిదుపదార్థములు కలిసి యొకేకట్ట యని యర్థమగుచున్నది. ఇట్టికట్టలెన్ని యనిప్రశ్నరాగా నట్టికట్టలయిదని యర్థము కుదురుచున్నది. అప్పుడు మొదటి పంచశబ్దము 'పంచపూల్యాః' అనుపదమునకంతకు విశేషణమగుచున్నది. ప్రకృతమునందో, పంచజనాః, అయిదుగురుజనులు అనునర్థమున సమాహారమనగా నేకత్వజ్ఞానము లేదు. పంచజన సమాసమునకు పంచజనసమాహారమని యర్థమును గ్రహించకూడదా? విడివిడిగా నయిదుగురుజనులు గ్రహింపబడుచున్నారు. అప్పుడయిదుగురుజను లెంతమందియను ప్రశ్న పుట్టదు. అటువంటి ప్రశ్న బుట్టినను, మొదటిపంచశబ్దము పంచజనశబ్దములోని పంచశబ్దమునకే విశేషణమగును గాని పంచజనశబ్దమునకు గానేరదు. అప్పుడు సంభవించు దోషము నిదివఱకే చెప్పితిమి.

పంచజన శబ్దముచే ప్రధాన పరత్వము కుదరదు.

అతిరేకాచ్చ న పంచవింశతితత్త్వాభిప్రాయం, అతిరేకో హి భవత్యాత్మాకాశాభ్యాం పంచవింశతిసంఖ్యాయాః. ఆత్మా తావదిహ ప్రతిష్ఠాం ప్రత్యాధారత్వేన నిర్దిష్టః, యస్మిన్నితి సప్తమీ సూచితస్య 'తమేవమన్య ఆత్మాన' మిత్యాత్మత్వేనానుకర్షణాత్. ఆత్మా చ చేతనః పురుషస్స చ పంచవింశతావంతర్గత ఏవేతి న తస్యైవాధారత్వమాధేయత్వం చ యుజ్యేత, అర్థాంతరపరిగ్రహే వా తత్త్వసంఖ్యాతిరేకస్సిద్ధాంతవిరుద్ధః ప్రసజ్యేత తథా 'ఆకాశశ్చ

---

అందువలన బంచపంచజనశబ్దము పంచవింశతితత్త్వముల బోధింపనేరదు.

పంచవింశతిసంఖ్యకంటె నధికముగ తత్త్వములుండుట వలన పంచవింశతితత్త్వము లభిప్రేతములగుటలేదు. ఆత్మ ఆకాశము విడిగా జెప్పబడినందున పంచవింశతితత్త్వముల సంఖ్య యతిక్రమణము సంభవించుచున్నది. ప్రకృత విషయవాక్యమునందాత్మ పంచజనమున కాధారముగ నిర్దేశింపబడుచున్నది. యస్మిన్—దేనియందని సప్తమీవిభక్తిచే సూచింపబడినదియే "అదియే యాత్మయని" తరువాతవాక్య భాగముతో సంబంధించుచున్నది. ఆత్మ చేతనాత్మకమగు పురుషుడు. సాంఖ్యులాత్మను పంచవింశతిసంఖ్యలో నొకటిగ జెప్పుచున్నారు. ఆ పక్షమున నదియాధారము ఆధేయముగ గూడనుండవీలులేదు. [సాంఖ్యవాదానుసారము పంచపంచజన శబ్దము పంచవింశతితత్త్వపరము. ఆత్మ పంచవింశతితత్త్వములలో నొకటి. కాని ప్రకృతవిషయవాక్యము పంచపంచ జనము కాత్మ ఆధారమనియు పంచపంచజన మద్దానిమీద

ప్రతిష్ఠిత' ఇత్యాకాశస్యాపి పంచవింశతావంతర్గతస్య న పృథగు పాదానం న్యాయ్యమ్, అర్థాంతరపరిగ్రహే చోక్తం దూషణమ్. కథం చ సంఖ్యామాత్రశ్రవణే సత్స్వశ్రుతానాం పంచవింశతి తత్త్వానాముపసంగ్రహః ప్రతీయేత, జనశబ్దస్య చ తత్త్వేష్వరూఢ త్వాత్, అర్థాంతరోపసంగ్రహేఽపి సంఖ్యోపపత్తేః.

---

నాధారపడుచున్నదనియు బలుకుచున్నది. ఈవిధమున సాంఖ్యవాదము ప్రకారము ఆత్మయాధారము ఆధేయము గూడ నగుచున్నది. ఒకేవస్తువునకు విరుద్ధలక్షణములు సంభ వము కావు]. ఆత్మ పంచవింశతితత్త్వములలో జేరదని యంటి రేని తత్త్వములు యిరువదియాఱగును. అప్పుడు సాంఖ్య సిద్ధాంతమునకు విరోధము సంప్రాప్తమగును. ఈవిధముగనే యాకాశము గూడ నాత్మయందు బ్రతిష్ఠితమైనదియని విషయ వాక్యము పల్కుచున్నది. సాంఖ్యులాకాశమును బంచవింశతి తత్త్వములలో నొకటిగ లెక్కించుచున్నారు. కనుక దానిని వేఱుగ లెక్కించుట న్యాయ్యముకాదు. వేఱుగ గ్రహించినచో బంచవింశతిసంఖ్యాతిక్రమణదోషము సంభవించునని యిది వరకే చెప్పియుంటిమి. శ్రుతియందు పంచపంచసంఖ్య విన వచ్చుచున్నంతమాత్రముచేత నెచటను వినబడని పంచవింశతి తత్త్వముల గ్రహించుట కెట్లుసాధ్యమగును? జనశబ్దము సాంఖ్యులతత్త్వములయందు రూఢముకాదు. జనశబ్దమునకు మఱియొక యర్థపరిగ్రహణము చేసినను, సంఖ్యాగణనము సంభవించుచున్నది.

కథం తర్హి పంచపంచజనా ఇతి? ఉచ్యతే—దిక్సంఖ్యే సంజ్ఞాయా' మితి (పా. 2-1-50) విశేషస్మరణాత్సంజ్ఞాయామేవ పఞ్చశబ్దస్య జనశబ్దేన సమాసః, తతశ్చ రూఢత్వాభిప్రాయేణైవ కేచిత్పంచజనా నామ వివక్ష్యంతే, న సాంఖ్యతత్త్వాభిప్రాయేణ, తే కతీత్యస్యామాకాంక్షాయాం పునః పంచేతి ప్రయుజ్యతే, పఞ్చజనా నామ యే కేచిత్, తే చ పంచైవేత్యర్థః. సప్తర్షయస్సప్తేతి యథా.

---

అట్లయినచో బంచపంచజనశబ్దమున కర్థమేమియన చెప్పుచున్నాము. దిక్కులను సంఖ్యలను బోధించుపదములు మరియొకవిశేష్యముతో సమసితములైనపుడు వానికి స్వీయమగు నర్థము

పంచజన శబ్దార్థము.

పోయి నొకప్రత్యేకమగు వస్తువును బోధించును. [దక్షిణాగ్ని సప్తర్షులు - నవరాత్రిలు మొదలగు సమాసములయందు దక్షిణ,సప్తనవయను దిక్సంఖ్యాపదములకు స్వీయార్థములేదు. దక్షిణాగ్నియను పదమొక యగ్నివిశేషమును. సప్తర్షులను పద మొక ఋషిగణము. నవరాత్రి లోకవ్రతము.] పంచజనమను సమస్తపద మొకపేరగుచున్నది. పంచజనశబ్దము రూఢిపదమనియు సాంఖ్యతత్త్వబోధకముకాదనియు కొందరనుచున్నారు, ఈపంచజనశబ్దముచే దెలియవచ్చువా రెందరని ప్రశ్నరాగా, వారయిదుగురని మొదటి పంచశబ్దముచే సమాధానము చెప్పబడుచున్నది. పంచజనశబ్దముచే జెప్పబడువా రెవరుగలరో వారయిదుగురని యర్థము. సప్తర్షు లేడుగురు అనినట్లె యిచటగూడ దెలియదగును. 11

కే పునస్తే పఞ్చజనా నామేతి తదుచ్యతే.

## ప్రాణాదయో వాక్యశేషాత్ (సూ 12.)

'యస్మిన్పంచ పంచజనా' ఇత్యత ఉత్తరస్మిన్మంత్రే బ్రహ్మస్వరూపనిరూపణాయ ప్రాణాదయః పఞ్చ నిర్దిష్టాః. 'ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుతశ్రోత్రస్య శ్రోత్రమన్న స్యాన్నం మనసో యే మనో విదు' రితి, తేఽత్ర వాక్యశేషగతా స్సన్నిధానాత్పఞ్చజనా వివక్ష్యంతే. కథం పునః, ప్రాణాదిషు

---

అ॥ పంచజనశబ్దముచే చెప్పబడువా రెవరన జెప్పుచున్నాము.

ప్రాణ ఆదయః = ప్రాణము మొదలగునవి పంచజనశబ్దముచే వాక్యశేషాత్ = తరువాత వాక్యమువలన జెప్పబడుచున్నవి.

ప్రాణాదులు పంచజనశబ్దార్థము.

"యస్మిన్ పంచజనః" అనువాక్యమునకు తరువాత మంత్రమునందు బ్రహ్మస్వరూపనిరూపణార్థమై పంచప్రాణములు నిర్దేశింపబడుచున్నవి. "ప్రాణమునకు ప్రాణము; మఱియు చక్షుస్సునకు జక్షుస్సు. శ్రోత్రమునకు శ్రోత్రము; అన్నమునకన్నము; మనస్సునకు మనస్సు. ఈవిధమున బ్రహ్మమును దెలిసికొనినవారు" (బృహ 4-4-18) ఈప్రాణాదులయిదు ప్రకృతవాక్యశేషమగు తరువాతవాక్యమున పంచజనముగ నుదాహరింపబడుచున్నవి. ప్రాణాదులు జనశబ్ద

జనశబ్దప్రయోగః, తత్త్వేషు వా కథం జనశబ్దప్రయోగః,? సమానే తు ప్రసిద్ధ్యతిక్రమే వాక్యశేషవశాత్ప్రాణాదయ ఏవ గృహీతవ్యా భవంతి, జనసంబంధాచ్చ ప్రాణాదయో జనశబ్దభాజో భవంతి, జనవచనశ్చ పురుషశబ్దః ప్రాణేషు ప్రయుక్తః 'తే వా ఏతే పంచ బ్రహ్మపురుషాః' (ఛాం. 3-13-16) ఇతి, అత్ర 'ప్రాణో హ పితా ప్రాణో హ మాతే' త్యాది (ఛాం. 7-15-1) చ బ్రాహ్మణమ్. సమాసబలాచ్చ సముదాయస్య రూఢత్వమవిరుద్ధమ్. కథం పునరసతి ప్రథమప్రయోగే

---

ముచే నెట్లు చెప్పబడుననిన, ఆశబ్దము తత్త్వపరముగ నెట్లు వాడబడుచున్నది? జనశబ్దమునకు ప్రసిద్ధమగు నర్థమునుభయులు విడనాడుచున్నారు. మేమున్నచో ప్రాణాదులను చెప్పు తరువాతమంత్రము పంచజన వాక్య శేషమగుటచే ప్రాణాదులను గ్రహించుచున్నాము. ప్రాణములు జనులకు సంబంధించినవిగనుక వానిని జనశబ్దముచే జెప్పనగును. పురుష శబ్దము జనమును తెలియజెప్పును. 'తే వా ఏ తే పంచ బ్రహ్మ పురుషాః'-ఈ అయిదుగురు బ్రహ్మపురుషులు (ఛాం 3-13-16) అను మొదలగు స్థలములయందు పురుషశబ్దము జనపరముగ వాడబడుచున్నది. "ప్రాణము పిత; ప్రాణము మాత" (ఛాం 7-15-1) మొదలగు ప్రయోగములు వ్యాఖ్యానరూపముగ కాన్పించుచున్నవి. [ప్రాణము సర్వాత్మకము గనుక ప్రాణాత్మలను పంచజనశబ్దమున బలుకుటయుక్తమే యని భావము. జాయన్తే-పుట్టువారుగనుక జనము అనివ్యుత్పత్త్యర్థమున మహదాదులను, జనకత్వాత్ - పుట్టించునది

రూఢిశ్శక్యాశ్రయితుమ్. శక్యోద్భిదాదివదిత్యాహ. ప్రసిద్ధార్థసన్నిధానేన హ్యప్రసిద్ధార్థశ్శబ్దః ప్రయుజ్యమానస్సమభివ్యాహారాత్తద్విషయో నియమ్యతే యథా 'ఉద్భిదా యజేత యూపం ఛినత్తి

---

గనుక జనము అనువ్యుత్పత్త్యర్థమున బ్రిధానమును గ్రిహింపగూడదా? రూఢ్యర్థమేల గ్రహింపవలెనన] పంచజన అను సమాసబలముచే నుపపన్నమగుచున్న సముదాయమునందు రూఢ్యర్థమును గ్రహించుట విరుద్ధముగాదు. ఇచట పంచజన శబ్దమునకు సముదాయార్థమేల గ్రహింపబడుచున్నది? అధికరణముఖ్యసూత్రమున గ్రహించుటలేదుగదా? అంతకు పూర్వమాయర్థమున పంచజనశబ్దము ప్రయోగింపబడనప్పుడాయర్థమాపదమునందెట్లు రూఢికాగలదంటిరేని ["స్యుః పుమాంసః పంచజనాః" పురుషులు పంచజనులగుదురని ప్రియోగముకలదు. అట్లుకాకపోయినను,] ఉద్భిదాది శబ్దములయందునువలెనే రూఢ్యర్థము శక్యమగుచున్నది. ప్రసిద్ధమగు నర్థముగల పదములసన్నిధానమున వాడబడు అప్రిసిద్ధార్థములగు శబ్దములు ప్రిసిద్ధార్థవిషయములుగా గ్రహింపబడుచున్నవి. ఉద్భిదా యజేత – ఉద్భిదముచే యజనము యనవలెను. యూపం ఛినత్తి – యూపమును చీల్చుచున్నాడు, వేదిం కరోతి – వేదికను జేయుచున్నాడు. ఈమొదలగు ప్రియోగములుదాహరణములు. [ఉద్భిత్ అనుపదము త్రవ్వుగోలయందు బ్రిసిద్ధము. అయినను యజేతయను ప్రిసిద్ధార్థపదముయొక్క సాన్నిధ్యముచేత యాగముచేత భావింపవలెనని యర్థకల్పనము చేయబడుచున్నది. ఛినత్తి – చీల్చ

వేదిం కరోతీ'తి తథాయమపి పంచజనశబ్దస్సమాసాన్వాఖ్యానాదవగతసంజ్ఞాభావస్సంజ్ఞ్యాకాంక్షీ వాక్యశేషసమభివ్యాహృతేషు ప్రాణాదిషు వర్తిష్యతే.

కైశ్చిత్తు దేవాః పితరో గంధర్వా అసురా రక్షాంసి చ పంచజనా వ్యాఖ్యాతాః. అన్యైశ్చ చత్వారో వర్ణా నిషాద

---

చున్నాడు అనుప్రసిద్ధార్థశబ్దసన్నిధానముచే యూపశబ్దమునకు దారువు అర్థము చెప్పబడుచున్నది. కరోతి యను శబ్ద సాన్నిధ్యముచే వేదిశబ్దమునకు స్తండులమని యర్థమును గ్రహించుచున్నారు.] అదేతీరున నీపంచజనశబ్దముగూడ సమసితమగుటచే సంజ్ఞార్థమున గ్రహింపబడుచున్నది. దేనికీపదము సంజ్ఞయగుచున్నదియని యాకాంక్ష రాగా, వాక్యశేషమునందు గల ప్రాణాదిశబ్దములతో సంబద్ధమై వానియందు అన్వయించుచున్నది. [పంచజనశబ్దము పురుషపరమనియు, ప్రాణములు పురుషసంబంధములుగనుక నాశబ్దము ప్రాణపరముగగూడ గ్రహింపదగునని భాష్యముయొక్క ప్రథమతాత్పర్యము. ఇచట నాపదమును సాక్షాత్తుగ ప్రాణాదిపరముగగూడ గ్రహింపవచ్చునని ప్రౌఢవాదముచే భాష్యకారులు నిశ్చయించుచున్నారు].

దేవతలు, పితరులు, గంధర్వులు, అసురులు రాక్షసులు అనునీ అయిదుగురు పంచజనశబ్దముచే బోధింపబడుచున్నారని వ్యాఖ్యాతలు కొందరు తలంచుచున్నారు. బ్రాహ్మణాది నాలుగువర్ణములు, నిషాదులుతోగూడి అయిదుగురు పంచ

పంచమాః పరిగృహీతాః. క్వచిచ్చ 'యత్పాంచజన్యయా విశే'తి ప్రజాపరః ప్రయోగః పంచజనశబ్దస్య దృశ్యతే. తత్పరిగ్రహేఽపీహ న కశ్చిద్విరోధః. ఆచార్యస్తు న పంచవింశతేస్తత్త్వానామిహ ప్రతీతిరస్తీత్యేవంపరతయా 'ప్రాణాదయో వాక్యశేషా'దితి జగాద.

పూ.పక్షీ: భవేయుస్తావత్ప్రాణాదయః పంచజనా మాధ్యందినానాం యేఽన్నం ప్రాణాదిష్వామనంతి, కాణ్వానాం తు కథం ప్రాణాదయః పంచజనా భవేయుః యేఽన్నం ప్రాణాదిషు నామనంతీతి.

---

జనశబ్దముచే చెప్పబడుచున్నారని మఱికొందరు తలంచుచున్నారు. పంచజనశబ్దము జనసామాన్యపదముగ గొన్ని స్థలముల ప్రయోగము కాన్పించుచున్నది. ఆయర్థమును గ్రహించినను ప్రకృతమున విరోధములేదు. సూత్రకారులన్ననో పంచవింశతితత్త్వముల కిచట ప్రసక్తి లేదనితలంచి పంచజనపదము ప్రాణాదిపరమని జెప్పుటకై యీసూత్రమును రచియించిరి 12

పూ. పక్షి : మంచిది! మాధ్యందినపాఠమునం దన్నముగూడ నుదాహరింపబడుటచే నాపాఠానుసారముగ ప్రాణాదులు పంచజనము అయినకావచ్చునుగాక, కాణ్వపాఠమునం దన్నముదాహరింపబడుటలేదు. కనుక నాపాఠమునందు ప్రాణాదులు పంచజన మెట్లుకాగలవు? అనిపూర్వవాది యాక్షేపించుచున్నాడు.

సిద్ధాంతీ: అత ఉత్తరం పఠతి.

## జ్యోతిషైకేషామసత్యన్నే (సూ 13.)

అసత్యపి కాణ్వానామన్నే జ్యోతిషా తేషాం పంచ సంఖ్యా పూర్యతే. తేఽపి హి 'యస్మిన్పంచజనాః' ఇత్యతః పూర్వస్మిన్మంత్రే బ్రహ్మస్వరూపనిరూపణాయైవ జ్యోతిరధీయతే. 'తద్దేవా జ్యోతిషాం జ్యోతి' రితి.

పూ.వక్షీ: కథం పునరుభయేషామపి తుల్యవదిదం జ్యోతిః పఠ్య

---

సిద్ధాంతి : అందువలన సమాధానమును జెప్పుచున్నాము

ఏకేషాం = కొందరియొక్క పాఠమునందు అన్నే అసతి = అన్నశబ్దము వినబడకపోయినను. పూర్వవాక్యము నందు వినవచ్చుచున్న జ్యోతిషా = జ్యోతిః శబ్దముచేత పంచసంఖ్య పూర్తియగుచున్నది.

కాణ్వపాఠమునందన్నశబ్దము లేకపోయినను వారలకు జ్యోతిఃశబ్దముచే పంచసంఖ్యాపూరణమగుచున్నది. యస్మిన్ పంచజనాః" యనుమంత్రమునకు పూర్వమంత్రమునందు బ్రహ్మస్వరూపనిరూపణము కొఱకు జ్యోతిఃశబ్దమును బఠియించుచున్నారు. "దేవతలాబ్రిహ్మమును జ్యోతిస్సులకు జ్యోతిస్సుగ నుపాసించుచున్నారు. అని కాణ్వపాఠ మంతార్థము.

పూ. పక్షము : 'తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హో పాసతేఽమృతమ్' (బృ 4-4-16) అను నీమంత్రముభయ

మానం సమానమంత్రగతయా పంచసంఖ్యయా కేషాంచిద్గ్రహ్యాతే కేషాంచిన్నేతి.

సిద్ధాంతీ: అపేక్షాభేదాదిత్యాహ. మాధ్యందినానాం హి సమాన మంత్రపఠితప్రాణాదిపంచజనలాభాన్నాస్తి మంత్రాంతరపఠితే జ్యోతిష్యపేక్షా భవతి. తదలాభాత్తు కాణ్వానాం భవిత్వపేక్షా, అపేక్షా భేదాచ్చ సమానేఽపి మంత్రే జ్యోతిషో గ్రహణాగ్రహణే, యథా సమానేఽప్యతిరాత్రే వచనభేదాత్షోడశినో గ్రహణాగ్రహణే

---

పాఠములయందును గాన్పించుచున్నది. కాని పంచసంఖ్యా పూరణము కొఱకీ జ్యోతిఃశబ్దము నొకశాఖవారు గ్రహించుటలేదు. ఇది యెట్లుసంభవము?

సిద్ధాంతి : ఆకాంక్షయందు భేదముండుటవలన! యని సమాధానము చెప్పుచున్నాము. మాధ్యందినపాఠమునం దొక మంత్రమునందే ప్రాణాదిపంచపదార్థములు వినవచ్చుచున్నవి వానిచేతనే వారలకు పంచసంఖ్యాపూరణమగుచున్నది. కనుక మఱియొకమంత్రమునందు వినవచ్చుచున్న జ్యోతిఃశబ్దమును వారపేక్షించుటలేదు. కాణ్వపాఠమునం దట్టియవకాశము లేకుండుటచే వారు మఱియొక మంత్రమునందలి జ్యోతిఃశబ్దము నపేక్షింపవలసివచ్చినది. ఆవశ్యకతాభేదమునుబట్టి జోతిర్మంత్ర ముభయులకు సమానమైనను, ఒకరు జ్యోతిఃశబ్దమును గ్రహించుటయు మఱియొకరు గ్రహింపకపోవుటయు సంభవించుచున్నది. అతిరాత్రమను క్రియావిశేష ముభయులకు సమానమయినను వాక్యభేదముచే నొకశాఖవారు షోడశి

కాణ్వపాఠమునకు విరోధములేదు.

తద్వత్. తదేవం న తావచ్ఛ్రుతిప్రసిద్ధిః కాచిత్ప్రధానవిషయాస్తి, స్మృతిన్యాయప్రసిద్ధీ తు పరిహరిష్యేతే. ఇతి తృతీయాధికరణమ్.

---

పాత్రను గ్రహించుచున్నారు. మరియొక శాఖవారు గ్రహించుటలేదు. అటులనే నిచటగూడ గ్రహింపనగును. ఈ విధముగ ప్రధానమునుగూర్చి చెప్పు శ్రుతిప్రసిద్ధమగు వాక్యము కానరాదు. స్మృతియందుగాని న్యాయమునందుగాని ప్రధానము ప్రసిద్ధముగాదని ముందునిరూపించుచున్నాము.

<u>అధికరణార్థసంక్షేపము</u>: పంచపంచజనశబ్దము పంచవింశతితత్త్వముల చెప్పునుగనుక ప్రధానము శ్రుతిప్రసిద్ధమని సాంఖ్యవాదము. సిద్ధాంతులీవాదము నంగీకరింపరు. ఒకగణమునందు జేర్చగలసమానధర్మములు మహత్తత్త్వముల యందు గానరావు. పంచ, పంచయనురెండుపదము లొకదానికొకటి విశేషణముగా గ్రహించినను, రెండును జనశబ్దమునకు విశేషణముగా గ్రహించినను పంచవింశతిసంఖ్యార్థము సంభవింపదు. పంచవింశతితత్త్వములలో జేరిన యాత్మ శ్రుతియందు పంచవింశతితత్త్వముల కాధారమని శ్రుతి చెప్పుచున్నది. ఒకేయాత్మ ఆధారముగాను ఆధేయముగా నుండశక్యముకాదు. ఆత్మ పంచవింశతిసంఖ్యలో చేరనిచో తత్త్వము నిరువదియాఱగును. అటులనే ఆకాశశబ్దమునుగూడ బంచవింశతితత్త్వములకంటె భిన్నముగ శ్రుతి పలుకుచున్నది. అపుడుగూడ పంచవింశతిసంఖ్యాతిక్రమణము సంభవించును. పంచజనశబ్దము పురుషపదముగ గ్రహించినచో వానికి నాధారమగు ప్రాణమును

గ్రహింపవచ్చును, లేక సాక్షాత్త్వాదిపరముగ గ్రహింప వచ్చును. కాణ్వపాఠమునందు అన్నముబదులు జ్యోతిస్సు గ్రహించి పంచసంఖ్యాపూరణము చేయబడుచున్నది. 13

## (4) కారణత్వాధికరణము

అ॥ సందిగ్ధపదముల సమన్వయముకొఱకు జతుర్థపాద మారంభింపబడినది. అవ్యక్తము అజము పంచజనము అను పదములు ప్రధానపరములు గానేరవనియు నందువలన బ్రధానము శ్రుతిసిద్ధము కాదనియు మొదటి మూడధికరణముల యందు సిద్ధముచేయబడినది. కాని సృష్టికారణమునుగూర్చి సందిగ్ధార్థకములగు వాక్యము లనేకములు కాన్పించుచున్నవి. కనుక సృష్టివిషయమై వికల్పాస్పదములగు శ్రుతివాక్యములు ప్రమాణముకావు. అనుమానప్రమాణ సిద్ధమగుప్రధానమే సృష్టికారణము కావలయును అని తిరిగి సాంఖ్యులు చేయు నాక్షేపమునకు సమాధానముచెప్పుటకై తరువాతి యధికరణ మారంభింపబడుచున్నది. సృష్టికారణవైచిత్ర్యము నుపపాదించు వివిధశ్రుతులు కవిరోధమును సాధించుట సమన్వయాధికరణవిషయము కానేరదని యాక్షేపింప దగదు. ఆపాతముగ విరుద్ధముగ గాన్పించుశ్రుతులకు సమన్వయము వానియ విరోధమును సాధించుటచేత నేగలుగును.

# కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః
(సూ 14.)

విషయము. : సృష్టిబోధకవాక్యము లన్నియు,

విశయము : అవి సృష్టికారణము బ్రహ్మమని తెలుపుచున్నవా! లేక మఱియొకదానిని జగత్కారణముగ నూహింప జేయుచున్నవా

పూర్వవాది : సృష్టివాక్యములు పరస్పర విరుద్ధములగుటంజేసి వానివలన బ్రహ్మ సృష్టికారణమని చెప్పవీలులేదు. అనుమానప్రమాణముచే నూహింపదగిన ప్రధానము జగత్కారణము.

సిద్ధాంతము : సృష్టిని గూర్చి విగానమున్నను. సృష్టికర్తనుగూర్చి విగానములేదు. బ్రహ్మమె సృష్టికర్తయని వేదవాక్యములన్నియు బలుకుచున్నవి.

అవలోకనీయములగు శ్రుతివాక్యములు.

తైత్తి 2-1-2,6, ప్రశ్న 6-4. ఐతరేయము 1-1-2 తైత్తి 2-6, 2-1, ఛాందోగ్య 6-2-1, 2, 3. 6-1-1-7, 6-8-2, 3-19-1, 7-1-3 బృహ 1-4-7, శ్వేత 3-8.

ఆకాశాదిషు=ఆకాశాది పంచమహాభూతములయందు సాక్షాత్తుబ్రహ్మము కారణత్వేన = కారణముగ నుపపాదింప బడుటవలన యథావ్యపదిష్ట ఉక్తేః = సృష్టికారణమును గూర్చి పూర్వవాక్యమేవిధముగ చెప్పెనో యావిధముననే తరువాతవాక్యములు పలుకుటవలన.

ప్రతిపాదితం బ్రహ్మణో లక్షణమ్, ప్రతిపాదితం చ బ్రహ్మవిషయం గతిసామాన్యం వేదాంతవాక్యానామ్, ప్రతిపాదితం చ ప్రధానస్యాశబ్దత్వమ్. తత్రేదమపరమాశంక్యతే.

పూ.పక్షీ: న జన్మాదికారణత్వం బ్రహ్మణో బ్రహ్మవిషయం వా గతిసామాన్యం వేదాంతవాక్యానాం ప్రతిపాదయితుం శక్యమ్, కస్మాత్ ? విగానదర్శనాత్. ప్రతివేదాంతం హ్యన్యాన్యా సృష్టిరుపలభ్యతే క్రమాదివైచిత్ర్యాత్, తథా హి క్వచిత్, 'ఆత్మనః ఆకాశస్సంభూత' (తై. 2-1) ఇత్యాకాశాదికా సృష్టిరామ్నాయతే, క్వచిత్తేజ ఆదికా 'తత్తేజోఽసృజత'తి (ఛాం. 6-2-3) క్వచిత్ప్రా

---

ఇంతవఱకు గడచిన గ్రన్థమునందు బ్రహ్మలక్షణముపపాదింపబడినది, వేదాంతవాక్యములన్నియు నొకబ్రహ్మమును గూర్చియె పల్కుచున్నవనియుగూడ నిరూపింపబడినది. మఱియు బ్రధానము శ్రుతిసిద్ధము కాదనియు స్థాపింపబడినది. ఇచట మఱియొకయాక్షేవణ చేయబడుచున్నది.

పూర్వవాది : బ్రహ్మము జగజ్జన్మాది కారణముకాదు. వేదాంతవాక్యములన్నియు బ్రహ్మమునుగూర్చియెపల్కుచున్నవని వక్కాణింపవీలులేదు. ఏలనన! వేదాంతవాక్యములలో బరస్పరవిరోధము కాన్పించుచున్నది. (1) సృష్టిక్రమమును గూర్చి వేదాంతవాక్యములయం దొక్కొక్కచోట నొక్కొక్కవిధముగ గాన్పించుచున్నది. ఇట్లుకదా కాన్పించుచున్నది. ఆత్మనుండి యాకాశ ముత్పన్నమగుచున్నట్లు తైత్తిరీయము 2-1 సూత్రమున గాన్పించుచున్నది. ఛాందోగ్యము 6-2-3

ణాదికా 'స ప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధా' (ప్ర. 6-4) మితి, క్వచిదక్రమేణైవ లోకానాముత్పత్తిరామ్నాయతే. 'స ఇమాంల్లోకానసృజతాంభో మరీచిర్మరమాప' ఇతి, తథా క్వచిదసత్పూర్వికా సృష్టిః పఠ్యతే, 'అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయతే' (తై. 2-7) తి 'అసదేవేదమగ్ర ఆసీత్ తత్సదాసీత్ తత్సత్యమభవ' (ఛాం.3-19-1) దితిచ, క్వచిదసద్వాదనిరాకరణేన సత్పూర్వికా ప్రక్రియా ప్రతిజ్ఞాయతే 'తద్ధైక అహురసదేవేదమగ్ర ఆసీ' దిత్యుపక్రమ్య 'కుతస్తు ఖలు సోమ్యైవం స్యాదితి హోవాచ కథమసతస్సజ్జాయేతే'తి 'సత్త్యేవ సోమ్యేదమగ్ర ఆసీత్' (ఛాం.

---

వాక్యమున అగ్నిముందు బుట్టినట్లగుపడుచున్నది. ప్రశ్న 6-4 వాక్యము సృష్టికర్త ప్రాణమును ముందు సృజియించి దాని నుండి శ్రద్ధను సృష్టించినట్లు పల్కుచున్నది. (2) ఐతరేయమునందు (11-1-2) సృష్టిక్రమములేక స్వర్గలోక, అంతరిక్షలోక మర్త్యలోకముల నాత్మసృష్టించెనని వినవచ్చుచున్నది. తైత్తిరీయమునందు (2-7) అసత్తువలన సృష్టిగలిగినట్లు గాన్పించుచునది. "ఇది మొదట యసత్తుగానుండెను. అది సత్తుగానై సంపూర్ణమయ్యెను" అని (ఛాం. 3-19-1) చెప్పుచున్నది. మఱియొకచోట నీయసద్వాదము నిరాకరింపబడి (3) సృష్టికంతకు సత్తుమూలమని తెలియజేయబడుచున్నది "అసత్తు మొదటనుండెనని గొందరందురు" అనియారంభించి, "ఇది యెట్లుసంభవించును? అసత్తునుండి సత్తు యెట్లు బుట్టును? మొదట ఇదిసత్తుగానే యుండెను" అని ఛాందోగ్యశ్రుతి

6-2-1, 2) ఇతి క్వచిత్స్వయంకర్తృకైవ వ్యాక్రియా జగతో నిగద్యతే 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియత' (బృ. 1-4-7) ఇతి. ఏవమనేకధా విప్రతిపత్తేః వస్తుని చ వికల్పస్యానుపపత్తేర్న వేదాంతవాక్యానాం జగత్కారణావధారణపరతా న్యాయ్యా, స్మృతిన్యాయప్రసిద్ధిభ్యాం తు కారణాంతరపరిగ్రహో న్యాయ్య ఇతి.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః.—సత్యపి ప్రతివేదాంతం సృజ్యమానేష్వాకాశాదిషు క్రమాదిద్వారకే విగానే న స్రష్టరి

---

(6-2-1-2) యసద్వాదనిరసనము చేయుచున్నది. "ఇది యంతయు నవ్యాకృతముగానుండెను, తరువాత నామరూపములచే వ్యాకృతమయ్యెను" అనుబృహదారణ్యకశ్రుతి (1-4-7) సృష్టి స్వయముగానే వ్యాకృతమైనట్లు జూపుచున్నది. ఈవిధముగ సృష్టివిషయమై యనేకములగు విప్రతిపత్తులు కాన్పించుచున్నవి. జరిగిపోయిన విషయమై విప్రతిపత్తులు సంభవముకావు. [ముందుజరుగబోవువిషయమై విప్రతిపత్తులుండిన యుండవచ్చును] కనుక జగత్కారణము నిశ్చయించుటకు వేదాంతములు ప్రమాణములనుట న్యాయముకాదు. స్మృతిన్యాయప్రమాణముల నాధారముచేసికొని మఱియొక కారణమునంగీకరించుట న్యాయసమ్మతము.

సిద్ధాంతి: ఈలాగు పూర్వపక్షముగాగా సమాధానము చెప్పుచున్నాము. వేదాంతవాక్యములయందు, సృజియింపబడుచున్న యాకాశాదులక్రమమునందు పరస్పరవిరోధము కాన్పించుచున్నను. సృష్టికర్తవిషయమెంతమాత్రము

కించిద్విగానమస్తి, కుతః ? యథా వ్యపదిష్టోక్తేః. యథాభూతో హ్యేకస్మిన్వేదాంతే సర్వజ్ఞస్సర్వేశ్వరస్సర్వాత్మైకోఽద్వితీయః కారణత్వేన వ్యపదిష్టః, తథాభూత ఏవ వేదాంతాంతరేష్వపి వ్యపదిశ్యతే, తద్యథా 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మే'తి, (తై. 2-1) అత్ర తావజ్జ్ఞానశబ్దేన పరేణ చ తద్విషయేణ కామయితృత్వవచనేన చేతనం బ్రహ్మన్యరూపయదపరప్రయోజ్యత్వేనేశ్వరం కారణమబ్రవీత్. తద్విషయేణైవ పరేణాత్మశబ్దేన శరీరాది కోశపరంపరయా చాంతరాత్మానుప్రవేశనేన సర్వేషాం నః

---

విరోధములేదు. ఏలనన పూర్వము చెప్పినట్లె యుండుట వలన. సృష్టికర్తయగువాడు సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వాత్ముడు. ఒక్కడు, అద్వితీయుడని యొక వేదాంతమునందెట్లుపదేశింబడెనో యితర వేదాంతములయందుగూడ నటులనే యుపదేశింపబడుచున్నది. అదియెట్లన, "బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము" అని తైత్తిరీయము (2-1) చెప్పుచున్నది. ఈవాక్యమునందయితే జ్ఞానశబ్దముచేతను, [సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి - (తై 2-6) నేను విస్తారముగ నయ్యెదనని బ్రహ్మము కోరెను] అని ఈతనికి గామయితృత్వమును నిర్దేశించి తరువాత వచనముచేత బ్రహ్మము చేతనమనియు సృష్టికారణ మీశ్వరుడనియు నాశ్రుతి పలుకుచున్నది. ఆబ్రహ్మమును గ్రహించియె బలుకు నాత్మశబ్దము చేత శరీరాదికోశపంచకపరంపరాద్వారా శరీరమునందు ప్రవేశించిన యాతడే యందఱికిని బ్రత్యగాత్మ యనియు నిశ్చయించెను. "నేనే బహురూపముల నయ్యెదను" (తై 2-6)

ప్రత్యగాత్మానం నిరధారయత్ 'బహు స్యాం ప్రజాయే' యేతి (తై. 2-6) చాత్మవిషయేణ బహుభవనాశంసనేన సృజ్యమానానాం వికారాణాం స్రష్టురభేదమభాషత, తథా 'ఇదం సర్వమసృజత యదిదం కిం చే' (తై. 2-6) తి సమస్తజగత్సృష్టినిర్దేశేన ప్రాక్సృష్టేరద్వితీయం స్రష్టారమాచష్ట. తదత్ర యల్లక్షణం బ్రహ్మకారణత్వేన విజ్ఞాతం తల్లక్షణమేవాన్యత్రాపి విజ్ఞాయతే. 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత' (ఛాం.6-2-1, 3)తి తథా 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించనమిషత్స

---

అనువాక్యమునం దాబ్రహ్మమే యనేకరూపములాయెనని సృజియింపబడిన వికారములకును సృష్టికర్తకు నభేదమును జెప్పినది. అదేతీరున ఈప్రపంచమేదేదిగలదో దానినంతయు నాతఁడు సృజియించెను" (తై 2-6) అనువాక్యమునందు సమస్తజగత్తుయొక్క సృష్టిని ఉదాహరించుటచేత సృష్టికి బూర్వము సృష్టికర్త యద్వితీయముగనుండెనని చెప్పుచున్నది. జగత్కారణముగ నిర్దేశింపబడిన బ్రహ్మమున కిచ్చట ఏలక్షణము లుదాహరింపబడినవో యాలక్షణములే యితర స్థలములగూడ నుదాహరింపబడినవి. "మొదట నిది (అనగా జగత్తు) సద్రూపముగా నుండెను. అది ఏకమేవాద్వితీయము ఒకటిమాత్రమే అద్వితీయము. తానే యనేకముగ విస్తరించెదనని యాలోచించెను. అది యగ్నిని సృజియించెను" అని ఛాందోగ్యము (6-2-1-3) పలుకుచున్నది. "మొదట నిది యంతయు నాత్మమాత్రముగా నుండెను. ఇతరమైన దేదియు

ఐక్షత లోకాన్నుసృజా' (ఐ. 4-1-1, 2) ఇతి చ, ఏవం జాతీయకస్య కారణస్వరూపనిరూపణపరస్య వాక్యజాతస్య ప్రతివేదాంతమవిగీతార్థత్వాత్. కార్యవిషయం తు విగానం దృశ్యతే క్వచిదాకాశాదికా సృష్టిః క్వచిత్తేజ ఆదికేత్యేవం జాతీయకం. న చ కార్యవిషయేణ విగానేన కారణమపి బ్రహ్మ సర్వవేదాంతేష్వవిగీతమధిగమ్యమానమవివక్షితం భవితుమర్హతీతి శక్యతే వక్తుమ్, అతిప్రసంగాత్. సమాధాస్యతి చాచార్యః కార్యవిషయం విగానం 'న వియదశ్రుతే' (బ్ర.సూ. 2-3-1) రిత్యారభ్య, భవేదపి కార్యస్య విగీతత్వమప్రతిపాద్యమానత్వాత్, న హ్యయం సృష్ట్యాది

---

నేవ్యాపారము కలిగినదియు లేదు. ఆతడు లోకములను సృజియించెదనని యోలోచించెను'' అని ఐతరేయమున (4-1-1-2) వినవచ్చుచున్నది. ఈవిధముగ బ్రహ్మముయొక్క జగత్కారణస్వరూపమును నిరూపింపనొడంగిన యిట్టివాక్యజాతమంతయు బ్రతివేదాంతమునందును పరస్పరవిరుద్ధము కాకున్నది. (2) సృష్టికార్యమువిషయమై భేదము కలదు. ఒకచోట సృష్టికి నాకాశ మాదిగ జెప్పబడినది. మఱియొకచోట నగ్ని యాదిగాగలదు. సృష్టికార్యక్రమములందు భేదము కాన్పించుచున్నంతమాత్రముచేత సర్వవేదాంతములయందు నేకవిధముగ దెలియవచ్చుచున్న జగత్కారణమగు బ్రహ్మము నవి చెప్పదలపలేదనుట యసమంజసము. అట్లనుట యతిప్రసంగమగును. "నవియదశ్రుతేః" (బ్రసూ 2-3-1) మొదలగు సూత్రములయందు సూత్రకారులు సృష్టిభేదమునకు సమాధానము చెప్పబోవుచున్నారు: సృష్టిక్రమ

ప్రపంచః ప్రతిపిపాదయిషితః. న హి తత్ప్రతిపత్తేః కశ్చి త్పురుషార్థో దృశ్యతే శ్రూయతే వా. న చ కల్పయితుం శక్యతే. ఉపక్రమోపసంహారాభ్యాం తత్ర తత్ర బ్రహ్మవిషయైర్వాక్యై స్సాకమేకవాక్యతాయా గమ్యమానత్వాత్, దర్శయతి చ సృష్ట్యాది ప్రపంచస్య బ్రహ్మప్రతిపత్త్యర్థతాం 'అన్నేన సోమ్య శుంగేనాపో మూలమన్విచ్ఛాద్భిస్సోమ్య శుంగేన తేజోమూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూలమన్విచ్ఛే'తి. (ఛాం. 6-8-4) మృదాది

---

మునుగూర్చి విరుద్ధవాక్యము లుండిన నుండవచ్చునుగాక. సృష్టినుపదేశించుట శ్రుతితాత్పర్యముకాదు. పురుషార్థ మొద్దియు సృష్టి నాధారము చేసికొని యున్నట్లు కనియు వినియు నుండలేదు. శ్రుతికి అట్టితాత్పర్య మున్నటులగూడ గల్పింప శక్యముకాదు. సృష్టిబోధకవాక్యములు బ్రహ్మ బోధకవాక్యములతో నేకవాక్యతను గలిగియున్న ట్లుపక్ర మోపసంహారములచే దెలియుచున్నది. బ్రహ్మమునుగూర్చి యుపదేశించుటకుమాత్రమే సృష్ట్యాదిప్రపంచ ముదాహరింప బడినట్లు గాన్పించుచున్నది. అన్నమునకు జలములు మూలము, జలమునకు తేజస్సుమూలము; తేజస్సునకు సత్తు మూలము : (ఛాందో 6-8-4) ఇట్లు సర్వసృష్టికి బ్రహ్మము మూలమని తెలియుచున్నది. మృత్తుమొదలగు దృష్టాంత ములచే గార్యకారణమున కభేదమును బోధించుటకై సృష్ట్యాదిప్రపంచమును శ్రుతులు పలుకరించుచున్నట్లు దెలియుచున్నది. [ఏవస్తువు దెలిసిన సర్వము దెలియునో యట్టివస్తువు నుద్దాలకుడు తనకుమారుడగు శ్వేతకేతువునకు

దృష్టాంతైశ్చ కార్యస్య కారణేనా భేదం వదితుం సృష్ట్యాది ప్రపంచ శ్శ్రావ్యత ఇతి గమ్యతే. తథా చ సంప్రదాయవిదో వదంతి— 'మృల్లోహవిస్ఫులింగాద్యైస్సృష్టిర్యా చోదితాన్యథా ఉపాయ స్సోఽవతారాయ నాస్తి భేదః కథంచనే'తి (మాండో. 3-15). బ్రహ్మప్రతిపత్తిసంబద్ధం తు ఫలం శ్రూయతే 'బ్రహ్మవిదాప్నోతి పరం (తై. 2-1) తరతి శోకమాత్మవిత్ (ఛాం. 7-1-3) తమేవ విదిత్వాతిమృత్యుమేతీ' (శ్వే. 3-8) తి చ. ప్రత్యక్షావగమం చేదం ఫలం 'తత్త్వమసీ' త్యసంసారాత్మత్వప్రతిపత్తౌ సత్యాం సంసార్యాత్మత్వవ్యావృత్తేః,

---

మృత్పిండము, సువర్ణపిండము, ఇనుపముద్దయను నుదాహరణ త్రయముచే బోధించెను. [ఇచట ఛాందోగ్యము, 6-1-1-7 మంత్రములు చూడవలెను] మృత్తు, లోహము, అగ్నికణములు మున్నగు దృష్టాన్తములచే ననేకవిధముల బోధింపబడినసృష్టి జీవాత్మల యేకత్వమును బోధించుట కుపాయము మాత్రమేకాని వారిద్దఱికి నెవ్విధమగు భేదము లేదనిమాండూక్యము 3-15 వాక్యమున సంప్రదాయవిదులగు గౌడపాదులు నిర్వచించియున్నారు. 'బ్రహ్మవిదుడగువా డుత్కృష్టఫలమును బొందును" (తై 2-1) అను వాక్యమునం దుత్కృష్టఫలము బ్రహ్మప్రాప్తితో నిబద్ధమైనట్లు చూపుచున్నది. "ఆత్మవిదుడు శోకమును దాటును" (ఛాం 7-1-3) "ఆ బ్రహ్మమును దెలిసికొనినవాడు మృత్యువును దాటును" (శ్వేత 3-8) అనుశ్రుతులుగూడ నీయర్థమునే చెప్పుచున్నవి. ఫలరూపమగు బ్రహ్మము ప్రత్యక్షముగ దెలిసికొనదగినది. "తత్త్వమసి" (ఛాం 6-8-2) 'నీరూపమున

యత్పునః కారణవిషయం వివానం దర్శితం 'అసద్వా ఇద మగ్రఆసీ' దిత్యాది తత్పరిహ ర్తవ్యం. అతోఽస్యతే.

## సమాకర్షాత్ (సూ 15.)

'అసద్వా ఇదమగ్ర ఆసీ' దితి (తై. 2-7) నాత్ర సన్నిరాత్మకం కారణత్వేన శ్రావ్యతే, యతః 'అసన్నేవ స భవతి

---

నున్న జీవుడు పరబ్రహ్మమే యయియున్నాడు" మొదలగు మహావాక్యములచేత సంసారి కానియాత్మను దెలిసికొనగా సంసారియగు జీవుని భావము తొలగిపోవును. 14

ఈప్రపంచము మొదట నసత్తుగానుండెను అను మొద లగు వాక్యములయందు జగత్కారణమునుగూర్చి వినవచ్చు చున్న భేదము బరిహరింపవలసియున్నది. అందుకు జెప్పు చున్నాము.

"ఆకాశాద్వాయుః" అను మొదలగు వాక్యముల యందు బ్రహ్మమునుసమాకర్ష చేసి యాకాశరూపమున నున్న బ్రహ్మమువలన వాయువుపుట్టినది యని చెప్పుటవలన జగత్కా రణమగు బ్రహ్మమును గురించి విరోధమేమియు లేదు. అదే విధముగ నగ్ని మొదలగు భూతములనుగూర్చి నెఱుంగ వలయును.

ఈ ప్రపంచము మొదట నసత్తుగానుండెను. (తై 2-7) అను వాక్యము శూన్యమగు నసత్తు జగత్కారణమని చెప్పు టలేదు. ఏలనన ఏవ్వాడైనను "బ్రహ్మలేదని తెలిసికొనిన

అసద్బ్రహ్మేతి వేద చేత్ అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదురితీ' త్యసద్వాదాపవాదేనా స్తిత్వలక్షణం బ్రహ్మాన్న మయాదికోశపరంపరయా ప్రత్యగాత్మానం నిర్ధార్య 'సోఽకామ యతే'తి తమేవ ప్రకృతం సమాకృష్య సప్రపంచాం సృష్టిం తస్మాచ్ఛ్రావయిత్వా 'తత్సత్యమిత్యాచక్షత' ఇతి చోపసంహృత్య 'తదప్యేష శ్లోకో భవతీ'తి తస్మిన్నేవ ప్రకృతేఽర్థే శ్లోకమిమ ముదాహరతి 'అసద్వా ఇదమగ్రఆసీ'దితి. యది త్వసన్నిరాత్మక మస్మిన్ శ్లోకేఽభిప్రేయేత తతోఽన్యసమాకర్షణేఽన్యస్యోదాహర

---

వాడు స్వయముగా లేనివాడే యగుచున్నాడు. బ్రహ్మము గలదని తెలిసికొనినవాడాకారణముచేత సత్పురుషుడని లోకులు తెలిసికొనుచున్నారు" (తై 2-6) అని యస ద్వాదము త్రోసివేయబడినది. అస్తిత్వమే లక్షణముగాగల బ్రహ్మ మన్నమయాది కోశములకు ప్రత్యగాత్మయని నిర్ధా రణచేయబడినది. అటుతర్వాత "అతడు కోరెను," (తై 2-6) అనువాక్యమునందా బ్రహ్మమునే సమాకర్షణముచేసి జగ త్సహితమగు సృష్టినంతయు వివరించి "మూర్తామూర్తము లన్నియు బ్రహ్మమేయని తెలిసినవారు పలుకుచున్నారు" (తై 2-6) అని యుపసంహారము చేయుటయెగాక 'నీసందర్భ మున చెప్పబోవు శ్లోకముకలదని' ప్రకృతార్థమున 'ఇది మొదట యసత్తుగానుండెనను' (తై 2-7) శ్లోకమునుబఠించెను. ఈ శ్లోకమునందలి యసచ్ఛబ్దము నిరాత్మకమగు శూన్య మును జెప్పినచో శూన్యమును సమాకర్షణముచేసి ప్రకరణ విషయమగు బ్రహ్మమును జెప్పిన వాక్యమునకు సంబంధము

ణాదసంబద్ధం వాక్యమాపద్యేత. తస్మాన్నామరూపవ్యాకృతవస్తు విషయః ప్రాయేణ సచ్ఛబ్దః ప్రసిద్ధ ఇతి తద్వ్యాకరణాభావాపేక్షయా ప్రాగుత్పత్తేస్సదేవ బ్రహ్మాసదివాసీదిత్యుపచర్యతే. ఏషైవ 'అసదేవేదమగ్ర ఆసీ' (ఛాం, 3-19-1) దిత్యత్రాపి యోజనా, 'తత్సదాసీ' దితి సమాకర్షణాత్. అత్యంతాభావాభ్యుప

---

లేకపోవును. అందువలన నామరూపాభివ్యక్తికి విషయమగు నొకవస్తువు ప్రాయశః సచ్ఛబ్దముచే బ్రసిద్ధికెక్కియుండుట వలన నభివ్యక్తి నుద్దేశించి జగదుత్పత్తికి పూర్వము సత్ అను శబ్దముచే బిలువబడుచున్న బ్రహ్మమే యసత్తువలె ననగా ననభివ్యక్తమైన దానివలె నున్నదియని గౌణముగ జెప్పబడుచున్నది.(ఇది మొదట నసత్తుగానే యుండెను' (ఛాం 3–19–1) అను వాక్యమునకుగూడ నర్థమన్వయమును చేయదగును. ఈయసచ్ఛబ్దమె 'తత్సదాసీత్' (ఛాం3–19-1) అను తరువాత వాక్యమునందలి తత్-అది యనుపదముచే సమాకర్షణము చేయబడుచున్నది. [అసదేవేదమగ్ర) ఆసీత్ తత్సదాసీత్ అని ఛాందోగ్యము సంపూర్ణవాక్యము. ఇది సృష్టికిపూర్వముఅసత్తుగానే యుండెను. ఆయసత్తే సృష్టితరువాత సత్తువలె నభివ్యక్తమయ్యెను. అని యీవాక్యమున కర్థము. వాక్యము పూర్వభాగమునందు జెప్పబడిన యసత్తె యుత్తరభాగమునందలి తత్ ఆదియనుశబ్దముచేత విమర్శింపబడుచున్నది. కనుక బూర్వపుటసత్తె తరువాత సత్తుగ సమాకర్ష చేయబడినది.] అసచ్ఛబ్దమత్యంతశూన్యమును దెలుపుచున్నట్లంగీకరించినచో నది సత్తు అయ్యెను. అని దేనిని సమాకర్ష చేయవలెను.? [స దేవ

గమే హి తత్సదాసీ' దితి కిం సమాకృష్యేత ? 'తద్ధైకఆహురస దేవేదమగ్ర ఆసీ' (ఛాం. 6-2-1) దిత్యత్రాపి న శ్రుత్యంతరాభిప్రాయేణాయమేకీయమతోపన్యాసః క్రియాయామివ వస్తుని వికల్పస్యాసంభవాత్. తస్మాచ్ఛ్రుతిపరిగృహీతసత్పక్షధార్ఢ్యాయైవాయం మందమతిపరికల్పితస్యాసత్పక్షస్యోపన్యస్య నిరాస ఇతి ద్రష్టవ్యం.

'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీ' (బృ. 1-4-7) దిత్య

---

సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాగ్రద్వితీయం- (ఛాం 6-2-1) ఇది మొదటసత్తుగానుండెను. అదిఏకమేవాద్వితీయము) తద్ధైక అహురస దేవేదమగ్ర ఆసీత్ (ఛాం 6-2-1) 'దానినే కొంతమంది అసత్తనిపిలిచి ఇది మొదట నసత్తుగానుండెనని వాదు వచియుంచిరి. యను వాక్యమునందలి ఏకే-కొంతమంది యను పదము చే వేదోక్తమగు మఱియొక శాఖవారి యభిప్రాయమని తలంపవీలులేదు. [శ్రుతులయందు క్రియలనుగూర్చి వికల్పము కాన్పించుచున్నది.అతిరాత్రియాగమునందు షోడశి పాత్రలను గ్రహింపవచ్చును గ్రహింపకపోవచ్చునను అని చెప్పినట్లే] సిద్ధవస్తువునుగూర్చి వికల్పము చెప్పశక్యము కాదు. క్రియను గూర్చివికల్పముచెప్పవచ్చును. అందువలన శ్రుతి తానుగ్రహించిన సద్వాదమును బలపఱచుటకై మందబుద్ధులచే గల్పింప బడదగు యీయసద్వాదమును బలుకరించి పరిహరించినదియని దెలియనగును.

ఇది అపుడవ్యాకృతముగానుండెను. (బృహ 1-4-7) అను బృహదారణ్యక వాక్యమునందుగూడ నధ్యాహృతములేక

త్రాపి నిరధ్యక్షస్య జగతో వ్యాకరణం కథ్యతే 'స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్య' ఇత్యధ్యక్షస్య వ్యాకృతకార్యానుప్రవేశిత్వేన సమాకర్షాన్నిరధ్యక్షే వ్యాకరణాభ్యుపగమే హ్యానంతరేణ ప్రకృతావలంబినా స ఇత్యనేన సర్వనామ్నా కః కార్యానుప్రవేశిత్వేన సమాకృష్యేత? చేతనస్య చాయమాత్మనశ్శరీరేఽనుప్రవేశ శ్శ్రూయతే, అనుప్రవిష్టస్య చేతనత్వశ్రవణాత్ 'పశ్యంశ్చక్షు శ్శృణ్వన్ శ్రోత్రం మన్వానో మన' ఇతి. అపిచ యాదృశ మిదమద్యత్వే నామరూపాభ్యాం వ్యాక్రియమాణం జగత్సాధ్యక్షం

---

జగత్తు స్వయముగా వ్యాకృతమైనట్లు జెప్పబడుటలేదు. 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్' అనువాక్యముతరువాత 'స త్తని చెప్పబడిన' ఆ యీతడే ఆఖానఖగముగ బ్రవేశించెను' (ఛాం 1-4-7) అనువాక్య మొకయధ్యక్షుడభి వ్యక్త నామ రూపముగు నీజగత్కార్యమును బ్రవేశించినట్లు బలుకుచున్నది. ఈవాక్యమునకు బూర్వముదాహరింపబడిన సత్తేయి చటికి సమాకర్షణము చేయబడుచున్నది. అధ్యక్షుడులేకనే నామరూపాభివ్యక్తి గలిగినట్లంగీకరించినచో ప్రసక్తవిషయమునకు సంబంధించి తరువాత వినబడుచున్న అతడను సర్వనామముచే జగత్కార్యమును బ్రవేశించిన వాడెవడని సమాకర్షణము చేయదగును. [సర్వనామమెపుడు పూర్వముదాహరింపబడిన విశేష్యమును గదా విమర్శచేయును!) శరీరమునందు చేతనుడగు నాత్మ ప్రవేశించినట్లు శ్రుతి వాక్యమున వినవచ్చుచున్నది. "చూచునపుడు చక్షుస్సనియు, వినునపుడు శ్రోత్రమనియు, మననము చేయునపుడు

వ్యాక్రియతే ఏవమాదిసర్గేఽపీతి గమ్యతే, దృష్టవిపరీతకల్పనానుపపత్తేః. శ్రుత్యంతరమపి 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీ'తి (ఛాం. 6-3-2) సాధ్యక్షామేవ జగతో వ్యాక్రియాం దర్శయతి. వ్యాక్రియత ఇత్యపి కర్మకర్తరి లకారస్సత్యేవ పరమేశ్వరే వ్యాకర్తరి సౌకర్యమపేక్ష్య ద్రష్టవ్యః. యథా లూయతే కేదారస్స్వయమేవేతి సత్యేవ పూర్ణకే లవితరి.

---

మనస్సనియు నామ మతనికి గలుగుచున్నది" (బృ 1-4-7) యని తరువాతవాక్యమున శరీరమును బ్రవేశించినవాడు చేతనుడని తెలియవచ్చుచున్నది. మఱియు నిక్కాలమున జగత్తు నామరూపసహితము, అధ్యక్షసహితముగ నేవిధముగ నభివ్యక్తమై కాన్పించుచున్నదో, యావిధముగనే ప్రథమసృష్టియందుగూడ నున్నట్లు దెలియనగును. ప్రత్యక్షముగ గనుపించుచున్నదానికి వ్యతిరేకముగ గల్పించుటకు గారణములేదు [అపుడు గూడ నధ్యక్షుడున్నాడనియె గ్రహింపవలెను]. జీవరూపముతో నున్న నీయాతనికిస్వరూపముతోనే సృజియింపబడిన శరీరము ననుసరించి ప్రవేశించెదను గాక, మఱియునామరూపములచే నభివ్యక్త మగుదును గాక" (ఛాం 6-3-2) యను మఱియొకశ్రుతిగూడ జగత్తు అధ్యక్షనిమిత్తముగనే యభివ్యక్తమైనట్లు ప్రదర్శించుచున్నది. 'అభివ్యక్తమగుచున్నది' యను నకర్మకప్రయోగము పరమేశ్వరుని యభివ్యంజనసౌలభ్యమును బ్రకటించుచున్నది. [అభివ్యక్తము చేయబడుచున్నది యనియే నిజమగునర్థము] మంచిపంట పండినది, [ధూమశకటము త్వరగా

యద్వా కర్మణ్యేవైష లకార అర్థాక్షిప్తం కర్త్రంతరముపేక్ష్య ద్రష్టవ్యః. యథా గమ్యతే గ్రామ ఇతి–ఇతి షష్ఠాధికరణమ్.

---

బోవుచున్నది] మొదలగు ప్రయోగములయందు యకర్మక క్రియ క్రియాసౌకర్యమును దెలుపుచున్నది. చేయించువాడు లేక క్రియ సాధ్యముకాదు. లేకగ్రామము పోబడుచున్నది యనుచోట్లవలె కర్మణిప్రయోగముగ గూడ గ్రహింపవచ్చును.

<u>అధికరణార్థ సంక్షేపము</u>: సృష్టిక్రమమును గూర్చి వివిధ శ్రుతులయం దనేకవిధముల వినుపించుచున్నది. సృష్టి స్వయముగా సంభవించినట్లు కొన్ని వాక్యములయం దుదాహరింపబడినది. కనుక వేదవాక్యములు బ్రహ్మము సృష్టి కర్తగా బలుకుచున్నవని గ్రహింపవీలులేదని పూర్వపక్షము. సృష్టిని గూర్చి వైవిధ్యమున్నను, బ్రహ్మమే సృష్టికర్తయని వేదవాక్యములన్నియు బలుకుచున్నవి. సృష్టిని గూర్చి చెప్పుటయందు వాని తాత్పర్యము కాదు. పరబ్రహ్మమును జెప్పుటకై సృష్టి యుదాహరింపబడినది. అసద్వాదమును పలుకరించు వాక్యము లత్యంతశూన్యమును జెప్పుటలేదు. పూర్వోదాహృతమగు సత్పదార్థమును సమీకరణముచేసుకొనియే యావాక్యములు ప్రవర్తించుచున్నవి. అసచ్ఛబ్దమునకు అవ్యాకృతనామరూపాత్మకమగు సృష్టియని యర్థము. చేతనాత్మకమగు నధ్యక్షుడొకడు లేక నామరూపము లభివ్యక్తములుగానేరవు. అట్టియధ్యక్షుడే సత్పదార్థము. నామరూపాభివ్యక్తికి బూర్వమీసృష్టి సద్రూపమున నుండెను.

అనభివ్యక్తరూపమునందుండుటచే నసత్తనిగూడ కొందరనిరి. 15

## (5) బాలాక్యధికరణము

అ॥ ఇంతకుబూర్వము విరుద్ధార్థకములగు ననేకపదముల నేకకారణమునం దర్థసమన్వయము చేయబడెను. అనగా నేక వాక్యమునందు వినవచ్చుచున్న సత్ అసత్పదములకు జగత్కారణమగు నొక పరబ్రహ్మమునందర్థసమన్వయము చేయబడెను. ఇక విభిన్నవాక్యములయందు వినబడుననేకార్థములు గల నొకశబ్దముననే విశేషార్థముచే వాక్యమునకు గారణపరత్వమును గల్పించునుద్దేశ్యముతో నీయధికరణ మారంభింపబడుచున్నది. ఇట్లుచేయుటగూడ సమన్వయమేయగును,

విషయవాక్యము : యో వై బాలాక, ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ స వై వేదితవ్యః (కౌషీత 3 4-18).

విశయము : ఇచట వేదితవ్యశబ్దమునకు నర్థమేమి, ప్రాణమా, ? జీవుడా ? పరమాత్మా ?

పూర్వపక్షము : ప్రాణజీవులలో నెవరయినను గావచ్చును.

సిద్ధాంతము : పరమాత్మ

అవలోకనీయములగు శ్రుతివాక్యములు కౌషీతకి బ్రాహ్మణము 4-18-20 బృహా 3-9-9, బ్ర॥సూ 1-1-31, ఛాం 3-8-2, బృ 4-1-16, ఛా 8-1

## జగద్వాచిత్వాత్ (సూ 16)

కౌషీతకిబ్రాహ్మణే బాలాక్యజాతశత్రుసంవాదే శ్రూయతే 'యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ స వై వేదితవ్య' ఇతి. (కౌ.బ్రా. 4-19) తత్ర కిం జీవో వేదితవ్యత్వేనోపదిశ్యతే? ఉత ముఖ్యః ప్రాణః? ఉత పరమాత్మేతి విశయః.

పూ.పక్షీ: కిం తావత్ప్రాప్తం ప్రాణ ఇతి కుతః? 'యస్య వై తత్కర్మే'తి శ్రవణాత్, పరిస్పందలక్షణస్య చ కర్మణః ప్రాణా

---

విషయవాక్యమునందలి ఏతత్—ఇదియను శబ్దము జగత్ వాచిత్వాత్ జగత్తును దెలియచేయుటవలన బ్రహ్మమే జగత్కారణముగ బోధింపబడుచున్నది.

అ॥ "ఓయి బాలాకీ! ఈ పురుషులకు గర్తయెవడో, యివియంతయు నెవనికర్మయో యతడు నిశ్చయముగ దెలిసికొనదగినవాడు" (కౌ బ్రా 4-18) అనువాక్యము బాలాకీఅజాతశత్రుసంవాదమున వినవచ్చుచున్నది, ఈవాక్యమునం దీవిషయమున సందేహము గల్గుచున్నది. ఇచట దెలిసికొనదగినవానిగా జెప్పబడినవా డెవడు—జీవుడా? ముఖ్యప్రాణమా? లేకపరమాత్మా?

పూ. పక్షి: పూర్వపక్షమేమన! ప్రాణము వేదితవ్యము ఏలనన! "ఈకర్మ యేవనిదో" యని వినవచ్చుట చేత. (1) పరిస్పందనము కర్మలక్షణము. అది ప్రాణము

శ్రియత్వాత్, వాక్యశేషే చ 'అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతీ'తి ప్రాణశబ్దశ్రవణాత్. ప్రాణశబ్దస్య చ ముఖ్యే ప్రాణే ప్రసిద్ధత్వాత్, యేచైతే పురస్తాద్బాలాకినా 'ఆదిత్యే పురుషశ్చంద్రమసి పురుష' ఇత్యేవమాదయః పురుషా నిర్దిష్టాః తేషామపి భవతి ప్రాణః కర్తా ప్రాణావస్థావిశేషత్వాదాదిత్యాదిదేవతాత్మనామ్. 'కతమ ఏకో దేవ ఇతి, ప్రాణ ఇతి, స బ్రహ్మేత్యాచక్షత' ఇతి (బృ. 3-9-9) శ్రుత్యంతర ప్రసిద్ధేః, జీవో వాయమిహ వేదితవ్యతయోపదిశ్యతే తస్యాపి ధర్మాధర్మలక్షణం కర్మ శక్యతే శ్రావయితుమ్. 'యస్య వై తత్కర్మే'తి సోఽపి భోక్తృత్వా

---

నాశ్రయించియున్నది. ప్రాణమునందతడేకత్వమును బొందుచున్నాడు" అనుతరువాతి (2) వాక్యమునందు ప్రాణ శబ్దము కాన్పించుచున్నది. ప్రాణశబ్దము ముఖ్యప్రాణమునందు ప్రసిద్ధము. (3) ఆదిత్యునియందలి పురుషుడు, చంద్రునియందలి పురుషుడు మొదలగు బాలాకిచే నిర్దిష్టమైన పురుషులందఱికిని ప్రాణము కర్తయగుచున్నది. ఆదిత్యాదిదేవతాస్వరూపులందఱు ప్రాణముయొక్క యవస్థా విశేషములు. "దేవతలందఱు నెవనిలో నంతర్భూతములగుదురో యా దేవత ఎవరు? అదేవత ప్రాణము, ఆప్రాణమే బ్రహ్మము. అతని నావిధముగ బల్కుచున్నారు." (బృ 3-9-9) అని శ్రుతిప్రసిద్ధి గలదు. లేదా (4) ఈజీవుడు తెలిసికొనదగినవాడుగా నిచట జేర్కొనబడుచున్నాడు– (5) "ఎవనిది యీకర్మ యగుచున్నదో" యని పలుకరింపబడుచున్న కర్మ ధర్మాధర్మస్వరూపముగ గ్రహించిన నది జీవునికి సంబంధించును. అతడు భోక్త" పురుషులందఱతని

ద్భోగోపకరణభూతానామేతేషాం పురుషాణాం కర్తోపపద్యతే, వాక్యశేషే చ జీవలింగమవగమ్యతే. యత్కారణం వేదితవ్యతయోపన్యస్తస్య పురుషాణాం కర్తుర్వేదనాయోపేతం బాలాకిం ప్రతిబుబోధయిషురజాతశత్రుః సుప్తం పురుషమామంత్ర్య మంత్రణశబ్దాశ్రవణాత్ప్రాణాదీనామభోక్తృత్వం ప్రతిబోధ్య యష్టిఘాతోత్థాపనాత్ప్రాణాదివ్యతిరిక్తం జీవం భోక్తారం ప్రతిబోధయతి, తథా పరస్తావపి జీవలింగ మవగమ్యతే. తద్యథా 'శ్రేష్ఠీ స్వైర్భుంక్తే యథా వా స్వాః శ్రేష్ఠినం భుంజంత్యేవమేవైష ప్రజ్ఞాత్మైతైరాత్మభిర్భుంక్తే ఏవమేవైతే ఆత్మాన ఏతమాత్మానం

---

కర్మఫలోపభోగమునకు సాధనములగుటవలన జీవుడు వారలకు గర్తయగుచున్నాడు. వాక్యశేషమునందు జీవసూచకములగు చిహ్నములు గలవు. ఏపురుషులకు గర్తయై జగత్కారణముగ వేదితవ్యమని శ్రుతి పల్కుచున్నదో యాతనిని బాలాకికి బోధించుటకై యజాతశత్రు నిద్రించుచున్న యొకపురుషుని బృహత్పాండరవాస, సోమరాజా, మొదలగు ననేక నామముల బిలచెను. ఆతడు మేల్కొనమిచేత ప్రాణాదులు భోక్తకావని తెలియజెప్పెను. తనచేకఱతో గొట్టగా నాతడు మేల్కాంచెను. అందుచే జీవుడు భోక్తగాని ప్రాణములుగావనియు జీవుడు ప్రాణములకంటె వ్యతిరిక్తుడనియు చూపట్టెను, దీనికి దరువాతవాక్యమునందు మఱియొక జీవచిహ్నము కానవచ్చుచున్నది. "యజమాని తన మనష్యునిచే నుపహృతమైన పదార్థములను భుజియించును. వారలతని నాధారము చేసికొని జీవించుదురు. ఆవిధముగనే

భుంజంతీ'తి (కౌ.బ్రా. 4-20) ప్రాణభృత్త్వాచ్చ జీవస్యోపపన్నం ప్రాణశబ్దత్వమ్. తస్మాజ్జీవముఖ్యప్రాణయోరన్యతర ఇహ గ్రహణీయో న పరమేశ్వరః. తల్లింగానవగమాదితి.

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః. — పరమేశ్వర ఏవాయమే తేషాం పురుషాణాం కర్తా స్యాత్, కస్మాత్, ఉపక్రమసామ

---

బ్రజ్ఞాత్మ యీజీవులవలన భోగముల ననుభవించును. ఈఆత్మలీయాత్మను భుజించుచున్నవి. ప్రాణములను ధరించుటచే జీవుడు ప్రాణశబ్దముచే చెప్పబడుచున్నాడు. [యజమానుడు భృత్యులు దెచ్చునాహారమును దిని జీవించుచున్నాడు. అతడు తన భృత్యులను బోషించుచున్నాడు. అటులనే జీవుడాదిత్యుని ప్రకాశము మొదలగు భోగసాధనములచే ననుభవించుచున్నాడు. జీవులిచ్చు హవిస్సును గ్రహించుటచే సూర్యాదులు జీవునియం దాధారపడియున్నారు. ఇట్లన్యోన్యము నాధారము చేసికొని జీవించుటకూడ నొకజీవసూచక మగుచున్నది. [ఆదిత్యశబ్దము చేత సూర్యాది దేవతలయందు కాన్పించు జీవుడుగూడ మానుషశరీరజీవులవలెనే యున్నాడని చెప్పవలెను అనగానమస్తజీవకోటికిని ప్రాణశబ్దము లింగమగుచున్నదియని తాత్పర్యము] అందువలన జీవముఖ్యప్రాణములలో నొకరినిచట గ్రహింపనగు, తగు సూచన లేమియు లేకపోవుటచేత బరమేశ్వరుని గ్రహింపవీలులేదు.

సిద్ధాంతి: పూర్వపక్ష మిటులరాగా సమాధానము చెప్పుచున్నాము. పరమేశ్వరుడే యీపురుషులకు గర్తయగుచున్నాడు. ఏలనన ఉపక్రమబలమువలన. "నేను నీకు బ్రహ్మ

ర్థ్యాత్, ఇహ హి బాలాకిరజాతశత్రుణా సహ 'బ్రహ్మ తే బ్రవాణీ'తి సంవదితుముపచక్రమే, స చ కతిచిదాదిత్యాద్యధికరణాన్పురుషానముఖ్యబ్రహ్మదృష్టిభాజ ఉక్త్వా తూష్ణీం బభూవ, తమజాతశత్రుః 'మృషా వై ఖలు మా సంవదిష్ఠా బ్రహ్మ తే ప్రబ్రవాణీ'త్యముఖ్యబ్రహ్మవాదితయాపోహ్య తత్కర్తారమన్యం వేదితవ్యతయోపచిక్షేప. యది సోఽప్యముఖ్యబ్రహ్మదృష్టిభాక్స్యాదుపక్రమో బాధ్యేత, తస్మాత్పరమేశ్వర ఏవాయం భవితుమర్హతి కర్తృత్వం చైతేషాం పురుషాణాం న పరమేశ్వరాదన్యస్య స్వాతంత్ర్యేణావకల్పతే.

---

మునుగూర్చి చెప్పెదనని" (కౌ 4-1) యజాతశత్రువునకు బాలాకి బ్రహ్మోపదేశము నారంభించెను. ఆదిత్యుడు చంద్రుడు మొదలగువారి నధిష్ఠించి బ్రహ్మభావనకు యోగ్యులగు పురుషులను కొంతమందిని బేర్కొని యూరకుండెను. "మీరు నాకు బ్రహ్మమును బోధించెదనని వృథాప్రతిజ్ఞ చేసితిర"ని బాలాకి ప్రశ్నింపగా నముఖ్యబ్రహ్మను త్రోసిపుచ్చి వీరలకు కర్తయగు మఱియొకనిని దెలిసికొన దగినవానినిగ బలికెను. అతడుగూడ నముఖ్యబ్రహ్మయె యైనచో నుపక్రమభంగము కలుగును. కనుక దెలిసికొన దగిన యీతడు పరమేశ్వరుడే కావలయును. పరమేశ్వరుడు దక్క నన్యుడీ పురుషులకు స్వతంత్రుడగు కర్త గానేరడు.

పరమేశ్వరుడు వేదితవ్యుడు.

'యస్య వై తత్కర్మే' త్యపి నాయం పరిస్పంద లక్షణస్య ధర్మాధర్మలక్షణస్య కర్మణో నిర్దేశః తయోరన్యతరస్యాప్య ప్రకృతత్వాదసంశబ్దితత్వాచ్చ. నాపి పురుషాణామయం నిర్దేశః, ఏతేషాం పురుషాణాం కర్తేత్యేవ తేషాం నిర్దిష్టత్వాత్, లింగ వచనవిగానాచ్చ. నాపి పురుషవిషయస్య కరోత్యర్థస్య క్రియా

---

"ఈకర్మ యెవనిదో" యనువాక్యమునందలి కర్మ గూడ పరిస్పందనరూపమైనగాని ధర్మాధర్మాత్మకమైన గాని కర్మను నిర్దేశించుటలేదు. ఈరెండువిధములగు కర్మలు గూడ ప్రకృతములుగావు. వానిగూర్చి యింతకు బూర్వము ప్రసంగములేదు. కర్మశబ్దముచే బురుషులు నిర్దేశింపబడుటలేదు. "ఈపురుషులకు గర్తయగువాఁడు" అనువాక్యమునందలి కర్తృశబ్దముచేతనే వారు నిర్దేశింపబడుచున్నారు, లింగము వచనముగూడ విభిన్నములగుచున్నవి. మఱియు కరోతి చేయుచున్నాడనుక్రియకు బురుషుడు విషయముగాని, యాతనిపుట్టుక క్రియాఫలముగాని గాదు. పురుషులకు గర్తయగు

జగత్తు కర్మశబ్దార్థము.

వాడు అనువాక్యముచేతనే యీయర్థము చరితార్థమగుచున్నది, పరిశేషన్యాయముచే "నేతత్కర్మ" యనువాక్యమునందలి ఎతత్ = ఈయనుసర్వనామముచే బ్రత్యక్షము సన్నిహితమునగు జగత్తు కర్మశబ్దార్థముగ గ్రహింపవలసియున్నది. [అనగా నీ కర్మ యెవనిదో యాతడు తెలిసికొనదగినవాడు అనువాక్యమునందు, ఈకర్మయని రెండుపదములు వినబడుచున్నవి. ఈరెండు పదములయర్థము స్పష్టముగ దెలి

ఫలస్య వాయం నిర్దేశః, కర్తృశబ్దేనైవ తయోరుపాత్తత్వాత్, పరిశేషాత్ప్రత్యక్షసన్నిహితం జగత్సర్వనామ్నైతచ్ఛబ్దేన నిర్దిశ్యతే, క్రియత ఇతి చ తదేవ జగత్కర్మ.

---

యగల నుపపదము లెవ్వియునులేవు. స్వయముగా వానికి ననేకార్థములు గలవు. పరిస్పందనాత్మకమగు ప్రాణము, ధర్మాధర్మలక్షితమగు జీవుడు, పురుషులు వీరిలో నెవరుచేయు కర్మయయినను గర్మశబ్దమున కర్థమగుటచేత, వానినే యీపదమున కర్థముగ గ్రహింపవచ్చునుగదా యనిశంక కలుగుచున్నది. ప్రకరణము బ్రహ్మప్రకరణమగుటవలన ప్రాణజీవులను గ్రహింప వీలులేదు. పురుషులకు గర్తయగు వాడు అని పూర్వవాక్యమునందు బురుషు లుదాహరింప బడుటచేత, గర్మశబ్దముచే దిరిగి పురుషులను గ్రహింప శక్యముకాదు. పునరుక్తిదోషము పట్టును. మఱియు, గర్మ యనునది నపుంసకలింగము ఏకవచనము. పురుషులు యనునది పుంలింగము బహువచనము. కనుక కర్మశబ్దముచే పురుషులవగతము కానేరరు. పురుషులు పూర్వవాక్యమునందు చెప్పబడుటవలన, కర్మశబ్దబోధితమగు చేయుటయను క్రియకు బురుషులుగాని తత్ఫలముగాని యర్థముకాదు. మిగిలిన జగత్తు సృష్టికార్యఫలము అనగా సర్జనక్రియాఫలము. అది ప్రత్యక్షముగను సన్నిహితముగనున్నది. ఏతత్ – ఈయని చేతితో జూపెట్టిన ట్లర్థమగుచున్నది. కనుక నీకర్మ యనుపదములకు సన్నిహితముగను బ్రత్యక్షముగను గాన్పించుచున్న జగత్తని యర్థము గ్రహింపనగును].

(61)

నను జగదప్యకృతమసంశబ్దితం, చ, సత్యమేతత్, తథాప్యసతి విశేషోపాదానే సాధారణేనార్థేన సన్నిధానేన సన్నిహితస్య వస్తుమాత్రస్యాయం నిర్దేశ ఇతి గమ్యతే, న విశిష్టస్య కస్యచిత్, విశేషసన్నిధానాభావాత్. పూర్వత్ర చ జగదేకదేశభూతానాం పురుషాణాం విశేషోపాదానాదవిశేషితం జగదేవేహోపాదీయత ఇతి గమ్యతే. ఏతదుక్తం భవతి, య ఏతేషాం పురుషాణాం జగదేకదేశభూతానాం కర్తా కిమనేన విశేషేణ యస్య వా కృత్స్నమేవ జగదవిశేషితం కర్మేతి. వాశబ్ద ఏకదేశావచ్ఛిన్న

---

నిజమే! జగత్తుగూడ బ్రకృతవిషయము కాదు. అంతకు బూర్వమది పలుకరింపఁబడలేదు. కాని విశేషముగ ప్రత్యేకవిషయమెద్దియు నిర్దేశింపబడనపుడు సామాన్యార్థమును గ్రహింపదగును. సన్నిహితముగనున్నది బుద్ధికి సామాన్యముగ స్ఫురించువస్తువగు జగత్తు కర్మశబ్దముచే నిర్దేశింపబడుచున్నట్లు దెలియుచున్నది. ప్రత్యేకవస్తువు నెద్దానిని గ్రహింపవీలులేదు. కర్మపదసన్నిధానమునందు బ్రత్యేకవస్తువెద్దియు వినవచ్చుటలేదు. మఱియు పూర్వవాక్యమునం దుదాహరింపబడిన జగత్తులో జేరినపురుషులు ప్రత్యేకముగ బలుకరింపబడుటవలన గర్మశబ్దముచే సర్వసాధారణమగు జగత్తభిప్రేతమగుచున్నట్లు తెలియుచున్నది. జగత్తులో నొకరగు పురుషులకెవడు కర్తయో యతడే పురుషుడని ప్రత్యేకముగ చెప్ప నేల! కృత్స్నమగు జగత్తంతయు నేదికలదో దానికంతయు నిర్విశేషముగ నతడే కర్తయగుచున్నాడని ప్రకృతవిషయవాక్యముచే జెప్పినట్లగుచున్నది.

కర్తృత్వవ్యావృత్త్యర్థః. యే బాలాకినా బ్రహ్మత్వాభిమతాః పురుషాః కీర్తితాస్తేషామబ్రహ్మత్వఖ్యాపనాయ విశేషోపాదానం, ఏవం బ్రాహ్మణపరివ్రాజకన్యాయేన సామాన్యవిశేషాభ్యాం జగతః కర్తా వేదితవ్యతయోపదిశ్యతే. పరమేశ్వరశ్చ సర్వజగతః కర్తా సర్వవేదాంతేష్వవధారితః.

---

వా అనగా లేక యను శబ్దమర్థముచే జగత్తులో నొక భాగమగు పురుషులకు మాత్రి మతడు కర్త యనుభావమును ద్రోసిపుచ్చుచున్నది. [ఎవడేపురుషులకు గర్తయో, లేక, పురుషు లననేల! యీజగత్తంతయు నిర్విశేషముగ నెవరి కర్మయో యాతడు దెలిసికొన దగినవాడు అని విషయ వాక్యార్థము దేలుచున్నది.] బ్రహ్మమని యంగీకరింపబడి బాలా కిచే సంకీర్తనముచేయబడిన పురుషులు నిజముగా బ్రహ్మము గారని చెప్పుటకు [కర్మశబ్దబోధితమగు జగత్తులో చేరినవార లగు] బురుషులు ప్రత్యేకముగ నుదాహరింపబడినారు. ఈ విధముగ బ్రాహ్మణపరివ్రాజకన్యాయముచే [అనగా, బ్రాహ్మ ణులకు భోజనము పెట్టవలయును, పరివ్రాజకులను బెట్ట వలయును అనువాక్యమునందు, బ్రాహ్మణులలో జేరిన పరి వ్రాజకులను బ్రత్యేకముదాహరించుటవలన పరివ్రాజకులుగాక మిగిలిన బ్రాహ్మణులు అని బ్రాహ్మణశబ్దమున కర్థము చెప్పినట్లు] సామాన్యవిశేషాకారములచే జగత్కర్త వేది తవ్యుడని యుపదేశింపబడుచున్నది. పరమేశ్వరుడే సర్వజగ త్కర్తయని వేదాంతముల యన్నిటియందును నిశ్చయింప బడినాడు.

## జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్
(సూ 17.)

అథ యదుక్తం వాక్యశేషగతాజ్జీవలింగాన్ముఖ్య ప్రాణ లింగాచ్చ తయోరేవాన్యతరస్యేహ గ్రహణం న్యాయ్యం న పరమే శ్వరస్యేతి తత్పరిహర్తవ్యమ్. అతోఽభిధీయతే, పరిహృతం తత్ 'నోపాసా త్రైవిధ్యా దాశ్రితత్వాదిహ తద్యోగా' దిత్యత్ర (బ్ర.సూ. 1-3 31) త్రివిధం హ్యతోఽపాసనమేవం సతి ప్రసజ్యేత, జీవో

---

అ॥ ఇంతవఱకు పైసూత్రమున సిద్ధాంతము వివరింప బడినది. పూర్వపక్షవాదమునకు తరువాతిసూత్రమున సమా ధానము చెప్పబడుచున్నది.

తత్యథా ప్రాణః శ్రేష్ఠః అను మొదలగు కార్యముల యందు జీవ ముఖ్యప్రాణ లింగాత్ = జీవముఖ్యప్రాణ పర ముగ సూచన కాన్పించుచున్నదిగనుక, పరమేశ్వరుడు వేది తవ్యుడు! కాడంటివేని, న = అదిసరికాదు తత్ = ఆవిష యము, వ్యాఖ్యానాత్ = 1-1-31 సూత్రమున వ్యాఖ్యా నము చేయ బడినది.

విషయవాక్యశేషమునందు గాన్పించుచున్న లింగ ములవలన ప్రకృతమున జీవునిగాని ముఖ్యప్రాణములింగమును గాని గ్రహించుట న్యాయముగాని పరమేశ్వరుని గ్రహిం చుట న్యాయముకాదను పూర్వవాది వాదమునకు ప్రతీకా రము చెప్పవలసియున్నది. అందులకిట్లు జెప్పుచున్నాము. దీనికి బరిహారము 1-1-31 సూత్రమున బలుకరింపబడినవి.

పాసనం ముఖ్యప్రాణోపాసనం బ్రహ్మోపాసనం చేతి. స త్రైత న్న్యాయ్యమ్, ఉపక్రమోపసంహారాభ్యాం హి బ్రహ్మవిషయత్వ మస్య వాక్యస్యావగమ్యతే. తతోఽపక్రమస్య తావద్బ్రహ్మవిష యత్వం దర్శితమ్. ఉపసంహారస్యాపి నిరతిశయఫలశ్రవణా ద్బ్రహ్మవిషయత్వం దృశ్యతే 'సర్వాన్పాప్మనోఽపహత్య సర్వేషాం చ భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్యమాధిపత్యం పర్యేతి య ఏవం వేదే'తి.

---

పూర్వవాది వాదముప్రకారము: జీవోపాసనము, ముఖ్య ప్రాణోపాసనము, బ్రహ్మోపాసనము అని మూడువిధము లగు నుపాసన లేర్పడును. ఇది న్యాయముకాదు. ఉపక్రమో పసంహారముల గమనించినచో నీవాక్యము బ్రహ్మపరమని తెలియుచున్నది. ఉపక్రమమునందు బ్రహ్మమునుగూర్చి పలుకరింపబడినట్లుల నిదివరకే యుదాహరించియుంటిమి. ["బ్రహ్మ తే బ్రవాణి – నీకు బ్రహ్మమును దెలుపుదును" అనువాక్యముతో బాలాకి ప్రకరణము నుపక్రమించెను]. నిరతిశయ ఫలశ్రవణముతో బ్రకరణ ముపసంహరింపబడు చున్నది. నిరతిశయమగునది బ్రహ్మముదక్క మఱియొకటి కానేరదు. "ఈవిషయమును దెలిసికొనినవాడు, సమస్త పాపములు పోయి, సమస్తభూతములకంటె శ్రేష్ఠత్వమును, అధికత్వమును, స్వారాజ్యమును బొందుననని" ఫలశ్రుతి వినవచ్చుచున్నది.

పూ.పక్షీ: నన్వేవం సతి ప్రతర్దనవాక్యనిర్ణయేనైవేద మపి వాక్యం నిర్ణీయతే

సిద్ధాంతీ: న నిర్ణీయతే 'యస్య వై తత్కర్మే' త్యస్య బ్రహ్మ విషయత్వేన తత్రానిర్ధారితత్వాత్, తస్మాదత్ర జీవముఖ్య ప్రాణశంకా పునరుత్పద్యమానా నివర్త్యతే. ప్రాణశబ్దోఽపి బ్రహ్మవిషయో దృష్టః 'ప్రాణబంధనం హి సోమ్య మనః' (ఛాం. 6-8-2) ఇత్యత్ర జీవలింగమప్యుక్రమోపసంహారయోర్బ్రహ్మ విషయత్వాదభేదాభిప్రాయేణ యోజయితవ్యమ్.

---

పూ. పక్షి : 1-1-31 సూత్రమున ప్రతర్దనవాక్యము చేతనే యీ వాక్యార్థనిర్ణయమగునుగదా! [ప్రత్యేక సూత్ర మేలయన!]

సిద్ధాంతి : అచట ప్రకృతమగు కర్మవాక్యము బ్రహ్మ పరముగ నిర్ణీతముకాలేదు. కనుక జీవముఖ్యప్రాణవిషయక మగు శంక తిరిగి యుద్ధారము చేయబడినది. దానిని నివారింప వలెను. "మనస్సు ప్రాణమునందు నిలుచుచున్నది" (ఛాం 6-8-2) యను వాక్యమునందు ప్రాణశబ్దము బ్రహ్మపర ముగ వాడబడుచున్నది. ఉపక్రమోపసంహారములు బ్రహ్మ సూచకములుగానుండుటచేత జీవలింగములుగూడ జీవబ్రహ్మ భేదపరములుగా గ్రహింపదగును. 17

అ॥ ఏతత్కర్మయను పదములకు స్వమతానుసార ముగ నర్థము 16 సూత్రమునందును, పూర్వపక్షనిరసన 17వ సూత్రమునందును జేయబడినది. ఈవిషయమున మఱి కొంతమంది తత్త్వవేత్తల భావమును తరువాతసూత్రమున వివరించుచున్నారు.

## అన్యార్థంతు జైమినిః
## ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే (సూ 18)

అపిచ నైవాత్ర వివదితవ్యం, జీవప్రధానం వా ఇదం వాక్యం స్యాద్బ్రహ్మప్రధానం వేతి, యతోఽన్యార్థం జీవపరామర్శం బ్రహ్మ ప్రతిపత్త్యర్థమస్మిన్వాక్యే జైమినిరాచార్యో మన్యతే, కస్మాత్, ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం, ప్రశ్నస్తావత్సుప్త పురుషప్రతిభోధనేన ప్రాణాది వ్యతిరిక్తే జీవే ప్రతిబోధితే పున ర్జీవవ్యతిరిక్తవిషయో దృశ్యతే 'క్వైష ఏతద్బాలాకే పురుషోఽశ

---

అన్య అర్థం తు = బ్రహ్మము నుపదేశించుటకుగాను స్థూలారుంధతీన్యాయముచేత ప్రశ్న ప్రతివచనాభ్యాం = అపి చ ప్రశ్న ప్రతివచనపూర్వకముగ జీవముఖ్యప్రాణములు వేదితవ్యములుగ నుదాహరింపబడినవని ఏవం = ఈవిధముగ ఏకే = జైమిన్యాచార్యుడు మొదలగువారు తలంచుచున్నారు.

ప్రకృతమగు నీ వాక్యము జీవపరమా, బ్రహ్మపరమా యని వివాదపడనవసరములేదు. బ్రహ్మను వివరించుటకై యిచట జీవపరామర్శ చేయబడుచున్నది అని

జైమిన్యాచార్య తాత్పర్యము

జైమిన్యాచార్యుడు తలంచుచున్నాడు. ఏలనన ప్రశ్న దానికి ప్రతివచనమువలన, నిద్రించుచున్న పురుషుని నేకనామముల బిలచి మేలుకొలుపుటచేత ప్రాణముకంటె జీవుడు భిన్నమని బోధింపబడెను. తరువాత "ఓయి బాలాకీ! ఈ పురుషు డెచటనిద్రించెను? అతడెచట

యిష్ట క్వ వా ఏతదభూత్కుత ఏతదాగా' దితి. (కౌ. బ్రా. 4-19) ప్రతివచనమపి 'యదా సుప్తస్స్వప్నం న కంచన పశ్యత్య థాస్మిన్ప్రాణ ఏవైకధా భవతీ' త్యాది. 'ఏతస్మాదాత్మనస్సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః' (కౌ.బ్రా. 4-20) ఇతి చ సుషుప్తికాలే చ పరేణ బ్రహ్మణా జీవఏకతాం గచ్ఛతి, పరస్మాచ్చ బ్రహ్మణః ప్రాణాదికం జగజ్జాయత ఇతి వేదాంతమర్యాదా. తస్మాదత్రాస్య జీవస్య నిస్సంబోధస్వస్థతారూపస్స్వప ఉపాధిజనిత విశేషవిజ్ఞానరహితం

---

నుండెను? ఏ చటనుండియిచటకువచ్చెను?" అని యజాతశత్రువు బాలాకి నడిగెను. (కౌషి 4-19) ఇందుకు సమాధానము "నిద్రించినపు డతడు స్వప్నమును గాంచడు. ఆతడు ప్రాణముతో నైక్యమును బొందుచున్నాడు." అని ప్రారంభించి, "ఆత్మనుండి ప్రాణములు తమ తమ స్థానముల కేగుచున్నవి. ప్రాణములనుండి దేవతలు, దేవతలనుండి లోకములు బయలు దేరుచున్నవి యని బాలాకి సమాధానము వినవచ్చుచున్నది. (కౌషి 4-20) సుషుప్తిసమయమునందు జీవుడు పరబ్రహ్మముతో నైక్యమును జెందును. పరబ్రహ్మమువలన ప్రాణము మొదలగు జగత్తంతయు బుట్టుచున్నట్లు వేదాంతముల నిర్ణయము. అందువలన నే స్థితియందు జీవుడను విశేషస్వరూపము కానిపింపదో, యే స్థితియందు విక్షేపకారణములేక సుషుప్తి యనుభూతమగునో, యేస్థితియం దుపాధిచేకలిగిన విశేషవిజ్ఞానము కాని దానినిజస్వరూపమనుభూతమగునో యట్టి

స్వరూపం యత స్తత్ప్రశ్నరూపమాగమనం సోఽత్ర పరమాత్మా వేదితవ్యతయా శ్రావిత ఇతి గమ్యతే.

అపిచైవమేకే శాఖినో వాజసనేయినోఽస్మిన్నేవ బాలాక్యజాతశత్రుసంవాదే స్పష్టం విజ్ఞానమయశబ్దేన జీవమామ్నాయ తద్వ్యతిరిక్తం పరమాత్మానమామనంతి 'య ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదభూత్కుత ఏతదాగా' దితి (బృ. 2-1-6) ప్రశ్నే ప్రతివచనేఽపి 'య ఏషోఽంతర్హృదయ ఆకాశ స్తస్మిన్ఛేత' ఇతి, ఆకాశశబ్దస్య పరమాత్మని ప్రయుక్తః 'దహరోఽస్మిన్నంతరాకాశ' ఇతి, (ఛాం. 8-1-1) అత్ర 'సర్వఏతఆత్మానో వ్యుచ్చరంతీ' తి చోపాధిమతామాత్మనా మన్యతోవ్యుచ్చరణమా

---

స్వరూపభ్రంశమే యచటినుండి యాగమనమగుచున్నదో యట్టిపరమాత్మ వేదితవ్యుడని శ్రుతి చెప్పుచున్నది.

మరియు, వాజసనేయ పాఠమునందలి యజాతశత్రు బాలాకీ సంవాదమున జీవుడు విజ్ఞానమయుడని పరమాత్మ యాతనికి వ్యతిరిక్తుడనియు స్పష్టముగ బలుకుచున్నారు. "అపుడు విజ్ఞానమయుడగు పురుషు డెచటనున్నాడు ? ఎచట నుండి యాత డిచటికి వచ్చుచున్నాడు" అను ప్రశ్న వేసికొని "ఈవిజ్ఞానమయుడు హార్దాకాశమున శయనించియున్నాడు" అని ప్రతివచనము చెప్పుచున్నారు. "హృదయకమలమునందలి దహరాకాశము" (ఛాం 8-1-1) అను వాక్యమున ఆకాశ శబ్దము పరమాత్మయందు వాడబడుచున్నది. "ఈజీవాత్మ లందఱు పరమాత్మనుండియె వచ్చుచున్నారు" అనువాక్యము

మనంతః పరమాత్మానమేవ కారణత్వేనామనంతీతి గమ్యతే. ప్రాణనిరాకరణస్యాపి సుషుప్తపురుషోత్థాపనేన ప్రాణాదివ్యతిరిక్తోపదేశోఽభ్యుచ్చయః— ఇతి పంచమాధికరణమ్.

---

నందు, పరమాత్మనుండియె వీరలందఱు వచ్చుచున్నారని యుదాహరింపబడుటచే నాతడే వీరలందరికి కారణమని తెలియుచున్నది. నిద్రించుచున్నవానిని మేలుకొలుపుటచేత తెలియవచ్చుచున్న ప్రాణముకంటె జీవుడు భిన్నమను విషయముగూడ, ప్రకృతవాక్యము ప్రాణపరముగాదను వాదమున కుపోద్బలకమగుచున్నది.

అధికరణార్థసంగ్రహము : బాలాకి అజాతశత్రుసంవాదమునందలి వేదితవ్యశబ్దముచే పరమాత్మ చెప్పబడుచున్నాడుగాని జీవప్రాణములు చెప్పబడుటలేదు. ప్రకరణము బ్రహ్మప్రకరణము మొదట నాదిత్యాదులను బ్రహ్మభావమున బాలాకి చెప్ప "మీరు నాకు బ్రహ్మమును బోధింప ప్రతిజ్ఞ చేసితిరి" యని యజాతశత్రువు బాలాకిని హెచ్చరికచేసెను. కనుక బాలాకిచే వేదితవ్యునిగా జెప్పబడిన పురుషుడు పరమాత్మయె కావలెను. కర్మశబ్దము పురుషుని జెప్పలేదు. రెంటికిని లింగవచనభేదము కాన్పించుచున్నది. పురుషునిగూర్చి విషయవాక్యము ప్రథమభాగమునం దంతకుపూర్వమే చెప్పబడియున్నది. ప్రత్యక్షముగ నెదుట గాన్పించుచున్న జగత్తు కర్మశబ్దార్థముగ గ్రహించవలెను. ఆపదమునకు మరియొక యర్థకల్పనము చేయదగిన పదములేవ్వియును కానరావు. బ్రాహ్మణప

## (6) వాక్యాన్వయాధికరణమ్ (సూ 19-22.)

ప్రాజకన్యాయముచే విషయవాక్యమునందు కృత్స్నమగు జగత్తంతయు గ్రహింపతగును. ప్రకరణముయొక్క యుపక్రమోపసంహారములు ఫలశ్రుతియు బ్రహ్మమునే తెలియజేయుచున్నది. నిద్రనుండి మెల్కొలుపబడిన పురుషుదృష్టాంతముచే జీవునికంటె ప్రాణములు భిన్నములనియు నిద్రయందు జీవుడు పరమేశ్వరునితో నైక్యము చెందుననియు అందువలన నతడే సర్వకారణమనియు దెలియుచున్నది. 18

### (6) వాక్యాన్వయాధికరణము

ఉపక్రమోపసంహారముల బ్రహ్మ తెలియవచ్చుటవలన వేదితవ్యశబ్దము బ్రహ్మపరముగ బాలాక్యాధికరణమున గ్రహింపబడినది. అదేతీరున 'న వా అరే పత్యుః కామాయ' అను మైత్రేయిబ్రాహ్మణము జీవునితో నుపక్రమమగుచున్నది. గనుక నావాక్యము జీవపరముగ నన్వయింపవచ్చునుగదా యను శంకకు సమాధానము చెప్పుటకై తరువాత ప్రకరణ మారంభమగుచున్నది.

విషయవాక్యము : "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యః' (బృహ 4-5-6)

సంశయము : ఇచట ద్రష్టవ్యుడుగా చెప్పబడినవా డెవరు జీవుడా? పరమాత్మా?

పూర్వపక్షము : జీవుడు.

# వాక్యాన్వయాత్ (సూ 19)

బృహదారణ్యకే మైత్రేయీబ్రాహ్మణేఽభిధీయతే 'న హి అరే పత్యుః కామాయే' త్యుపక్రమ్య 'న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి. ఆత్మా వా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో

---

సిద్ధాంతము : పరమాత్మ.

అవలోకనీయమగు ప్రమాణవాక్యములు బృహదారణ్యకము. మైత్రేయి బ్రాహ్మణమంతయు- (4-5)

ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము నిదిధ్యాసితవ్యమునగు వస్తువు పరమాత్మయని వాక్య అన్వయాత్ = వాక్యములయొక్క పరస్పరాన్వయముచే దెలియుచున్నది.

బృహదారణ్యకము మైత్రేయీబ్రాహ్మణమునందిట్లు వినవచ్చుచున్నవి. "ఓయి మైత్రేయీ! పతిమీద ప్రేమ కొఱకు పతిప్రియుడగుటలేదు. అని ప్రకరణ ముపక్రమింపబడినది. తరువాత "ఏవస్తువుగూడ దానియందలిప్రేమచే ప్రియమగుటలేదు. ఆత్మయందలి ప్రేమకొఱకది ప్రియమగుచున్నవి. అత్మయే ద్రష్టవ్యము, శరణము చేయదగినది మననము చేయతగినది. నిదిధ్యాసనము చేయతగినది. ఆత్మయొక్క దర్శన, శ్రవణ, మనన, నిదిధ్యాసనములచే నిదియంతయు దెలియబడినదగుచున్నది." యని యుపదేశింపబడినది. [ద్రష్టవ్యమన సాక్షాత్కారము చేసికొనతగినది. శ్రవణ

నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితం' (బృ. 4-5-6) మితి. తత్రైత ద్విచికిత్స్యతే—కిం విజ్ఞానాత్మైవాయం ద్రష్టవ్యశ్రోతవ్యత్వాది రూపేణోపదిశ్యతే ఆహోస్విత్పరమాత్మేతి. కుతః పునరేషా విచికిత్సా. ప్రియసంసూచితేనాత్మనా భోక్త్రోపక్రమాద్విజ్ఞానాత్మోపదేశ ఇతి ప్రతిభాతి, తథాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానోపదేశాత్పరమాత్మోపదేశ ఇత్యపి ప్రతిభాతి.

---

మనన నిదిధ్యాసనము లిందుకుసాధనములు. ఆత్మప్రతిపాదకములగు శ్రుతి వాక్యములను విశ్వాసపూర్వకముగ నాచార్య ముఖమున వినుట శ్రవణము. శ్రవణముచేసిన వాక్యములను శ్రుతిసమ్మతములగు యుక్తిపురస్సరముగ నర్థవిచారముచేసి అవిపర్యయము అసందిగ్ధమునగు నిశ్చితార్థమును గ్రహించుట మననము. నిశ్చితార్థమైన జ్ఞానమును మనస్సునందు ధారణజేసి యనవరతభావనము చేయుకొనుట నిదిధ్యాసనము. ఇచట జీవుడు శ్రవణమనననిదిధ్యాసనములచేత ద్రష్టవ్యుడని ఉపదేశింపబడుచున్నాడా? లేక పరమాత్మ చెప్పబడుచున్నాడా? యని సందేహము కలుగుచున్నది. ఈ సందేహమేల కలుగవలెనన! ప్రియుడగు భర్త మొదలగు పదములచేత భోక్తయగుజీవుడుపక్రమమున సూచింపబడుచున్నటుల కాన్పించును. ఆత్మవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము లభించునట్లుదాహరింపబడుటచే పరమాత్మ ఉపదేశింపబడుచున్నట్లు తోచుచున్నది.

పూ,పక్షీ: కిం తావత్ప్రాప్తం విజ్ఞానాత్మోపదేశ ఇతి. కస్మాత్. ఉపక్రమసామర్థ్యాత్. పతిజాయాపుత్రవిత్తాదికం హి భోగ్య జాతం సర్వం జగదాత్మార్థతయా ప్రియం భవతీతి ప్రియసంసూచితం భోక్తారమాత్మానముపక్రమ్యానంతరమిదమాత్మనో దర్శనాద్యుపదిశ్యమానం కస్యాన్యస్యాత్మనస్స్యాత్. మధ్యేఽపి 'ఇదం మహద్భూతమనంతమపారం విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞా' స్తీతి

---

పూ. పక్షి : పూర్వపక్షవాద మేమన! జీవుడిచట నువదేశింపబడుచున్నాడు. ఏలనన! ఉపక్రమబలమువలన! పతిపత్నీపుత్రవిత్తాది భోగ్యభూమియైన నీజగత్తంతయు నాత్మకొరకు ప్రియమగుచున్నది. ప్రియశబ్దముచే సూచింపబడిన భోక్త ఆత్మయని యుపక్రమమునందు పేర్కొనబడినది. తరువాత నిట్టిఆత్మ ద్రష్టవ్యము శ్రోతవ్యము అనినిర్దేశింపబడినది. జీవుడుగాక నీయాత్మ మరియెవరు కాగలరు? [కర్తృత్వ భోక్తృత్వములు జీవునికి కలవుగాని ఆత్మకు లేవు] "ఈయాత్మ బాహ్యాభ్యంతర భేదములేక నంతయు నొక ప్రజ్ఞానస్వరూపముగ నున్నది. ఆత్మ యీభూతములన్నిటినుండి యుత్థితమగుచున్నది. భూతములపరిత్యేకత వానితోనే నశించును. ఇట్లేకత్వమును బొందినతరువాత విశేషవిజ్ఞానమాత్మయందుండదు" (బృ కా 4–5–13) అని ప్రకరణమధ్యమున వినబడుచున్న వాక్యమునందుగూడ ప్రకృతమగు జీవుడే దర్శనమునకు, మహాభూతములనుండి సముత్థానమునకు విషయమగు మహాభూతముగ నుదాహరింపబడినాడు. ఇట్టి

ప్రకృతస్యైవ మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యస్సముత్థానం విజ్ఞానాత్మభావేన బ్రువన్విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యత్వం దర్శయతి తథా 'విజ్ఞాతారమరే కేన విజానీయా' దితి కర్తృవచనేన శబ్దేనోపసంహరన్ విజ్ఞానాత్మానమేవేహోపదిష్టం దర్శయతి, తస్మాదాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానవచనం భోక్త్రర్థత్వాద్భోగ్యజాతస్యౌపచారికం ద్రష్టవ్యమితి.

సిద్ధాంతి: ఏవం ప్రాప్తే బ్రూమః.— పరమాత్మోపదేశ ఏవాయం. కస్మాత్ ? వాక్యాన్వయాత్. వాక్యం హీదం

---

విజ్ఞానాత్మయే ద్రష్టవ్యముగ నుపదేశింపబడుచున్నాడు, "ఇతడే సర్వమును దెలుసుకొనువాడు. అతనిని దేనివలనను దెలుసుకొన శక్యముకాదు" (బృ 4-5-13) అని యుపసంహారవాక్యమునందు తెలుసుకొనువాడు అని కర్తృత్వము వినబడుచున్నది. కనుక నుపసంహారవాక్యముగూడ కర్తృత్వముతో గూడిన జీవుని దెలుపుచున్నది, కనుక ఆత్మను దెలిసికొనిన సర్వము దెలియబడినదగును" అనువాక్యము భోక్తను బోధించుచున్నది. భోగ్యజాతమంతయు, భోక్తను బట్టి దెలిసికొనదగినదిగా వర్ణింపబడినది.

సిద్ధాంతి : పూర్వపక్షమిటులనుండ సమాధానము చెప్పుచున్నాము. ఇయ్యది పరమాత్మనుగూర్చిన యుపదేశము. ఏలనన వాక్యసమన్వయమువలన ! ప్రకృతవాక్యమన్ననో పూర్వాపరసంబంధముచే పర్యాలోచనముచేయగా పరమాత్మనుగూర్చి సమన్వయముగు ప్రకరణభాగముగ కా

ఆత్మావాఅరేద్రష్టవ్య శ్రుతిపరమాత్మపరము.

పౌర్వాపర్యేణావేక్ష్యమాణం పరమాత్మానం ప్రత్యన్వితావయవం లక్ష్యతే. కథ మితి తదుపపాద్యతే 'అమృతత్వస్య తు నాశాస్తి విత్తేనే'తి యాజ్ఞవల్క్యాదుపశ్రుత్య 'యేనాహం నామృతాస్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహీ'త్యమృతత్వమాశాసానాయై మైత్రేయ్యై యాజ్ఞవల్క్య ఆత్మవిజ్ఞాన ముపదిశతి, న చాన్యత్ర పరమాత్మవిజ్ఞానాదమృతత్వమస్తీతి శ్రుతిస్మృతివాదా వదంతి. తథా చాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ముచ్యమానం నాన్యత్ర పరమకారణవిజ్ఞానాన్ముఖ్యమవకల్పతే, నచైతదౌపచారికమాశ్రయితుం శక్యం, యత్కారణమాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయానంతరేణ గ్రంథేన తదేవోపపాద

---

న్పించుచున్నది, అదియెట్లుగునో వివరించుచున్నాము. "విత్తసాధ్యమగు కర్మచే నమృతత్వముగలుగదు అని" (బృ 4-5-2) మైత్రేయి యాజ్ఞవల్క్యునివలన విని, నాకమృతత్వము సిద్ధింపనిదానిని నేనేమి చేయుదును? అమృతత్వమునుగూర్చి తెలిసినదానిని పూజ్యులగు మీరు నాకు తెలియ చెప్పుడు" అని ఆయననడిగెను. అమృతత్వమును దెలియగోరిన మైత్రేయికి యాజ్ఞవల్క్యు డాత్మవిజ్ఞానము నుపదేశించుచున్నాడు. పరమాత్మవిజ్ఞానముచే దక్క మఱియొకవిధముగ నాత్మవిజ్ఞానము గలుగదని శ్రుతిస్మృతులు బలుకుచున్నవి. ఉపదేశింపబడిన ఆత్మవిజ్ఞానముచేతనే సర్వవిజ్ఞానము గలుగుననియు, పరమకారణవిజ్ఞానమే సర్వవిజ్ఞానమునకు ముఖ్యకారణమనిగూడ తెలియుచున్నది" ఆత్మవిజ్ఞానముచేత సర్వవిజ్ఞానము గలుగునని యాజ్ఞవల్క్యుడు ప్రతిజ్ఞచేసి తరువాత గ్రంథమునందు దానినే

యతి 'బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మవేదే'త్యాదినా. యో హి బ్రహ్మక్షత్రాదికం జగదాత్మనోఽన్యత్ర స్వాతంత్ర్యేణ లబ్ధసద్భావం పశ్యతి తం మిథ్యాదర్శినం తదేవ మిథ్యాదృష్టం బ్రహ్మక్షత్రాదికం జగత్పరాకరోతీతి భేదదృష్టిమపోద్య 'ఇదం సర్వం యదయమాత్మే'తి సర్వస్య వస్తుజాతస్యాత్మావ్యతిరేకమవతారయతి. దుందుభ్యాదిదృష్టాంతైశ్చ (బృ. 4-5-8) తమేవావ్యతిరేకం ద్రఢయతి. 'అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేద' (బృ. 4-5-11) ఇత్యాదినా చ ప్రకృతస్యాత్మనో నామరూపకర్మప్రపంచకారణతాం వ్యాచక్షాణః పరమాత్మానమే

---

యాత్మకంటె వేఱొకచోటబ్రహ్మను దెలిసికొనగోరినవానిని బ్రహ్మము పరిత్యజించునని వివరించెను. బ్రాహ్మణక్షత్రియాదివిభిన్నాత్మకమగు నీజగత్తున కాఆత్మకంటె భిన్నమగు స్వతంత్రకారణమువలన నునికిపట్టులభించినదని తెలిసికొను మిథ్యాజ్ఞానికి మిథ్యాదృష్టము బ్రహ్మక్షత్రాది విభిన్నము నగు జగత్తే శ్రేయోమార్గమునుంచి భ్రంశకారణమగునని పై వాక్యమువలన తెలియుచున్నది. బ్రహ్మక్షత్రాదిభేద దృష్టిని పరిమార్చి "ఇదియతంతయు నాత్మయే" యనువాక్యమున సమస్తవస్తుజాతము ఆత్మకంటె వ్యతిరిక్తముగాదను విషయము ప్రవేశపెట్టబడినది. దుందుభిమొదలగు దృష్టాంతములచే నీ ఆత్మావ్యతిరిక్తత్వమె ధృవపరుపుబడినది. ఋగ్వేదము ఈభూతము యొక్క నిశ్వసితము అను మొదలగువాక్యములయందు ప్రకృతమగు నాత్మయె నామరూపకర్మాత్మకమగు ప్రపంచకారణమని చెప్పుటచే నీపరమాత్మనే బోధిం

మైనం గమయతి. తథైవైకాయనప్రక్రియాయామపి(బృ. 4-5-12) సవిషయస్య సేంద్రియస్య సాంతఃకరణస్య ప్రపంచస్యైకాయన మనంతరతుబాహ్యం కృత్స్నం ప్రజ్ఞానఘనం వ్యాచక్షాణః పర మాత్మానమేవైనం గమయతి, తస్మాత్పరమాత్మన ఏవాయం దర్శనాద్వ్యపదేశ ఇతి గమ్యతే.

యత్పునరుక్తం ప్రియసంసూచనోపక్రమాద్విజ్ఞానా త్మన ఏవాయం దర్శనాద్వ్యపదేశ ఇత్యత్ర బ్రూమః.

## ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః (సూ 20.)

చెను. విషయములు యింద్రియములు అంతఃకరణము మొదలగువానితో గూడుకొనియున్న ప్రపంచమునకంతకు నొకటియె లయస్థానమనియు, అయ్యది బాహ్యాభ్యంతరము లేనిది, సంపూర్ణమగు జ్ఞానస్వరూపముగ నున్నదనియు దెలి పెను. ఇట్లు పరమాత్మయే దెలుపబడుచున్నది. అందువలన ప్రకరణమంతయు పరమాత్మయె ద్రష్టవ్యమని తెలియ జేయుచున్నది. 19

అ॥ ప్రియాదిసూచనతో నుపక్రమణముచేత జీవుడే యిచటనుపదేశింప పడుచున్నాడను ప్రతివాదమున కిటుల సమాధానము చెప్పుచున్నాము.

ప్రతిజ్ఞా సిద్ధేః = బ్రహ్మజ్ఞానమువలన విజ్ఞానము కలు గునను ప్రతిజ్ఞ జీవులయందు సిద్ధముగుటవలన లింగం = జీవులుగూడ నుత్పన్నులగుచున్నారనుటను సూచించు చున్నది యని ఆశ్మరథ్యః = ఆశ్మరథ్యాచార్యుడు తలంచు చున్నారు.

అత్రత్ర ప్రతిజ్ఞా 'ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీదం సర్వం యదయమాత్మే'తి చ తస్యాః ప్రతిజ్ఞాయాస్సిద్ధిం సూచయత్యేతల్లింగం యత్ప్రియసంసూచితస్యాత్మనో ద్రష్టవ్యత్వాదిసంకీర్తనం. యది హి విజ్ఞానాత్మా పరమాత్మనోఽన్యస్స్యాత్, తతః పరమాత్మవిజ్ఞానేఽపి విజ్ఞానాత్మా న విజ్ఞాయత ఇత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం యత్ప్రతిజ్ఞాతం తద్ధీయేత, తస్మాత్ప్రతిజ్ఞాసిద్ధ్యర్థం విజ్ఞానాత్మపరమాత్మనోరభేదాంశేనోపక్రమణమిత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే.

## ఉత్క్రమిష్యతఏవం భావాదిత్యౌడులోమిః

(సూ 21.)

---

"ఆత్మ తెలియబడినదగుచుండగా నిదియంతయు తెలియబడును. ఇదియంతయు నాత్మయె" యని ప్రతిజ్ఞ కలదు. ప్రియశబ్దసూచితమగు నాత్మ ద్రష్టవ్యమని చెప్పుట చేత నీప్రతిజ్ఞాసిద్ధి సూచింపబడుచున్నది. జీవు డాత్మకంటె భిన్నమనయిచో, నాత్మవిజ్ఞానముచేత జీవవిజ్ఞానము లభింపదు. అప్పు డేకవిజ్ఞానముచే సర్వము విజ్ఞాతమగునను ప్రతిజ్ఞకు భంగము కలుగును, అందువలన నీ ప్రతిజ్ఞాసంసిద్ధి కొరకు జీవపరమాత్మల కభేదాంశనుగ్రహించి యిట్లుపక్రమించబడినట్లాశ్మరథ్యుడనునాచార్యుడు దలంచుచున్నాడు.20

ఉత్క్రమిష్యతః = దేహాద్యభిమానము వీడిపోయిన ముక్తజీవుడు ఏవంభావాత్ = బ్రహ్మముకంటె భిన్నుడు గాకుండుటవలన బ్రహ్మవిజ్ఞానప్రతిజ్ఞ సిద్ధమగుచు

విజ్ఞానాత్మన ఏవ దేహేంద్రియమనోబుద్ధిసంఘాతో పాధిసంపర్కాత్కలుషీభూతస్య జ్ఞానధ్యానాదిసాధనానుష్ఠానాత్సం ప్రసన్నస్య దేహాదిసంఘాతాదుత్క్రమిష్యతః పరమాత్మనైక్యోప పత్తేరుపపన్నమిదమభేదేనోపక్రమణమిత్యౌడులోమిరాచార్యో మన్యతే. శ్రుతిశ్చైవం భవతి 'ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్ప ద్యత' ఇతి. (ఛాం. 8-12-3) క్వచిచ్చ జీవాశ్రయమపి నామ రూపం నదీనిదర్శనేన జ్ఞాపయతి, 'యథా నద్యస్స్యందమానా స్సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వా

---

న్నది యని ఔడులోమిః = ఔడులోమ్యాచార్యుడు తలంచు చున్నాడు.

విజ్ఞానాత్మయగు జీవుడు దేహేంద్రియ మనోబుద్ధి సంఘాతరూపమగు నుపాధియొక్క సంపర్కమువలన కాలు ష్యమును బొందుచున్నాడు. జ్ఞానము ధ్యానము మొదలగు ననుష్ఠానముచే ప్రసన్నుడై దేహాదిసంఘాతము నుపాధినుండి యుత్క్రమణమును చేసి పరమాత్మతో నైక్యమగుట సంభవించుచు న్నది. కనుక జీవపరమాత్మల కభేదమును పురస్కరించుకొని ప్రకరణ ముపక్రమింపబడినదని యౌడులోమ్యాచార్యుడు తలంచుచున్నాడు. "సంప్రసాదావస్థనుజెందిన యాజీవు డీశరీరమునుండి లేచి పరంజ్యోతిని బొంది స్వస్వరూపమున భాసించును" (ఛాం 8-12-3) అని శ్రుతి బల్కుచున్నది. "ప్రవహించు నదులు సముద్రమును బ్రవేశించి స్వీయమగు

ఔడులోమి మతము

న్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమితి. (ముండక.3-2-8) యథా లోకే నద్యస్స్వాశ్రయమేవ నామరూపం విహాయ సముద్రముపయంతి ఏవం జీవోఽపి స్వాశ్రియమేవ నామరూపం విహాయ పరం పురుషముపైతీతి హి మంత్రార్థః ప్రతీయతే దృష్టాంతదార్ష్టాంతికయోస్తుల్యతాయై.

---

నామరూపములను గోల్పోవుచున్నవి. అటులనే జ్ఞానిగూడ నామరూపముల విడనాడి తేజోరూపమగు పరాత్పరుని బొందును" (ముండ 3-2-8) అను శ్రుతియందలి నదీదృష్టాంతముచేత జీవుడు నామరూపముల కాశ్రయమని తెలియ వచ్చుచున్నది, లోకమునందు నదులు తమకుగల నామ రూపములను విడనాడి సముద్రమును బొందినట్లే జీవుడుగూడ తననామరూపములను విడనాడి పరమపురుషుని బొందుచు న్నాడను నర్థము దృష్టాంత దార్ష్టాంతికసమన్వయముచే సిద్ధమగుచున్నది.

అ॥ నిప్పుకణికనుండి బయలుదేరు మిణుగురులు అగ్ని స్వభావము గలవగుటవలన అగ్నికంటె భిన్నములుకావు. అగ్నికంటె ప్రత్యేకముగ కాన్పించుటచే భిన్నములగుచు న్నవి. అగ్నికణము లగ్నికంటె భిన్నము అభిన్నముగూడ నగుచున్నవి. జీవుడు బ్రహ్మముకంటె భిన్నుడైన జడూప్రుడు కాకపోవలెను. భిన్నము కాకపోయినచో ఒకరినుండి మరియొకరిని ప్రత్యేకింపలేకపోవుదుము. సర్వజ్ఞుడగు పర మాత్మనుగూర్చి చెప్పుశాస్త్ర మనర్థకము కావలసివచ్చును.

## అవస్థితేరితికాశకృత్స్నః (సూ 22.)

అస్యైవ పరమాత్మనోఽనేనాపి విజ్ఞానాత్మభావేనావస్థానాదుపపన్నమిదమభేదేనోపక్రమణమితి కాశకృత్స్నః

---

జీవబ్రహ్మాము లిరువరకొకవిధమున భేదము, మరియొకవిధమున నభేదమునని చెప్పవలయును. కనుక జీవపరమాత్మైకభేదాంశను గ్రహించి యొకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగునని శ్రుతి యుపక్రమించినదియని యాశ్మరథ్యుని మతము. ఈవాదము భేదాభేదవాదమనబడుచున్నది. జీవుడు పరమాత్మకంటె భిన్నుడు, సంసారగ్రస్తుడు జ్ఞానముచే సంసారముబోయి పరమాత్మతో నైక్యమును బొందును. ముందు రాబోవు నభేదమును పురస్కరించుకొని భేదకాలమునందుగూడ నభేదమును శ్రుతిచెప్పుచున్నదియని యౌడులోమిమతము. ఇది సత్యభేదవాదము. జీవుడత్యంతము భిన్నుడైనచో నతడెల్లపుడును సంసారియే కావలసివచ్చును. ముక్తదశయందతని కభేదము సంప్రాప్తము కాకుండుటచే నీవాదము సమంజసము కాదని తలంచి కాశకృత్స్నాచార్యమతము రాబోవు సూత్రమున పలుకరింపబడుచున్నది. 21

అవస్థితేః ఇతి = జీవబ్రహ్మాలకు బింబ ప్రతిబింబభావముచే నెంతమాత్రము భేదము లేకుండుటవలన ప్రకృత ప్రతిజ్ఞ సిద్ధమగుచున్నది యని కాశకృత్స్నః = కాశకృత్స్నాచార్యుడు తలంచుచున్నాడు.

ఈపరమాత్మయె విజ్ఞానాత్మస్వరూపమున నుండుటచేత జీవబ్రహ్మాల కభేదమాతో ప్రకరణ ముపక్రమింపబడినది.

ఆచార్యో మన్యతే. తథాచ బ్రాహ్మణమ్ 'అనేనజీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' (ఛాం. 6-3-2) ఇత్యేవం జాతీయకం పరస్యైవాత్మనో జీవభావేనావస్థానం దర్శయతి, మంత్రవర్ణశ్చ 'సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా భివదన్యదాస్తే' (తై. బ్రా. 3-12-5) ఇత్యేవంజాతీయకః, న చ తేజఃప్రభృతీనాం సృష్టౌ జీవస్య పృథక్సృష్టిః శ్రుతా యేన పర స్మాదాత్మనోఽన్యస్తద్వికారో జీవస్స్యాత్, కాశకృత్స్నస్యా చార్యస్యావికృతః పరమేశ్వరో జీవో నాన్య ఇతి మతమ్, ఆశ్మ రథ్యస్య తు యద్యపి జీవస్య పరస్మాదనన్యత్వమభిప్రేతం తథాపి

---

యని కాశకృత్స్నాచార్యుడు తలంచుచున్నాడు. "నేనీ జీవ రూపమున బ్రవేశించి నామరూపములనభివ్యక్తము చేయుదునుగాక"

కాశకృత్స్నమతము.

(ఛాం 6-3-2)—ఈజాతికి జెందిన శ్రుతిజాతిమువలన పరమాత్మయె జీవభావమున నుండునట్లు కాన్పించుచున్నది. "ఈశ్వరుడు రూపముల నన్నిటి నేర్పఱచి, వానిని యా నామముల బిలుచుచున్నాడు" (తై బ్రా 3-12-5)—అను నీజాతికి చెందిన మఱికొన్ని శ్రుతులు గలవు. అగ్ని మొదలగువానిని పలుకరించిన సృష్టిప్రకరణమునందు జీవసృష్టినిగూర్చి ప్రత్యేకముగ వివవచ్చుటలేదు. అటులవినవచ్చిన జీవుడాత్మకంటె నన్యుడనియు అతని వికారమనియు గ్రహించవచ్చును. వికారము చెందని పరమేశ్వరుడే జీవుడు, మరియొకడుగాడని కాశకృత్స్నాచార్యుని మతము. పరమాత్మకంటె జీవుడన్యుడు గాడని యాశ్మరథ్యుడు దలంచినను, ఏకవిజ్ఞానముచే సర్వ

ప్రతిజ్ఞాసిద్ధేరితి సాపేక్షత్వాభిధానాత్కార్య కారణభావః క్రియాన
వ్యభిప్రేత ఇతి గమ్యతే, ఔడులోమిపక్షే పునస్స్పష్టమేవావ
స్థాంతరాపేక్షౌ భేదా గమ్యేతే, తత్ర కాశకృత్స్నీయం మతం
శ్రుత్యనుసారీతి గమ్యతే ప్రతిపిపాదయిషితార్థానుసారాత్తత్త్వమసీ
త్యాది శ్రుతిభ్యః, ఏవం చ సతి తజ్జ్ఞానాదమృతత్వమవకల్పతే,
వికారాత్మకత్వే హి జీవస్యాభ్యుపగమ్యమానే వికారస్య ప్రకృతి
సంబంధే ప్రళయప్రసంగాన్న తజ్జ్ఞానాదమృతత్వమవకల్పేత,

---

విజ్ఞానము తటస్థించుచున్నదను ప్రతిజ్ఞానుసారముగ వార
లిద్దరికి నేస్వల్పముగానయినను కార్యకారణభావము నంగీక
రించినట్లు దెలియుచున్నది. వారుభయులకును బంధముక్తావస్థ
లను బట్టి భేదము అభేదమునుగూడ నౌడులోమ్యాచార్యు
డంగీకరించుచున్నాడు. ఈమూడుమతములలో కాశకృత్స్నా
చార్యమతము శ్రుతిసమ్మతముగ కాన్పించుచున్నది. ఆపా
తము "తత్త్వమసి" (ఛాం 6-8-2) అను మొదలగు
శ్రుతులచే నుపదిష్టమగు జీవబ్రహ్మముల కభేదము ననుస
రించుచున్నది. జీవబ్రహ్మముల కభేదము సిద్ధమగుచుండగా
నట్టిజ్ఞానముచే నమృతత్త్వము సాధ్యమగుచున్నది. ['జ్ఞానా
దేవతు కైవల్యం'— జ్ఞానముచేత నే కైవల్యము సంప్రాప్తమగు
చున్నది. యను శ్రుతి బలమువలన కైవల్యమునకు జ్ఞానము
దక్క మార్గాంతరములేదు]. జీవుడు ఆత్మయొక్క వికార
స్వరూపుడని యంగీకరించినచో, తనకారణమునందు తాను
లయమును బొందును, అట్టిజీవుని జ్ఞానముచే నమృతత్త్వము

అతశ్చ స్వాశ్రయస్య నామరూపస్యాసంభవాదుపాధ్యాశ్రయం నామరూపం జీవ ఉపచర్యతే, అత ఏవోత్పత్తిరపి జీవస్యాగ్నేరి దగ్నివిస్ఫులింగోదాహరణేన శ్రావ్యమాణోపాధ్యాశ్రయైవేతి వేదితవ్యా

యదప్యుక్తం ప్రకృతస్యైవ మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యస్సముత్థానం విజ్ఞానాత్మభావేన దర్శయన్విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యత్వం దర్శయతీతి, తత్రాపీయమేవ త్రిసూత్రీ యోజయితవ్యా. 'ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః' ఇద

---

సిద్ధింపనేరదు. జీవఆత్మల కెంతమాత్రము భేదము లేదు గనుకనే [నదీదృష్టాంతముచే నిరూపింపబడిన] నామరూపములు నిజముగా జీవుని యాశ్రయించుట సంభవముగాదు. అవి యుపాధి నాశ్రయించి జీవునియం దారోపింపబడుచున్నవి. ఈకారణముచేతనే అగ్నివిస్ఫులింగదృష్టాంతబలముచే నుపపాదింపడిన యాశ్మరథ్యాచార్యమతముగు జీవబ్రహ్మల భేదాభేదముగూడ, ననగా బ్రహ్మమునుండి జీవుడుత్పన్నుడగుచున్నాడను వాదమునకుగూడ నుపాధియె యాధారమని దెలిసికొనవలెను.

ప్రకృతముగు జీవుడే ద్రష్టవ్యుడైనట్టియు మహాభూతములనుండి యుత్థానమైనట్టియు మహాభూతముగ ప్రదర్శింపబడినాడను పూర్వపక్షముయొక్క రెండవవాదముగూడ నీసూత్రత్రయముచేతనే పరిహరింప దగును. 'ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః—' అను నిరువదియవ సూత్రమునందుదా

మత్ర ప్రతిజ్ఞాతమ్—'ఆత్మని విదితే సర్వమిదం విదితం భవ తీదం సర్వం యదయమాత్మే' (బృ. 2-4-6) తి చ, ఉపపాదితం చ సర్వస్య నామరూపకర్మప్రపంచస్యైకప్రసవత్వా దేకప్రళయత్వాచ్చ దుందుభ్యాదిదృష్టాంతైశ్చ కార్యకారణయోరవ్యతిరేక ప్రతిపాదనాత్, తస్యా ఏవ ప్రతిజ్ఞాయాస్సిద్ధిం సూచయత్యేతల్లింగం యన్మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యస్సముత్థానం విజ్ఞానాత్మభావేన కథితమిత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే అభేదే హి సత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాతమవకల్పత ఇతి,

---

హరింపబడిన ప్రతిజ్ఞ "ఆత్మ దెలియబడినదగును. ఇది యంతయు నాయాత్మయే' (బృ 2-4-6) అను నీ రెండువాక్యములయం దుదాహరింపబడినది. ఈ యేకవిజ్ఞానప్రతిజ్ఞా విషయము నామరూపకర్మాత్మకమగు నీ ప్రపంచమంతయు నొక కారణమునుండియె యుత్పన్నమై యచటనే లయమునొందుటచేతను, దుందుభి మొదలగు దృష్టాంతములచేత కార్యకారణములకు భేదము లేదని నిర్ధారణచేయబడుటచేతను ధ్రువపరుపబడినది. ఈ భూతములనుండి జీవుడను మహాభూత ముత్థానమగుచున్నాడని శ్రుతిపల్కుటచే నీ ప్రతిజ్ఞ సంసిద్ధమైనట్లాశ్మరథ్యాచార్యుడు తలంచుచున్నాడు, జీవుడు ఆత్మయు నభిన్నులయినపు డొకనిని దెలిసికొనినపుడు, సమస్తము దెలియబడినదగుటచే నేకవిజ్ఞాన ప్రతిజ్ఞ నెరవేరుచున్నది.

ఆశ్మరథ్య మత సమన్వయము.

'ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః' ఉత్క్రమిష్యతో విజ్ఞానాత్మనో జ్ఞానధ్యానాదిసామర్థ్యాత్సంప్రసన్నస్య పరేణాత్మనైక్య సంభవాదిదమభేదాభిధాన మిత్యౌడులోమిరాచార్యో మన్యతే.

'అవస్థితేరితి కాశకృత్స్నః' అస్యైవ పరమాత్మనోఽనేనాపి విజ్ఞానాత్మభావేనావస్థానాదుపపన్న మిదమభేదాభిధానమితి కాశకృత్స్న ఆచార్యో మన్యతే.

పూ.పక్షీ: ననూచ్ఛేదాభిధానమేతత్ ఏతేభ్యో భూతేభ్యస్సము

---

"ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః" యను యిరువదియొక సూత్రమిట్లు ప్రతిజ్ఞాసంసిద్ధిని చేయుచున్నది.

ఔడులోమి మతసమన్వయము.

ఈ శరీరమునుండి యుత్క్రమణము చేయు జీవుడు జ్ఞానము ధ్యానము మొదలగువాని సామర్థ్యముచేత ప్రసన్నుడై పరమాత్మతో నైక్యమునొందుట సంభవమగుటవలన, నుభయులకు నభేద ముదాహరించుటచే ప్రతిజ్ఞ సిద్ధించుచున్నదియని యౌడులోమ్యాచార్యుడు తలంచుచున్నాడు.

"అవస్థితేరితికాశకృత్స్నః" అను ప్రకృతసూత్రము నందేకవిజ్ఞానప్రతిజ్ఞ యిటుల సమర్థింపబడుచున్నది.

కాశకృత్స్నమత సమన్వయము

ఈపరమాత్మయే జీవాత్మభావమున నుండుటవలన, యిద్దరికి నభేదము చెప్పుట సమంజసమేయని కాశకృత్స్నాచార్యుడు తలంచుచున్నాడు.

పూ.పక్షి: 'జీవుడను నీమహాభూత మీభూతములనుండి

త్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తీ'తి కథమేతద భేదాభిధానమ్.

సిద్ధాంతీ: నైష దోషః, విశేషవిజ్ఞానవినాశాభిప్రాయమేతద్వినాశాభిధానం నాత్మోచ్ఛేదాభిప్రాయమ్ 'అత్రైవ మాభగవానమూముహన్న ప్రేత్య సంజ్ఞాస్తీ' (బృ. 2-4-12) తి పర్యనుయుజ్య స్వయమేవ శ్రుత్యాఽర్థాంతరస్య దర్శితత్వాత్ 'న వా అరేఽహం మోహం బ్రవీమ్యవినాశీ వా 'అరేఽయమాత్మానుచ్ఛిత్తిధర్మా మాత్రాసంసర్గస్త్వస్య భవతీ'తి, ఏతదుక్తం భవతి—కూటస్థ

---

యుత్థానమునొంది తిరిగి వానియందే నశించుచున్నది. అపుడాతని జ్ఞానమే లేకపోవుచున్నది'(బృ 2-4-12)అని శ్రుతిపల్కుచున్నది. ఇచట జీవునియొక్క నాశనము వినవచ్చుచున్నది గాని వారిరువురకభేదము వినవచ్చుటలేదుగదా?

సిద్ధాంతి : ఇది యొకలోపము కాదు. అచట వినవచ్చుచున్న నాశనముచే జీవునియొక్క విశేషలక్షణములు నశించుచున్నవని చెప్పబడుచున్నదిగాని యాత్మ నశించునని చెప్పబడుటలేదు. "మృతినొందినతరువాత జీవునివిషయమగు జ్ఞానమే లేదనుచున్నాడు. జ్ఞానస్వరూపుడగు నాత్మనుగూర్చి జ్ఞానమెట్లు లేకపోవును?] ఈవిషయమున పూజ్యులగు మీరు నన్ను మోహపుచ్చుచున్నారు" అను మైత్రేయివాక్యమును బురస్కరించుకొని శ్రుతియే ఆవాక్యముయొక్క అర్థమునిట్లు వివరించుచున్నది. "ప్రియురాలవగు నిన్ను నేను మోహపెట్టుటలేదు. ఈయాత్మకు నాశనహేతువు లేదు. కనుక నది నశింపదు. కాని యింద్రియాదిసంసర్గము మాత్రము నశిం

నిత్య ఏవాయం విజ్ఞానఘన ఆత్మా. నాస్యోచ్ఛేదప్రసంగోఽస్తి, మాత్రాభిస్త్వస్య భూతేంద్రియలక్షణాభిరవిద్యాకృతాభిరసంసర్గో విద్యయా భవతి, సంసర్గాభావే చ తత్కృతస్య విశేషవిజ్ఞానస్యాభావాన్న ప్రేత్య సంజ్ఞాస్తీత్యుక్తమితి.

యదప్యుక్తం 'విజ్ఞాతారమరే కేన విజానీయా' దితి కర్తృవచనేన శబ్దేనోపసంహారాద్విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యమితి, తదపి కాశకృత్స్నీయేనైవ దర్శనేన పరిహరణీయం.

---

చును" దీనితాత్పర్యమేమున, ఈయాత్మ యగసాలిదిమ్మ వలె మార్పులేనివాఁడు, నిత్యుఁడు, అంతటను విజ్ఞానస్వరూపుఁడు; అతనికి నాశప్రసంగము లేదు. అవిద్యచే నతనికి భూతములతోను, యింద్రియములతోను సంసర్గమేర్పడుచున్నది. జ్ఞానముచే నాసంసర్గ నాశనముగుచున్నది. ఇంద్రియసంసర్గము నాశనమైనపుడద్దానివలన గలిగిన విశేషములగు జీవలక్షణములుగూడ నశించును. అపుడు మరణానంతరము జీవలక్షణములు తెలియబడవని శ్రుతియందు చెప్పబడుచున్నది.

విజ్ఞాతను దేనివలన దెలిసికొనదగును? అను శ్రుతి వాక్యమునందు వినబడుచున్న కర్తృత్వమును దెలియచేయు విజ్ఞానశబ్దముచేత మైత్రేయీ యుపదేశ ముపసంహరింపబడుటవలన విజ్ఞానాత్మ అనగా జీవాత్మయే ద్రష్టవ్యుడుగ శ్రుతియందు వినవచ్చుచున్నది యనుపూర్వవాదియొక్క మూడవయాక్షేపణ కాశకృత్స్నాభిప్రాయానుసారముగ

అపిచ 'యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి' (బృ. 2-4-13) త్యారభ్యావిద్యావిషయే తస్యైవ దర్శనాదిలక్షణం విశేషవిజ్ఞానం ప్రపంచ్య 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యే' దిత్యాదినా విద్యావిషయే తస్యైవ దర్శనాది లక్షణస్య విశేషజ్ఞానస్యాభావమభిదధాతి, పునశ్చ విషయా భావేఽప్యాత్మానం విజానీయాదిత్యాశంక్య 'విజ్ఞాతారమరే కేన విజానీయా' దిత్యాహ, తతశ్చవిశేషవిజ్ఞానాభావోపపాదనపర త్వాద్వాక్యస్య విజ్ఞానధాతురేవ కేవలస్సన్ భూతపూర్వగత్యా కర్తృవచనేన తృచా నిర్దిష్ట ఇతిగమ్యతే, దర్శితం తు పురస్తా

---

పరిహరించతగియున్నది. "ఎచటనైతే ద్వైతమున్నట్లు కాన్పించుచున్నదో నచటనెల్ల నొకడు మరియొకనిని చూచును" (బృ 2-4-14) అను మొదలగు వాక్యములయందలి ద్రష్టవ్యుడగు జీవుని వ్యాకృతములగు విశేష లక్షణములు విస్తరింపబడినవి. తరువాత "నెచటనైతే సర్వ మాత్మయే యయినపుడెవడు దేనిని దేనిచేత చూడగలడు?" అను మొదలగువాక్యములయందు విద్యచే ద్రష్టవ్యుడగు నత నికే జీవుని విశేషలక్షణముల లేమియు వివరింపబడినది. అటుతరువాత ఆత్మ ఆత్మనే చూడగూడదా యను నాశంక కలుగునేమోయను సందేహమును వారించుటకై "విజ్ఞాత నేవిధమున జూడగల్గును?" అని యాజ్ఞవల్క్యుడు బల్కెను. ఈవాక్యమునందు విశేషవిజ్ఞానముయొక్క లేమి చెప్పబడు టచే కేవలజ్ఞానస్వరూపమగు నాత్మయే విజ్ఞానశబ్దముచేత నిర్దేశింపబడుచున్నట్లు తెలియవగుచు. కాశకృత్స్నాచార్య

త్కాశకృత్స్నయస్య మతస్య శ్రుతిమత్త్వమ్. అతశ్చ విజ్ఞానాత్పరమాత్మనోరవిద్యాప్రత్యుపస్థాపితనామరూపరచితదేహాద్యుపాధినిమిత్తో భేదో న పారమార్థిక ఇత్యేషోఽర్థస్సర్వైర్వేదాంతవాదిభిరభ్యుపగంతవ్యః. ఇదం 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం (ఛాం. 6-2-1) ఆత్మైవేదం సర్వం (ఛాం. 7-15-1) బ్రహ్మైవేదం సర్వం (ముండక. 2-2-11) యదయమాత్మా (బృ. 2-4-6) నాన్యోఽతోఽస్తి ద్రష్టా (బృ. 3-5-23) నాన్యోఽతోఽస్తి శ్రోతే' త్యేవమాదిభ్యశ్శ్రుతిభ్యః స్మృతిభ్యశ్చ 'వాసుదేవస్సర్వమిదం, (గీ. 7-19) క్షేత్రజ్ఞం చాపి

---

మతము శ్రుతిసమ్మతమని యింతకుపూర్వమే చూపబడినది. అందువలన జీవునికిని ఆత్మకును గలభేద మజ్ఞానకృతమగు నామరూపములచే కృతములగు దేహాద్యుపాధులవలన సంప్రాప్తమైనదిగాని పరమార్థముకాదను నీవిషయము వేదాంతవాదులందరు నంగీకరింపవలసియున్నది. "సృష్టికి పూర్వము సత్పదార్థమొక్కటియే యుండెను. అది యేకమేవాద్వితీయము" (ఛాం 6-2-1), పరిదృశ్యమానమగు నీజగత్తంతయు నాత్మయే" (ఛాం 7-15-1). "ఇదియంతయు బ్రహ్మమే" (ముండ 2-2-11) "ఇదియంతయు నేదిగలదో యదియంతయు నాత్మయే" (బృ 2-4-6) "ఇతనికంటె జూచువాడు మఱియొక డెవరును లేడు" (బృ 3-5-23) "ఇతని చూచునది అతడుదక్క మరియొకటి లేదు" (బృ 3-8-11) మొదలగు శ్రుతులన్నియు నీయర్థమునే ప్రదర్శించుచున్నవి. "వాసుదేవుడే సర్వమునై యున్నాడు" (గీ 7-19) క్షేత్రి

మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత (గీ. 13-2) సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వర' మిత్యేవంరూపాభ్యః, భేదదర్శనాపవాదాచ్చ 'అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేదయథా పశుః (బృ. 1-4-10) మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవపశ్యతీ' (బృ. 4-4-19) త్యేవంజాతీయకాత్, 'స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమృతోఽభయో బ్రహ్మే'తి(బృ.4-4-25) చాత్మని సర్వవిక్రియాప్రతిషేధాత్, అన్యథా చ ముముక్షూణాం నిరపవాదవిజ్ఞానానుపపత్తేః, సునిశ్చితార్థత్వానుపపత్తేశ్చ, నిరప

---

ములన్నిటియందును నుండుక్షేత్రజ్ఞుడు నేనేయని దెలిసికొనుము". (గీ 13-2) "అన్నిభూతములయందు పరమేశ్వరుడు సమానముగ నున్నాడు" (గీ 13-17) అను మొదలగు గీతావాక్యములుగూడ నీయర్థమునే బల్కుచున్నవి. "ఈతడు వేరు, నేను వేరు అని తలంచువాడు యథార్థమును దెలిసికొనలేదు" (బృ 1-4-10) "ఎవ్వడిచట యనేకత్వమును గ్రహించుచున్నాడో యాతడు మృత్యుపరంపరకు లోనగును" (బృ 4-4-19) అను మొదలగు భేదమును నిరాకరించు వాక్యములుగూడ నీయర్థమునే తెలిజేయుచున్నవి. "ఈయాత్మ మహాంతము, జన్మలేనిది, క్షయము లేనిది, మృత్యువులేనిది, అమృతము, భయము లేనిది, అదియే బ్రహ్మము" (బృహ 4-4-25) అని యాత్మయందు సర్వవికారములు నిషేధింపబడుచున్నవి. జీవబ్రహ్మల కభేదమే నిశ్చితార్థము కానియెడల, ముముక్షువులకు నిర్వివాదమగు నాత్మజ్ఞానము కుదరదు. సునిశ్చితమగు విషయము

వాదం హి విజ్ఞానం సర్వాకాంక్షానివర్తకమాత్మవిషయ మిష్యతే 'వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా' (ముండక. 3-2-6) ఇతి చ శ్రుతేః 'తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః' (ఈశ.4-7) ఇతి చ స్థితప్రజ్ఞలక్షణస్మృతేశ్చ (గీ. 2-54)

స్థితే చ క్షేత్రజ్ఞపరమాత్మైకత్వవిషయే సమ్యగ్దర్శనే క్షేత్రజ్ఞః పరమాత్మేతినామమాత్రభేదాత్ క్షేత్రజ్ఞోఽయం పరమాత్మనో భిన్నః పరమాత్మాఽయం క్షేత్రజ్ఞాద్భిన్న ఇత్యేవంజాతీయక ఆత్మభేదవిషయోఽయం నిర్బంధో నిరర్థకః. ఏకో హ్యయమాత్మా నామమాత్రభేదేన బహుధాభిధీయత ఇతి, నహి 'సత్యం

---

సంభవముకాదు. నిర్వివాదము, సర్వసందేహనివారకము నగునాత్మజ్ఞానము నందఱు గోరుదురు. "వేదాంతవిజ్ఞానముచే సునిశ్చితమగు ప్రయోజనము గలవారు" అని (ముండ 3-2-6) శ్రుతి పల్కుచున్నది. "ఏకత్వమును గ్రహించినవానికి మోహమెక్కడ? శోకమెక్కడ?" (ఈశ 7) అని మరియొక శ్రుతిగలదు. గీత 2-54 శ్లోకమునందు స్థితప్రజ్ఞునిలక్షణము వర్ణింపబడినది.

జీవుడు, పరమాత్మ యనుభేదము నామమాత్రముగుట వలనను, జీవపరమాత్మలయొక్క యేకత్వమే లెస్సయగు జ్ఞానముగుటచేతను, ఈతడు జీవుడు పరమాత్మకంటె భిన్నుడు. ఈతడు పరమాత్మ, జీవునికంటెభిన్నుడు, అను జీవాత్మల భేదముగూర్చి నిర్బంధము చేయుట నిరర్థకము. ఆత్మయొకడే నామమాత్రభేదముచే ననేకముగ వాడబడుచున్నాడు. 'సత్యా

జ్ఞానమనంతం బ్రహ్మ యో వేద నిహితం గుహాయా' (తై. 2-1) మితి కాంచిదేవైకాం గుహామధికృత్యైతదుక్తం, న చ బ్రహ్మణోఽన్యో గుహాయాం నిహితోఽస్తి 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశ' (తై. 2-6) దితి స్రష్టురేవ ప్రవేశ శ్రవణాత్, యే తు నిర్బంధం కుర్వంతి తే వేదాంతార్థం బాధమానాః శ్రేయోద్వారం సమ్యగ్దర్శన మేవ బాధంతే కృతకమనిత్యం చ మోక్షం కల్పయంతి న్యాయేన చ న సంగచ్ఛంత ఇతి. ఇతి షష్ఠాధికరణమ్.

---

జ్ఞానానంత స్వరూపమగు బ్రహ్మమును బుద్ధిగుహాలో నున్నదానిగా తెలిసికొనినవాడు' (తై 2—1) అను తైత్తిరీయ వాక్యమునందలి బుద్ధిగుహా జీవునిగుహాకంటె భిన్నమగు మరియొకగుహను చెప్పుటలేదు. "దానిని సృజియించి తానే దానిని ప్రవేశించెను." (తై 2-6) అను వాక్యమువలన బ్రహ్మముకంటె మరియొకడు బుద్ధిగుహాయందున్నట్లు తెలియుటలేదు. జీవాత్మలకు భేదమును గలదని నిర్బంధముచేయువారు వేదాంతార్థమునకు బాధను కల్పించుచున్నారు. శ్రేయస్సునకు కారణమగు సమ్యక్ జ్ఞానమునకు బాధను తెచ్చిపెట్టుచున్నారు. మోక్షము క్రియాకల్పితము అనిత్యము నయినదానిగ జేయుచున్నారు. మోక్షము కల్పితమైనను నిత్యమనువారు సరియగు హేతువాదమును గుర్తెరుగని వారగుచున్నారు.

<u>అధికరణ సంక్షేపార్థము :</u> ఆత్మా వా అరే ద్రష్టవ్యః యను యాజ్ఞవల్క్యోపదేశ వాక్యమునందలి యాత్మశబ్దము జీవపరమా, లేక పరమాత్మపరమా? యని సందేహము

ఉపక్రమమున ద్రష్టవ్యుడు భోక్తగాను మధ్యన విశేషవిజ్ఞానోపేతుడుగాను సముత్థితుడుగాను, ఉపసంహారమునందు విజ్ఞానకర్తగాను వినవచ్చుటచేత నతడు జీవుడగుచున్నాడని పూర్వపక్షము. ద్రష్టవ్యుడు పరమాత్మయని సిద్ధాంతము. ప్రకరణమాత్మవిజ్ఞాన ప్రకరణము. అది పరమాత్మజ్ఞానముచేతను మాత్రమేసిద్ధించును. యాజ్ఞవల్క్యుడు పరమాత్మను గూర్చియె యుపదేశించెను. జీవబ్రహ్మల కభేదాంశను గ్రహించి యిచట జీవుడు ద్రష్టవ్యుడని ఆశ్మరథ్యుడు, మోక్షదశయందు వారలిరువురికి నభేదనమును పాటించి ద్రష్టవ్యశబ్దమున కర్థకల్పనము చేయవలయునని యౌడులోమియు జీవబ్రహ్మలొకరయినను యవస్థాభేదమునుబట్టి విభిన్ననామములు గలుగుచున్నవని కాశకృత్స్నుడును తలంచుచున్నారు, కాశకృత్స్నమతము శ్రుతిసమ్మతము. 22

## (7) ప్రకృత్యధికరణము

అ॥ ఏకవిజ్ఞానప్రతిజ్ఞా బలముచేత మైత్రేయిబ్రాహ్మణమంతయు బ్రహ్మపరమని నిర్ధారణము చేయబడినది. ఆప్రకరణమునుబట్టియే బ్రహ్మము జగత్తున కుపాదానకారణమగుచున్నదియని తరువాత అధికరణమున సాధింపబడుచున్నది.

విషయము : బ్రహ్మముయొక్క జగత్కారణత్వము.

సంశయము : బ్రహ్మమునిమిత్తకారణము మాత్రమా? లేక ఉపాదానకారణముగూడనా?

ప్రకృతిశ్చప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్ (సూ 23.)

యథాభ్యుదయహేతుత్వాద్ధర్మో జిజ్ఞాస్య ఏవం నిశ్శ్రే

పూర్వవాది : నిమిత్తకారణము మాత్రము

సిద్ధాంతి : ఉపాదానకారణముగూడ.

ఆవలోకనీయములగు (ప్రమాణవాక్యములు = ప్ర 6-3-6-4 శ్వేత 6-19, ఛాం 6-1-2, 6-1-4-8-6, ముండ 1-1-7, బృ 4-5-6-8, ఛాం 1-9-1, తై 2-7, తై 2-6, ముండ 1-1-6-7 బ్ర సూ 1-1-5)

బ్రహ్మము జగత్తునకు ప్రకృతిః = ఉపదానకారణము, చ = నిమిత్తకారణముగూడ నగుచున్నది. ప్రతిజ్ఞాదృష్టాన్త అనుపరోధాత్ = ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము గలుగు నను ప్రతిజ్ఞకును మృత్తికాదృష్టాంతమునకును విరుద్ధము లేకుండుటవలన॥

అభ్యుదయహేతువగుటవలన ధర్మము జిజ్ఞాస్యమైనట్లే నిఃశ్రేయసహేతువగుటవలన బ్రహ్మము జిజ్ఞాస్యమని చెప్ప బడినది. [వేదముచే చోదనజేయబడిన కర్మాచరణము ధర్మము. దానివలన స్వర్గాదిఫలములు ప్రాప్తిగాబుట్టు చున్నవి. అందువలన నవి అభ్యుదయములని చెప్పబడు చున్నవి. బ్రహ్మ మత్యుత్తమతమ ఫలముగనుక నది నిఃశ్రేయ స్సనబడుచున్నది. బ్రహ్మము నితరాం = అత్యుత్త మమగు శ్రేయస్సు = శుభముగనుక నిఃశ్రేయస్సని పిలువ

యసహేతుత్వాద్బ్రహ్మాపి జిజ్ఞాస్యమిత్యుక్తం. బ్రహ్మ చ 'జన్మాద్యస్య యతః' (బ్ర.సూ. 1-1-2) ఇతి లక్షితమ్, తచ్చ లక్షణం ఘటరుచకాదీనాం మృత్సువర్ణాదివత్ప్రకృతిత్వే కులాలసువర్ణకారాదివన్నిమిత్తత్వే చ సమానమిత్యతో భవతి విమర్శః, కిమాత్మకం పునర్బ్రహ్మణః కారణత్వం స్యాదితి.

పూ. పక్షః తత్ర నిమిత్తకారణమేవ తావత్కేవలం స్యాదితి ప్రతిభాతి, కస్మాత్, ఈక్షాపూర్వకకర్తృత్వశ్రవణాత్, ఈక్షాపూర్వకం హి బ్రహ్మణః కర్తృత్వమవగమ్యతే 'స ఈక్షాం చక్రే (ప్ర. 6-3) స ప్రాణమసృజత'(ప్ర. 6-4) ఇత్యాదిశ్రుతిభ్యః, ఈక్ష

---

బడుచున్నది. అనగా బ్రహ్మముకంటె శ్రేయస్తరమగునది మరియొకటి లేదని తాత్పర్యము]. దేనివలన నీజగత్తునకు జన్మాదులు గలుగుచున్నవో అదిబ్రహ్మమని బ్రహ్మలక్షణము (1–1–2) నిరూపింపబడినది. ఈలక్షణము ఘటము ఆభరణములు మొదలగువానికి మృత్తుసువర్ణములు మొదలగునుపాదానకారణపక్షమునను, కులాలుడు సువర్ణకారుడు మొదలగు నిమిత్తకారణమునందుగూడ సమన్వయమగుట వలన బ్రహ్మముయొక్క జగత్కారణత్వ స్వరూపమెట్టి దను విషయము విమర్శనీయమగుచున్నది.

బ్రహ్మము జగత్తునకు కేవలనిమిత్తకారణము మాత్రమగుచున్నటుల కాన్పించుచున్నది. ఏలనన! ఆలోచనాపూర్వకమగు జగత్కర్తృత్వము వినబడుచుండుటవలన! "అతడాలోచించెను" (ప్రశ్న 6–3) "అతడు ప్రాణమును సృజియించెను" (ప్ర 6–4) అను మొదలగు శ్రుతులవలన

పూర్వకం చ కర్తృత్వం నిమిత్తకారణేష్వేవ కులాలాదిషు దృష్టం, అనేకకారకపూర్వికా చ క్రియాఫలసిద్ధిర్లోకే దృష్టా, స చ న్యాయ ఆదికర్తర్యపి యుక్తస్సంక్రామయితుమ్, ఈశ్వరత్వప్రసిద్ధేశ్చ ఈశ్వరాణాం హి రాజవైవస్వతాదీనాం నిమిత్తకారణత్వమేవ కేవలం ప్రతీయతే, తద్వత్పరమేశ్వరస్యాపి నిమిత్తకారణత్వమేవ యుక్తం ప్రతిపత్తుమ్, కార్యం చేదం జగత్సావయవమచేతనమశుద్ధం చ దృశ్యతే, కారణేనాపి తస్య తాదృశేనైవ భవితవ్యం, కార్యకారణయోస్సారూప్యదర్శనాద్బ్రహ్మ

---

బ్రహ్మము ముందుగ నాలోచించి తరువాతజగత్తును సృష్టించినట్లు తెలియవచ్చుచున్నది. ఆలోచనాపూర్వకమగు కర్తృత్వము నిమిత్తకారణమగు కులాలాదులయందు కాన్పించుచున్నది. పూర్వగతములగు ననేకకారణములచేత క్రియాఫలములు సిద్ధించుట లోకమునందు కాన్పించుచున్నది, ఈన్యాయము లోకమున కాదికర్తయగు బ్రహ్మమునందు గూడ వర్తించుట యుక్తము. (2) బ్రహ్మ ఈశ్వరుడనిగూడ ప్రసిద్ధిని జెందియున్నాడు. రాజులు వైవస్వతుడు మొదలగు ప్రభువులయందుగూడ నిమిత్తకారణమే కాన్పించుచున్నది. ఆరీతిగనే పరమేశ్వరునికిగూడ జగత్తునకు నిమిత్తకారణత్వమును జెప్పుటయుక్తము. (3) మరియు కార్యరూపమగు నీజగత్తు భాగములతోగూడుకొనియున్నది; అచేతనము; అశుద్ధము నగుచున్నది. అట్టికార్యముయొక్క కారణము గూడ తదనురూపముగ నుండవలయును. కార్యకారణముల యందు సమానమగు పోలిక కాన్పించుచున్నది. బ్రహ్మము

చానేవంలక్షణమవగమ్యతే, 'నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజన' (శ్వే. 6-19) మిత్యాదిశ్రుతిభ్యః, పారిశే ష్యాదబ్రహ్మణోఽన్యదుపాదానకారణమశుద్ధ్యాదిగుణకం స్మృతి ప్రసిద్ధ మభ్యుపగంతవ్యమ్, బ్రహ్మకారణత్వశ్రుతేర్నిమిత్తత్వ మాత్రే పర్యవసానాదితి.

---

నకిట్టి లక్షణములు గానరావు. "బ్రహ్మమున కవయవములు లేవు. క్రియావిహీనము శాంతము, దోషములులేనిది, చీకటి లేనిది యని (శ్వేత 6-19) శ్రుతి పల్కుచున్నది. (4) కనుక బ్రహ్మముతో పాటు దానికి భిన్నమగునది. అశుద్ధత్వము అచేతనత్వము మొదలగుగుణములుగల యొకయుపాదాన కారణము స్మృతిప్రసిద్ధముగ నుండితీరవలయునని యంగీక రించవలయును. శ్రుతియందు పలుకరింపబడిన బ్రహ్మకార ణత్వము నిమిత్తకారణమని పర్యవసానము తేలుచున్నది. [అనగా బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణము మాత్ర మగును. ఉపాదానకారణము కానేరదు. ఉపాదానకారణగుణ ములు కార్యమునందు సంక్రమించుట అనుభవసిద్ధము. కార్యమగు జగత్తు అచేతనము, అశుద్ధము. కనుక నద్దాని యుపాదానకారణముగూడ నశుద్ధము అచేతము కావల యును. బ్రహ్మము శుద్ధము అచేతనము కాదుగనుక జగత్తున కుపాదానకారణము కానేరదు. ఉపాదానకారణము మరి యొకటి కావలెను. కనుక మిగిలియున్న నిమిత్తకారణము మాత్రమే బ్రహ్మము కావలయును అని భావము.]

సిద్ధాంతీ: ఏవం ప్రాప్తే బ్రూమః—ప్రకృతిశ్చ ఉపాదానకారణం చ బ్రహ్మాభ్యుపగంతవ్యం నిమిత్తకారణం చ, న కేవలం నిమిత్తకారణమేవ, కస్మాత్, ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్, ఏవం హి ప్రతిజ్ఞాదృష్టాంతౌ శ్రౌతౌ నోపరుధ్యేతే, ప్రతిజ్ఞా తావత్ 'ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాత' (ఛాం. 6-1-2) మితి, తత్ర చైకేన విజ్ఞాతేన

---

సిద్ధాంతి : ఇటుల సంప్రాప్తమైన పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాము. బ్రహ్మము జగత్తునకు ప్రకృతి అనగా నుపాదానకారణము నిమిత్తకారణముగూడ నగుచున్నదని యంగీకరింపతగును. ఆతఁడొక నిమిత్తకారణము మాత్రముకాదు. ఏలనన! (1)

బ్రహ్మ ముఖ్య కారణము కానిచో ప్రతిజ్ఞాభంగమగును.

ఇట్లనుట ప్రతిజ్ఞకును దృష్టాంతమునకును విరుద్ధముకాదు' శ్రుతియం దుదాహృతములగు ప్రతిజ్ఞాదృష్టాంతములు రెండు నీవిధముగ విరుద్ధములు కాకున్నవి. "దేనిని వినుటచేత వినబడనదంతయు వినబడిన దగుచున్నదో, దేనిని యూహించుటచేత నూహింపబడనదంతయు నూహింపబడినదే యగుచున్నదో, దేనిని తెలిసికొనుటచేత దెలియబడనిదంతయు దెలియబడినదగుచున్నదో యట్టియాదేశమును నీగురువును నీవడిగితివా" (ఛాం 6-1-2) అనుఛాందోగ్యశ్రుతియందు ప్రతిజ్ఞ దెలియవచ్చుచున్నవి. ఏది దెలిసిన, దెలియబడనిది యంతయు దెలియ బడినదగుచున్నదియో అటువంటి వస్తువొకటి యున్నటుల నావాక్యమువలన దెలియ

సర్వమన్యదవిజ్ఞాతమపి విజ్ఞాతం భవతీతి ప్రతీయతే, తచ్చోపాదానకారణవిజ్ఞానే సర్వవిజ్ఞానం సంభవతి ఉపాదానకారణవ్యతిరేకాత్కార్యస్య. నిమిత్తకారణాదవ్యతిరేకస్తు కార్యస్య నాస్తి, లోకే తక్ష్ణః ప్రాసాదవ్యతిరేకదర్శనాత్, దృష్టాంతోఽపి 'యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్య' మిత్యుపాదానకారణగోచర ఏవామ్నాయతే, 'తథైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాదేకేన నఖనికృంతనేన సర్వం

---

వచ్చుచున్నది. కార్య ముపాదాన కారణముకంటె భిన్నముకాదుగనుక నుపాదానకారణము దెలిసిన కార్యమంతయు దెలిసినదియగును. మరియు కార్యములు నిమిత్త కారణముకంటె నభిన్నములుగావు. వడ్రింగి తాను నిర్మించిన గృహముకంటె భిన్నముగ లోకమున గాన్పించుచున్నాడు. ''ఒకమృత్పిండము దెలిసిన దానివలన బుట్టిన సమస్తమృణ్మయపాత్రలు దెలియుచున్నవి. ఘటము శరావము మొదలగునవి వికారస్వరూపములు. వాక్కుచే నిష్పాదితములగు నామమాత్రములగుచున్నవి. మృత్తిక మాత్రము సత్యము'' అని ఉపాదానకారణమున కద్దాని కార్యములు గోచరమగుట దృష్టాంత పూర్వకముగ శ్రుతియందు పఠింపబడుచున్నది. సువర్ణపిండము తెలియుటచే దానిచే చేయబడిన యాభరణజాతమంతయు తెలియుచున్నది, ఇనుపముద్ద తెలిసినపు డద్దానిచే తయారుచేయబడిన పనిముట్లు

కార్ష్ణాయసం విజ్ఞాతం స్యా'దితి (ఛాం. 6-1-4,5,6) చ. తథాన్యత్రాపి 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీ'తి (ముండక. 1-1-2) ప్రతిజ్ఞా 'యథా పృథివ్యామోషధయస్సంభవతీ'తి దృష్టాంతః, తథా 'ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదిత' మితి ప్రతిజ్ఞా 'స యథా దుందుభేర్హన్యమానస్య న బాహ్యాన్ శబ్దాంచ్ఛక్నుయాద్గ్రహణాయ దుందుభేస్తు గ్రహణేన దుందుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః'

---

న్నియు తెలియుచున్నవి. (ఛాం 6-1-4-5-6) అని మరికొన్ని దృష్టాంతములుగూడ నుదాహరింపబడినవి. అదేవిధముగ "ఏది తెలిసిన నిదియంతయు తెలియబడినది యగును"? (ముం 1-1-2) యని యితరశ్రుతులయందుగూడ ప్రతిన చేయబడినది. 'పృథివియం దోషధులు సంభవించినట్లే' యని (ముం 4-1-1-7) యిచట నుదాహరణ మివ్వబడినది. "ఆత్మ వినబడినది, చూడబడినది వినబడినది, తెలియబడినది. యగుచుండగా, నిదియంతయు తెలియబడినది యగును (బృ 2-4-5) అని బృహదారణ్యకమునందు ప్రతిజ్ఞ చేయబడినది. "దుందుభి ప్రయోగించబడినపు డద్దానిశబ్దమును వివేకించుట సాధ్యముకాదు. అవి యన్నియు నద్దానిసామాన్య శబ్దములలో ప్రతిదెబ్బచే బుట్టు శబ్దము లిముడియున్నవి" (బృ 2-4-7) అని దృష్టాంత మివ్వబడినది. [దుందుభిని సామాన్యశబ్దముకంటె భిన్నముగ దాని ప్రయోగించినపుడు బుట్టి బాహ్యమున వినవచ్చుచున్న విశేషశబ్దములను ప్రత్యేకముగ గ్రహింపశక్యముకాదు.] దుందుభి సామాన్యశబ్ద

(బృ. 4-5-6, 8) ఇతి దృష్టాంతః. ఏవం యథా సంభవం ప్రతి వేదాన్తం ప్రతిజ్ఞాదృష్టాంతౌ ప్రకృతిత్వసాధనౌ ప్రత్యేతవ్యౌ. యత ఇతీయమపి పంచమీ 'యతో వా ఇమాని భూతాని జాయంతే' ఇత్యత్ర 'జనికర్తుః ప్రకృతి'రితి (పా. 1-4-30) విశేషస్మరణాత్ప్రకృతిలక్షణ ఏవాపాదానే ద్రష్టవ్యా.

నిమిత్తత్వం త్వధిష్ఠాత్రంతరాభావాదధిగంతవ్యమ్.

---

గ్రహణముచే దానిని ప్రయోగించుటవలన బుట్టినవిశేషశబ్దము గ్రహింపబడినది యగుచున్నది. దుందుభి యొక్క శబ్దసామాన్యగ్రహణముచే దెలిసికొనదగిన విశేషశబ్దములు సామాన్యమునందు కల్పింపబడుచున్నవి. అటులనే ఆత్మప్రకాశముచే ప్రకాశింపబడు ఘటాదు లాత్మయందు కల్పితములని తాత్పర్యము.] ఈవిధముగ వివిధోపనిషత్తులయం దుదాహరింపబడిన ప్రతిజ్ఞా దృష్టాంతములచే బ్రహ్మము జగత్తున కుపాదానకారణముగ తెలియచేయబడుచున్నది. "దేనివలన నీభూతము లుత్పన్నములగుచున్నవో" (తై 3-1) యను శ్రుతియందు వినవచ్చుచున్న 'దేనివలన'యను పంచమీవిభక్తిచేతను, ఉత్పన్నమగు కార్యమునం దపాదానమను సంజ్ఞ సంభవించునను పాణినిసూత్రముచేతను, ఉపాదానకారణమునం దపాదానమును గ్రహించదగును. [అపాదానే పంచమీ, పంచమ్యర్థమున కపాదానమనిసంజ్ఞ].

ప్రతిజ్ఞాదృష్టాంత సమ్మతము.

మరియొక అధిష్ఠాత కాన్పించనందున బ్రహ్మమే నిమిత్తకారణమనికూడ తెలియనగును. లోకమునం దేవ

యథా హి లోకే మృత్సువర్ణాదికముపాదానకారణం కులాలసువర్ణ కారాదీనధిష్ఠాతౄనపేక్ష్య ప్రవర్తతే, నైవం బ్రహ్మణ ఉపాదాన కారణస్య, స్వతోఽన్యోఽధిష్ఠాతాపేక్ష్యోఽస్తి, ప్రాగుత్పత్తేరేక మేవాద్వితీయమిత్యవధారణాత్, అధిష్ఠాత్రంతరాభావోఽపి ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాదేవోదితో వేదితవ్యః, అధిష్ఠాతరి హ్యుపాదానాదన్యస్మిన్నభ్యుపగమ్యమానే పునరప్యేకవిజ్ఞానేన సర్వ విజ్ఞానస్యాసంభవాత్ప్రతిజ్ఞాదృష్టాంతోపరోధ ఏవ స్యాత్, తస్మాదధిష్ఠాంత్రంతరాభావాదాత్మనః కర్తృత్వముపాదానాంతరా భావాచ్చ ప్రకృతిత్వమ్.

---

కారము మృత్సువర్ణాది ఉపాదానకారణము కులాలసువర్ణ కారుల నాశ్రయించి కాన్పించుచున్నవో ఆప్రకారము ఉపాదానమగు బ్రహ్మముకంటె భిన్నమగు మరియొక ఆశ్రయ ముపాదాన కారణమునకు కాన్పించుటలేదు. సృష్టికి పూర్వము బ్రహ్మ మేకమేవాద్వితీయముగ నున్నట్లు నిశ్చ యింపబడినది. ప్రతిజ్ఞాదృష్టాంతములనుబట్టియె బ్రహ్మము కంటె భిన్నమగు మరియొక యుపాదానకారణము లేదని దెలిసికొనతగును. ఉపాదానముకంటె భిన్నమగునిమిత్తకారణ మున్నటుల నంగీకరించితిమేని, ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన మసంభవమగును అపుడు ప్రతిజ్ఞాదృష్టాంతముల కవరోధము గలుగును, అందువలన మరియొకయధిష్ఠానము లేకపోవుటచే సృష్టికర్తృత్వము. మరియొకయుపాదానకారణము లేకపోవు టచే నుపాదానకారణత్వముగూడ నాత్మకుసిద్ధించుచున్నది. 23

ఇతశ్చాత్మనః కర్తృత్వప్రకృతిత్వే.

## అభిధ్యోపదేశాచ్చ (సూ 24.)

అభిధ్యోపదేశశ్చాత్మనః కర్తృత్వప్రకృతిత్వే గమయతి. 'సోఽకామయత బహూ స్యాం ప్రజాయేయేతి', చ. తత్రాభిధ్యానపూర్వికాయాస్స్వాతంత్ర్యప్రవృత్తేః కర్తేతి గమ్యతే. బహూ

---

[మాయావిజృంభణముచే నీసృష్టియంతయు నున్నట్లు చూపరులకు వివర్తముచే కాన్పించుచున్నది యను వాదము నకును దీనికిని సమన్వయముచే యుటెట్లు?]

మరియొక కారణమువలన యాత్మకు నిమిత్తోపాదానోభయకారణత్వము చెప్పదగును [ఉభయకారణములు నొకరియందుండుట విరుద్ధముకాదని తరువాత నాలుగుసూత్రములచే ప్రదర్శించుచున్నారు].

అభిధ్య ఉపదేశాత్ చ = సోఽకామయత అతడు కోరెను అనుశ్రుతియందు జగత్సృష్టి చేయవలయునని వినవచ్చుటచేత సృష్టిసంకల్పము నుభయకారణత్వ మాతనికి చెప్పవచ్చును.

బ్రహ్మము పుష్కలముగ సంకల్పించెను. అని శాస్త్రము బల్కుటచేత ఆత్మ జగత్తునకు నిమిత్తోపాదాన కారణమని తెలియవచ్చుచున్నది. "నేనే యనేకముగ విస్తరించెదను." "తానే విస్తరించెదనని యతడాలోచించెను" అని శ్రుతులు వినవచ్చుచున్నవి. ముఖ్యంగా

సృష్టిసంకల్పము భయకారణత్వ సూచకము.

స్యామితి ప్రత్యగాత్మవిషయత్వాద్బహుభవనాభిధ్యానస్య ప్రకృతి రిత్యపి గమ్యతే.

## సాక్షాచ్చోభయామ్నానాత్ (సూ 25.)

ప్రకృతిత్వస్యాయమభ్యుచ్చయః, ఇతశ్చ ప్రకృతి ర్బ్రహ్మ యత్కారణం సాక్షాద్బ్రహ్మైవ కారణముపాదానోభౌ ప్రళయప్రభవావామ్నాయేతే 'సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశాదేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతీ'తి, (ఛాం. 1-9-1) యద్ధి యస్మాత్ప్రభవతి యస్మింశ్చ ప్రలీయతే

---

సంకల్పించుట తరువాత స్వయముగా ప్రవర్తించుట- వీని వలన ఆత్మయొక్క కర్తృత్వము తెలియుచున్నది. 'నేనే విస్తరించెదను' అనుటచేత ప్రత్యగాత్మయె జగత్తుగ విస్తరించుటకు సంకల్పించెననియు అందువలన ఉపాదానకారణ మగుచున్నదనియు తెలియుచున్నది. 24

సాక్షాత్ = సాక్షాత్తుగ ఉభయ ఆమ్నానాత్ జగత్తుయొక్క నిమిత్తోపాదానోభయకారణము బ్రహ్మమేయని శ్రుతిపల్కుటవలన.

బ్రహ్మముయొక్క యుపాదానకారణత్వమున కియ్యది మరియొకకారణము. ఈకారణముచేతగూడ బ్రహ్మముపాదానకారణమగును. సాక్షాత్ బ్రహ్మము నే కారణముగా గ్రహించి జగత్తుయొక్క సృష్టిలయములు 'ఆకాశమునుంచియె యీ భూతములన్నియు సముత్పన్నములగుచున్నవి) అకాశము నే తిరిగి జేరుచున్నవి. [ఛాం 1-9-1] యను

బ్రహ్మము సృష్టిలయ కారణముగనుకనుభయ కారణమగుచున్నది.

తత్తస్యోపాదానం ప్రసిద్ధమ్, యథా వ్రీహి యవాదీనాం పృథివీ. సాక్షాదితి చోపాదానంతరానుపాదానం సూచయత్యాకాశాదేవేతి. ప్రత్యస్తమయశ్చ నోపాదానాదన్యత్ర కార్యస్య దృష్టః.

## ఆత్మకృతేః పరిణామాత్ (సూ 26.)

ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ. యత్కారణం బ్రహ్మ ప్రక్రియాయాం 'తదాత్మానగ్ంస్వయమకురుత' (తై. 2–7) త్యా

---

వాక్యమునందు పేర్కొనబడుచున్నవి. [ఈ వాక్యము బ్ర. సూ. 1–1–22 మునందు విషయవాక్యముగ విచారింపబడి యచట నాకాశశబ్దము బ్రహ్మపరముగ నిశ్చయింపబడినది. "యతో వా ఇమాని భూతాని" యను వాక్యమిచట యేల ఉదాహరించలేదు ?] దేనివలన యేది పుట్టుచున్నదో, దేనియందేది లయమగుచున్నదో అది దానికి యుపాదానమని లోకప్రసిద్ధము. వ్రీహియవలకు పృథివియుపాదానకారణము. సాక్షాత్ అనుశబ్దముచేత మరియొక యుపాదానకారణము లేదనియు ఆకాశమే యూకారణమనియు దెలియుచున్నది. కార్యముపాదానముకంటె మరియొకచోట లయమగుట లోకమున కానరాదు]



తదాత్మానం స్వయమకురుత ('తై 2-7) ఆత్మ నామ రూపాత్మకమగు ప్రపంచముగ తనను తాను చేసికొనెను. అనుశ్రుతివలన ఆత్మయె ప్రపంచరూపమున పరిణామాత్ = పరిణమించినట్లు దెలియుటవలన.

ఈ కారణమువలనగూడ బ్రహ్మము జగదుపాదాన మగును. "తనను తానే స్వయముగ చేసికొనెను" (తై 2-7)

త్మనః కర్మత్వం క_ర్తృత్వం చ దర్శయతి, ఆత్మానమితి కర్మత్వం స్వయమకురుతేతి క_ర్తృత్వం, కథం పునః పూర్వసిద్ధస్య సతః క_ర్తృత్వేన వ్యవస్థితస్య క్రియమాణత్వం శక్యం సంపాదయితుం, పరిణామాదితి బ్రూమః, పూర్వసిద్ధోఽపి హి సన్నాత్మా విశేషేణ వికారాత్మనా పరిణమయామాసాత్మానమితి, వికారాత్మనా చ పరిణామో మృదాద్యాసు ప్రకృతిషూపలబ్ధః, స్వయమితి చ విశేషణాన్నిమిత్తాంతరానపేక్షత్వమపి ప్రతీయతే.

---

అను శ్రుతియందు ఆత్మ తననుతానే చేసికొనెను అని కర్మత్వము కర్తృత్వము రెండునాత్మయందే నిర్దేశింపబడుచున్నవి. తనను అనుటచేత కర్మత్వము తానేయనుటచే కర్తృత్వము గూడ దెలియుచున్నవి. క్రియాచరణము

బ్రహ్మమే పరిణామముచెందుటచే నుభయకారణమగును.

పూర్వమే ఆత్మ సిద్ధవస్తువు. కర్తృత్వమును వహించి సిద్ధముగానుండెను. అతనికి కర్మత్వమెట్లు సిద్ధింపగలదు? పరిణామముచే సిద్ధించుచున్నది యనియందుము. పూర్వము సిద్ధముగానున్నను వికారాత్మకమగు నొకవిశేషాకారముచే తనను తాను పరిణమింపచేసుకొనెను. మృత్తు మొదలగు నుపాదాన కారణములయందు పరిణామముచే వికారస్వరూప ముపలబ్ధమగుచున్నది. స్వయముగా ననుపదముచే మరియొక నిమిత్తకారణముతో నవసరములేకనే స్వయముగా పరిణామము నొందినట్లు భాసించుచున్నది.

పరిణామాదితి వా పృథక్సూత్రం, తస్యైషోఽర్థః, ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ యత్కారణం బ్రహ్మణ ఏవ వికారాత్మనాఽయం పరిణామస్సామానాధికరణ్యేనామ్నాయతే 'సచ్చ త్యచ్చాభవత్ నిరుక్తం చానిరుక్తంచే' (తై. 2-6) త్యాదినేతి.

---

పరిణామాత్ = పరిణామమును చెందుటవలన అని ప్రత్యేకసూత్రముగగూడ గ్రహించనగును. అప్పుడద్దాని యర్థమేమన! ఈకారణముచేతగూడ బ్రహ్మముపాదానమగుచున్నది. "బ్రహ్మమే సత్తు త్యత్తు నిరుక్తము, అనిరుక్తముగూడ నయ్యెను" (తై 2-6) అనువాక్యమునందు బ్రహ్మము,అద్దాని పరిణామముగూడ సామానాధికరణ్యముచే వర్ణింపబడుచున్నది. [ఇచట పరిణామశబ్దమునకు కార్యమని గాని వివర్తమనిగాని యర్థము. సువర్ణము కుండలములకు పరిణామ కారణము వివర్తకారణముగూడనగుచున్నది. క్షీరము దధిగమారిన తరువాత పూర్వరూపము రానేరదు. ఇది కేవల పరిణామము. కుండలము సువర్ణరూపమును బొందుచున్నది. అంతియకాదు. కుండలమునందు కుండలరూపము ఆ నామముగూడ భాసించునట్లె సువర్ణముగూడ భాసించుచున్నది. నామరూపములు అసత్యములు గనుక వానిని త్రోసిపుచ్చగా సత్యమగుసువర్ణము మిగులుచున్నది. కుండలమును కరిగించినపుడు నామరూపములుపాదానమునందు లయమై కారణము మిగులుచున్నది. కరిగించనప్పుడుగూడ పైకికాన్పించు నామరూపము లసత్యములని త్రోసిపుచ్చగా సువర్ణము మిగులుచున్నది. ఇట్లు కుండలములకు మృత్తు పరిణామకారణము, వివర్తకారణముగూడ నగుచు

## యోనిశ్చ హి గీయతే (సూ 27.)

ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ యత్కారణం బ్రహ్మయోనిరిత్యపి పఠ్యతే వేదాంతేషు 'కర్తారమీశం పురుషం బ్రహ్మయోని' మితి 'యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః' (ముండ 1-1-6) ఇతి చ, యోనిశబ్దశ్చ ప్రకృతివచనః సమధిగతో లోకే 'పృథివీ

---

న్నది. అదేవిధముగ బ్రహ్మము జగత్తున కుపాదానవివర్త కారణములు రెండునగుచున్నది, పైకి కాన్పించుచున్న జగత్తను నామరూపము లసత్యములుగనుక త్రోసివేయబడినపు డుపాదానమగు బ్రహ్మమే మిగులును. జగత్తు బ్రహ్మమునందు లయమయినపుడుగూడ బ్రహ్మమే మిగిలియుండును.]

యోనిశ్చ = బ్రహ్మము జగత్కారణమనిగూడ గీయతే = "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అను శ్రుతియందు పేర్కొనబడుచున్నది.

ఈ కారణముచేతగూడ బ్రహ్మ ముపాదానమగుచున్నాడు. "క్రియాశక్తిమంతముగను, నియంతగను. ప్రత్యగాత్మగను, పూర్ణునిగను, ప్రకృతిగను ధీరులగువారు ధ్యానముచే బ్రహ్మమును దెలిసికొనుచున్నారు" (ముండ 3-1-3) అనుశ్రుతివాక్యమునందాబ్రహ్మమె జగదుపాదానముగా బఠింపడుచున్నది. "సర్వభూతములకు కారణమగు వానిని ధ్యానముచేత దెలిసికొనుచున్నారు." (ముండ 1-1-6) అని మరియొకవాక్యము పలుకుచున్న

యోనిశబ్దము నకు ముపాదానమర్థము

యోనిశబ్దము ఉపాధికారణపరమని లోకమునందు తెలియబడుచున్నది. "పృథివి యోషధులకును వనస్పతులకును యోని అనగా కారణము

యోనిరోషధివనస్పతీనా'మితి, స్త్రీయోనేరప్యస్త్యేవావయవద్వారేణ గర్భం ప్రత్యుపాదానకారణత్వం, క్వచిత్ స్థానవచనోఽపి యోనిశబ్దో దృష్టః 'యోనిష్ట ఇంద్ర నిషదే అకారి' ఇతివాక్యశేషాత్, తత్ర ప్రకృతివచనతా పరిగృహ్యతే 'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచే' (ముం 1-1-7) త్యేవంజాతీయకాత్, తదేవం ప్రకృతిత్వం బ్రహ్మణః ప్రసిద్ధం. యత్పునరిదముక్తమీక్షాపూర్వకం కర్తృత్వం నిమిత్తకారణేష్వేవ కులాలాదిషు లోకే దృష్టం నోపాదానేష్విత్యాది తత్ప్రత్యుచ్యతే, న లోకవదిహ భవితవ్యం, నహ్యయమనుమానగమ్యోఽర్థః. శబ్దగమ్యత్వాత్త్వస్యార్థస్య యథా

---

"అనిప్రయోగము గలదు. స్త్రీయోనికిగూడ శోణితము ద్వారా గర్భమునుగూర్చి యుపాదానత్వము గలదు, యోనిశబ్ద మొకపుడు స్థానపరముగ వాడబడుచున్నది. "హేఇంద్ర! నీవు కూర్చొనుటకు నాచే యోని అనగా స్థానము కల్పింపబడుచున్నది" అని ప్రయోగము కలదు. "ఏవిధముగ సాలీడు దారములను సృజించి తిరిగి గ్రహించుచున్నదో" అనువాక్యశేషముచేత ప్రకృతమున యోనిశబ్దముపాదానపరముగ గ్రహింపబడుచున్నది. ఈవిధముగ బ్రహ్మమున కుపాదానత్వము ప్రసిద్ధము సంకల్పపూర్వకమగు కర్తృత్వము కులాలాది నిమిత్తకారణములయందు మాత్రమే లోకమునందు కాన్పించుచున్నది. కానియుపాదాన కారణములయందు కాన్పించుటలేదను యాక్షేపణకిట్లు ప్రతివచనమును చెప్పుచున్నాము. సామాన్యలోకమువలెనే నిచట గ్రహింపతగదు. ఈవిషయ మనుమానప్రమాణముచేత గ్రహించతగినదికాదు. శబ్దప్రమాణముచేతనే

శబ్దమిహ భవితవ్యం, శబ్దశ్చేక్షితురీశ్వరస్య ప్రకృతిత్వం ప్రతిపాదయతీత్యవోచామ, పునశ్చైతత్సర్వం విస్తరేణ ప్రతివక్ష్యామః. ఇతి సప్తమాధికరణమ్.

---

గ్రహించతగినది. కనుక వేద మేవిధముగ చెప్పినదో యటులనే గ్రహించవలయును. వేదమన్ననో సృష్టిని సంకల్పించిన ఈశ్వరుడుపాదానకారణమని నిరూపించుచున్నదియని మేము చెప్పుచున్నాము. ఈ విషయమునకు తిరిగి విస్తృతముగ ముందుసమాధానము చెప్పుచున్నాము.

అధికరణ సంక్షేపార్థము. బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణము మాత్రమగుచున్నది. అచట నాలోచనాదిక్రియలు వినబడుచున్నవి. కార్యమగు జగత్తు అశుద్ధముగనుక కారణముగూడ నశుద్ధమే కావలయును కనుక బ్రహ్మముపాదానకారణము కానేరదు. అది మరియొకసిద్ధాంతము కావలయును. ఇది పూర్వపక్షవాదము. బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణము ఉపాదానకారణముగూడ నగుచున్నాడు. బ్రహ్మ ముభయకారణము కానిచో ఏకవిజ్ఞానప్రతిజ్ఞకు విరోధము కలుగును మృత్పిండము మొదలగు దృష్టాంతములకు విరోధముకలుగును. ఒకనిమిత్తకారణము దెలిసిన కార్యము దెలియదు. 'బ్రహ్మమువలన' అను పంచమీవిభక్తి ఉపాదానమును తెలియ జేయుచున్నది. ఉపాదానమగు బ్రహ్మముకంటె భిన్నమగు మరియొక నిమిత్తకారణము కాన్పించుటలేదు. అటుల నంగీకరించిన నేకవిజ్ఞానప్రతిజ్ఞాభంగముగూడ సంభవించును. బ్రహ్మము జగత్సృష్టిని

సంకల్పించెను. బ్రహ్మమునందు సృష్టిలయములగుచున్నది. బ్రహ్మ తనను తానే జగత్తుగ పరిణమింపచేసుకొనెను. యోనిశబ్దము ప్రకృతమున ఉభయకారణములయం దన్వయించుచున్నది. కనుక బ్రహ్మముభయకారణము కావలెను.

## (8) సర్వవ్యాఖ్యాధికరణము

అ॥ "ఈక్షతేర్నాశబ్దమ్" (1-1-5) అను సూత్రము మొదలింతవరకు ప్రధానకారణవాద మనేకవిధముల అశబ్దత్వాదిహేతువులచేత త్రోసివేయబడినది. అణువాదము, స్వభావవాదము, శూన్యవాదము మొదలగు నితరవాదముల నేకములు విచారించవలసినవి గలవు. వేదాంతముచే నుపపాదింపబడని జగత్కారణ వాదములన్నిటిలోను సాంఖ్యప్రధానవాదము ప్రధానమగుటచే ప్రత్యేకముగ నది విచారింపబడినది. తదితరములన్నిటికిని సమాధానము రాబోవునధికరణమున కలిపి చెప్పబడుచున్నది.

విషయవాక్యము : వేదాంతములన్నియు.

సంశయము : వీనియందు పరమాణు శూన్యాదివాదములకు జగత్కారణత్వము వినబడుచున్నదా ? లేక నియతముగ నొకపరబ్రహ్మమునందే జగత్కారణత్వమనియా.

పూర్వపక్షము : " అణ్వో మాధానాః " అసదేవేదమగ్ర ఆసీత్ - స్వభావమేకే = ఈ మొదలగు వాక్యముల చేత నణ్వాదులు జగత్కారణాలగుచున్నవియని పూర్వపక్షము.

## ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః (సూ 28.)

'ఈక్షతేర్నాశబ్దమి' (బ్ర సూ 1-1-5) త్యారభ్య ప్రధాన కారణవాదిస్సూత్రైరేవ పునఃపునరాశంక్య నిరాకృతః, తస్యహి పక్షస్యోపోద్బలకాని కానిచిల్లింగాభాసాని వేదాంతేష్వాపాతేన మందమతీన్ప్రతిభాంతీతి, స చ కార్యకారణానన్యత్వాభ్యుపగమాత్ప్రత్యాసన్నో వేదాంతవాదస్య దేవలప్రభృతిభిశ్చ కైశ్చిద్ధర్మ

సిద్ధాంతము : ప్రధానవాదనిరాకరణమునందుదాహరింపబడిన అశబ్దత్వము, అచేతనత్వము ఏక విజ్ఞాన ప్రతిజ్ఞానుపపత్తి మొదలగుకారణములు వానికిగూడ వర్తించుటచే నవియన్నియు నిరసింపబడుచున్నవి. గనుక బ్రహ్మమేజగత్కారణము.

ఏతేన = ప్రధానము జగత్కారణము కానేరదని త్రోసిపుచ్చుటచేత, సర్వే = ఇతరకారణములన్నియు, వ్యాఖ్యాతాః = సమాధానము చెప్పబడినవి యగుచున్నవి. రెండవ వ్యాఖ్యాతశబ్దము వీప్సయందు వాడబడినది. లేదా అధ్యాయపరిసమాప్తిని సూచించును.

ప్రధానకారణమున కుపోద్బలకములుగ నున్నట్టు కాన్పించుచున్న కొన్నిసూచనలు మందమతులను పొరబెట్టునని శంకించి "ఈక్షతేర్నాశబ్దం" అనుసూత్రము మొదలనేకసూత్రములచేత నావాదము నిరాకరింపబడినది. [ప్రధానవాదమును ముఖ్యముగ నీసూత్రమునందెత్తుకొనుటకు కారణమేమున] ప్రధానవాదులుగూడ కార్యకారణముల కనన్యత్వమంగీకరించుటవలన వారివాదము వేదాంతవాదమున కత్యం

సూత్రకారైస్స్వగ్రంథేష్వాశ్రితః. తేన తత్ప్రతిషేధ ఏవ యత్నోఽతీవ కృతో నాణ్వాదికారణవాదప్రతిషేధే. తేఽపి తు బ్రహ్మకారణవాదపక్షస్య ప్రతిపక్షత్వాత్ప్రతిషేద్ధవ్యాః. తేషామప్యు పోద్బలకం వైదికం కించిల్లింగమాపాతేన మందమతీన్ప్రతి భాయాదితి, అతః ప్రధానమల్లనిబర్హణన్యాయేనాతిదిశతి. ఏతేన ప్రధానకారణవాదప్రతిషేధన్యాయకలాపేన సర్వేఽణ్వాదికారణవాదా అపి ప్రతిషిద్ధతయా వ్యాఖ్యాతా వేదితవ్యాః. తేఽపి హి

---

తము సన్నిహితముగ నున్నది. దేవలుడు మొదలగు కొంత మంది ధర్మసూత్రకారులు ఆవాదమును స్వగ్రంథములం దంగీకరించిరి. అందువలన నామత నిరాసము నం దధిక ప్రయత్నము చేయబడినది.

సమన్వయాధ్యాయో పసంహారము

అణువాదము మొదలగు జగత్కారణవాద నిరసమునం దంతప్రయత్నము చేయలేదు. ఆవాదములుగూడ బ్రహ్మకారణవాదమునకు విరుద్ధమగుట వలన నిషేధింపతగిన వగుచున్నవి. వానినిగూడ బోషణ చేయు కొన్నిసూచన లాపాతముగ వేదములయందు కాన్పించుచున్నవి. వానిచే మందమతులగు వారలు భ్రమచెంద గలరు. అందువలన ప్రధానమల్లుని జయించిన నితరులను జయించినట్లు ప్రధానకారణవాద నిరాసకొరకు రచియింప బడిన సూత్రకలాపముచేత అణ్వాదీతర కారణవాదముల న్నియు పరిహరింపబడినట్లు తెలియదగును. ఆవాదములు గూడ ప్రధానవాదమువలెనే వేదచోదితములు కాకపోగా వానికి విరుద్ధములు గూడనగునగుచున్నవి. వ్యాఖ్యాత

ప్రధానవదశబ్ధత్వాచ్ఛబ్దవిరోధిత్వాచ్చేతి, వ్యాఖ్యాతా ఇతి పదాభ్యాం సోఽధ్యాయపరిమాప్తిం ద్యోతయతి.

ఇతి శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే శ్రీశంకరభగవత్పాదకృతౌ
ప్రథమాధ్యాయస్య చతుర్థః పాదః.
ప్రథమాధ్యాయః సమాప్తః

---

శబ్దము రెండుపర్యాయము లుచ్చరించుటవలన అధ్యాయపరిసమాప్తి యయినట్లు తెలియుచున్నది. 28

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంచిత
శ్రీ భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు
శ్రీ కల్యాణానంద భారతీమహాస్వామ్యాచార్య మహాస్వామి
పాదాత్యంతాన్తేవాసియు నత్రిగోత్ర సముద్భూతుడు
నగు లింగనసోమయాజిచే విరచితమగు
కల్యాణకౌముది యను శ్రీమచ్ఛాంకర
శారీరకసూత్ర భాష్యాంధ్రానువాదమున
ప్రథమాధ్యాయము–చతుర్థపాదము
సంపూర్ణము.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ 

తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥